శ్రీః

# శ్రీ పరశమ్భు మహిమ్నః స్తోత్రమ్

## (మహర్షిదుర్వాసోవిరచితమ్)




## శివప్రియా వ్యాఖ్యానము

(ఆంధ్ర పద్యానువాద - ప్రతిపదార్థ - తాత్పర్య - వివరణములు)


## దోర్బల విశ్వనాథ శర్మ



-- ప్రకాశికా --

## శ్రీమతీ రావి కృష్ణకుమారీ

*Dandy House*, **404,** జంజనం కాంప్లెక్స్,

చీరాల - **523155.**

**శ్రీః**

# శ్రీ పరశమ్భు మహిమ్నః స్తోత్రమ్

మహర్షిదుర్వాసోవిరచితమ్

శివప్రియా వ్యాఖ్యానము

(ఆంధ్ర పద్యానువాద - ప్రతిపదార్థ - తాత్పర్య - వివరణములు)

దోర్బల విశ్వనాథ శర్మ


| | | |
|---|---|---|
| *ప్రథమ ముద్రణ* | : | ***01-05-1998*** |
| *ద్వితీయ ముద్రణ* | : | ***05-09-2015, శ్రీకృష్ణజన్మాష్టమి*** |
| *ప్రతులు* | : | ***500*** |
| *పేజీలు* | : | ***264*** |
| *వెల రూ.* | : | ***300-00*** |





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**



# శాంతి మంత్రము

నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరాయ మహాదేవాయ
త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ
కాలాగ్నిరుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ
సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః




# శివ పంచాక్షరీ స్తోత్రమ్

(శ్రీ శంకరాచార్య కృతమ్)

నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై 'న' కారాయ నమశ్శివాయ ॥ 1

మందాకినీ సలిలచందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ ।
మందార ముఖ్య బహుపుష్ప సుపూజితాయ
తస్మై 'మ' కారమహితాయ నమశ్శివాయ ॥ 2

శివాయ గౌరీ వదనారవింద-
సూర్యాయ దక్షాధ్వర నాశకాయ ।
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై 'శి' కారాయ నమశ్శివాయ ॥ 3

వశిష్ఠ కుంభోద్భవ గౌతమాది-
మునీంద్ర దేవార్చిత శేఖరాయ ।
చంద్రార్క వైశ్వానరలోచనాయ
తస్మై 'వ' కారాయ నమశ్శివాయ ॥ 4

యక్ష స్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ ।
సుదివ్య దేహాయ దిగంబరాయ
తస్మై 'య' కారాయ నమశ్శివాయ ॥ 5

పంచాక్షర మిదం పుణ్యం యః పఠేచ్ఛివ సన్నిధౌ ।
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే ॥



## శ్రీ శివాయ గురవే నమః

మూడు కన్నుల స్వామి శంభుండు సకల
భువన రక్షణ దక్షుఁడై పూజ్యుఁడగుట
మున్ను పరశమ్భుమహిమంబు ముదముతోడ
స్రగ్ధరావృత్తముల భక్తి సంస్తుతించె
ముక్తి కలుగంగ దుర్వాస ముని వరుండు. 1

గద్యపద్యంబులం దనవద్యరీతిఁ
దనర, దోర్బల వంశవర్ధనుడు ఘనుఁడు
విశ్వనాథుఁడు విరచించె విశదఫణితి
నీ శివప్రియ వ్యాఖ్యాన మింపుఁబెంపు. 2

ఉత్తములగు లేఖకులై సమున్నత మతిఁ
దండ్రికిం దోడునీడలై యుండు సుతులు
సతము దామోదరానంద శర్మ లెందు
నాయురారోగ్య సంపద లందఁగలరు. 3

సిరులఁబెంచు మాణిక్యాంబ శ్రీమతి యయి
శక్తి పీఠంబుగాఁ బ్రప్రశస్తిఁగాంచు
దక్షవాటి భీమేశ్వరు దక్షయమగు
నీకృతిఁగొని యానందించుఁగాక మదిని. 4

విఘ్నతతి మాన్చి వెనకయ్య వేడుక లిడు
శరవణభవుండు కోరిన వరములొసఁగు
నీ వృషభపతి స్తుతి పఠియించువారి
కాయురారోగ్య భోగభాగ్యంబు లలరు. 5

దేశమున శివక్షేత్రముల్ దీని భక్తి
తిరిగి ముద్రింపఁగ ననుమతింపఁబడియె
సహృదయానంద కందమై సరసమగుచు
నిదియు వెలయు నాచంద్రార్కమెలమి భువిని. 6

శివనామ స్మరణమ్మె జీవనముగా శ్రీమాతృసేవా మహో
త్సవమే భాగ్యముగాఁదలంచు మహిత స్వాంతుల్ కళారాధకుల్
స్తవనీయ స్థిరధర్మ వర్తనులు కృష్ణామోహనాఖుల్ గురు
ప్రవణుల్ శంకర సత్కృపాభరితులై వాసిం గనం గోరెదన్. 7

చిత్త సంస్కార సంపదశ్రీ రహింప
సార సారస్వత శుభప్రచార సరణి
కృష్ణమోహన దంపతు లీజగాన
సచ్చిదానంద మందంగ నిచ్చు దలఁచు. 8



– డాక్టర్ తూములూరు

## శ్రీః

# శ్రీ పరశమ్భు మహిమ్నః స్తోత్ర పరిచయము

వాఙ్మయమున స్తోత్రవాఙ్మయమున కొక విశిష్ట స్థానమున్నది. పుట్టబోవు శిశువునకు తల్లిస్తనములలో ఆహారమును సమకూర్చిన భగవాను డెంత దయామయుడు? శిశువు పెరిగి పెద్దయై భగవానుడు చేసిన ఆ ఉపకారమును తలచుకొనిన భగవానుని పట్ల కృతజ్ఞత వెల్లివిరియును. జీవితమున అడుగడుగున ప్రమాదములనుండి తప్పింపబడుట, అసమ్భవముల వంటి కోరికలు తీరుట మొదలగు సంఘటనలు జరిగినప్పుడు భగవానుని పట్ల కృతజ్ఞత కలుగక మానదు. ఈ కృతజ్ఞత ఆవిష్కరణ ప్రయత్నముననే స్తోత్ర వాఙ్మయము వెల్లివిరిసినది.

ముఖ్యముగా సంస్కృత వాఙ్మయమున ఇట్టి స్తోత్రవాఙ్మయము రాశిలోను వాసిలోను సర్వభాషలలోను అట్టి వాఙ్మయముల కన్న అత్యంతమహనీయముగా విలసిల్లి యున్నది. దానిలో పెక్కు శాఖోపశాఖలు విస్తరించి యున్నవి. 1. అవయవ స్తోత్రములు (కేశాదిపాదాంతములు లేక పాదాదికేశాంతములు) 2. కథాస్తోత్రములు (అవతార లీలాదులు) 3. తత్త్వ ప్రతిపాదక స్తోత్రములు (ద్వైతవిశిష్టాద్వైతాద్వైతములు) ఇత్యాదులు. మరొక విధముగా శ్లోక సంఖ్య ననుసరించి పంచకములు, అష్టకములు, నక్షత్రమాలలు (27 సంఖ్యగలవి), శతకములు, సహస్రములు మొదలగునవి. దేవతా భేదము ననుసరించి 1. శైవములు 2. వైష్ణవములు 3. శాక్తములు 4. సౌరములు 5. **గాణాపత్యములు** మొదలగునవి. ఛందస్సు ననుసరించి ఏకవృత్తములు, బహువృత్తములు కలవు, ఏకవృత్తములలో స్తోత్రాంత సూచకముగా వృత్త భేదముండుట అకించిత్కరము. మరొక విధముగా 1. ఏకరూపచతుర్థపాదాంతములు (సమ కుట్టము) 2. దేవతా సంబోధన నియమము గలవి (ఏదో యొక పాదమున) 3. మాతృకా (వర్ణమాలా)దులు ఇత్యాదులను పేర్కొన వచ్చును.

ఇట్లెన్నో వైవిధ్యములు కల స్తోత్రములు సంస్కృతభాషలోనున్న ట్లితర భాషలలో కానరావు. స్తవము, స్తుతి, స్తోత్రమనగా (యథార్థ) గుణకథనము. అనితరసాధారణ సత్త్వము ఆశ్చర్యావహకృత్యము. ఇట్టివి అన్ని స్తోత్రములలో వర్ణింపబడుచుండును. కావున ఇట్టి అన్ని స్తోత్రములందు ప్రతిపాద్య దేవతా మహిమవర్ణనము సర్వసాధారణముగా కన్పించును. అయినను పుష్పదంత మహాకవి 'మహిమ్నః' అను పదముతో వ్రాసిన యొక స్తోత్రము 'శివమహిమ్నః' స్తోత్రముగా ప్రసిద్ధిగాంచిన నాటి నుండి మహిమ్నః స్తోత్ర శాఖ యొకటి యేర్పడినది. విష్ణుమహిమ్నః స్తోత్రము (పరమహంస బ్రహ్మానంద స్వామి విరచితము),

గణేశ మహిమ్నః స్తోత్రము (అజ్ఞాత కర్తృకము), దేవీ మహిమ్నః స్తోత్రము (దుర్వాసోముని విరచితము), పరశమ్భుమహిమ్నః స్తోత్రము (దుర్వాసోముని విరచితము). ఈ శాఖలో నేనెఱిగినవి (వీనికన్నింటికి ఆంధ్ర చంపకోత్పలాన్యతర వృత్తపద్యానువాదము చేసి యున్నాను).

నేడు లభించుచున్న శివ మహిమ్నః స్తోత్రము ముద్రితప్రతులలో నలుబది యైదు శ్లోకములున్నదే అత్యధిక సంఖ్య కలది. వీనిలో ముప్పది మాత్రమే పుష్పదంత కృతములని ఇతర శ్లోకములు ప్రక్షిప్తములని కొందఱి విద్వాంసుల మతము. విష్ణు మహిమ్నః స్తోత్రమున ముప్పదియైదు శ్లోకములు, గణేశ మహిమ్నః స్తోత్రమున ముప్పది యొక్క శ్లోకములు, దేవీ మహిమ్నః స్తోత్రమున అఱువది శ్లోకములు, పరశమ్భు మహిమ్నః స్తోత్రమున నూట నలుబది రెండు శ్లోకము లున్నవి. శ్లోక సంఖ్య బృహత్త్వమేగాక, ఒక సిద్ధాంత (శాంభవ) మును సమగ్రముగా ప్రతిపాదించు సమగ్రత కలిగియున్న స్తోత్రము ఈ పరశమ్భు మహిమ్నః స్తోత్రము. గణేశ మహిమ్నః స్తోత్రము మొదటి శ్లోకము శివవిష్ణు మహిమ్న స్తోత్రముల వలె 'మహిమ్నః' అను పదముతో మొదలుగాకున్నను వానివలె శిఖరిణీ వృత్తమున రచింపబడినది. దేవీ మహిమ్నః స్తోత్రము మొదట అనుష్టుప్ శ్లోకమున్నది. దానిలో మహిమా పదమున్నది. పరశమ్భు మహిమ్నః స్తోత్రమున మొదట మంగళాచరణ రూపమైన అనుష్టుప్ శ్లోకమున్నది. దేవీ మహిమ్నః స్తోత్రమున వరుసగా నలుబది మూడు శార్దూలవిక్రీడిత వృత్తములున్నవి. అంతమందు వివిధ వృత్తములున్నవి. పరశమ్భుమహిమ్నః స్తోత్రమందు వరుసగా నూట యిరువది స్రగ్ధరావృత్తము లున్నవి. అంతమున వివిధ వృత్తము లున్నవి. ఈ రెండు మహిమ్నః స్తోత్రములు దుర్వాసోముని కృతములని ప్రసిద్ధి యున్నది.

వీనిలో దేవీ మహిమ్నః స్తోత్రములోని కొన్ని శ్లోకములు భాస్కరరాయ నారాయణ భట్టు (లలితాసహస్రనామస్తోత్రము యొక్క సౌభాగ్య భాస్కర కౌలపాఠ, జయమంగళ సమయపాఠ) భాష్యములలో ఉదహరింపబడినవి. కాని పరశమ్భు మహిమ్నః స్తోత్ర శ్లోకముల నే వ్యాఖ్యాతయు ఉదహరించుట నేనెఱుగను.

దేవీ మహిమ్నః స్తోత్రమున బాలా, పంచదశీ షోడశ్యాది దేవీ మంత్రోద్ధారము లున్నట్టే పరశమ్భు మహిమ్నః స్తోత్రమున అఘోరమంత్రోద్ధారమున్నది. దేవీ మహిమ్నః స్తోత్రము యొక్క శ్లోకములలో అఘోర మంత్ర ప్రశంస యున్నది. ఈ రెండు స్తోత్రములు చదివిన వారికి వానిలో సామ్యము కొంత కన్పించును. ఇవి ఏకకర్తృకము లనుటలో సందేహించ నక్కఱలేదు. కాని దేవీ మహిమ్నః స్తోత్రమున సాధారణ శాక్తాద్వైతమే కన్పించుచుండగా పరశమ్భు మహిమ్నః స్తోత్రమున సాధారణ శైవము కాక శైవ

ప్రభేదములలో విశిష్టమైన 'శామ్భవసిద్ధాంతము' ప్రతిపాదింపబడిన విధము కన్పడును. దీనికి సంబంధించిన అఘోరవిద్య అఘోరమంత్రోద్ధారమును కన్పించును.

శామ్భవ సిద్ధాంతమున పరశమ్భువు పరమదైవతము. అనగా పరశమ్భువును మించిన దేవుడు లేడు. బ్రహ్మవిష్ణురుద్రాదులందఱు ఆతనికి లోబడియే తమతమ జగత్ సృష్ట్యాది కృత్యములను ఇతర కృత్యములను చేయుచుందురు. పరశమ్భువునకు శివ, పరశివ, మొదలగు శబ్దములు పర్యాయములుగా ఈ స్తోత్రమున ప్రయోగింపబడినవి. ఈ సిద్ధాంతమున గురువునకు అత్యున్నత స్థానమున్నది. ఆతనికి **శివగురు,** శివదేశిక ఇత్యాది శబ్దములు పర్యాయములుగా నున్నవి. ఆయన ఇచ్చు దీక్ష **శామ్భవదీక్ష. అఘోర మంత్రోపదేశము నాతడు చేయును.** గురువచనము వేదతుల్యమే. వేదమే. దానివలన శిష్యులకు శామ్భవసిద్ధాంతరహస్యములు అఘోరబ్రహ్మవిద్యారహస్యములు చివఱకు ముక్తియు కరతలామలకము లగును.

సాధారణ శైవమున శివునకైదు ముఖములు – తత్పురుష, వామదేవ, సద్యోజాత, అఘోర, ఈశాన నామములు ప్రసిద్ధములు. పంచబ్రహ్మములు అని పిలువబడు మంత్రములలో అఘోరమంత్రమొకటి యున్నది. 'అఘోరేభ్యో.... నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః' కాని ఈ మంత్రము ఈ స్తోత్రమున ఉద్ధరింపబడలేదు. ఆమ్నాయ మందారమున అఘోరమంత్ర మున్నది కాని అదికూడ ఈ స్తోత్రమున ఉద్ధరింపబడలేదు. గురుముఖైక వేద్యమయిన ఒక మంత్రము ఈ స్తోత్రమున ఉద్ధరింపబడినది.

యజుర్వేదాంతర్గత ప్రసిద్ధ రుద్రాధ్యాయమున (నమకమున) **యాతే రుద్రశివా తనూ రఘోరా** ఇత్యాది మంత్ర మొకటి యున్నది. అందు రుద్రుని ఘోర తనువు (లు) వర్ణింపబడినవి. ఆతని అఘోర తనువు శివ అని చెప్పబడినది. శంతమ అని చెప్పబడినది. ఈ విధముగా వేదమునందు అఘోర మంత్రముతోపాటు అఘోర తనువు చెప్పబడినది. అనగా అఘోరశైవము యొక్క జాడలు వేదమునందున్నవని అది వైదికమే యని (కాలాంతరమున అవైదికాంశములు చేర్పబడిన చేర్పబడుగాక) తెలియుచున్నది.

రుద్రుని అగ్నిమయత్వ (బభ్రువర్ణ)ము వేదసమ్మతము. ఈ స్తోత్రమున పరశమ్భువు యొక్క అగ్నిమయత్వము చెప్పు పెక్కు శ్లోకములున్నవి. ఇందలి పావక ధ్యాన యోగ ప్రకరణము పూర్తిగా పరశమ్భువుయొక్క **అగ్నిమయత్వమును** ప్రతిపాదించుచున్నది.

వైదికములైన శ్రీసూక్త దుర్గా సూక్తాదులలో శ్రీదేవి యొక్క అగ్నిమయత్వము పెక్కుఱు విద్వాంసులకు పరిచితమే. శైవదేవతయైన కుమారస్వామి ఆగ్నేయ మూర్తి యనుట పురాణ సమ్మతము. ఆయన కాఱు ముఖము లున్న వనుట సుప్రసిద్ధము. ఈ స్తోత్రమున

పరశమ్భువే షడాస్యుడని చెప్పబడినది. కాని కుమారస్వామియొక్క పరశమ్భు పుత్రత్వము స్పష్టము చేసిన సందర్భము లేదు. షడాస్యుడైన పరశమ్భువు షట్కోణాంతరస్థుడని చెప్పబడినది. షట్కోణ యంత్రమున పూజింప దగిన వాడని దీని సామాన్యార్థము. ఒక ఘనసమ చతురస్రమును గ్రహించినప్పుడు దానికి ముఖము లాఱుండును. సమచతురస్రము యొక్క నాలుగు కోణములు (నాలుగు ముఖములు) 360 డిగ్రీలు కలిగియుండును. అట్లే వృత్తమునకు 360 డిగ్రీలు ఉండును. ఈ డిగ్రీలు శాక్తేయ సిద్ధాంతమున రశ్మలు అని చెప్పబడినవి. పంచభూతములు మనస్సు ఈ ఆఱింటిలో జలమునందు 52, అగ్నియందు 62, వాయువునందు 54, ఆకాశమునందు 72, మనస్సునందు 64. ఈ రశ్మలన్నింటిపైన అమ్మవారి పాదము లున్నవి. సౌందర్యలహరిలోని ఒక శ్లోకమున చెప్పబడినది. బ్రహ్మాండ గోళమున (ఘనమును) రేఖాగణితమున వివరింపవలసి యున్నచో షట్కోణ (యంత్ర) రూపమున వివరింప వచ్చును.

బ్రహ్మాండగోళము యొక్క ఆఱు దిక్కుల కేంద్ర బిందువు లాఱు ముఖము లగును. 'ముఖమ్ బిన్దుమ్ కృత్వా' అను సౌందర్యలహరీ శ్లోకమున బిందు ముఖముల ఐక్యము చెప్పబడినది. వీనిని సమరశ్మలుగా భావించినప్పుడు ఒక్కొక్క ముఖము 60 రశ్మలుగల దగును. ఎట్లైనను 360 సంఖ్యకు బాధలేదు. పరశమ్భువు షట్కోణాంతర షట్పీఠ గతుడై యున్నాడనగా బ్రహ్మాండ గోళము యొక్క ఆఱు కేంద్రములలో ఉన్నాడని యర్థము. ఇట్లు షట్కోణ యంత్రము యంత్రములలో ప్రముఖస్థానము కలిగియున్నది. వాస్తవమునకు కేంద్ర మొక్కటే యైనను దృశ్యమును బట్టి ఆఱు కేంద్రములని చెప్పబడినది. పరశమ్భువు షడాస్యుడనుటలో రహస్యము పరమాత్మ సర్వతోముఖుడని చెప్పుటయే. శివుడు పంచముఖుడని చెప్పుటలోని రహస్యము మహాన్యాసమున కాననగును. సద్యోజాతాదిపంచ ముఖములు నాలుగు దిక్కుల కభిముఖములు. ఊర్ధ్వముఖముతో కలిపి అవి అయిదు ముఖములు. వీనితో పాటు పాతాళషష్ఠముఖము కూడ ప్రస్తావింపబడినది. అనగా శివుని షడాస్యత ఆయన షణ్ముఖముల షడ్దిశాభిముఖమునే స్పష్టము చేయుచున్నది. నాలుగు దిక్కులు ఊర్ధ్వాధోదిశలు కలిపి దిక్కు లాఱు. షడాస్యుని షణ్ముఖములే ఏ దిక్కున నున్న వారికైన పరమాత్మ అభిముఖుడనుట ప్రతిపాదనములోని తాత్పర్యము.

దిక్కులు పదియనుట విద్వత్పరిచితాంశమే. నాలుగు దిక్కులు నాలుగు మూలలు ఊర్ధ్వధో దిశలు కలిపి దశదిశలు. వీనికంతరాళమును కలిపి దిగ్రూపమైన ఏకాదశ రుద్రగణము పురాణములలో పేర్కొనబడినది. ఒక ముఖము కలవానికి రెండు చేతులుండును. పంచముఖ శివునికి పదిచేతులు. షణ్ముఖ శివునికి పన్నెండు చేతులు ఉండును. ఈ స్తోత్రమున ఆ పన్నెండు చేతులలో శూలము, అసి, ఇషువు, ఉగ్రశక్తి,

అంకుశము, వరముద్ర, కపాలము, శ్రీఫలము, ఇష్వాసనము, అరి(చక్రము), పాశము, అభయముద్ర ఉన్నట్లు చెప్పబడినది. పరశమ్భువు షడాస్యుడే కాక షడంగుడు. **'సర్వజ్ఞతా తృప్తి రనాదిబోధః స్వతంత్రతా నిత్యమలుప్త శక్తిః అనంతతా చేతి విభో ర్విధిజ్ఞాః షడాహురంగాని మహేశ్వరస్య'** అను పురాణశ్లోకములోని పై ఆఱు అంగములు సర్వజ్ఞత, తృప్తి, అనాదిబోధము, స్వతంత్రత, అనిత్యాలుప్తశక్తిః అనంత అనునవి ఈ స్తోత్రములోని యొక శ్లోకమున కించిచ్ఛబ్ద భేదమున చెప్పబడినవి.

పరశమ్భువు యొక్క ఉపాసన ప్రతీకమైన యంత్రము షట్కోణమని చెప్పబడినది. ఆయన మంత్రమున ఆఱు భాగము లున్నట్టును ప్రస్తావింపబడినది. ఆయన **షడయనగ** తత్త్వము చెప్పబడినది.

సాధారణముగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశము లైదు తైత్తిరీయోపనిషత్ ప్రసిద్ధములు. సర్వవేదాంత (ద్వైత విశిష్టాద్వైతాద్వైతాది) సమ్మతములు. కాని ఈ స్తోత్రమున పిండము షాట్కౌశికమని చెప్పబడినది. పై కోశములకు మాయామయకోశమును కలిపి షాట్కౌశికము పిండమని చెప్పవచ్చును.

పీఠము లాఱు అని చెప్పబడినది. ఇవి భూమి, జలము, అగ్ని, వాయు, ఆకాశము, చేతము అనునవి.

**'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే'** అను శ్రుతిననుసరించి పరశమ్భువునకున్న ఆఱు శక్తులలో పరాశక్తి చాలా ముఖ్యమైనదని ఈ స్తోత్రమున చెప్పబడినది. ఈ స్తోత్రమున మాయ గూడ ఒకటి రెండు చోట్ల ప్రస్తావింపబడినది.

పరశమ్భువునకు పరా, ఇచ్ఛ, జ్ఞాన, క్రియా, కుండలినీ, మాతృకా అను ఆఱు శక్తులున్నవి. ఒక్కొక్క శక్తి యొక్క వివరణము ఒక్కొక్క ప్రకరణమున చేయబడినది. మొత్తము పన్నెండు ప్రకరణములని చివటి ఉపసంహార ప్రకరణమున 'రవి ప్రకరణమ్' అను శబ్దముతో చెప్పబడినది. మొదటిదైన ఉపోద్ఘాత ప్రకరణమున శామ్భవసిద్ధాంతము సంగ్రహముగా చెప్పబడినది. దాని విస్తృతి మిగిలిన ప్రకరణములలో చేయబడినది.

శివాద్వైతమునకు చెందిన శక్తి శివ సూత్రములలో శివయోగి జీవించి యుండగా పూర్ణాహంతను పొంది శివతుల్యుడగును. శివుడగునని చెప్పబడినట్లే స్తోత్రమునను చెప్పబడుటచే శివాద్వైతచ్ఛాయ లీ స్తోత్రమున నున్నవని అంగీకరింపవలసి యున్నది.

శక్తా శివాద్వైతములలో ప్రపంచము సత్యమని చెప్పబడినది. బ్రహ్మమును సత్యమే అగుచో అద్వైతమెట్లు అను ప్రశ్నమునకు లలితా సహస్రనామ సౌభాగ్య భాస్కర భాష్యకర్త శ్రీభాస్కరరాయలు బ్రహ్మ ప్రపంచములు రెండును సత్యములే, వాని భేదము మిథ్య.

భేదము మిథ్య అనగా బ్రహ్మ ప్రపంచముల అద్వైత (అభేద)ము సిద్ధము.

శాంకరాద్వైతము **చిద్వివర్తః ప్రపంచోఽయమ్** (ప్రపంచము చిత్తునందు భ్రాంతి దృశ్యము) అని చెప్పుచుండగా శాక్త శివాద్వైతములు **చిద్విలాసః ప్రపంచోఽయమ్** (ఈ ప్రపంచము చిత్తు యొక్క విలాస)మని చెప్పును. ఏతత్ స్తోత్రప్రతిపాద్య శామ్భవ సిద్ధాంతమున పరశమ్భువునకన్న భిన్నమైన దేదియు లేదని చెప్పబడినది.

శాక్తశివాద్వైతములందు వలె నీ శామ్భవసిద్ధాంత మందు వ్యావహారికముగా షట్త్రింశత్తత్త్వము లంగీకరింప బడినవి. బ్రహ్మాండమంతయు పరశమ్భు రశ్మి పూర్ణమని చెప్పబడినది. శాక్తమునందును ఈ రశ్మల ప్రతిపాదన మున్నది. ఈ స్తోత్రము నందలి ప్రకరణములకు పరాశక్తి స్కంధరశ్మి ప్రకరణము, ఇచ్ఛా శక్తి స్కంధరశ్మి ప్రకరణము ఇత్యాది రీతిగా నామకరణములు చేయబడినవి. షణ్మతములందువలె ఈ శాంభవ సిద్ధాంతము నందును అంతరంగ సాధనములైన ధ్యానయోగాదులతోపాటు బహిరంగములైన యజ్ఞ పూజలు చెప్పబడినవి.

సంవిద్రూపుడైన పరశమ్భ్వగ్ని యందు సర్వప్రపంచము హవిస్సు అని చెప్పబడినది. తైత్తిరీయోపనిషత్తు నందు చెప్పబడిన ఆత్మ యజ్ఞము కించిద్భేదమున ఈ స్తోత్రము నందును చెప్పబడినది. పరశమ్భూపాసన మందు ఓంకారప్రతీక మంగీకరింప బడినది. వ్యాహృతిత్రయముయొక్క, వ్యాహృతి సప్తకముయొక్క, గాయత్రీ మంత్రముయొక్క ఉచ్ఛ్వాస నిఃశ్వాసము లందు చేయదగిన **అజపా (హంస) గాయత్రి జపము యొక్క ప్రాధాన్యము** లంగీకరింపబడినవి.

మూలాధారాది షట్చక్రములందు పరశమ్భుధ్యానము అంగీకరింపబడినది. శాక్తమునందు శ్రీలలితా పరమేశ్వరి చక్ర రాజాసనస్థయని చెప్పబడినట్లు ఈ స్తోత్రమున పరాశక్తి చక్ర రాజాసనస్థ అని చెప్పబడినది. మిగిలిన శక్తులన్ని పరాశక్తి రూపములని చెప్పబడినది.

శైవమునందు శివుడు శ్మశానవాసి యని చెప్పబడుట ప్రసిద్ధము. ఇందును పరశమ్భువు యొక్క శ్మశానాగ్నిత్వము వర్ణింపబడినది.

శివమహిమ్నః స్తోత్రము నందువలె ఈ స్తోత్రము నందును భూమ్యాదులందు రథాద్యారోపణములు చేయబడినవి. 'తత్ర చిన్త్యోరథీత్వమ్' (ఆ భూరథమున నీవు చింతింప దగిన రథివి) (అగ్నివి) అని చెప్పబడినది. షణ్మతము లున్నను శైవవైష్ణవులలో పరస్పర మున్నంత విరోధ మితర దేవతా భక్తులలో కనిపించదు. శైవ వైష్ణవ విరోధ మేల యేర్పడినదో తెలియదు. **సర్వ ప్రపంచము నిష్ట దేవతా మయముగా చూడవలెననియే ఆయా మతములు**

**చెప్పుచున్నవి.** ఒక దేవత పారమ్య మంగీకరించిన వారి యెదుట అన్యదేవతా పారమ్య ప్రశంస (అనవదిర) కోపకారణమగుట కానవచ్చును. అంతమాత్రము చేత వివేకులు వివేకము కోల్పోనక్కఱలేదు. ఏది యేమైనను ఇట్టి వైషమ్యములను సహింపని వివేకు లాదిలో గొప్ప ప్రయత్నము లొనరించినారు. హరిహరనాథ తత్త్వప్రచార మందులోని భాగమే అననగును.

ఈ పరశమ్భు మహిమ్నః స్తోత్రమున పరశమ్భువు జ్ఞానదుగ్ధాబ్ధిశాయి అని చెప్పబడినాడు. దుగ్ధాబ్ధిశాయి విష్ణువు. దుగ్ధాబ్ధి జ్ఞానరూపమను రహస్యమును వైష్ణవ మతస్థులు ప్రశంసింపదగినట్లుగా ఈ శామ్భవ గ్రంథమున చెప్పబడుట విశేషము. విష్ణ్వాయుధమైన చక్రము పరశమ్భువు యొక్క 12 చేతులలోని ఒకచేత నున్నట్లు చెప్పబడుట మరొక విశేషము.

షడాస్య ద్వాదశహస్త మూర్తి యోగజ్ఞానాది మార్గముల నందుకొనలేని వారి కొఱకని సరిపెట్టుకొన వచ్చును. లేదా తమ మందాధికారము నంగీకరింపకయే ఈ మూర్తి పూజ ఉత్తమాధికారికిని ఆవశ్యకమే అని ఆ మూర్తిని పూజింపవచ్చును. మూర్తిని ధ్యానించు వారికన్న పూజించు వారి సంఖ్యయే అధికము. దాదాపు అవి హిందువులలో సార్వజనీన మనియే అంగీకరింపవలెను. పూజలలో పంచోపచారపూజ మిక్కిలి చిన్నది. షోడశాద్యుపచారపూజ మధ్యమము. చతుష్షష్టిపూజ మిక్కిలి పెద్దది. **ఈ స్తోత్రమున మానసపూజకు అధికప్రాధాన్యమీయ బడినది.** బాహ్యపూజలలో సామాన్యోపచారములు విశేషోపచారములు (రాజోపచారములు ఛత్రచామర నృత్యగీతాదులు) పేర్కొనబడినవి. పంచభూతములైన భూమ్యాదులు చేయు గంధాద్యుపచార సమర్పణము చెప్పబడినది. కైలాసాది లోకములందువలె కల్పవృక్షములు వాని నధిరోహించిన పిశాచాది గణములు పేర్కొనబడినవి. శాక్తాదులందు వలె యోగినులు భైరవీ భైరవ గణములు పేర్కొనబడినారు.

ఇంకను ఈ స్తోత్రము నందేమేమి యున్నవో అవి యన్నియు పేర్కొనుట గ్రంథ విస్తరమునకు కారణమగును. ఈ మాత్రముతో ఆసక్తి పెఱిగి వ్యాఖ్యానముతో స్తోత్రాన్ని బాగా అధ్యయనము చేయగలరనియే. ఏలనగా వ్యాఖ్యానము నందీ విషయము లన్నియు వివరింపబడినను అందఱకు విస్తృతమైన ఆ వ్యాఖ్యాన మంతయు సమగ్రముగా చదివి అర్థము చేసికొను అవకాశము లేనివారికి మాత్రము పరిచయము ఆవశ్యకమని భావించి చేయబడినది. విద్వాంసులు క్షీరగ్రహణ న్యాయము ననుసరించి గుణముల గ్రహింపగలరని ప్రార్థింపబడుచున్నారు.

ఇట్లు

రామాయంపేట.
8-11-1997

దోర్బల విశ్వనాథశర్మ

# విషయసూచిక



జయ గణేశ జయ గణేశ జయ గణేశ పాహి మామ్ ।
జయ గణేశ జయ గణేశ జయ గణేశ రక్ష మామ్ ॥

శ్రీః

మహర్షిదుర్వాసోవిరచితమ్

# శ్రీ పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్

*వ్యాఖ్యాత - దోర్బల విశ్వనాథశర్మ, రామాయంపేట.*

## ఉపోద్ఘాతప్రకరణమ్

**అవతారిక :** మంగళాచరణము

**శ్లో॥ అనేకశక్తిసంఘట్టప్రకాశలహరీతనుః ।**
**శుద్ధసంవిచ్ఛివః పాయాద్విభుః శ్రీపరమేశ్వరః ॥ 1**

**ప్రతిపదార్థము :-** అనేక శక్తి సంఘట్ట ప్రకాశలహరీ తనుః = అనేకములైన శక్తుల ఒరపిడిచే ఏర్పడిన వెలుగుల ప్రవాహమే శరీరముగా గల, శుద్ధ సంవిత్ = శుద్ధ జ్ఞానరూపుడైన, విభుః = సర్వవ్యాపియైన, శ్రీ పరమేశ్వరః = పూజ్యమైన అనితరసమమైన (సర్వాధికమైన) ఐశ్వర్యముకల, శివః = శివుడు, **పాయాత్** = కాపాడుగాక.

**తాత్పర్యము :-** అనేక శక్తుల రాపిడి వలన పుట్టిన వెలుగుల ప్రవాహము శరీరమున గల శుద్ధ సంవిద్రూపుడు శ్రీ పరమేశ్వరుడునైన **శివుడు** రక్షించుగాక!

**వివరణము :- 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే'** అను శ్రుతి పరమేశ్వరుని పరానామిక ఏకమైన శక్తి అనేక విధములుగా విలసిల్లునని చెప్పును. అనేకములున్నప్పుడు వానికి సంయోగము తప్పదు. సంయోగము వేగముగా జరిగినపుడు దానికి **సంఘట్టమను** పేరేర్పడును. ఆ సంఘట్టముచే ఆ శక్తులు జ్వలించి **ప్రకాశము** ప్రవహించును. ఆ ప్రకాశ ప్రవాహము శివునకు శరీరమని పూర్వార్ధమువలన తెలియును. తంత్రములలో శివుడు ప్రకాశమని, శక్తి విమర్శమని చెప్పఁబడును. శివుడు ధర్మియని, శక్తిని ధర్మమనియు చెప్పుదురు. 2. మాలిన్యమనగా విషయ మిశ్రణము. అదిలేని జ్ఞానము శుద్ధమైన జ్ఞానము. అదియే **శుద్ధసంవిత్తు.** అదియే శివుడు. ఆ శివుడు సాక్షి, నిర్గుణుడు, నిర్వికారుడు. జ్ఞానముచే నేది తెలియఁబడునో అది విషయము. తెలియబడు విషయము లేనప్పుడును తెలివియుండును. కాని అది యున్నట్లు తెలియుట కష్టము. ఆ విషయమున్నప్పుడు ఉండు తెలివి విషయి జ్ఞానము. విషయము లేనపుడు విషయాభావము విషయమగుటచే నప్పటి తెలివియు అనగా జ్ఞానమును విషయియే. విషయమున్నప్పుడును విషయదోషము జ్ఞానమునకుండదు. కావున విషయ జ్ఞానమును శుద్ధమే అనవలెను. అట్టిచో విషయి

జ్ఞానము శుద్ధమని వేరుగా చెప్పనక్కఱలేదు. కాని అంతఃకరణము విషయాకారముగా పరిణమించుట అను వృత్తి ఉండుటచే విషయ జ్ఞానము వృత్తిజ్ఞానమనబడును. విషయాభావము జ్ఞానములో విషయమై యుండుటయే నిద్రయని కొందఱు, నిద్రావృత్తి భావరూపతమో (అజ్ఞానము) రూపవృత్తియే అని మరికొందరు చెప్పెదరు. మనకు ఆ మతభేదములతో ప్రస్తుతము పనిలేదు కాని అజ్ఞానము అంతఃకరణము జడములు కావున తత్పరిణామములన్నియు మలినములని, తత్పరిణామరాహిత్యసంతత జ్ఞానము **శుద్ధసంవిత్** అని గుర్తించవలసి యున్నది.

ఆ శుద్ధ సంవిద్రూప శివుడే శ్రీ పరమేశ్వరుడు. శుద్ధ సంవిద్రూప శివుని నిర్గుణ బ్రహ్మమని, మాయా శబల (సగుణ) బ్రహ్మము శ్రీ పరమేశ్వరుడని చెప్పుట **అద్వైత సంప్రదాయము**. 'పాయాత్' అను ఆశీరర్థక క్రియారూప ప్రయోగము చేయబడినందున ఆశీరూప మంగలాచరణమీ శ్లోకమున చేయబడినది. ఎవరిని రక్షించుటయో పేర్కొనక పోవుటచే సర్వజగములను అను అర్థము లభించుటచే కవి సర్వజగత్సమభావము కలవాడని తెలియుచున్నది.

**బహులశక్తి సంఘట్ట ప్రభాతరంగ**
**దేహి శుద్ధసంవిద్రూపి తిమిరహారి**
**విభుడు శ్రీపరమేశుడు విశ్వమూర్తి**
**శివుడు రక్షించుతన్ సర్వభువనములను.**

**అవతారిక :–** పుష్పదంతరచితమైన శివమహిమ్నఃస్తోత్రము 'మహిమ్నః' అను పదముతో ఆరంభింపబడినది. అది గమనించిన దుర్వాసుడు 'శ్రీశమ్భో తే మహిమ్నః' అని ఆరంభించుచు తన యీ స్తోత్రము తత్సమవో తదతిశాయియెూ కాగలదని సూచించుచున్నాడు.

**శ్లో॥ శ్రీశమ్భో! తే మహిమ్నః స్తుతిపథరచితాః సాంగవేదాః సశాస్త్రాః**
**సిద్ధాంతాః సాంగవిద్యాః సచకితమతయో నైవ పశ్యంతి పారమ్ ।**
**సాద్యంతాస్త్వామనంతం పరమశివగురుం తే కథం వర్ణయేయు–**
**స్తస్మాత్ప్రజ్ఞానుసారాదహమపి భవతః స్తౌమి కించిచ్చరిత్రమ్ ॥ 2**

**ప్రతిపదార్థము :–** హే శ్రీశమ్భో! = ఓ పూజ్యుడైన శమ్భూ!, స్తుతి పథరచితాః = స్తోత్ర మార్గమున రచింపబడిన, సాంగవేదాః = అంగములతో గూడిన వేదములు, సశాస్త్రాః =

శాస్త్రములతో కూడిన, సిద్ధాంతాః = సిద్ధాంతములు, సాంగవిద్యాః = అంగములతో కూడిన విద్యలు (నేర్చిన బుధ మండలులు), సచకితమతయః = బెదఱిన బుద్ధిగలవై, తే = నీ యొక్క, మహిమ్నః = మహిమ యొక్క, పారమ్ = ఆవలిఒడ్డును, న + ఏవ పశ్యంతి = చూడనే చూడవు, సాద్యంతాః = మొదలు చివఱకల, తే = అవి, అనంతమ్ = (ఆది) అంతము లేని, పరమశివగురుమ్ = పరమశివుడవు గురుడవునైన, త్వామ్ = నిన్ను, కథమ్ = ఎట్లు, వర్ణయేయుః = వర్ణింపజాలును, తస్మాత్ = అందువలన, ప్రజ్ఞానుసారాత్ = ప్రజ్ఞానుసారముగా, అహమ్ అపి = నేను కూడ, భవతః = నీ యొక్క, చరిత్రమ్ = చరిత్రమును, కించిత్ = కొంచెము, **స్తౌమి** = పొగడెదను.

**తాత్పర్యము :–** ఓ పూజ్యుడవైన శమ్భుడా! వేదములు వాని అంగములు, శాస్త్రములు వాని సిద్ధాంతములు, అంగములతో కూడిన విద్యలు వర్ణించుట కారంభించి దిక్కుతోచనివై నీ మహిమయొక్క అంతు గనలేనివై పోయినవి. ఆద్యంతములు గల ఆ వేదములు, శాస్త్రముల సిద్ధాంతములు ఆద్యంతములు లేని నిన్నెట్లు వర్ణింపగలవు. అయినను ఏ కొంచెమో వర్ణించినవిగదా! అట్లే నేనును నీ చరిత్రమును కొంచెము పొగడెదను.

**వివరణము :–** వేదశాస్త్రాది విద్యలన్నియు భగవానుని పొగడుటకై ప్రవృత్తములైనవి కావున అవి యన్నియు స్తోత్రమార్గముననే రచింపబడినట్టివే అగుచున్నవి. వేదములు పురుషరచితములు కాక పోయినను తాత్పర్యము కలవి కావున రచన కలిగినవే అగును కావున వేదశాస్త్రాదులు స్తుతి పథరచితములే. అయినను వాని కాద్యంతములున్నవి. పరమేశ్వరున కాద్యంతములు లేవు. కావున స్తుతి యందు ప్రవర్తిల్లి పరమేశ్వరుని అంతములేని మహిమనూహించి మొత్తమామహిమను వర్ణింపలేము. ఇంతటితో మరలి పోవుటయే మంచిదని తమ ప్రవృత్తిని విరమించుకొన్నవి. వేదశాస్త్రాదులే అనంతమైన నీ మహిమను స్తుతించ ప్రవర్తించినప్పుడు వాని కన్న నెంతో అల్పప్రజ్ఞగల నేను పొగడ యత్నించుటలో (వైఫల్య మెదురైనను) అనౌచిత్యము లేదు. 2. **పరమశివగురుమ్** అను సమాసమున శివగుర్వైక్యము వాచ్యమైనది. ఎవనికి మరో గురువు లేడో ఆ శివుడు పరమగురువు. గురువునకు శివునకు తాదాత్మ్యమును (అభేదమును) పాటించుట శాక్తశైవ సిద్ధాంత సమ్మతము. 3. **శమ్** అనగా సుఖము. అది శివుని వలన భవతి కలుగును కావున శివుడు శమ్భువు అని చెప్పబడును. 4. వర్ణించుటకు శబ్ద విస్తరము కావలెను. శబ్దవిస్తరముగల వేదశాస్త్రాదులే శివుని వర్ణించలేవు. కావున వానిని స్తుతి పథరచితములని కవి అనినాడు. యథార్థ గుణ కథనము స్తుతి యనబడును. వర్ణనమున అయథార్థములు

కూడా ఉండవచ్చును. కల్పనములు నుండవచ్చును. ప్రభువుల వర్ణనలో వారి సౌముఖ్యమును గోరి కవులు అయథార్థ వర్ణనలు చేయుట ప్రసిద్ధమే. అయథార్థగుణములు చెప్పుట **శ్లాఘ** అని, యథార్థగుణ కథనము **స్తుతి** అని, శ్లాఘస్తుతుల భేదమును కొందరు చెప్పియున్నారు. యథార్థగుణములును శివుని యందనంతములే కావున సాంతములైన వేద శాస్త్రములు స్తుతి కూడా చేయలేవు. అయినను అవి చేసినవి, ఇక నేను చేయుటలో మాత్రము దోషమేమి? చరిత్రము అనగా పెద్దలు నడచిన వృత్తము అనగా వారాచరించినది. శివుని నడక యంతము చరిత్రమే. ఆది లేని శివుని చరిత్రమున కాది లేదు. అంతములేని శివుని చరిత్రమున కంతము కూడ లేదు. కావున సాద్యంతములైన వేదశాస్త్రాదులు శివుని చరిత్రము నెట్లు వర్ణింపగలవు? శివుని యథార్థగుణముల కంతములేదు. వాని నన్నింటిని స్తుతించుట అసాధ్యమే. సంపూర్ణముగా చరిత్రమును వర్ణించుటకాని స్తుతించుట కాని సాధ్యములు కాకపోయినను చరిత్రమును గుణాదికమును కొంచెము స్తుతించుట సాధ్యమే. కావున ఓ శివా! నీ చరిత్రమును కొంచెము స్తుతించెదనని కవి చెప్పుచున్నాడు. మహాత్ముల చరిత్రము, గుణములు మహిమ అనబడును. అవి స్తోత్రమున స్తుతింపబడుటచే నీ స్తోత్రము మహిమ్నఃస్తోత్ర మనబడినది.

**వేదములాదిగా సకల విద్యలు భీతములై చరించి శం**
**భో దరియంగలేవు కడుపూన్కి భవన్మహిమంపు పారమున్**
**సాదులు నంత యుక్తము లనాది ననంతు నెటుల్ వచించెదున్**
**నీదు చరిత్రలేశమును నేను నుతించెద నా యథామతిన్.**

**అవతారిక :-** పై శ్లోకమున శివమహిమను వేదశాస్త్రాది వాఙ్మయభేదములు వర్ణింపలేవు, స్తుతింపలేవు అని చెప్పబడినది. ఈ శ్లోకమున బ్రహ్మాదులును వర్ణింపలేరు, స్తుతింపలేరు అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆనందాత్మప్రకాశస్తవ పరమహిమాపారపీయూషసింధు-**
**స్త్వద్భక్త్యామోదమగ్నాః క్వ చ కవిమధుపా బ్రహ్మవిష్ణుప్రముఖ్యాః ।**
**శ్రీశమ్భో! మోహజ్జృమ్భో న జనయతి పరాం స్వాత్మవత్తాం కిమేతత్**
**చిత్రం తద్వన్మయాపి స్వమతి విభవతః స్తూయసే కిం స దోషః? ॥ 3**

**ప్రతిపదార్థము :-** శ్రీ శమ్భో = ఓ శ్రీశమ్భూ!; ఆనందాత్మ ప్రకాశః = ఆనంద రూపమైన ఆత్మయొక్క వెలుగైన; తవ = నీ యొక్క; పరమహిమాపార పీయూష సింధుః =

ఉత్కృష్టమైన మహిమయను అంతులేని అమృత సముద్రము; క్వ = ఎక్కడ; త్వద్భక్త్యామోదమగ్నాః = నీ భక్తి యనెడి (మధువు యొక్క) సుగంధమున మునిగిన; బ్రహ్మ విష్ణు ప్రముఖ్యాః = బ్రహ్మ విష్ణ్వాదులైన; కవిమధుపాః = కవులనెడి తుమ్మెదలు; క్వచ = ఎక్కడ; మోహజ్జృంభః = మోహము యొక్క విజృమ్భణము; పరామ్ = శ్రేష్ఠమైన; స్వాత్మవత్తామ్ = తానాత్మకలిగియుండుటను ( ఆత్మవిత్త్వమును); న జనయతి = కలిగించుట లేదు; ఏతత్ = ఇది; కిమ్ = ఏమి; చిత్రమ్ = చిత్రము; తద్వత్ = ఆ విధముగా; మయా అపి = నా చేతను; స్వమతి విభవతః = నా బుద్ధిశక్తి ననుసరించి; త్వమ్ = నీవు; స్తూయసే = పొగడ బడెదవు; సః = అది; దోషః కిమ్ = దోషమా? దోషము కాదు.

**తాత్పర్యము :–** శ్రీ శమ్భూ! ఉత్కృష్టమైన నీ మహిమామృత సముద్రము నీ ఆత్మానంద ప్రకాశమే. అది ఎక్కడ? బ్రహ్మవిష్ణ్వాదులైన కవులను తుమ్మెదలు నీ భక్తి మధుపరిమలమున మునిగిపోయి ఉన్నారు. వారెక్కడ. అయినను వారు తమ శక్తిని తెలిసికొనలేని మోహజ్జృంభణము కలిగి ఉన్నారు. దాని చేతనే నీ మహిమను పొగడ యత్నించినారని తెలిసిన నేనును నా శక్తికొలది నిన్ను స్తుతించుచున్నాను అది దోషమా? కాదు.

**వివరణము :–** సముద్రమునకు అవతలి ఒడ్డు కనబడకున్నను ఉన్నమాట యథార్థము. నీ మహిమ సముద్రమునకు మాత్రమావలి ఒడ్డు కాని ఈవలి ఒడ్డుకాని లేకపోవుట చేత బ్రహ్మాదులు కూడ దానిలో మునిగియున్నవారే అగుదురు. అనినచో అస్మదాదులందు మునిగి యుండుటలో ఆశ్చర్యమేమి? ఆస్వాదించువారు దీనిని వర్ణింపగలరేమో కాని మునిగిన వారెట్లు వర్ణింపగలరు. (వాస్తవమునకు ఆస్వాదమును ఎంత వర్ణించినను ఆస్వాదము వలన కలుగు అనుభూతి మాత్రము కలుగదు). అందుచే కవి అమృతము నందు మునిగినవారని చెప్పక భక్త్యామోదమున మునిగినవారని చెప్పినాడు. ఆమోదమున అనగా పరిమళమున ఉక్కిరి బిక్కిరగుటయే ఆమోదమున మునుగుటగా భావింప వలెను. 2. పరమేశ్వరుని మహిమ పారము లేని అమృత సముద్రము. అగస్త్యునివంటి వారైనను పారముగల సముద్రమును ద్రావగలరేమో కాని అపారామృత సముద్రమును త్రాగలేరు. ఆ అగస్త్యాదుల సృష్టి స్థితిలయములకు హేతుభూతులైన బ్రహ్మాదులు అగస్త్యుని కన్న ఎన్నో రెట్లు గొప్పవారు. వారు అపారమైన అమృత సముద్రమును మొత్తము త్రావుదు మన్న పేరాసతో వచ్చిన మధుపములు. ఆ బ్రహ్మాదులే అమలిన రూపమైన ఆ సముద్రము ముందు తుమ్మెదలై పోయినారనగా మిగిలిన నావంటి వారా సముద్రము వైపు చూచుటకైనను అసమర్థులు. ఇక దానిని వర్ణించుట యను మాట గగనకుసుమమే. 3. ఈ వాస్తవమును

నా మోహ విజృంభణము గమనింపనీయకున్నది. ఆత్మవత్తను కలిగించుట లేదు. అనగా తమకెంత శక్తి యున్నదో గమనింపనీయుటలేదు. మోహము ఆత్మవత్తను అనగా ఆత్మవిత్తను (తనకు తానెరుగుటను) తెలియనీయదు. ఇచట ఆత్మవత్త ఉత్కృష్ట మని చెప్పబడినది. ఆత్మను కలిగి యుండుట యున్నప్పుడట్టు తెలియుట యనియే అర్థము. తన శక్తియే ఇట ఆత్మవత్తాపదార్థము. మోహము కలవారికి తన అల్పశక్తి అధికశక్తిగా, అధికశక్తి అల్పశక్తిగా గోచరించును. శివుని మహిమ వర్ణింపలేను. అను నా ఆత్మవత్తను నా మోహము తెలియనిచ్చుట లేదు. ఇదియే విచిత్రమైన మోహవిజృంభణము. కావుననే బ్రహ్మాదులు శివమహిమను వర్ణింపనలవికాని దానిని వర్ణించుటకు పూనుకొన్నారు. నేనును అట్లు చేయుట దోషమెట్లు అగును. అది దోషము కానేకాదు. అందుచేతనే నేను నిన్ను స్తుతించు చున్నాను. కాదు నీవు నా చే స్తుతింపబడుచున్నావు. ఇట్లు కర్మణీ ప్రయోగము చేయుట నేను చేయుచున్నానను అహంకారము కవి తనకు లేదని చెప్పుకొనుటగా గమనింప దగియున్నది. 4. **క్వ** అను శబ్దము ఒకసారి ప్రయోగింపబడినను ప్రక్కన 'చ' శబ్దముండుటచే రెండుసార్లు ప్రయోగింపబడినట్లు భావింపవలెను. రెండవ క్వ శబ్దము నా విధముగా నధ్యాహారము చేసికొనవలెను. అప్పుడే శ్లోకమున విషమాలంకారమేర్పడును. కవిమధుపా అను సమాసమున రూపకాలంకారమున్నది. మధుప విశేషణమైన భక్త్యామోదమగ్నా అను సమాసమున కూడ రూపకాలంకారమున్నది. కవులను మధుపములతో రూపించుట ఆ సమాసములలో నున్నది. పుష్పరసము మధువనియు అమృతమనియు పిలువబడుట కవి సమయ సిద్ధము. 5. శివుని మహిమ జ్ఞానరూపమని **'ఆనందాత్మప్రకాశ'** అను సమాసములోని ప్రకాశ శబ్దము వ్యంజింపజేయును.

**ఆ దరిలేని నీదు మహిమామృతసింధువు భక్తినామకా**
**మోద సుమగ్నమైన హరిముఖ్యమధువ్రతపంక్తి యేడ శ**
**మ్భో దయితాత్మవత్త్వమును బుట్టగనీయదు మోహజృమ్భమో**
**నా దగుబుద్ధి వైభవమునన్ నిను స్తోత్రమొనర్ప దోసమే?**

**అవతారిక :–** పై శ్లోకమున శంభు మహిమను స్తుతించుటలో దోషము లేదని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ మహిమ స్వరూపము తానెటిగిన విధము కవి చెప్పుచున్నాడు.

**శ్లో॥ శ్రీమద్భిర్దృశ్యభావైరహమహమిదమిత్యాత్మజృంభాధిరూఢై–**
**ర్నానారూపైః పదార్థైరనవధివిభవైరాశు దేదీప్యమానః ।**

**సర్వాతీతస్త్వమేకః పరశివచరణ! స్వప్రకాశాత్మశమ్భో!**
**నాన్యస్త్వత్తః పరోఽస్తీత్యహమిహ గురుణా త్వాం స్వభావైరవైమి ॥ 4**

**ప్రతిపదార్థము :-** అహమ్ అహమ్ = నేను నేను, ఇదమ్ = ఇది, ఇతి = అని, ఆత్మజృంభాధిరూఢైః = ఆత్మజృంభమునాశ్రయించిన, శ్రీమద్భిః = శోభాయుతములైన, దృశ్యభావైః = తెలియబడు స్వభావముగల, అనవధి విభవైః = అంతులేని ఐశ్వర్యముగల, నానారూపైః = అనేకవిధములైన, పదార్థైః = పదార్థములచేత, ఆశు = శీఘ్రముగా, దేదీప్యమానః = మిక్కిలి ప్రకాశింపబడుచున్న, ఏకః = ఒక్కడవు, (పరః = ఉత్కృష్టుడవు,) త్వమ్ = నీవు, సర్వాతీయః = అన్నింటికవతలనున్న వాడవు, పరశివచరణ = గొప్ప మంగలాచరణములు గలవాడా!, స్వప్రకాశాత్మశంభో! = స్వప్రకాశ స్వరూపుడవైన ఓ శమ్భూ, త్వత్తః = నీకన్న, పరః = ఉత్కృష్టుడు, అన్యః = మరొకడు, న + అస్తి = లేడు, ఇతి = అని, అహమ్ = నేను, ఇహ = ఇచట, గురుణా = గురువుహేతువుగా, త్వామ్ = నిన్ను, స్వభావైః = స్వభావములతో, **అవైమి** = తెలిసికొను చున్నాను.

**తాత్పర్యము :-** నేను నేనను ఇదియను ఆత్మజృంభణము నాశ్రయించి నానా విధములైన అనంత వైభవముగల శోభావంతములైన దృశ్యపదార్థములతో వేగముగా ప్రకాశింపజేయ బడుచున్న వాడవైన నీవొక్కడవే సర్వాతీతుడవు. మంగలాచరణముగల స్వప్రకాశ స్వరూపుడవైన ఓ శమ్భూ! గురువచనము వలన నీకన్న భిన్నమైనదేదియు ఈ లోకమున లేదని స్వాభావికముగానే నిన్ను తెలిసికొనుచున్నాను.

**వివరణము :-** ఒకే ఆత్మరూపశమ్భువు, నేను నేనను దృగ్రూపముతో ఇది అను దృశ్య భావము గల శోభావత్పదార్థములతో మిక్కిలి ప్రకాశింప జేయబడుచున్నాడు. దృగ్దృశ్య భావముల కతీతుడవుగా కేవల స్వప్రకాశరూపుడవుగా కూడా నీవుందువని నీకు భిన్నముగా మరొకటేమియు లేదని మత్పురాకృత సుకృత జన్య స్వభావములతో నిన్ను నేను తెలిసి కొనుచున్నాను. అని శివుడెదురుగా నున్నట్లు భావించుకొని అతనితో పలుకుచున్నాడు. 2. అనేక జన్మలందొనర్చిన సుకృతముల వలన గుర్వనుగ్రహము కలుగును. ఆ గురువు శివుడిట్టి వాడని చెప్పవలెను. శిష్యుడెఱుగవలెను. గుర్వనుగ్రహము కాక మరొక ఉపాయము శివజ్ఞానమును కలిగించగలది లేదు. **గురుణా** అను శబ్దమందలి హేతుతృతీయ ఈ విషయమును సూచించుచున్నది. 3. అంతఃకరణము యొక్క భేదములైన మనోబుద్ధి చిత్తాహంకారములందు, బాహ్య ఇంద్రియములందు, స్థూలశరీరమునందు అహమ్ బుద్ధి స్వేతర జడపదార్థములందు ఇదమ్ బుద్ధి కలుగుచుండును. అహమ్ బుద్ధి దృక్త్వమును

ఇదమ్ బుద్ధి దృశ్యత్వమును తెలుపును కాని అంతఃకరణ ప్రభేదములుగాని బాహ్యేంద్రియములుకాని స్థూల శరీరముకాని యథార్థముగా దృగ్రూపములు కావు. సుకృత విశేషము వలన స్థూలశరీరము నందు అహమ్ బుద్ధి (నే నను కొనుట) విచారణ ద్వారమున నిరాకరించుకొన గలుగుట సంభవించును. ఇంక కొంత ఎక్కువ సుకృతమువలన బాహ్యేంద్రియము లందు అహమ్ బుద్ధి విచారణ ద్వారమును తొలగించుకొనుట సంభవించును. అట్లే నేను చచ్చెదను అని స్థూలదేహము నందు అహమ్ బుద్ధి కూడ నశించిన పిమ్మట మనస్సుచే విచారణ చేయగా బాహ్యేంద్రియప్రాణ బుద్ధ్యాద్యంతఃకరణ భేదములందు అహమ్ బుద్ధి తొలగిన పిమ్మట ఏమనస్సు విచారణకు సహకరించినదో దానిని కూడ విడచి కేవలాత్మరూపుడుగా నిలచి పోవుట సుకృత పరిపాకముచే కలిగిన చిత్తశుద్ధి యున్నప్పుడే సాధ్యమగును. **యేన త్యజసి తత్త్యజ** అని ఉపనిషత్త్రీక్రమమును సూచించును. సర్వము శమ్భురూపమే. అంతేకాదు ఆ శివుడు సర్వాతీతుడు కూడా. ఈ విషయమును **'పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి అత్యతిష్ఠ దశాంగులమ్'** అను పురుష సూక్త వాక్యములు తెలుపును. 4. పరశివ చరణములలో ఒకటి ఎఱ్ఱనిది మరొకటి తెల్లనిది. తెల్లని చరణము శివరూపము. ఏకదృష్టితో శివుడే చరణము. (భేద దృష్టితో శివచరణములు ప్రకాశ విమర్శరూపములు). ఒక చరణము ఎఱ్ఱనిది. అది విమర్శ రూపము. తెల్లని చరణము ప్రకాశరూపము. ఈ అర్థము పరశివచరణ స్వప్రకాశాత్మ అను పదములతో సూచింపబడుచున్నది. 5. స్వప్రకాశాత్మ అనునది శమ్భు విశేషణము, స్వ అనగా శమ్భువు యొక్క ఆత్మ, ప్రకాశమనగా ఆయన యొక్క వెలుగు. అదియే విశ్వము, దృగ్రూపమైన ఆత్మ మరియు దృశ్యమైన విశ్వము రెండును శమ్భువు యొక్క స్వరూపములే కావున శమ్భువు స్వప్రకాశాత్మ అని విశేషింపబడినాడు. ఇది యొక మతము. మరొక మతమున ప్రకాశమనగా ఆత్మశమ్భువు స్వప్రకాశరూపమైన ఆత్మకలవాడని **'స్వప్రకాశాత్మ శంభో'** అను సమాసము బోధించును. పై మతభేదములు శైవశాక్తాద్వైతములకు చెందినవి. శైవశాక్తములు అద్వైత సిద్ధాంత ప్రతిపాదకములేగాని శంకరాద్వైతమందు చెప్పబడిన జగన్మిథ్యాత్మ సిద్ధాంతము నంగీకరించవు. శమ్భువు విశ్వము రెండు సత్యములైనచో అద్వైతమెట్లు అను ప్రశ్నమిక్కడ సమాధానించు కొనదగినది. **అధిష్ఠానమైన శమ్భువునకు అధిష్ఠితమైన విశ్వమునకు ఏ భేదము మనకు కన్పడుచున్నదో ఆ భేదము మిథ్య; భేదము మిథ్యయగుటచే, అభేదము అనగా అద్వైతము సత్యమగుట సిద్ధమైనట్లే.**

**నేనిది నేనటంచును ననేకమయాత్మవిజృమ్భణాప్త దృ**
**శ్యానవధి ప్రభావబహులార్థములన్ వెలుగొందు నిన్నుగా**
**కేను నెఱుంగ నన్యము పరేశ! పరాత్మక స్వప్రకాశ శ**
**మ్భో! నిజభావయుక్తి నిను బూర్ణు నెఱింగితి నే గురూక్తిచే.**

**అవతారిక :–** పై శ్లోకమున శమ్భువు యొక్క **'అహమిదమ్'** అను దృగ్దృశ్య భేదములు ప్రస్తావింపబడినవి. అవి మాయోపాధికములగుటచే శమ్భువు అను అద్వైతమున వాస్తవ భేదమునకు కారణములు కాజాలవని ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆత్మైవైష స్వకీయో నిరతిశయచిదానందసద్బ్రహ్మపూర్ణో౽**
**జిహ్మైః సంసారభావైరతిదురధిగమైరాత్తమాయావిలాసైః ।**
**సర్వాత్మత్వాదనన్తస్తవ శివమహసః శ్రీగురోః సత్యవాక్యై–**
**ర్నిస్తర్కోపాధిభేదైః పరమపురుష! తే తత్త్వమద్వైతమేతి ॥ 5**

**ప్రతిపదార్థము :** పరమపురుష! = ఓ పరమపురుషుడా!, తవ = నీయొక్క, ఏషః = ఈ, స్వకీయః = తనదైన, ఆత్మా ఏవ = ఆత్మయే, నిరతిశయ చిదానంద సద్బ్రహ్మ పూర్ణః = నిర్విశేష సచ్చిదానంద పూర్ణ బ్రహ్మము, అతిదురధిగమైః = ఎంత వారికిని తెలియవశముకాని, ఆత్తమాయావిలాసైః = పొందబడిన మాయా విలాసములు గల, సంసారభావైః = సంసార భావములచే, అజిహ్మః = మాలిన్యమును పొందనిది, సర్వాత్మత్వాత్ = సర్వాత్మక మగుట వలన, అనన్తః = దేశకాలవస్తు పరిచ్ఛేదము లేనిది, శివమహసః = శివతేజోరూపుడైన, శ్రీగురోః = శ్రీ గురువు యొక్క, నిస్తర్కోపాధిభేదైః = తర్కములకు ఉపాధి భేదములకు అతీతములైన, సత్యవాక్యైః = సత్యవాక్యములచేత, తే = నీ యొక్క తత్త్వమ్ = యథార్థమైన, అద్వైతమ్ = అద్వైతమును, **ఏతి** = పొందుచున్నది.

**తాత్పర్యము :** తన ఈ ఆత్మయే సచ్చిదానందపూర్ణబ్రహ్మము. అది మాయా విలాసముచే నేర్పడిన సంసార భావముల నంటక స్వచ్ఛముగానే ఉండును. అది సర్వాత్మకమగుటచే త్రివిధ పరిచ్ఛేద రహితము. అది తర్కమునకు తావులేనిది, ఉపాధి భేదములచే భేదమును పొందనిది అగుటచే యథార్థమైన ఏకత్వమునే చివఱకు పొందుట తప్పదు. (కాని అట్లు పొందవలెననిన శ్రీ గురువుయొక్క తాదృశవాక్యముల విని విశ్వసించుట ఆవశ్యకము)

**వివరణము :** భౌతికశరీరమునందు 'నేను నేన'ను సార్వకాలికమైన అనుభవరూపమున నున్న ఈ ఆత్మయే సచ్చిదానందపూర్ణబ్రహ్మమై యున్నది. దానిని మాయా విలాసములైన

సంసార భావములంటినట్లు కనబడినను అవి యాత్మను అంటజాలవు. అందువలన దానికి మాలిన్య ప్రసక్తి లేదు. జాడ్య ప్రసక్తియు లేదు. వంచింపబడిన దనుటయు కుదరదు. నశించినదనుటగాని అజ్ఞానము కలదనుటకాని దుఃఖము కలదనుటగాని కుదరదు. అది సచ్చిదానందపూర్ణబ్రహ్మము కదా. 2. ఆత్మ అనంతము అనగా త్రివిధ పరిచ్ఛేద శూన్యము. అంతము అనగా త్రివిధ పరిచ్ఛేదము. దేశపరిచ్ఛేదము (ఒక దేశమున ఉండి మరొక దేశమున లేకుండుట) కాల పరిచ్ఛేదము (ఒక కాలమున ఉండి మరొక కాలమున లేకుండుట) వస్తు పరిచ్ఛేదము (ఒక వస్తువు మరొక వస్తువు కాకపోవుట) ఈ మూడు పరిచ్ఛేదములు ఆత్మకు లేవు. అనగా ఆత్మ అన్ని దేశములలో నుండును. అన్ని కాలములలో నుండును. అన్ని వస్తువులు తానేయయినట్టిది. 3. వేద వాక్కులందు వలె గురువాక్కులందు విశ్వాసముండుట శ్రద్ధ అనబడును. ఇది సాధనచతుష్టయములోని షడ్గుణసంపత్తికి చెందిన యొక గుణము. శ్రద్ధను బలపఱుచు తర్కము అనగా వేదవాక్యములం దా యర్థమును బలపఱచు తర్కము చేయవలెనే గాని పై ప్రమాణవచనము లయథార్థములని నిరూపింప యత్నించు తర్కములను చేయరాదు. **'శ్రుతిమతస్తర్కోఽనుసంధీయతామ్'** అనునది శ్రీశంకరుల ఉపదేశము. అందుచేతనే **'తర్కాప్రతిష్ఠానాత్'** అను బ్రహ్మసూత్రము ప్రవర్తిల్లి తర్కమునకు ప్రతిష్ఠ (ఇదే సబలమైన చివరి హేతువు) లేదని చెప్పినది. గురువేద వాక్యములు విశ్వసించుటకు తర్కము చేయనక్కరలేదు. విశ్వసించిన పిమ్మట విశ్వాసమును బలపఱుచుకొనుటకు మాత్రము తర్కము చేయవచ్చును కావున గురు(వేద) వాక్కులు నిస్తర్కములు, అట్లే ఆత్మయు తర్కాతీతమే. స్వానుభవరూపమైన ఆత్మ ఉన్నదని తర్కము చేయుట వ్యర్థము. అది బ్రహ్మరూపమనుట వేదాంతవాక్యసిద్ధము కావున అక్కడ తర్కము లేకుండ విశ్వసింపవచ్చును. విశ్వసింపవలసినదే విశ్వాసదార్ఢ్యము కొఱకు తర్కము చేయవచ్చును. ప్రత్యక్షములైన భేదములౌపాధికములేగాని వాస్తవములు కావని బ్రహ్మ మొక్కటే అని బోధించు గురువాక్యముల సత్యత్వము శంకింపదగినది కాదు. కావున అవి నిస్తర్కోపాధి భేదములు, అట్లే బ్రహ్మము నిస్తర్కము, ఉపాధి భేదములు కలది కాని వాస్తవ భేదములు కలదిగాదు. ఇట్టివి గురువాక్యములు. ఆ గురువు స్వాత్మ బ్రహ్మైక్యానుభవము కలవాడు కావున ఆతడు **శ్రీ గురువని** చెప్పబడినాడు. మొత్తము మీద నిస్తర్కోపాధిభేదైః అను సమాసమును తర్కాతీతము, ఉపాధిభేదరహితమునైనను బ్రహ్మమును బోధించు సత్యవాక్యముల విశేషించుచున్నది. 4. జీవులందఱు పురుషులు అనబడుదురు. అందఱు జీవులకును శరీరము లుండును. వాని యందు వారు నివసించెదరు కావున పురుషులన బడును. పురములలో అనగా శరీరములలో నివసించు వారు కావున జీవులు పురుషులు.

వానిలో పరముడు ఉత్కృష్టుడు కావున శమ్భువు **పరమపురుష** అని పేర్కొనబడినాడు. పరమ శబ్దము సర్వశ్రేష్ఠవాచకము. పర అనగా ఉత్కృష్టమైన, మా అనగా విద్యగలవాడు పరముడు శమ్భువు అను పురుషుడు. జీవులందఱిలో నున్న విద్యలలో నుత్కృష్టమైన **'అహమ్ సర్వః'** అను విద్య (జ్ఞానము) గలవాడు గావున ఆతడు పరమపురుషుడు. 5. తత్ అనగా బ్రహ్మము, త్వమ్ అనగా జీవుడవైన నీవు అని అర్థము. గురువీవిధముగా నీవే బ్రహ్మవు 'త్వమ్ తత్' తత్ త్వమ్ (ఆబ్రహ్మమే నీవు) అని బోధించును. అదియే యథార్థము కావున **'తత్త్వమ్'** శబ్దము యథార్థమును బోధించును. అట్టి యథార్థమును, అనగా తత్త్వమును, అనగా సత్యమును బోధించు గురువాక్యములే సత్యములు. ఆ వాక్యములలోని సత్యము అద్వైతము. దానిని ఆ వాక్యముల విశ్వసించిన శిష్యుడనుభవమునకు తెచ్చుకొని తన ఈ ఆత్మయే సచ్చిదానందపూర్ణబ్రహ్మము అని తెలిసికొని అద్వైతబ్రహ్మమే అగును. 6. **ఏతి** అను పదము తెలిసికొనును, పొందును అను అర్థములను ఒసగును. తన ఆత్మయే బ్రహ్మము అని తెలిసికొనుటయే బ్రహ్మమును (అద్వైతతత్త్వమును) పొందుట, **'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి'** అను శ్రుతివాక్యము ఈ విషయమునకు ప్రమాణము.

**నిరతిశయ ప్రబోధ సుఖనిత్యము బ్రహ్మమునైన స్వాత్మయే**
**దురధిగమాత్తమాయిక సుదూషిత సంసృతి భావజిహ్మమై**
**గురువచనమ్ములన్, బరమగూఢ మనంతము నద్వయాత్మమున్**
**పరనిజ భేదశూన్యము భవత్పరతత్త్వము గాంచు నంతటన్.**

**అవతారిక : అద్వైత బ్రహ్మభావాపత్తి** పై శ్లోకమున చెప్పబడినది. దానికి సాధనమైన **శాంభవ దీక్ష స్వీకరణముచే అది** కలుగునని ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ దీక్షాం యః శామ్భవీయాం శివగురువిహితాం దివ్యబీజాగమోక్తాం**
**ప్రాప్య శ్రీశమ్భుతాదాత్మ్యవితరణచణాం జన్మమృత్యుప్రభేత్త్రీమ్ ।**
**భిత్త్వా భేద్యం పశుత్వం పరశివచరణధ్యానయోగేన పూర్ణః**
**స్వాఘోరబ్రహ్మవిద్యావిదితపరపదం బ్రహ్మ స ప్రైతి విద్వాన్ ॥ 6**

**ప్రతిపదార్థము :** దివ్యబీజాగమోక్తామ్ = దివ్యమైన బీజాగమమున చెప్పబడిన, శివుగురు విహితమ్ = శివగురువుచే చేయబడిన, శమ్భుతాదాత్మ్య వితరణ చణామ్ = శమ్భువు యొక్క తాదాత్మ్యమును ఇచ్చుటకు సమర్థమైన, జన్మ మృత్యు ప్రభేత్త్రీమ్ = జనన

మరణములను నివారించు, శామ్భవీయామ్ = శమ్భువునకు చెందిన, దీక్షామ్ = దీక్షను, యః = ఎవడు, ప్రాప్య = పొంది, భేద్యమ్ = భేదింపదగిన, పశుత్వమ్ = పశుత్వమును, భిత్త్వా = ఛేదించి, పరశివచరణధ్యానయోగేన = పరశివచరణముల ధ్యానించుట అను యోగముతో, పూర్ణః = పూర్ణుడై, స్వాఘోర బ్రహ్మ విద్యా విదిత పరపదమ్ = తన అఘోర బ్రహ్మ విద్యచే తెలియబడిన ఉత్కృష్టపదముకల, బ్రహ్మ = బ్రహ్మమును, సః = ఆ, విద్వాన్ = విద్వాంసుడు, **ప్రైతి** = పొందును.

**తాత్పర్యము :** దివ్యబీజాగమమున చెప్పబడిన శివగురువుచే నీయబడిన శంభు తాదాత్మ్యమును ప్రసాదించగల జన్మమృత్యు బంధముల ఛేదించగల శాంభవ దీక్షను పొంది ఛేదింపదగిన పశుత్వము ఛేదించిన పరశివచరణధ్యానయోగపూర్ణుడై తన అఘోరబ్రహ్మవిద్యచే తెలియబడిన పరపదరూపమైన బ్రహ్మమును పొందును.

**వివరణము :** మంత్రదీక్షను గురువునుండి స్వీకరించి పురశ్చరణమును (అనగా ఉపాసనకు ముందు చేయదగిన గురువు పట్ల కృతజ్ఞతను ప్రకటించుట కవసరమైన సేవాది కర్మను) చేసిన పిదప మంత్రజపాదికము నారంభింప వలెను. 2. శాంభవదీక్షను స్వీకరించి గురువు పట్ల కృతజ్ఞతను ప్రకటించు సేవాది రూపమైన పురశ్చరణమునాచరించి ఆయన ఉపదేశించిన అఘోర బ్రహ్మను (హ్రాం, హ్రీం, హ్రూం, అఘోరేభ్యో... రుద్రరూపేభ్యః అఘోరాయ స్వాహా, కంకం హంక్షం, హ్రీంహ్రూం, గ్రీంగ్రీం ప్రత్యక్ష ప్రత్యక్ష హ్రూం హ్రీం హూం ఫట్ స్వాహా ఇత్యాది మంత్రముల రహస్యమును) ఆ గురువు వలననే తెలిసికొనవలెను. దానివలన ఆ మంత్రము యొక్క ఉపాసనవలన గుర్వనుగ్రహము వలన శిష్యునకు పరపద మనగా నేమో తెలియును. 3. జీవుడు పశువు. అనగా అజ్ఞాని, అతని కఘోరమనగా శాంతమైన బ్రహ్మ విద్యచే పశుత్వము అను బంధము విడిపోవును. ఆ బంధము విడిపోవుటయే మోక్షము. విద్యయొక్క శక్తి బంధమోక్షణమునందే ఉ పయోగపడును. కాని బ్రహ్మప్రాప్తిని కలిగించుటలో ఉపయోగించదు. బంధము అనగా అజ్ఞానము. అది స్వాత్మబ్రహ్మైక్యజ్ఞానము కలుగకుండ చేయు ఆవరణము. దీపమున కున్న ఆవరణము తొలగించుటయే మనపని. దీప ప్రకాశ ప్రాప్తికి మన మేమియు చేయనక్కఱలేదు. అది తనకు తానే లభించును. అట్లే అజ్ఞానావరణము తొలగగా బ్రహ్మము తానే అను జ్ఞానము ఆవరణము తొలగిపోయి ఉన్నందున తనకు తానే కలుగును. స్వాత్మయే బ్రహ్మము అని తెలియుటయే బ్రహ్మప్రాప్తి. ఇది ప్రాప్తప్రాప్తియే కాని దేశాంతర కాలాంతరములలో లభించునది కాదు. ఆవరణము తొలగిన చాలును. తన ఆత్మయే

అఘోరబ్రహ్మము అను అఘోరవిద్యచే 'తన ఆత్మ బ్రహ్మము కాదు' అను భ్రాంతి నశించును. **భ్రాంతియే పశుత్వము**. అది ఉన్నంత వరకు జన్మమృత్యుపరంపరనుండి తప్పించుకొనుట సాధ్యము కాదు. శామ్భవదీక్షను పొందినాడనగా ఆ జన్మమృత్యు పరంపరతొలగినట్లే. అఘోరబ్రహ్మవిద్యచే పరపదము అనగా బ్రహ్మపదము తెలియును. స్వాత్మయే ఆ అఘోర (శాంత) బ్రహ్మము పరము. పరమపదము బ్రహ్మము ఏకార్థక పదములు. ఆ ఏకార్థము బ్రహ్మమే. అది సంసారమున కన్న భిన్నము. ఉత్కృష్టము గావున పరపదము అని చెప్పబడినది. 4. దీక్షాపురశ్చరణా నంతరము ఉపాసనమారంభింపవలెను. ఉపాసనమునకే ధ్యానమనునది నామాంతరము. ధ్యానమేమని చేయవలెను. ఈ విశ్వము అంతయు పరశివచరణమే అని ధ్యానింపవలెను. ఆత్మకు (పరబ్రహ్మము) చరణములు అనగా పాదములు నాలుగు. వానిలో నీ విశ్వమంతయు నొక చరణము. **'పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి'** అను పురుష సూక్త మంత్రమీ విషయమునకు ప్రమాణము **'సర్వమ్ ఖల్విదమ్బ్రహ్మ'** అను ధ్యానమే పరశివచరణ ధ్యానము. దాని యందు పూర్ణత లభించుట అనగా నేను బ్రహ్మను అనగా బ్రహ్మభిన్నుడను కాను అను జ్ఞానము రూఢమగుట. 5. **చరణ** శబ్దమునకు చరించునది అను వ్యుత్పత్తి ననుసరించి కుండలిని అను అర్థము లభించును. అప్పుడు పరశివచరణధ్యానయోగమనగా సహస్రారమున పరశివునితో కుండలిన్యైక్యమును ధ్యానించుట అను అర్థము లభించును. జీవరూపిణియైన కుండలినీ శక్తి శివునిలో నైక్య మొంది తిరిగి క్రిందికి ఆజ్ఞాచక్రాది ద్వారమున మూలాధారమునకు పూర్వపు స్వస్థానమును చేరక పరపదము (పరుని చోటు) అని చెప్పదగిన సహస్రారముననే స్థిరముగా నుండుట. అట్లున్నదని యెఱుగుట **అఘోరబ్రహ్మవిద్య**. అది అఘోర బ్రహ్మోపాసనముచే లభించును. విద్యాశబ్దమునకు ఉపాసనమనియు అర్థము కలదు. ఉపాసన చేత నీ బ్రహ్మపదప్రాప్తి గలుగుననుట శైవశాక్తాద్వైతములలో కొందఱి మతము. ఈ విషయమున వీరు విశిష్టాద్వైతులకు కొంచెము దగ్గఱగా నుందురు. బ్రహ్మసూత్రములకు నీలకంఠాచార్యులచే అవి శివాద్వైతమును చెప్పునని నిరూపించుచు వ్రాయబడిన భాష్యము యొక్క తాత్పర్యము ఇదియే అని ఆరాధ్యశైవసంప్రదాయమునకు చెందిన శివశ్రీముదిగొండ నాగలింగశాస్త్రిగారు నిరూపించిరి. పై నీలకంఠాచార్యులు చెప్పిన శివాద్వైతము శివవిశిష్టాద్వైతమనియే వారి నిశ్చయము. కాని ఆ నీలకంఠాచార్యుల భాష్యమునకు వ్యాఖ్యానము వ్రాసిన అప్పయదీక్షితుల వారి దృష్టిలో అది శివాద్వైతమే కాని శివవిశిష్టాద్వైతము కాదు. 6. ప్రాచీనకాలమున కాలాముఖశైవము, అఘోరశైవము, పాశు పతశైవము మొదలగు ననేక భేదములతో శైవము విస్తరిల్లినది. ఇవి శివాద్వైత

సంప్రదాయమును పూర్తిగా అనుసరింపవు. కాని కొన్ని విషయములలో దానితో నైకమత్యము కలిగియున్నవి. అయినను ఇవి అవైదికములని భావింపబడినవి. వీనిలో పాశుపతము మిక్కిలి ప్రాచీనము. అద్వైతమతానుయాయులచే బహుధా ఖండింపబడిన శైవములలో నిదియే ప్రధానము. ఈ మతమున పరమేశ్వరుడు పశుపతి నాముడు. జీవులందఱు పశువులు. వారికీశ్వరుడు కావున పరమేశ్వరుడు పశుపతి యనబడినాడు. ఆ పశుపతి పాశముల జీవులను బంధించి యుంచును. గురూక్త మంత్రోపాసనాదులచే ఆ పశుపతి అనుగ్రహించి పశువుల పాశములనుండి విడిపించును. అనగా ముక్తుల నొనరించును.

**శివపర మైక్యదాయకము సేవ్యము సమ్భవమృత్యుభేది శ్రీ**
**శివగురు సుప్రసాదితము సిద్ధిద శామ్భవదీక్ష నొంది పా**
**శవమును ద్రచ్చి శమ్భుపదసారసచింతన పూర్ణుడై యఘో**
**ర విదితమైన బ్రహ్మమున రంజిలు కోవిదు డెల్లకాలమున్.**

**అవతారిక :** పై శ్లోకమున శివునకు శంభు తాదాత్మ్యము నొసంగు **శామ్భవదీక్ష** చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ శివునితో తాదాత్మ్యము నొందు **జీవుని అర్హత** ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ బ్రహ్మాణ్డమ్పిణ్డమేతత్పితరమివ సుతస్తత్సమం నైకధర్మం**
**విజ్ఞాయాజ్ఞానముక్తః శివగురువచనైరాత్మవిజ్ఞానశాంతః ।**
**సర్వాత్మైకప్రభోస్తే పరశివచరణారాధనాసక్తచిత్తో**
**యః కోఽప్యేకః స యోగీ జయతి జనిమృతీ భో! మహామృత్యుమృత్యో! ॥7**

**ప్రతిపదార్థము :** నైకధర్మమ్ = అనేక ధర్మములు గల, తత్ బ్రహ్మాణ్డమ్ = ఆ బ్రహ్మాండము, ఏతత్ = ఈ, పిణ్డమ్ = పిణ్డము, సుతః = కుమారుడు, పితరమ్ ఇవ = తండ్రిని వలె, సమమ్ = సామ్యము కలిగియున్న దానినిగా, శివగురువచనైః = శివునికభిన్నుడైన గురువు యొక్క మాటలచేత, విజ్ఞాయ = తెలిసికొని, అజ్ఞానముక్తః = అజ్ఞానము నుండి విడువబడిన వాడై, ఆత్మవిజ్ఞాన శాంతః = ఆత్మవిజ్ఞానముచే శాంతి నొందినవాడై, సర్వాత్మైకప్రభోః = సర్వాత్మరూపుడవు ఒక్కడవు ప్రభుడవునైన, తే = నీయొక్క, పరశివచరణారాధనాసక్త చిత్తః = ఉత్కృష్టమంగళకరమునైన (నీ) చరణము యొక్క పాదపూజయందాసక్తమైన మనస్సు కలవాడై, యః కః అపి = ఎవడో ఒక, యోగీ = యోగి, భవతి = ఉండునో, సః = అతడు, భో = ఓ, మహా మృత్యుమృత్యో! = సర్వమును మ్రింగు మహామృత్యువునకు కూడ మృత్యువైన వాడా!, జనిమృతీ = జన్మమరణములను, జయతి = జయించును.

**తాత్పర్యము :** జీవేశ్వరులు వారి శరీరముల దృష్టిలో పుత్రపితలు. వారి శరీరములు బ్రహ్మాణ్డ పిణ్డాణ్డములును తండ్రి కొడుకులవంటివి. అవి రెండును అనేక ధర్మములు కలిగియుండును. పరస్పర సామ్యమును కలిగియుండును. అందుచే బ్రహ్మాండముతో తాదాత్మ్యమును పొందుట కర్హమైనదీ పిండము. ఈ జీవుడును అందుకు అర్హుడే అను శివగురువచనములచే నజ్ఞానమును వీడి ఆత్మజ్ఞానమును పొంది శాంతి నొందినవాడు. సర్వాత్మైక ప్రభుడవైన ఓ మహామృత్యుమృత్యో! నీ ఉత్కృష్ట మంగళకరచరణములందే ఆసక్తమైన చిత్తముగల ఎవడో ఒకానొక యోగి మాత్రమే జన్మమరణములను జయించును.

**వివరణము :** బ్రహ్మాండపిండములు ఈశ్వరజీవ దేహములు. అవి రెండు తండ్రి కొడుకులవలె అనేక ధర్మములు కలిగియున్నను పరస్పరసామ్యము కలిగి యుండును. బ్రహ్మాండ మీశ్వరదేహము. ఈశ్వరోపాధి పిండాండము జీవ దేహము. జీవోపాధి బ్రహ్మాండము పెద్దది. పిండాండము చిన్నది. బ్రహ్మాణ్డము అపంచీకృత భూతముల పంచీకరణముచే జనించును. పిండాండము బ్రహ్మాండములోని ఏకాంశము. కావున పిండాండము బ్రహ్మాండ సామ్యమును కలిగి యుండుటలో వింత లేదు. బ్రహ్మాండము తండ్రి వంటిది కాగా పిండాండము బిడ్డవంటిది. తండ్రి కొడుకులకు ధర్మములు కొన్ని భిన్నభిన్నముగా నున్నను పోలిక యుండును. పోలిక యనగా కొన్ని యంశములలో భేదము కొన్ని యంశములలో అభేదము. కొందఱు దార్శనికుల (పూర్వ మీమాంసకుల) దృష్టిలో తాదాత్మ్యమును ఇట్టిదే. 2. జీవేశ్వరులకు **'నిరంజనః పరమమ్ సామ్యముపైతి'** అను శ్రుతివాక్య మాధారముగా కొందఱు దార్శనికులు 'జీవేశ్వరులకు కొన్ని అంశములలో అభేదమున్నను కొన్ని అంశములలో పితాపుత్రులలో వలె భేదముకూడా సత్యముగా నుండుటచే జీవుడు ముక్తి నొందునపుడు ఈశ్వరసామ్యమునే పొందును. ఈశ్వరునితో అభేదమును పొందుట అసంభవ'మని చెప్పుదురు. 3. ఆలంకారికులు భేదప్రధానసామ్యము, అభేదప్రధాన సామ్యము, భేదాభేద ప్రధానసామ్యము అని సాదృశ్యమును (సామ్యమును) **త్రివిధమని** చెప్పిరి. కావున సామ్యమనగా అభేదప్రధానసామ్యమే అభేదమే అని పై శ్రుతిలోని సామ్యశబ్దమును అద్వైతులు నిర్వచించిరి. అంతే కాదు బ్రహ్మాండపిండాండములు మాయా కల్పితములని చెప్పిరి. కావున వాని సామ్యముకాని వాని తాదాత్మ్యముకాని ఎక్కువగా వారికి పట్టించు కొనునవసరము కలుగలేదు. కాని ఈ శ్లోకమున బ్రహ్మాండపిండాండముల సామ్యము ప్రతిపాదించుట జీవేశ్వరైక్యమునకు బలము చేకూర్చుటకే అని గమనింపవలెను. తాదాత్మ్యశబ్దమునకు అభేదమే అర్థమని శ్రీ భాస్కరరాయలు తమ లలితాసహస్రనామ

భాష్యమున నిరూపించిరి. శ్రీ శంకరులు **'సత్యపి భేదాగమే నాథతవాహం న మామకీనస్త్వమ్, సాముద్రో హి తరంగః క్వచన సముద్రో న తారంగః'** (జీవేశ్వరులకు భేదము లేకున్నను జీవుడు ఈశ్వరుని వాడే కాని ఈశ్వరుడు జీవుని వాడు కాదు. తరంగము సముద్రసంబంధియని చెప్పవచ్చునేకాని సముద్రము తరంగ సంబంధియని చెప్పరాదు) అని చెప్పిరి. ఈ సముద్ర తరంగములకున్న సంబంధమే జీవేశ్వరులకున్నదని ఆ శ్లోకము యొక్క తాత్పర్యము. సముద్ర తరంగముల సంబంధమును తాదాత్మ్యమనవలెనే కాని అభేదమనరాదు. జీవేశ్వరుల ఉపాధులైన బ్రహ్మాండ పిండాండముల తాదాత్మ్యదృష్టితో ఈ ఉపాధులు మిథ్యలు కావున వాని తాదాత్మ్యమును మిథ్య అనియే అనవలెను. ఉపహితములైన జీవేశ్వరుల అభేదము నిర్బాధమే అగును. పై శంకరుల శ్లోకమున స్వస్వామి భావ సంబంధము కూడా చెప్పబడినదందురు. అది వ్యావహారికమేకాని పారమార్థికము కాదని గ్రహింపవలెను. అస్తు. 4. బ్రహ్మాండ పిండాండముల సంబంధము పితాపుత్రసంబంధము వంటిదని శ్లోకమున చెప్పబడినది. బ్రహ్మాండ పిండాండోపాధుల ఆ పితాపుత్ర సంబంధమే జీవేశ్వరులకును అనువర్తింపజేయుట వ్యావహారికముగ అద్వైతులకును ఆమోదయోగ్యమే. విశిష్టాద్వైతులు పితృత్వ రక్షకత్వ శేషిత్వాదులీశ్వరునకు, పుత్రత్వ రక్ష్యత్వశేషత్వాదులు జీవునకు సత్యములనియే అంగీకరించెదరు. **'ఆత్మా వై పుత్ర నామాసి'** అను శ్రుతి పితాపుత్రుల కభేదమే చెప్పినది. ఆత్మ (పుత్ర) నామ శబ్దముల అర్థము సావధానముగ పరిశీలించిన వారిరువురి ఆత్మల యద్వైతమే శ్రుతితాత్పర్యమని తెలియును. 5. బ్రహ్మాండ పిండాండముల సామ్యము లేక తాదాత్మ్యము నెఱుగుట (అజ్ఞాన) ముక్తి హేతువని శ్లోకమున చెప్పబడినది. ఉపాధులకున్న సామ్యమో తాదాత్మ్యమో యెఱుగుట చేత మూలాజ్ఞానముక్తి యెట్లో వివరించుట దుర్భరముగానే యున్నది. ఏది ఎరిగినా దాని అజ్ఞానము నశించునే గాని మూలావిద్యానాశము జరుగుట ఎట్లో తెలియరాదు. మూలాజ్ఞాననాశము ఆత్మవిజ్ఞానము చేతనే శమించునని **'ఆత్మవిజ్ఞానశాంతః'** అను సమాసము తెలుపుచునే యున్నది. పరశివ చరణారాధనాసక్తచిత్తుడు ఉపాసకుడై యోగియై జన్మమృత్యువుల చక్రబంధమునుండి ముక్తుడగుటలో విప్రతిపత్తిలేదు. ఎవనికో ఒకనికి మాత్రమే ఆ యోగము పట్టి యోగియగును. 6. ఆ శమ్భువు సర్వాత్మైక ప్రభువు, సర్వాత్ముడైన వానికి బ్రహ్మాండాత్మకత్వము గాని పిండాండాత్మకత్వము గాని దుర్ఘటము కాదు. ఆ శమ్భువు మహామృత్యువునకే మృత్యువు గావున ఆ శమ్భు యోగియు జన్మమృత్యుబంధమునుండి ముక్తుడగుట సత్యము. ఆ యోగియే సర్వోత్కృష్టుడని **జయతి** అను పదము తెలుపును.

7. పరశివచరణములలో నొకటి ప్రకాశరూపము, మరొకటి విమర్శ రూపము. విమర్శ రూపచరణమెఱ్ఱనిది. ప్రకాశరూపచరణము తెల్లనిది. పరశివునియొక్క ఆ రెండు చరణములు రక్తశుక్ల ప్రభామిశ్రములు పార్వతీ పరమేశ్వర స్వరూపములు. పరశివుడే గురువు. గురువే పరశివుడు కావున గురుచరణములును రక్తశుక్ల ప్రభామిశ్రములే, పార్వతీపరమేశ్వర స్వరూపములే అని శాక్తతంత్రమున అంగీకరింపబడును. 8. శివగురువునుండి శామ్భవ దీక్షను స్వీకరించి పరశివధ్యానయోగపూర్ణుడై ఆత్మవిజ్ఞానముచే అజ్ఞానముక్తుడైన జీవునకు శమ్భుతాదాత్మ్యము సంభవించును. అట్టివానికే జన్మమృత్యు రూపసంసారచక్రబంధమునుండి ముక్తి లభించును.

**దండిగురుండు చెప్పిన విధమ్మున, తండ్రిని బిడ్డఁబోలె బ్ర**
**హ్మాండము ఁబిండమున్ దెలిసి యాత్మనెఱింగి యవిద్యనుండి ము**
**క్తుండయి శాంతుడయ్యు శివగుర్వమలాంఘ్రి సమర్చనాస్థ చి**
**త్తుండయి యెవ్వడే నొకడు త్రుంచు జనిన్ మృతి నంతకాంతకా!.**

**అవతారిక :** పై శ్లోకమున అజ్ఞానమునుండి విముక్తుడైన వానికి **మృత్యుంజయత్వము** కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున అజ్ఞానముయొక్క పరిణామములైన షట్కోశములతో కూడిన పిండమునందే (జీవించియుండ గానే) పరశమ్భు విజ్ఞానము కలుగవలెనని అట్టివానికే **విశ్వరూపత్వము** (సర్వాత్మకత్వము) పరశమ్భువునకువలె నేర్పడునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పిండే షాట్కౌశికేఽ స్మిన్నవవివరపురే పంచభూతేంద్రియాఢ్యే**
**పుంస్కే స్త్రైణే చ షాండే శివగురువచనైరత్ర విజ్ఞాయసే చేత్ ।**
**కేనాప్యన్నాసుచిత్తప్రమితినిరుపమానందకోశాంతరాశి-**
**స్త్వం షోఢాభిన్నమూర్తిః పరశివ! స బుధో విశ్వరూపత్వమీయాత్ ॥ 8**

**ప్రతిపదార్థము :** అస్మిన్ = ఈ, షాట్కౌశికే = ఆఱు కోశములు గల, నవవివరపురే = తొమ్మిది రంధ్రముల పట్టణమైన, పంచభూతేంద్రియాఢ్యే = అయిదు భూతములతో ఇంద్రియములతో కూడిన, పుంస్కే = పుంలింగము గల, స్త్రైణే = స్త్రీ లింగముగల, షాండే = నపుంసక లింగము గలదియు నైన, అత్ర = ఈ, పిండే = పిండాండమున, షోఢాభిన్నమూర్తిః = ఆఱు విధములైన మూర్తులు గల, అన్నాసుచిత్త ప్రమితి నిరుపమానంద కోశాంత రాశిః = అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు,

సాటిలేని ఆనందమయ కోశము చివఱగా గల కోశముల సమూహము గల, త్వమ్ = నీవు, కేన అపి = ఎవని చేతనైన, శివగురువచనైః = పరశివుడే అని చెప్పదగిన గురువు యొక్క మాటలతో, విజ్ఞాయసే చేత్ = తెలియబడిన వాడవగుదువేని, సః = ఆ, బుధః = తెలిసినవాడు, విశ్వరూపత్వమ్ = విశ్వమే రూపముగా గల ఈశ్వరత్వమును, **ఈయాత్** = పొందును.

**తాత్పర్యము :** ఈ పిండాండము ఆఱుకోశములతో నవరంధ్రములతో పంచభూతములతో ఇంద్రియములతో కూడినట్టిది. ఇందులో ఆఱువిధములుగా భిన్నములైన మూర్తులు గలిగిన శమ్భువున్నాడు. పిండాండమని పిలువబడు ఈ దేహమునందే ఆ శమ్భువునెఱిగిన వాడు విశ్వరూపుడైన ఆ శమ్భువే కాగలడు.

**వివరణము :** ఆత్మ పంచకోశాంతర్వర్తి అని, ఆ పంచకోశములు, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, నామములు గలిగినది. ఆత్మ పంచకోశ విలక్షణుడని, పిండాండము పంచకోశమని అద్వైత గ్రంథములన్నింటిలో దాదాపుగా ఇట్లే చెప్పబడినది. ఈ శ్లోకమున పిండము (పిండాండము) షాట్కౌశికమని చెప్పబడినది. ఈ శ్లోకమున గూడ ఐదు కోశముల పేర్లే చెప్పబడినవి. ఆఱవ కోశము పేరు చెప్పబడలేదు. కాని షట్కోశములలో ఆత్మ షోఢాభిన్నమూర్తియై ఉన్నదని చెప్పబడినది. అజ్ఞానము మాయా విద్యారూపమున ద్వివిధమై యుండును. వానిలోని అవిద్యారూప (నిద్రాకారణ) ఆనందకోశమైదవది గావున మాయారూప (మహాకారణ) కోశము ఆఱవది యని చెప్పనగును. **శ్రీమద్భాగవత శ్రీధరీయ వ్యాఖ్య** యందు త్వగ్, రుధిర, మేధో, మజ్జా, అస్థి, మాంసము లాఱు కోశములని చెప్పబడినది కావున పిండము షాట్కౌశికము. 2. జీవ దేహములు (పిండములు) త్రివిధములు (1) పుంలింగము, (2) స్త్రీలింగము, (3) నపుంసకలింగము. వానిలో మానవ దేహము నవవివరపురము అని శ్లోకమున చెప్పబడినది. నవవివరములనగా నవరంధ్రములు. వానిలో నొకటి ఊర్ధ్వమున అనగా శిరోమధ్యమున గల బ్రహ్మరంధ్రము. మధ్యమున అనగా ముఖమున గల రెండు చెవులు, రెండు కన్నులు, రెండు ముక్కు పుటములున్ను ఒక నోరు మొత్తమేడున్నవి. అధో రంధ్రములు మలమూత్రములు విసర్జించు నవి రెండు మొత్తము తొమ్మిది రంధ్రములు గల దేహము నవద్వారములుగల నగరము; నగరమును రాజేలు నట్లు దేహము నా జీవుడేలుచుండును అని పురశబ్దముచే తెలియబడుచున్నది. పిండాండము బ్రహ్మాండమును షాట్కౌశికమే అని చెప్పవలెను కాని అవిద్యారూప (నిద్రానందకారణ) కోశమీశ్వరునకు లేదని ఆఱవ కోశము

యొక్క పేరు చెప్పకపోవుటచే తెలియుచున్నది. కాని **షోఢాభిన్నమూర్తిః** అని చెప్పుటచే అన్నమయాద్యానందమయాంత పంచకోశోపాధులలోని ఐదు ఆత్మభేదములు వాని వంటి మాయామయకోశోపాధికే ఈశ్వర భేదమును కలుపుకొన వలెనని **షోఢా** అను పదముచే తెలియజేయబడినది. 3. **'అన్నాసు చిత్త ప్రమితి నిరుపమానంద కోశాంతరాశిః'** అను సమాసమున పంచ కోశముల పేర్లు చెప్పబడినవి. 'ఆనందకోశము నిరుపమమని విశేషింపబడినది. జాగ్రదవస్థలో జీవునకన్నమయ కోశాభిమానముండును. అన్నమయ కోశాభిమాన మనగా స్థూల దేహాభిమానము. అది జాగ్రదవస్థాభిమానము కూడ. ఆ అవస్థలో జీవుడు పంచేంద్రియములతో శబ్దస్పర్శ రూప రసగంధముల ననుభవించును, అవి అనుకూలములైనప్పుడు సుఖము ననుభవించును. ఆ సుఖము విషయానంద మనబడును. అది క్షణికము. ఒక్కొక్కప్పుడు దుఃఖమిశ్రము కూడ నగుచుండును. ఆ సుఖానుభవక్షణమునకు ముందు వెనుకల దుఃఖముండును. అందుచే విజ్ఞులు దానిని సుఖాభాసమందురు. జాగ్రదవస్థలో వలె స్వప్నావస్థలోను విషయానంద ముండును. కాని నిద్రావస్థలో అనగా ఆనందమయ కోశమున ప్రతికూల విషయానుభవాభావమువలన దుఃఖానుభవ ముండదు. కావున అప్పుడదియే ఆనందముగా తోచును. అట్టి ఆనందమునకు సాటిలేదు. కావుననే ప్రతి జీవుడు నిద్రించి ఆ ఆనందము ననుభవించగోరుచున్నాడు. అది కనీసము కొన్ని గంటలైనను ఉండును. కావున జాగ్రత్స్వప్నములలో క్షణిక విషయానందమున కన్న అది విలక్షణముగా నుండును. కావున ఆ ఆనందము నిరుపమమని చెప్పబడినది. **4. శివుడు షోఢాభిన్నమూర్తి** అని చెప్పబడినాడు. పంచ భూతములు, చిత్తము మొత్తము ఆఱు శివునకు పీఠములు. మూలాధారాది ఆజ్ఞాపర్యంత చక్రములాఱు. అవియు శివుని పీఠములు; ఈ పీఠము లాఱింటిలో శివుడు ఆఱు విధములైన భిన్నరూపములు ధరించి యున్నట్లుపాసకులు భావించెదరు.

**కూడెను లింగమున్ మఱియు ఁగూడిన దింద్రియపంచకమ్మిటన్**
**కూడిన వైదుభూతములు కోశములాఱు నవోరురంధ్రముల్**
**కూడిన యిట్టి పిండమునఁ గూడిన షడ్విధ భిన్నమూర్తి యె**
**వ్వాడొకొ వాని సద్గురుకృపన్ గను విజ్ఞుడు విశ్వరూపుడౌ.**

**అవతారిక :** పై శ్లోకమున తన షాట్కౌశిక పిండముననే శివుని సాక్షాత్కరించు కొనిన జ్ఞాని విశ్వరూపత్వమును పొందునని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ **విశ్వరూపత్వము** వివరింప బడుచున్నది.

శ్లో॥ సర్వేశ! శ్రీపురేశ! త్రిభువనభవనవ్యక్తయః శక్తయస్తేఽ
నంతాద్యాః శ్రీపరాద్యాః నిరవధివిభవా మాతృకాంతాః క్షకాంతాః ।
విజ్ఞాతాః స్యుః స్వరూపే యది శివగురుణా విశ్వదృశ్యప్రపంచః
స్వాత్మజ్యోతిర్విలీనాన్ విదధతి విదుషో యోగినః సైవ ముక్తిః ॥ 9

**ప్రతిపదార్థము :** సర్వేశ! = ఓ సర్వేశ్వరా!, శ్రీపురేశ = శ్రీపురప్రభూ!, త్రిభువనభవన వ్యక్తయః = లోకత్రయము అను భవనమును వెలయించు, నిరవధివిభవాః = అంతులేని వైభవముగల, అనంతాద్యాః = అనంత మొదలగు, క్షకాంతాః = క్ష అంతమందుగల, మాతృకాంతాః = వర్ణమాలాభిమాని కాంతలు, శ్రీ పరాద్యాః = శ్రీ పర మొదలైన, మాతృకాంతాః = మాతృకచివఅగల శక్తులు, తే = నీయొక్క, శక్తయః = శక్తులు, శివగురుణా = శివగురువు యొక్క అనుగ్రహము చేత, స్వరూపే = స్వరూపము నందు, విజ్ఞాతాః స్యుః = తెలియబడిన వైనచో, విశ్వదృశ్యప్రపంచః = దృశ్యప్రపంచములనన్నింటిని, స్వాత్మజ్యోతి ర్విలీనాన్ = తన ఆత్మయను వెలుగున విలీనమైన వానినిగా, **విదధతి** = చేయును, సా ఏవ = అదియే, విదుషః = జ్ఞానియైన, యోగినః = యోగికి, ముక్తిః = ముక్తి.

**తాత్పర్యము :** ఓ సర్వేశ్వరా! శ్రీపురేశ్వరా! పరా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, కుండలినీ, మాతృకా అను పేర్లు గల శ్రీపరాదులు (శక్తులు) అంతులేని విభవము గలవి. అనంతాదిమాతృకల అంతమున క్ష అనుమాతృక ఉండుటచే ఆ అనంతాదులు క్షకాంతములు. అవియన్నియు గురుకృపచే స్వరూపమున తెలియబడిన వైనచో విశ్వమందలి దృశ్యప్రపంచములన్నియు స్వాత్మజ్యోతిలో విలీనములగునట్లు ఆ శ్రీపరాదులు అనంతాదులునైన మాతృకలు (మాతృకాంతలు) చేయును. అట్లు చేయుటలో వాని విభవము నిరవధికము. అవి త్రిభువన భవనమును వ్యంజింపజేయగల శక్తులు. కావుననే విశ్వస్వరూపముననే అవి యన్నియు విలీనములగుట జ్ఞానియైన యోగికి ముక్తి లభించుట.

**వివరణము :** శ్రీ శమ్భువు సర్వేశ్వరుడు. బ్రహ్మాండముల అవతలనున్న శ్రీపురమునకు ఆతడు ప్రభువు. పరా, ఇచ్ఛా, క్రియా, జ్ఞాన, కుండలినీ, మాతృకా అను నామములు గల్గి పర ఆదియందు, మాతృక అంతమందుగల ఆతని శక్తులు త్రిభువనమను భవనమును వ్యంజింపజేయును. తిరిగి దానిని స్వాత్మజ్యోతియందు విలీనము చేయును. వాని వైభవము నిరవధికము. ప్రలయకాలమున ఆ శక్తులు సమస్త దృశ్యప్రపంచములను స్వాత్మరూపుడైన శివుని యందు లయింపజేసి తిరిగి సృష్టికాలమున బహిర్గతము చేయుచుండును. ఆ

శమ్భువే నేనను జ్ఞానము కల యోగికి కూడ దృశ్య ప్రపంచముల విలీనమొనరించి ముక్తిని కలిగించున వాశక్తులే. 2. శబ్దమే అర్థప్రపంచమును సృజించు మాతృక కావున అకారాది క్షకారాన్త వర్ణములకు **మాతృక అని లేక మాతృకలు అని** పేరు ఏర్పడియున్నది. ఆ శబ్దప్రపంచమున కంతటికి మూల శబ్దము వాక్కు **పర** యనబడును. అది సృష్ట్యాదిలో శ్రీశమ్భువునందే లీనమై యుండును. అతనికి త్రిభువనముల సృజించునిచ్ఛ ఏర్పడినప్పుడు ఆ పరా (శబ్ద) శక్తి **పశ్యంతి** యగును. అది శ్రీశమ్భువు యొక్క ఇచ్ఛాశక్తి పరిణామము. తరువాత ఆ పశ్యంతి **మధ్యమ** యగును. ఆ దశలో **'ఇచ్ఛాశక్తిచే ఉచ్ఛూనమైన (ఉబ్బిన) బీజము'** ద్విధాభూత మగును. శబ్దము అర్థము అను భేదమును పొందును. అట్లు భేదింప బడినప్పుడు దృగ్దృశ్య భేదమేర్పడును అనగా జ్ఞానశక్తి వికసించును. ఆ తరువాత ఆ మధ్యమ **వైఖరిగా** పరిణమించును. ఆ వైఖరి యే అకారాది క్షకారాన్త మాతృక. ఇది శ్రీశమ్భువు యొక్క క్రియాశక్తి రూపము కావున సమస్తమైన అర్థప్రపంచము సృజించుటకు హేతువు. అందుచేతనే అకారాది క్షకారాన్త మాతృకలు విశ్వమునకు మాతలు అనగా మాతృక (కాంత)లు. మాతలైన కాంతలు అని శ్లోకమున పేర్కొనబడినది. మరొక విధముగా, పరాశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, కుండలినీశక్తి, మాతృకాశక్తి అను ఆఱు శక్తులు పరాద్యులు మాతృకాంతలు. భిన్నభిన్న తంత్రశాస్త్ర గ్రంథములలో మాతృకల పేర్లు భిన్నభిన్నముగానున్నవి. శ్రీలలితా సహస్ర నామ స్తోత్రమున విశుద్ధి చక్రములోని మొదటి మాతృక 'అ'. దాని పేరు **అమృత** అని, అమృతాది మహాశక్తి సంవృతా అను నామము తెలియజేయగా ఈ స్తోత్రమున దాని పేరు **అనంత** అని చెప్పబడినది. చివర మాతృక **'క్ష'** దాని పేరు **క్షక** అని చెప్పబడినది. **క్షక శబ్దము స్వార్థక ప్రత్యయాంతము.** 3. ప్రపంచ సారమున ఏబదివర్ణములు ఓంకార ప్రభవములని చెప్పబడినది. అనగా మాతృక (వర్ణమాల) ఓంకార ప్రభవము అని చెప్పినట్లైనది. **ఓంకారము నందలి అకారము నుండి పది బ్రహ్మకలలు, ఉకారము నుండి పది విష్ణుకలలు, మకారము నుండి పది రుద్రకలలు, బిందువు నుండి నాలుగు (ఈశ్వర) కలలు, నాదము నుండి 16 (సదాశివ) కలలు పుట్టినట్లు చెప్పబడినది.** ఈ శ్లోకమున అనంతాద్యాః అని వర్ణ(మాల) దేవతలలో అనంత మొదటిదని చెప్పబడగా ప్రపంచసారమున ఆమె చివరి దేవతగా చెప్పబడినది. ప్రపంచ సారము ననుసరించి **అనంతాద్యాః** అను పాఠమును **అనంతాంతాః** అని సరిచేసికొన వచ్చును. లేదా దుర్వాసోమహర్షి చెప్పిన అనంతాద్యకలలు తంత్రాంతరమునకు సంబంధించినవి కావచ్చును.

**ఆదులు క్షాంతలై చను ననాదులనంతలు శ్రీపరాది వి**
**శ్వాది నిశాంతబోధక మహావిభవాధిక శక్తి మాతృకల్**
**సాదరదేశికోక్తుల నిజాత్మ వసించెదరం చెటింగినన్**
**వేది చిదగ్ని దృశ్యముల వ్రేల్తురు ముక్తియనంగ నిద్దియే.**

**అవతారిక :** పై శ్లోకమున మాతృకల వైభవము **శ్రీపరాది మాతృకాంతల వైభవము** వర్ణింప బడినది. ఈ శ్లోకమున ఆది మాతృకరూపిణియగు **శ్రీపరాశక్తి యొక్క వైభవము** వర్ణింపబడు చున్నది.

**శ్లో॥ యా షోఢా పంచధా చ ప్రకటితవిభవా శ్రీపరా దేవ! శమ్భో!**
**సైవ శ్రీసుందరీతి శ్రుతిభిరభినుతా చక్రరాజాసనస్థా ।**
**సర్వత్రానేకకోటిప్రకటితగణనా యోగినీర్వ్యశ్నువానా**
**త్వత్తేజోఽన్తర్నిగూఢా రచయతి జగతామాదిమధ్యాంతకాలాన్ ॥ 10**

**ప్రతిపదార్థము :** శమ్భో! దేవ! = ఓ శమ్భుదేవా!, యా = ఏ, శ్రీపరా = శ్రీపరాదేవి, షోఢా = ఆఱు విధములుగా, పంచధా చ = అయిదు విధములుగాను, ప్రకటితవిభవా = వైభవమును ప్రకటించినదో, సా ఏవ = ఆమెయే, శ్రుతిభిః = వేదముల చేత, చక్రరాజాసనస్థా = చక్రరాజము అను ఆసనమునందున్న, శ్రీ సుందరి ఇతి = శ్రీ సుందరియని, అభినుతా = పొగడబడినదై, సర్వత్ర = అన్నిచోట్ల, అనేకకోటిప్రకటితగణనా = అనేక కోట్లుగా లెక్కలో ప్రకటింపబడిన, యోగినీః = యోగినులను, వ్యశ్నువానా = పొందుచున్నదై, త్వత్తేజోఽన్తర్నిగూఢా = నీ తేజములోపల దాగియున్నదై, జగతామ్ = జగత్తులయొక్క, ఆదిమధ్యాంత కాలాన్ = ఆదిమధ్యాంతకాలములను, **రచయతి** = రచించుచున్నది.

**తాత్పర్యము :** ఆఱు విధములుగా, అయిదు విధములుగా తన వైభవమును తానే ప్రకటించుకొన్న ఆ శ్రీపరాశక్తియే శ్రుతులచేత చక్రరాజాసనస్థయని, శ్రీ సుందరియని పొగడబడినదై అన్ని చోట్ల అనేక కోట్లుగా గణింపబడిన యోగినులలో వ్యాపించినదై శ్రీ శమ్భుదేవుని తేజములోపల దాగియున్నదై జగత్తులయొక్క ఆదిమధ్యాంతకాలములను రచించుచున్నది.

**వివరణము :** జీవాత్మ పంచకోశములతో, షట్కోశములతో ఆవరింపబడియున్నది. అన్నప్రాణమనోబుద్ధ్యానందములు పంచకోశములు, త్వఙ్మాంసరుధిరమేధోమజ్జాస్థులు షట్కోశములు, ఆవరించు లక్షణములు కలవి కావుననే అన్నప్రాణాదులు కోశములని

పిలువబడినవి. ఆవరణము, అది కారణముగా కలిగిన విక్షేపము. ఇవి రెండును శ్రీపరాదేవి యొక్క శక్తులు లేక విలాసములు. అనగా పంచకోశములుగాని షట్కోశములుగాని అమ్మవారి యొక్క స్వరూపములు. చతుష్షష్టి కోటి యోగినులు అమ్మవారి రూపములే. నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, శాంత్యతీత అను ఐదుకలల రూపమునకూడ, అమ్మవారైదు విధములుగా నున్నది. వాని అన్నింటి యందమ్మవారే వ్యాపించి యున్నది. ఆమే శివతేజమున దాగియుండియే సృష్టిస్థితిలయముల నొనర్చుచున్నది. వానిని జగత్తులయొక్క ఆది మధ్యాంతకాలములని కవి చెప్పినాడు. ఆది కాలము అనగా సృష్టి, మధ్యకాలము అనగా స్థితి, అంతకాలమనగా లయము. అఖండకాలమునందు ఖండకల్పనము నమ్మవారు చేయుటయే ఈ సృష్టిస్థితిలయరూపకృత్య త్రయ రచనము. 2. ఆ పరాదేవిని వేదములు చక్రరాజాసనస్థ అని, శ్రీసుందరియని వేదములు పొగిడినవి. చక్రరాజమందలి రేఖలు కలియుచోట్లు యోగము లనబడును. ఈ యోగాధిష్ఠాతృదేవతలు యోగినులు. వారి కోట్ల కొలది పరిచారికలు కూడ యోగినులే.

**ఐదును నాఱురీతులుగ వ్యక్త సువైభవయైనశక్తి శ్రీ**
**వేదిక నుండి సుందరిగ వేదముచే నుతు లందుకొన్నదై**
**నీదగు సుప్రకాశమును నిల్పియు నంతట కోటియోగినీ**
**ఖ్యాదినియై జగమ్ముల త్రికాలములన్ రచియించు చుండెడిన్.**

**అవతారిక :** పై శ్లోకమున జగముల ఆదిమధ్యాంతకాలముల ననగా సృష్టిస్థితిలయముల నొనర్చిన **శ్రీ పరాదేవి** వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆమెయొక్క **కాలాకర్షిణి** (కాలసంకర్షిణి) అను శక్తి ప్రలయ మొనర్చుటయేగాక **భక్తుల అవిద్యను** నశింపజేయునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ యా శక్తిః పంచవాహప్రవహణలహరీ వ్యక్తనైజాత్మతేజః**
**సంవర్తాగ్నిప్రపీతత్రిభువనజలధిః కాలసంకర్షిణీ తే ।**
**దిక్కాలాతీతమూర్తే! పరశివ! మహతాం భక్తిభాజామవిద్యా-**
**మ్మృత్యుం విజ్ఞానదానాత్ప్రహరతి విదుషాం తన్మహత్త్వం త్వమేవ ॥ 11**

**ప్రతిపదార్థము :** యా = ఏ, పంచవాహ = ఐదుతూముల నుండి, ప్రవహణ = ప్రవహించు, లహరీ = తరంగములచేత, వ్యక్త = తెలియబడిన, నైజ = తన, ఆత్మ = ఆత్మ యొక్క తేజః = తేజస్సనెడి, సంవర్తాగ్ని = ప్రలయకాలాగ్నిచే, ప్రపీత = త్రాగబడిన, త్రిభువన = లోకత్రయమనెడి, జలధిః = సముద్రము గల, కాలసంకర్షిణీ = కాలాకర్షిణి అను పేరుగల,

తే = నీ యొక్క, శక్తిః = శక్తి, దిక్కాలాతీతమూర్తే! = దేశకాలములకతీతమైన స్వరూపముగల, పరశివ = ఓ పరశివా!, మహతామ్ = గొప్పవారైన, భక్తి భాజామ్ = భక్తి తోగూడిన వారి యొక్క, అవిద్యామ్ = అవిద్యయను, మృత్యుమ్ = మృత్యువును, విజ్ఞానదానాత్ = విజ్ఞానము నొసగుట వలన, ప్రహరతి = తొలగించును. విదుషామ్ = విద్వాంసుల, తత్ = ఆ, మహత్త్వమ్ = గొప్పతనము, త్వమ్ ఏవ = నీవే.

**తాత్పర్యము :** దిక్కాలాతీతుడవైన ఓ పరశివా! ఏ నీ కాలాకర్షిణీ అను పేరుగల శక్తి అయిదుతూముల నుండి ప్రవహించు ప్రవాహతరంగములచే తెలియబడిన తన ఆత్మతేజము అనెడి ప్రలయాగ్నిచే భువనత్రయము అను సముద్రమును త్రాగి వేసినదో ఆ శక్తి గొప్పవారైన భక్తుల అవిద్యామృత్యువును తొలగించి జ్ఞానులుగా చేయును. విద్వాంసుల ఆ గొప్పతనము నీవే.

**వివరణము :** పదార్థము **దిక్కు** (దేశము), **కాలము, వస్తువు,** అని మూడు విధములు. ఈ మూడును మాయా రూపములు లేక ప్రకృతి (అవ్యక్త) రూపములు. యథార్థము బ్రహ్మమే. అదియే వస్తువు అని చెప్పదగినది. మాయా పరిణామరూపములైన బ్రహ్మ వివర్తములు నైన జడములు మిథ్యలే యైనను వ్యావహారికమున నవి వస్తువులని చెప్పబడుచున్నవి. దిక్ (దేశ) కాలములలో దిక్కు (దేశము) ఆకాశరూపముగా, కాలమవ్యక్తరూపముగా కొందఱు అద్వైతదార్శనికులు (మధుసూదనసరస్వతులు) పేర్కొనినారు. వ్యవహారము ననుసరించి పూర్వమీమాంసకులు నైయాయికులు వైశేషికులు దిక్కాలములు ఆకాశము ద్రవ్యములని చెప్పినారు. విభుపదార్థములనియు చెప్పినారు. కాని ఈ మూడింటిని దేశకాలములుగా సంగ్రహించవచ్చును. శబ్దము వాయుగుణము అని పూర్వమీమాంసకుల ననుసరించినచో ఆకాశము దేశము భిన్న పదార్థములుగా అంగీకరింపవలసిన ఆవశ్యకత కనిపింపదు. అస్తు. **పరశివుడు దిక్కాలాతీతుడు.** 2. జ్ఞానేంద్రియములు అంతఃకరణము తదవచ్ఛిన్న చైతన్యము బయటకు వెళ్ళుట కుపయోగపడు తూముల వంటివి. అట్లు బయటకు వెడలిన చైతన్యాగ్ని ప్రపంచము నంతను మ్రింగివేయును. అంతయు జ్ఞానాకారముగా నొనర్చును. ప్రాపంచిక విషయములను కానుకలను, ఇంద్రియములు అను సామంతరాజులు ఆత్మకడకు గొని పోవగానే అవి అన్నియు జ్ఞానాగ్ని రూపమైన ఆత్మయందు విలీనములై పృథగస్తిత్వమును కోల్పోవును. బుద్ధి వానిని స్మరించినపుడు అవి అంతఃకరణములలోనే ఇంతవఱకు ఉన్నవనిపించును. ఈ ప్రపంచముయొక్క సత్యత్వమింత పరాధీనముగా నున్నది. వర్తమానానుభవములు భూతకాలస్మృతులగును.

భవిష్యత్ప్రపంచమును వర్తమానకాలమున యోగులు దర్శించిన దర్శించెదరు గాక. అంతమాత్రమున వానికి సత్యత్వము అనగా త్రికాలాబాధ్యత్వము సంభవింపదు. ఇట్లు ప్రపంచమును ఆత్మకు దర్శింప జేయునది ఆ శమ్భువు యొక్క కాలాకర్షిణీ అను శక్తి. ఆ శక్తియే ప్రలయకాలమున సమస్త ప్రపంచమును శివునందు విలయ మొనరించును. అట్లే ప్రపంచమంతయు శివమయముగా దర్శించు జ్ఞానమును భక్తులకిచ్చి వారి అజ్ఞానమృత్యువును తొలగించి జ్ఞానులుగా నొనరించి స్వాత్మల యందే శివత్వము ననుభవింపజేయును. ఆ కాలాకర్షిణి ఆ శివునిశక్తి కావున జ్ఞాను లనుభవించి శివత్వానుభవము శివుని మహిమయే అగును. 3. **'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే'** అను శ్రుతి ననుసరించి శివుని ఆ పరాశక్తియొక్క ప్రకాశమే కాలాకర్షిణి.

**పంచమహాప్రవాహగతివాహి నిజాత్మ మహాలయాగ్ని పీ**
**తాంచిత విశ్వకంధిసమయప్రవికర్షిణి నీదుశక్తి గా**
**వించి ప్రబోధమున్ బరమవిజ్ఞ! మహాశివ! భక్తియుక్తులన్**
**సంచిత మృత్యుదూరులుగ సల్పు మహత్త్వము నీవు మాత్రమే.**

**అవతారిక :** పై శ్లోకమున పరాశక్తి ప్రకాశమైన కాలాకర్షిణీశక్తితో కూడిన వాడని పర శంభువు వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున శమ్భువునకున్న ఆ పరాశక్తి నిత్యానపాయిని అని దానికెన్నడు శివునందు లోపము ఉండదని వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ సర్వజ్ఞో నిత్యతృప్తః సదసదుభయగోఽనాదిబోధః స్వతంత్రః**
**నిత్యాలుప్తాత్మశక్తిర్నిరుపమచరితోఽనంత ఇత్యంగషట్కైః ।**
**షట్ఛక్తివ్యక్తభావస్త్వమిహ శివ! యది జ్ఞాయసే దేశికోక్త్యా**
**యేన స్వాత్మన్యనాదౌ సకలవిలసితం తే పరాయాః స భేదః ॥ 12**

**ప్రతిపదార్థము :** శివ! = ఓ శివా!, నిత్యతృప్తః = నిత్యతృప్తిగలవాడు, సర్వజ్ఞః = సర్వమునెఱిగినవాడు, సదసదుభయగః = సత్తు అసత్తు అను రెంటి యందు వ్యాపించిన వాడు, అనాదిబోధః = అనాదియైన ఎఱుక గలవాడు, స్వతంత్రః = స్వాతంత్ర్యము కలవాడు, నిత్యాలుప్తాత్మశక్తిః = ఎప్పుడును లోపింపని ఆత్మశక్తి గలవాడు, నిరుపమచరితః = సాటిలేని చరితము గలవాడు, అనంతః = నాశము లేనివాడు, ఇతి = అను, అంగషట్కైః = ఆఱు అంగములచే, షట్ఛక్తివ్యక్తభావః = ఆఱు శక్తులచే తెలియబడిన సత్తగల, త్వమ్ = నీవు, దేశికోక్త్యా = గురూక్తి చేత, ఇహ = ఇచట, యది = ఒకవేళ, జ్ఞాయసే =

తెలియబడుదువేని, యేన = ఎవనిచేత, అనాదౌ = ఆదిలేని, స్వాత్మని = తన ఆత్మయందు, సకలవిలసితమ్ = సకలము విలసితమైనదో, తే = (ఆ) నీకు, పరాయాః = ఆ పరాశక్తికి, సః = అది, భేదః = భేదము.

**తాత్పర్యము :** సర్వజ్ఞత, నిత్యతృప్తత, అనాది బోధము, స్వతంత్రత, లోపించని నిత్యశక్తి గలవాడు (సాటిలేని చరితము గలవాడు) (సదసత్తుల నెఱుగువాడు) అంతము లేకపోవుట, అనునవి షడంగములు. వాని వలన గురు వచనము వలన పరా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, కుండలినీ, మాతృకా అనబడు షట్ఛక్తుల వలన ఆ శివుని అనాదియైన ఆత్మయందు తెలియబడుట అనునది పరాశక్తి యొక్క ఒక విద్యా రూపమే. ఓ శివా! శిష్యుని ఆత్మయందలి నీ విలసితమంతయు ఆ పరాశక్తి యొక్క ప్రకాశమే.

**వివరణము :** శమ్భువునకు సర్వలోకముల సృజించు శక్తి, పాలించు శక్తి, సంహరించు శక్తి, ఇతరులకు కనబడకుండు శక్తి, ఇతరులకు కనబడు శక్తి, ఈ అయిదు శక్తుల కతీతముగా నుండు శక్తి అను ఆఱుశక్తులున్నవి. ఆ శక్తులే ఆయన భావమును అనగా ఉనికిని నిరూపించును. లేక పరాదిమాతృకాంత శక్తులాఱు ఆయన ఉనికిని నిరూపించును.
2. **అంగషట్కైః** అను సమాసమునకు శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను ఆఱు అంగముల చేత అని ఒక అర్థము. వేదములకు చెందినవి పై అంగములు కావున, ఆఱు అంగములు గల వేదముల చేత అని మరొక అర్థము. అందుచేత అంగషట్కైః అను సమాసమునకు వేదవేదాంగములు అను అర్థము లభించును. ఆ వేద వేదాంగములలో పరమేశ్వరుని సర్వజ్ఞత, నిత్యతృప్తి, అనాది బోధము, అలోపత, స్వతంత్రత, అనంతశక్తి చెప్పబడినవి. సర్వజ్ఞత, తృప్తి, అనాదిబోధము, స్వాతంత్ర్యము, అలోపము, అనంత శక్తిత్వము అను ఆఱు అంగములు బ్రహ్మమున కున్నవని ప్రతిపాదింపబడినది. **సర్వజ్ఞత,** ఈ ధర్మము ఈశ్వరుని యందుండుట, జీవుని యందది లేకుండుట చేత జీవుడు కొన్ని విషయముల నెఱుగక పోవుట సంభవించుచున్నది. ఈశ్వరుడు అన్ని ఎఱుగును కావున జీవుని యందలి యా లోపము లేదు. **'యః సర్వజ్ఞః సర్వవిత్'** ఇత్యాది శ్రుతి వాక్యము లీసర్వజ్ఞత్వ మీశ్వరుని యందున్నదని చెప్పుచున్నవి. సర్వజ్ఞతా తృప్తి రిత్యాది పురాణవాక్యము తృప్తి అను (గుణ) ధర్మము, సర్వజ్ఞత్వము అను ధర్మముతో పాటు ఉన్నదని చెప్పుచున్నది. పై వాక్యము అనాది బోధము ఈశ్వరున కున్నదని చెప్పుచున్నది. పై వాక్యమే స్వాతంత్ర్యము అను ధర్మము ఈశ్వరున కున్నట్లు చెప్పుచున్నది. నిత్యాలుప్తాత్మశక్తిని పై వాక్యము ఈశ్వరునికి నిత్యశక్తికి లోపములేదని నిత్యమలుప్తశక్తిః

అను పదములతో తెలుపు చున్నది. సదసదుభయగత్వము అను ధర్మము తెలుపుచున్నది. ఇది పురాణవాక్యము లోని అంగషట్కమున లేదు. ఉపనిషద్వాక్యము ఈశ్వరుని కనంత శక్తిత్వము అను ధర్మమున్నదని తెలుపుచున్నది. పై పురాణవాక్యమున నిరుపమ చరితత్వము చెప్పబడలేదు. పరమేశ్వరుని చరితము సాటిలేనిదని వేదోపబృంహకములైన శివపురాణాదులు అనేక భక్తి కథలలో అవతారకథలలో వివరించు చున్నవి. 'అంగషట్కైః' అను సమాసము వేదవేదాంగము లతో పాటు ఉపలక్షణముగా పురాణవాక్యములోని పై అంగములను కూడ తెలుపును. 3. గురువులభించుట, ఆయనవలన ఉపదేశము లభించుట శిష్యునికి పూర్వ సుకృతము. పరిపాకము నందుట, గురూపదేశముచే శిష్యునకు స్వాత్మయందు శివజ్ఞానము లభించును. తొలుత శంభువు జీవభావము నందుట శంభుత్వము దూరము కాకుండుటచే గురూపదేశమును పొంది మరల శంభుత్వము నందుట ఇది యంతయు శంభువు యొక్క పరాశక్తి యొక్క విలాసమే.

**సకలమెఱుంగువాడు సదసద్గు దనంతుడు నిత్యతృప్తి శ**
**క్తికుడనుచున్ షడంగములు తెల్పెడు నిన్నని శక్తి షట్క సం**
**ప్రకటిత వైభవుండవని భవ్యగురూక్తి నెఱుంగ స్వాత్మ నీ**
**సకల విలాసమే పరకు సంభవి భేదము నీకునద్దియే.**

**అవతారిక :** పరమేశ్వరుని **సర్వజ్ఞత్వాదిశక్తులు** (అంగములు) పై శ్లోకమున వర్ణింపబడినవి. ఈ శ్లోకమున పరమేశ్వరుని మరొకశక్తి **వేదధాత్రి గాయత్రి** వర్ణింపబడు చున్నది.

**శ్లో॥ గాయత్రీ వేదధాత్రీ శతమఖఫలదా వేదశాస్త్రైకవేద్యా**
**చిచ్ఛక్తిర్బ్రహ్మవిద్యామ్పరమశివ! తవ శ్రీ పరాం వ్యాకరోతి ।**
**శబ్దబ్రహ్మైకవాచ్యామఖిలమతమితి వ్యక్తతత్త్వామవాచ్యాం**
**సప్తస్రోతోవిభూతిం త్రిభువనమయతాం తత్త్వతః సర్వతుర్యామ్ ॥ 13**

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరమశివా!, వేదధాత్రీ = వేదములకు తల్లియైన, శతమఖ ఫలదా = నూఱు యజ్ఞములొనర్చిన ఫలములనిచ్చు, వేదశాస్త్రైకవేద్యా = వేదశాస్త్రముల చేతనే ముఖ్యముగా తెలిసికొన దగిన, గాయత్రీ = గాయత్రియను మంత్రము, చిచ్ఛక్తిమ్ = చిచ్ఛక్తి రూపిణియైన, బ్రహ్మవిద్యామ్ = బ్రహ్మవిద్యారూపిణియైన, శబ్దబ్రహ్మైకవాచ్యామ్ = శబ్దబ్రహ్మము చేతనే చెప్పదగిన, అఖిలమతమ్ = అందఱచే అంగీకరించబడినది, ఇతి = అను, వ్యక్తతత్త్వామ్ = తత్త్వమును వ్యక్తీకరించు, అవాచ్యామ్

= చెప్పరాని, సప్తస్రోతో విభూతిమ్ = ఏడు వ్యాహృతులే విభూతులుగా గల, త్రిభువనమయతామ్ = త్రిలోక రూపత్వము కల, సర్వతుర్యామ్ = సర్వమైన లేక మొత్తము నాలుగవ తత్త్వము స్వరూపముగా గల, తవ = నీ యొక్క, శ్రీ పరామ్ = శ్రీ పరావిద్యను, **వ్యాకరోతి** = వివరించును.

**తాత్పర్యము :** ఓ పరమశివా! జపించువారికి శతయజ్ఞములు చేసిన ఫలమును ప్రసాదించునట్టి, వేదశాస్త్రములచే తెలియదగిన వేదమాతయైన గాయత్రిగా ప్రసిద్ధికెక్కిన మంత్రము చిచ్ఛక్తి బ్రహ్మవిద్యయునైన తనలోని శబ్దములచే బ్రహ్మైక్యమును బోధించు సర్వాంగీకార్యతత్త్వమైన అవాచ్యమైన స్వయముగా తుర్యమైన ఆత్మతత్త్వమును తెలుపు సప్తవ్యాహృతులు లేక సప్తలోకములు స్వరూపముగా గల శ్రీపరా విద్యను వివరించును.

**వివరణము :** గాయత్రి గుప్తగాయత్రి అని, ప్రకటగాయత్రి అని ద్వివిధముగా నున్నది. వాని శబ్దములు అర్థములు వేఱుగా నున్నను తాత్పర్యము మాత్రమొక్కటే. ఋగ్వేదములోని సవితృసూక్తములోని సవితృదేవతాకమైన త్రిపాది యైన గాయత్రీ ఛందమునకు చెందిన తత్ అను పదము మొదలు ప్రచోదయాత్ అను పదము చివఱగల ఒక మంత్రము ప్రకటగాయత్రి. ఋగ్వేదము లోని గాయత్రీ ఛందమునకు చెందిన వెన్నో మంత్రములున్నను దేనికిని గాయత్రి అను పేరు లేదు. సృష్ట్యాది నుండి నేటివరకు జపింపబడు మంత్రము ఇది యొక్కటి. ఈ మంత్రము సవితృదేవతాకమై సావిత్రియని పిలువబడినను గాయత్రియనియే లోకమున ప్రసిద్ధముగా వ్యవహరింపబడుటచే నిదియే **ప్రకటగాయత్రి.** అరుణోపనిషత్తులోని యొక మంత్రము **కావో యో నిరి**త్యాది పదములతో గుప్తగాయత్రియని, శ్రీవిద్య పరావిద్యయని పిలువబడు మంత్రము నుద్ధరించును. ఆ మంత్రమే **గుప్తగాయత్రి.** ప్రకటగాయత్రి త్రిపాదకాగా, గుప్తగాయత్రి త్రిఖండాత్మిక ప్రకటగాయత్రి. ఈ గుప్తగాయత్రి యొక్క యర్థమైన జీవబ్రహ్మైక్యమునే తాత్పర్యరూపమున బోధించునని పెద్దలు చెప్పుదురు. 2. బ్రహ్మసరోవరము ఏడుతూముల (స్రోతముల) నుండి తన విభూతిని ప్రకటించుచు (వెలువరించుచు) ప్రపంచము నంతను బ్రహ్మ సముద్రముగా నొనరించు చున్నది. భూరాది సప్తోర్ధ్వలోకములు అతలాది సప్తాధో లోకములు ఆ బ్రహ్మవిభూతులే. గాయత్రి మంత్రములతో ప్రాణాయామము చేయునప్పుడు దశప్రణవగాయత్రి నుచ్చరింపవలెను. ఏడు వ్యాహృతులను ఏడు ఓంకారముల నుచ్చరించిన పిదప నుచ్చరింపవలెను. త్రిపాదగాయత్రినొక ఓంకారము నుచ్చరించి ఉచ్చరింపవలెను. అనంతరము ఓంకారము మొదట చివఱగల గాయత్రీశీర్షము నుచ్చరింపవలెను. ఇదియే

**దశప్రణవగాయత్రి.** ఈ దశప్రణవగాయత్రిలోని మొదటి ఏడు వ్యాహృతులు సప్తోర్ధ్వలోక వాచకములు. గాయత్రి శీర్షమున ఆపస్సులు, జ్యోతి రసము, అమృతము, సప్తవ్యాహృతులలోని మొదటి మూడు వ్యాహృతులచే చెప్పబడిన భూర్భువస్సువస్సులు బ్రహ్మమని చెప్పబడినది. గాయత్రీశీర్షమున కాద్యంతములలో ప్రణవమున్నది. గాయత్రీ మంత్రమునకు మొదటనొక ఓంకారమున్నది. దానికి ముందు ఓంకారపూర్వముగానే సప్తవ్యాహృతు లుచ్చరింపబడుటచే సర్వమోంకార మయమని తెలియుచున్నది. ఈ సప్తవ్యాహృతులే **సప్తస్రోతోవిభూతి**యని శ్లోకమున చెప్పబడినది. గాయత్రీ మంత్రము జపించునప్పుడు భూర్భువస్సువస్సులను త్రివ్యాహృతు లుచ్చరింపబడును. వానికి మొదటనొక ఓంకారమే యుండును. కాగా జపమొనర్చునప్పుడు గాయత్రి ఒక ఓంకారము కలదియే యగుచున్నది. గాయత్రిలోని మూడుపాదములు 'భూర్భువస్సువః' స్వరూపములు. త్రిభువనమయములు అని శ్లోకమున చెప్పబడినది. మానవ శరీరమున రంధ్రము లున్నవి. రెండు కన్నులు, రెండు చెవులు, రెండు ముక్కుపుటములు, ఒక నోరు మొత్తమేడు. రెండు కన్నులలో చక్షురింద్రియము, రెండు చెవులలో శ్రోత్రేంద్రియము, నాసాగ్రమున అనగా ముక్కు పుటముల నడుమ ఘ్రాణేంద్రియము, నోటిరంధ్రములో జిహ్వేంద్రియము, శీర్షచర్మమున స్పర్శేంద్రియము అను ఐదు జ్ఞానేంద్రియములున్నవి. ఈ సప్తస్రోతస్సుల నుండి అనగా జ్ఞానేంద్రియముల నుండి అంతఃకరణములోని చైతన్యము అంతఃకరణ సహితముగా బహిర్విషయదేశముల కేగును. కావున అంతశ్చైతన్యము బాహ్యదేశము చేరుటకీ సప్తస్రోతస్సు లుపయోగపడుచున్నవి. అందుచే బాహ్యవిషయ మంతయు ఆత్మవిభూతియే అగుచున్నది. ఆత్మయొక్క సప్తస్రోతోవిభూతి యనగా జ్ఞానవిషయమైన పంచ విషయాత్మక ప్రపంచము. విషయములకు అనగా ప్రమేయమునకు, ప్రమాతకు అనగా అంతఃకరణమునకు రెంటికిని చైతన్యమే అనగా ఆత్మయే అధిష్ఠానము. కావున సప్తస్రోతోవిభూతి ఆత్మవిభూతియే. 3. భువన శబ్దము శరీరవాచి. జాగ్రత్స్వప్న సుషుప్తులలోని స్థూలసూక్ష్మకారణ శరీరములు త్రిభువనములు, ప్రకటగాయత్రిలోని మూడు పాదములు గుప్తగాయత్రిలోని మూడు ఖండములు ఈ త్రిభువనములకు సంకేతములు. ఈ మూడింటి కావలనున్న నాల్గవది కావున తుర్యయని ఆ మూడును ఆత్మలోని దృశ్యములే కావున ఆత్మ స్వరూపములే. ఆ మూడు భువనములు వ్యష్టిలో స్థూల సూక్ష్మకారణ శరీరములు అని ఈ వఱకే చెప్పబడినది. అదే విధముగా సమష్టిలోని స్థూలసూక్ష్మకారణశరీరములును ఆ త్రిభువనములే. ప్రపంచమంతయు త్రిభువనాత్మకము కావున ఆత్మసర్వము సర్వాతీతము. అందుచేతనే శ్లోకమున **సర్వతుర్య** అని చెప్పబడినది. ఆ విద్య త్రిభువనములు సర్వరూపము

సర్వాతీతమైన తుర్యముతో గూడినది అని ఆ శబ్దము యొక్క అర్థము. 4. ఆత్మ అఖిల మతము అనగా సర్వసమ్మతము. వైదికమైన మీమాంస (అద్వైత) దర్శన మొక్కటే గొప్ప దర్శనము. అర్థవైదికములైన వైశేషన్యాయ యోగ సాంఖ్యదర్శనములకు ఆత్మ సమ్మతమే. అవైదికములైన చార్వాక జైనబౌద్ధములు ఆత్మలేదని చెప్పును. ఆ దర్శనముల వారు శూన్యాత్మవాదులు లేక ఆత్మశూన్యతావాదులు, ఆ మాట యెట్లున్నను అభావ మనునది జ్ఞానము మీద ఆధారపడినదని చెప్పవలెను. లేదనునది కూడ ఒక జ్ఞానము. ఆ అభావమునకు అది (ఆత్మ) సాక్షి. వైదికదర్శన మందు జ్ఞానమే ఆత్మ కావున ఇతరు లభావమని చెప్పినను భావమని చెప్పినను జ్ఞానహీనులు కారు, కావున జ్ఞానము నంగీకరించని వారు కారు కావున శ్లోకమున **ఆత్మ అఖిల మతమ**ని చెప్పబడినది.

**త్రాత్రిశత క్రతూక్త ఫలదాత్రి శ్రుతిస్తుత వేదధాత్రి గా**
**యత్రియు వ్యాకరించు భవదాత్మక శ్రీపదబ్రహ్మవిద్యనే**
**స్తోత్రము సేయరానిదగఁ దుర్యగ సప్తసరోవిభూతిగా**
**నా త్రిజగన్మయాత్మగ ననంత మితి ప్రమిత స్వతత్త్వగా.**

**అవతారిక :** పై శ్లోకమున చిచ్ఛక్తియు బ్రహ్మవిద్యారూపిణియు **ఉభయగాయత్రి** రూపిణియు నైన శివుని పరాశక్తి వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ పరాశక్తి ఆత్మాభిన్నయని గ్రహించినచో సంసారమును పోగొట్టి **జీవునకు ముక్తి** ప్రసాదించునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సంసారాసారభారప్రవహణచతురామాదిశక్తిమ్పరాం తాం**
**స్వాత్మాభిన్నాం విదిత్వా వపురనుమతిభిర్నావృతాహంకృతస్థః ।**
**త్రైలోక్యమ్బ్రహ్మ విశ్వప్రసరమనవధిస్వప్రకాశప్రపూర్ణం**
**జ్ఞాత్వా ముక్తః స యోగీ భవతి గతభవస్త్వత్ప్రసాదాన్మహేశ! ॥ 14**

**ప్రతిపదార్థము :** మహేశ! = ఓ మహేశా!, సంసారాసారభార ప్రవహణ చతురామ్ = సంసారము యొక్క అసారమైన భారమును ప్రవహింపజేయుటలో సమమైన, తామ్ = ఆ, ఆదిశక్తిమ్ = ఆదిశక్తియైన, పరామ్ = పరాశక్తిని, స్వాత్మాభిన్నమ్ = తనకు అభిన్నమైన దానినిగా, విదిత్వా = తెలిసికొని, వపురనుమతిభిః = దేహాభిమానములచేత, లేక వపురనుమతిభిః = దేహప్రాణబుద్ధులచేత, నావృతాహంకృతస్థః = దాచబడని అహంకారము నందున్నవాడు (జీవుడు), బ్రహ్మవిశ్వప్రసరమ్ = బ్రహ్మయొక్క విశ్వరూప ప్రసారరూపమైన, అనవధి స్వప్రకాశప్రపూర్ణమ్ = అంతులేని ప్రకాశము చేత నిండిన దానినిగా, త్రైలోక్యమ్

= భువనత్రయమును, జ్ఞాత్వా = తెలిసికొని, సః = ఆ, యోగీ = యోగి, గతభవః = తొలగిన సంసారము గలవాడై, త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహము వలన, ముక్తః = ముక్తుడు, **భవతి** = అగును.

**తాత్పర్యము :** సంసారము అసారము, నిష్ఫలమైన భారము. దాని నో మహేశా! నీ పరాశక్తి జీవునకు వివిధాభిమానముల ద్వారా మోపును. జీవుడొక వేళ ఆ పరాశక్తి స్వాభిన్నయని, ఈ ప్రపంచమంతయు బ్రహ్మయొక్క వివిధరూప ప్రకాశమేయని, అంతులేని స్వప్రకాశముచే నింపబడినదేయని యెఱిగి నీ యనుగ్రహముచే సంసారము తొలగినవాడై అనగా సంసార భారబంధమునుండి ముక్తుడగును.

**వివరణము :** నిస్సారమైన భారమునకు సంసారము (మిక్కిలి సారము గలది) అని ఎవరు పేరు పెట్టిరో కాని దానికా పేరే నిశ్చితమై రూఢమైపోయి యున్నది. బరువులేనిది నిస్సారము. సంసారమనునది మిథ్యయే. రజ్జువుమీద భాసించు సర్పము వంటిది. రజ్జుసర్పము బరువు చెప్పగలవాడే దీనిని సంసార మనినచో చెల్లునేమోగాని ఏ మాత్రము వివేకము గలవాడు అట్లనడు, అనినను చెల్లదు. రజ్జుసర్పమునకు భారమును కల్పించి తూచగల శక్తియే నీ పరాశక్తి. అదియే ఆదిశక్తి. ఏమీలేని దానిని ఏదికాని దానిని ఏదియో ఉన్నదానినివలె చూపగల శక్తి నీ ఆదిశక్తియే పరాశక్తి. ఆ ఆది పరాశక్తియే జీవరూపిణిగా సంసరించి శివరూపమునంది ముక్తి నందుచున్నది. భిన్నరూపమున సంసారమై బంధమై అభిన్న రూపమున ముక్తి యగుచున్నది. భిన్నరూపమును కల్పించు అవిద్యగా, అభిన్నత్వమును కలిగించు విద్యగా నీ పరాశక్తియే విలసిల్లుచున్నది. కావున దానిని స్వాత్మాభిన్నగానే యెఱిగిన వానికి దేహాభిమానము తొలగిపోవును. స్థూలదేహాభిమానము, సూక్ష్మదేహాభిమానము, కారణదేహాభిమానము అను ఈ త్రివిధాభిమానములే సంసారహేతువులు, అహంకార రూపములు. ఈ అహంకృతులలో నున్న జీవుడు శివానుగ్రహమును పొందినచో నీత్రిలోకము బ్రహ్మము యొక్క విశ్వరూపప్రసారమని నీ స్వప్రకాశముచే నిండియున్నదని తెలిసికొనును. అట్లు తెలిసికొని జన్మ(మృత్యు) పరంపరారూప సంసారచక్రబంధమునుండి విడివడి ముక్తుడగును. 2. స్థూలదేహాభిమానము జాగ్రదవస్థయందు, సూక్ష్మదేహాభిమానము స్వప్నావస్థయందు, కారణదేహాభిమానము నిద్రావస్థయందును జీవుడు కలిగియుండును. స్వప్నజాగ్రదవస్థలలో సుఖదుఃఖము లనుభవించును. నిద్రావస్థలో సుఖదుఃఖము ల ననుభవించకున్నను వానికి మూలమైన కర్మవాసనలను ఆత్మకు హేతువైన అజ్ఞానమును కలిగియుండి వాని వాసనలచే అవశముగా

స్వప్నజాగ్రదవస్థలను పొందుచుండును. కావున నిద్రావస్థయు సంసారరూపమే. అందు ఆనందమున్నను అది ఆశాశ్వతమే కావున ముక్తి రూపము కాదు.

**సారములేని భారమగు సంసృతిఁ బాఱఁగఁ జేయఁజాలు నా**
**భూరి పరాదిశక్తి నిజభోక్త్ర విభిన్నగ నెన్ని తానహం**
**కారముతో వపుర్మతులఁ గప్పక సర్వము స్వప్రకాశసం**
**పూరితమంచెఱింగి భవముక్తుఁడగున్ శివయోగి నీ కృపన్.**

**అవతారిక :** పై శ్లోకమున బ్రహ్మ యొక్క స్వప్రకాశ ప్రసారమే **త్రైలోక్యమని** చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ స్వప్రకాశభిన్నమైన దేదియు లేదను తత్త్వము, తత్త్వజ్ఞానము వలననే సంసారభారము నుండి **జీవుడు ముక్తుడగుట** అను భావన ఈ శ్లోకమున చెప్పబడుచున్నవి.

**శ్లో॥ విశ్వేశ! స్వప్రకాశప్రసరమిహ వినా నాన్యదస్తీతి తత్త్వం**
**మీమాంసారూపమేతత్తవ పరమగురో! శ్రీముఖామ్నాయజాలమ్ ।**
**స్వప్రత్యక్షం విహాయ స్వరహితమితి చేదస్తి నాన్యత్ర తత్త్వం**
**యే ధీరాస్తర్కయేయుస్త ఇహ జనిమృతీర్నాప్నువంత్యంగభారైః ॥ 15**

**ప్రతిపదార్థము :** విశ్వేశ! = ఓ విశ్వేశ్వరా!, ఇహ = ఈ ప్రపంచమున, స్వప్రకాశ ప్రసరమ్ వినా = స్వప్రకాశ ప్రసారము తప్ప, అన్యత్ = మరొకటి, న అస్తి ఇతి = లేదనుట, తత్త్వమ్ = సత్యము, ఏతత్ = ఇది, మీమాంసారూపమ్ = వేదార్థ విచార (శాస్త్ర) రూపము, పరమగురో = ఓ శ్రేష్ఠగురూ!, తవ = నీ యొక్క, శ్రీముఖామ్నాయజాలమ్ = శ్రీముఖము నుండి వెడలిన వేదముల యొక్క నిగమాగమముల యొక్క సమూహము, స్వరహితమ్ = తానులేనిది, స్వప్రత్యక్షమ్ = తన ఇంద్రియజ్ఞానమును, విహాయ = వీడి, అన్యత్ర = మరొక చోట, అస్తి ఇతి చేత్ = ఉన్నదన్నచో (ఉన్నదనుట), తత్త్వమ్ = సత్యము, న = కాదు, ఇతి = అని, యే = ఏ, ధీరాః = విద్వాంసులు, **తర్కయేయుః** = ఊహించెదరో, తే = వారు, ఇహ = ఈ ప్రపంచమున, జనిమృతీః = జన్మమరణములను, అంగభారైః = శరీరపు భాగములతో, **న ఆప్నువంతి** = పొందరు.

**తాత్పర్యము :** ఓ విశ్వేశ్వరా! **ఈ ప్రపంచమున స్వప్రకాశము తప్ప వేరొకటి లేదు అనుట సత్యము. ఇదియే వేదార్థవిచార రూపము. వేద (నిగమాగమ) రూపము. గురూపదేశ రూపము.** తాను లేక తనకు ప్రత్యక్ష మనునది యెట్లుండును. అది తత్త్వ మెట్లగును. తనకు ప్రత్యక్షము కానిది మరొకచోట ఉన్నదన్నచో అది తత్త్వ మెట్లగును. ఈ విధముగా

స్వవిచారము నే విద్వాంసు లొనర్చెదరో వారికి శరీర జన్మమరణ భారముండదు.

**వివరణము :** విశ్వమీశ్వరుని ప్రకాశము. ఏది యెవని ప్రకాశమో దానికి వాడు ప్రభువు. తానెఱుగని దానికి తాను ప్రభువనుట అనునది అసంభవము. ఎఱిగినదంతయు తన ఎఱుకకే అధీనమై యుండుటచే ఎఱుకయైన తనకు దాసభూతము. విశ్వ మా ఈశ్వరుని ఎఱుకకు లోబడినదే కావున విశ్వమునకాతడు ప్రభువగుచున్నాడు. 2. స్వప్రకాశ ప్రసారములేని దానికి ఉనికి సంభవింపదు కావున స్వప్రకాశ ప్రసారములేని దున్నదనుట అసంభవము. ఒక జీవునకు తెలియనిది మరొక జీవునకు తెలియవచ్చును. ప్రతి వస్తువు ఎవరో ఒక జ్ఞాత ఎఱుకకు విషయమైనప్పుడే దానికి ఉనికి ఉండును. ఈశ్వరుడు సర్వజ్ఞాత, విశ్వజ్ఞాత కావుననే ఆయన విశ్వేశ్వరుడు. ఆయనకు తెలియనిది లేదు. జ్ఞాతృత్వము ఈశ్వరజీవోభయసాధారణము. అదియే **తత్త్వమసి** వాక్యముచే లక్ష్యమైన అర్థము. కొంచెము అంత అనునవి విశ్వ (బుద్ధి) ధర్మములు. సర్వజ్ఞత్వకించిజ్ఞత్వములోని సర్వత్వకించిత్త్వములు విశ్వ ధర్మములు. జ్ఞత్వము (జ్ఞాతృత్వము) జీవేశ్వరోభయ సాధారణమైన ధర్మము. అందు భేదములేదు. కావున జీవేశ్వరులకు భేదము లేదు. భిన్నములైన సర్వత్వకించిత్త్వములు విశ్వధర్మములు కావున వానిభేదము జీవేశ్వరభేదమును కలిగింపజాలదు. (అని విశ్వనానాత్వము (భేదము)ను మాత్రమే నిరూపించును.) ఇది యంతయు తత్త్వమసి యను వేదవాక్యము యొక్క అర్థమును విచారించుట కావున ఇది మీమాంసారూపము. 3. **తత్త్వమసి** అనునది గురువు యొక్క శ్రీముఖము నుండి వెడలిన వాక్యము. ఇట్టి మహావాక్యము లామ్నాయము నందునున్నవి. అట్టివే గురువునుండి వెడలి శ్రీముఖము లగుచున్నవి. **శ్రీముఖామ్నాయజాల**మనియు చెప్పబడుచున్నవి. పరమేశ్వరుని వాక్కులు వేదములు అని దర్శనకారు లంగీకరించినారు. గురువు శివుడే అనుట శైవశాక్తాదులందఱి అభిమతము కావున వేదమునకు (ఆమ్నాయము నకు) గురువు యొక్క శ్రీముఖము నుండి వెడలిన వాక్కునకు భేదములేదు. కావున గురూక్తవాక్యముయొక్క అర్థవిచారము కూడ మీమాంసారూపమే. 4. తానున్నప్పుడే తనకు ఏదియైన ప్రత్యక్షమగుటయో, కాకపోవుటయో అను విచారమునకు ఆస్కారముండును. కావున తానే తన ప్రత్యక్షము యొక్క సత్యత్వాసత్యత్వములకును నిరూపించుట కర్తాడు. నాకు కల వచ్చినదని ఒకడు చెప్పగా, మరొకడు నీకు కల రాలేదని చెప్పిన వాని వాక్యము తనకు ప్రమాణము కాదు. తానావాక్యమును నమ్మడు. కాన స్వప్రత్యక్షము తన ఇంద్రియముల మీద ఆధారపడి యున్నది. తన ఇంద్రియములలో లోపమున్నదని బహుజన ప్రత్యక్షము తద్వ్యవహారమున

నుండగా దానికి భిన్నముగా తన ద్విచంద్రదర్శనము సత్యమని నిరూపించ జాలడు. ఇట్లే ఒకరి **అజ్ఞానము** మరొకరిచే అజ్ఞానముగా నిరూపింపబడి ప్రామాణ్యమును కోల్పోవు చుండును. అంత మాత్రముచేత 'తాను' అను జ్ఞానము యొక్క అనగా తనయొక్క సత్యత్వము ఖండింపబడ జాలదు. ప్రతి వ్యక్తిలో నితరులకు తెలియని తాను ఉండును. కావున అది జ్ఞేయము కాదు. తాను లేకపోవుట ఎవనికిని ఉండదు. అందుచేత ఆ జ్ఞానము స్వతః ప్రమాణము, పరతః ప్రమాణము కాదు. తత్త్వమసి అను గురూపదేశముచే సంసారమంతయు మిథ్యయని తానీశ్వరుడే అని ఎఱిగిన వానికి బ్రహ్మేతరమేమియు లేకపోవుట సర్వము బ్రహ్మముగానే భాసించును. అప్పుడు దుఃఖము, సంసారము, మీమాంస. ఇట్లు తర్కించు విద్వాంసులు మీమాంసకులు. వారు సంసార భార ముక్తులగుదురు. లోకమున ప్రతివ్యక్తి తన దేహమున కీశ్వరుడు కుటుంబి. తన కుటుంబమున కీశ్వరుడు గృహస్థుడు. తన గృహమున కీశ్వరుడు కావున ఈశ్వరశబ్దము జీవునకును వర్తించునను నుద్దేశముతో ఈశ్వరుని పరమేశ్వరు డందురు. అతనికి మరొక ఈశ్వరుడు లేడని ఆ **పరమ** శబ్దము స్పష్టము చేయును. ఈశ్వరుడన్నను పరమేశ్వరుడే అను నర్థమును గ్రహింపబడుచున్నది. అట్లే ప్రతిగురువునకు ఒక గురువుండును. **'ఆచార్యవాన్ పురుషో వేద'** అను శ్రుతివాక్యము ననుసరించి గురూపదేశము నొంది శిష్యత్వము నెఱపని వానికి గురుత్వమే సంభవింపదు. పరమేశ్వరునికి మాత్రము **'స పూర్వేషామపి గురుః కాలేన అనవచ్ఛేదాత్'** అను పాతంజలసూత్రము (26) ననుసరించి పూర్వులందఱకు నాతడే గురువు. అతనికి మరొక గురువు లేడు కావున పరమేశ్వరుడే పరమ గురువని ఈ శ్లోకమున **పరమగురో** అని సంబోధింపబడినాడు.

**తన వెలుగున్ త్యజించి మఱి తత్త్వము లేదను శ్రీగురూక్తి చిం**
**తన మొనరించు ధీరులకు దైహిక జన్మజరాది భారముల్**
**తనరవు స్వప్రకాశమగు తత్త్వముగాక మఱొక్కటేదియున్**
**తనరదటంచు తర్కమును దాల్చెడివారికిఁ దప్పిపోవవే!**

**అవతారిక :** పై శ్లోకము విశ్వమంతయు పరబ్రహ్మ యొక్క ప్రకాశప్రసారమే తత్త్వాంతరము కాదు అని చెప్పబడినది. ఈ శ్లోకమున బ్రహ్మాది సమస్త విశ్వము సత్యము కాదని సచ్చిదానందబ్రహ్మ (స్వయం జ్యోతియగు) పద మొక్కటే సత్యమని (తత్త్వమని) చెప్పబడుచున్నది.

**శ్లో॥ న బ్రహ్మా విష్ణురుద్రౌ సురపతిరమరా నాసురా నైవ పృథ్వీ**
**నాపో౽గ్నిర్నైవ వాయుర్న చ గగనతలం నో దిశో నైవ కాలః ।**
**నో వేదా నైవ యజ్ఞా న చ రవిశశినౌ నో వియన్నో వికల్పః**
**స్వజ్యోతిస్సత్యమేకం జయతి తవ పదం సచ్చిదానందమూర్తే! ॥ 16**

**ప్రతిపదార్థము :** బ్రహ్మా = చతుర్ముఖబ్రహ్మ, న = సత్యుడుకాదు, విష్ణురుద్రౌ న = విష్ణురుద్రులు సత్యులు కారు, సురపతిః న = ఇంద్రుడు సత్యుడు కాదు, అమరాః న = దేవతలు సత్యులుకారు, అసురాః న = రాక్షసులు సత్యులు కారు, పృథ్వీ = భూమి, నైవ = సత్యము కానేకాదు, ఆపః న = నీళ్ళు సత్యము కావు, వాయుః = వాయువు, నైవ = సత్యము కానేకాదు, దిశః = దిక్కులు, నో = సత్యములు కావు, గగనతలమ్ నచ = ఆకాశతలము కూడ సత్యముకాదు, కాలః = కాలము, న ఏవ = సత్యము కానేకాదు, వేదాః = వేదములు, నో = సత్యములు కావు, యజ్ఞాః = యజ్ఞములు, న ఏవ = సత్యములు కానేకావు, రవిశశినౌ చ = సూర్యచంద్రులుకూడ, న = సత్యములు కారు, వియత్ = ఆకాశము, నో = సత్యము కాదు, వికల్పః = వికల్పము, నో = సత్యము కాదు, సచ్చిదానందమూర్తే! = ఓ సచ్చిదానందమూర్తీ, స్వజ్యోతిః = స్వప్రకాశరూపమైన, తవ = నీ యొక్క, ఏకమ్ = ఒక, పదమ్ = స్వరూపము, సత్యమ్ = సత్యమై, **జయతి** = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తాత్పర్యము :** బ్రహ్మవిష్ణురుద్రులు ఇంద్రుడు దేవతలు రాక్షసులు భూజలాది పంచ భూతములు దిక్కాలములు వేదములు యజ్ఞములు సూర్య చంద్రులు వికల్పములు ఏవియు సత్యములు కావు. స్వయంజ్యోతియైన నీ పద మొకటే, ఓ సచ్చిదానందమూర్తీ! సత్యమై వర్ధిలుచున్నది.

**వివరణము :** పరప్రకాశ్యముయొక్క సత్త పరవస్తువుయొక్క ప్రకాశము మీద ఆధారపడి యుండును. బ్రహ్మాది సకల విశ్వము స్వప్రకాశము మీద ఆధారపడి ప్రకాశించు చున్నది. కావున అవి ఏవియు సత్యములు కావు. స్వయంప్రకాశము సచ్చిదానందస్వరూపమునైన పరతత్త్వము అనదగిన నీ స్వరూప మొక్కటే సత్యమైయున్నది. 2. **వియత్** అనగా భూమ్యాకాశాదులందు వాని అంతరాళము నందు వానిలోపల బయట వ్యాపించియున్న **ఆకాశమని; గగనతలమ్** అనగా వృక్షాదుల కాధారముగా నున్న భూతలమువలె పైన నక్షత్రాదులతో నీలముగా కనబడు ఆకాశము అని గ్రహించవలెను.

**లేదు విరించి లేదు హరి లేదు హరుండును లేరు దేవతల్**
**లే దనలుండు లేదు శ్రుతి లే రినచంద్రులు లేరు రాక్షసుల్**
**లే దనిలుండు లేదు మహి లేదు నభమ్మును లేవు దిక్కులున్**
**లేదు సురేంద్రు దేమియును లేదిక నున్నది సచ్చిదాత్మయే.**

**అవతారిక :** పై శ్లోకమున **పరబ్రహ్మము** తప్ప అన్యమేమియు సత్యము కాదని చెప్పబడినది. ఈ శ్లోకమున నిర్వికల్పమైన పరబ్రహ్మయందు విద్వాంసులు చేయు వికల్పములనావశ్యకములని చెప్పబడుచున్నది.

**శ్లో॥ శమ్భో! సైద్ధాంతికా యే స్వమతివిభవతోఽ ఖర్వగర్వాః ప్రమాణై -**
**ర్మీమాంసంతే భవన్తమ్బహుమతజనకైరావృతాశుద్ధవిద్యైః ।**
**అన్యోన్యస్పర్ధినస్తే కథమివ భవతస్తత్త్వమీయుస్స్వతేజః**
**సర్వాతీతం వికల్పగ్రహరహితమజమ్మానతర్కాద్యగమ్యమ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** శమ్భో = ఓశమ్భో!, స్వమతి విభవతః = తమ బుద్ధి వైభవము వలన, అఖర్వగర్వాః = అధిక గర్వముగల, యే = ఏ, సైద్ధాంతికాః = సిద్ధాంతము చేయువారు, బహుమతజనకైః = అనేకాభిప్రాయములను కలిగించు, ఆవృతాశుద్ధవిద్యైః = ఆవరింపబడిన అస్వచ్ఛమైన విద్యగల, ప్రమాణైః = ప్రమాణములతో, భవన్తమ్ = నిన్ను, మీమాంసంతే = విచారించెదరో, అన్యోన్యస్పర్ధినః = పరస్పరము స్పర్ధించుకొను, తే = ఆ సైద్ధాంతికులు, స్వతేజః = స్వప్రకాశమైన, సర్వాతీతమ్ = అన్నిటికి అతీతమైన, వికల్పగ్రహరహితమ్ = వికల్పజ్ఞానములకు దూరమైన, అజమ్ = పుట్టుకలేని, మానతర్కాద్యగమ్యమ్ = ప్రమాణములచే తర్కములచే తెలియరాని, భవతః = నీ యొక్క, తత్త్వమ్ = యాథార్థ్యమును, ఇహ = ఈ లోకమున, కథమ్ = ఎట్లు, **ఈయుః** = పొందగలుగుదురు.

**తాత్పర్యము :** ఓ శమ్భో! తమ తమ బుద్ధి వైభవము సాటిలేనిదని తమకు తామే గర్వించియున్న సైద్ధాంతికులు ఏకాభిప్రాయమునకు రాలేని వారై తమకు తోచిన అశుద్ధ విద్యావరణముగల ప్రమాణములచేత నిన్ను విచారించుచున్నారు. వికల్పముల కతీతమైన నిన్ను వికల్పించు చున్నారు. ప్రమాణములకు తర్కము లకు అందని నిన్ను ప్రమాణములచేత తర్కముచేత నీ తత్త్వమును నిరూపింప దలచి యున్నారు. పరస్పరము కలహించుకొను ఆ సైద్ధాంతికులు నీ తత్త్వము నెట్లు అందుకొనగలరు.

**వివరణము :** 1. ప్రత్యక్షము (ఇంద్రియము) ఒక్కటే ప్రమాణము అని **చార్వాకులు,**

ప్రత్యక్షానుమానములు రెండు ప్రమాణములని **బౌద్ధులు**, ప్రత్యక్షానుమానశబ్దములు మూడూ ప్రమాణములని **జైనులు**, ప్రత్యక్షానుమానశబ్దోపమానములు నాలుగు ప్రమాణములని **నైయాయికవైశేషికులు**, ప్రత్యక్షానుమానశబ్దోపమానానుపలబ్ధ్యర్థాపత్తులు ఆఱు ప్రమాణములని **పూర్వమీమాంసకులు**, ప్రత్యక్షానుమానశబ్దోపమానానుపలబ్ధ్యర్థాపత్తి సంభవైతిహ్యములు ప్రమాణములని **పౌరాణికులు** అంగీకరించుచున్నారు. 2. ప్రమాణ సంఖ్యావిషయముననే ఏకాభిప్రాయములేని ఈ సైద్ధాంతికులలో చార్వాక బౌద్ధ జైనులు శమ్భువు అను నామాంతరము గల ఈశ్వరుడున్నాడనియే అంగీకరించరు. వేదమును కూడ ప్రమాణము అని అంగీకరించరు. అందుచేత వారు నాస్తికులుగా పేర్కొనబడి ఆస్తిక సైద్ధాంతికులచే బహిష్కరింపబడినారు. ఆ నాస్తికమతములను ఖండించుటలో నేకాభిప్రాయము చూపిన ఆస్తికులని పేర్కొనబడిన నైయాయికాదులు ఈశ్వరుని ఉనికిని నంగీకరించుటలో నేకాభిప్రాయమును చూపినను ఈశ్వరుడు సగుణుడని కొందఱు (నైయాయికాదులు) నిర్గుణుడని కొందఱు (అద్వైతులు), చైతన్యగుణము గల జడుడని కొందఱు (నైయాయికాదులు) చెప్పెదరు. చేతను నంగీకరించిన కొందఱు (సాంఖ్యులు) అతని ఏకత్వము నంగీకరింపరు. 3. పైన పేర్కొనబడిన ఆస్తికులనబడిన సైద్ధాంతికులలో కొందఱు నైయాయికులు వైశేషికులు అనుమాన ప్రమాణముచేతనే సాధింపయత్నించుచు వేదమునకు కూడ ప్రామాణ్యము నంగీకరించినట్లు కనబడినను వారి కనుమాన ప్రమాణము మీదనున్నంత మక్కువ వేదములపైన లేదు. వైదికులమని చెప్పికొన్నను వేదము శ్రేష్ఠ ప్రమాణమని ఒప్పుకొనరు. ప్రత్యక్షానుమానాది ప్రమాణ సమకక్షప్రమాణముగా మాత్రమే అంగీకరించెదరు. వారు తర్కరసికులే కాని తత్త్వరసికులు కారు. హేత్వాభాసములనే హేతువులుగా భ్రమించి ఈశ్వరుని సగుణత్వమును సాధింపయత్నించినారు. వేదము చెప్పిన ఈశ్వరుని నిర్గుణత్వమును వారు పట్టించుకొన లేదు. న్యాయముగా అట్టి నైయాయిక వైశేషికుల నర్ధవైదికులనియే చెప్పవలసియున్నది. 4. సాంఖ్యులు ప్రకృతి సంగవర్జితుడైన చేతను నంగీకరించినను అవైదికమైన చేతన బహుత్వము నంగీకరించి వారును అర్ధవైదికులు గానే మిగిలి పోయినారు. పూర్వమీమాంసకులు వేదమందలి మంత్ర బ్రాహ్మణముల కిచ్చినంత ప్రాధాన్యముపనిషత్తుల కీయరు. మేమే పూర్ణవైదికులమని జబ్బలు చఱచుకొను ఆ పూర్వమీమాంసకులలో కొందఱు ఈశ్వరాస్తిత్వమునే పట్టించు కొనలేదు. 5. ఉత్తరమీమాంసకులలో కూడ జీవేశ్వరులు వేఱని విశ్వసించు ద్వైతవిశిష్టాద్వైతాది సైద్ధాంతికులు నిర్వికల్పుడు స్వతేజః స్వరూపుడు మానతర్కాద్యగమ్యుడు సర్వాతీతుడైన

ఈశ్వరుని (శమ్భుని) తత్త్వము నెట్లు తెలిసికొనగలరు. ఉపనిషత్ప్రామాణ్యము నంగీకరించిన అద్వైతులలో కూడ అనేక మతములున్నవి. గురూప సదనము చేయక గుర్వనుగ్రహము పొందక వేదాంతులమని విఱ్ఱవీగు నద్వైతులలో కూడ నిన్ను స్వమతి విభవము ననుసరించి వికల్పించుచునే యున్నారు. నిర్వికల్పత నంగీకరించియు వికల్పించు చున్నారు. వారు మాత్రము నీతత్త్వము నెట్లు తెలియగలరు. జన్మాది వికార రహితుడైన శంభువు యొక్క అవతారాది కథల పరమార్థమెఱుగక శమ్భువు యొక్క గుణ గణ నిరూపణమునందే తమ జీవితముల పర్యవసింపజేసికొని మరల జన్మనొందుటకు సంసిద్ధులై యున్నారు. వైరాగ్యహీనులై యున్నారు. స్వామీ నీవే (నీ) యాథార్థ్యమును మా ఆత్మలలో నింపుము అని ప్రార్థించుచు ఈ శ్లోక వ్యాఖ్యానము ముగించెదము.

**స్వమతి బలాతిగర్వితులు శాస్త్రవిదుల్భవదీయతత్త్వమున్**
**తమతమ యుక్తులన్ బహువిధమ్ములఁ జెప్పుచునుంద్రు స్పర్ధ వా**
**దములను సల్పువారలకు తర్కము చేరని స్వప్రకాశ రూ**
**పమతి వికల్పశూన్యమగు త్వన్నిజతత్త్వ మెఱుంగనౌ నెటుల్.**

**అవతారిక :** పై శ్లోకమున సైద్ధాంతికులు శమ్భువు యొక్క యాథార్థ్య మెఱుగ జాలరు అని చెప్పబడినది. ఈ శ్లోకము ఎవఱాశమ్భువు యొక్క యాథార్థ్యమెఱుగుదురో చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధీరాః కేచిన్మహాంతో గురువచనరతాస్త్యక్తసంసారభావా**
**నిశ్శంకాఘోరవిద్యాఃపరిణతమతయః సర్వసంకల్పముక్తాః ।**
**త్వత్కారుణ్యాక్షిలక్ష్యాః పరమశివ! భవత్సాధకాః పుణ్యపాపైః**
**కృత్యాకృత్యైర్విహీనాః పరపదవిభవం త్వాముపశ్యంతి విశ్వమ్ ॥ 18**

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరమశివా!, కేచిత్ = కొందఱు, మహాంతః = గొప్ప, ధీరాః = ధీరులు, గురువచనరతాః = గురువాక్కులందాసక్తులై, త్యక్తసంసారభావాః = సంసార భావమును విడచినవారై, నిశ్శంకాఘోరవిద్యాః పరిణతమతయః = శంకలేని అఘోరవిద్యచే పరిపక్వమైన బుద్ధి గలవారై, సర్వసంకల్పముక్తాః = సర్వసంకల్పముల వీడినవారై, త్వత్కారుణ్యాక్షిలక్ష్యాః = నీ దయాదృష్టిపాతయోగ్యులై, భవత్సాధకాః = నిన్ను సాధించువారై, కృత్యాకృత్యైః = కృత్యాకృత్యములచే, పుణ్యపాపైః = పుణ్యాపాపములచేత, విహీనాః = రహితులై, పరపదవిభవమ్ = పరమపద వైభవరూపుడవైన, త్వామ్ = నిన్ను,

విశ్వమ్ = సమస్తముగా, **ప్రపశ్యంతి** = బాగుగా దర్శించుచున్నారు.

**తాత్పర్యము :** ఓ పరమశివా! కొందఱు మహాధీరులు సంసారమునందు విరక్తులై గురువచనముల విశ్వసించువారు బోధించిన అఘోరవిద్యచే తమ బుద్ధిని పరిణమింప జేసికొని సర్వసంకల్పముల (వికల్పముల) వీడి పుణ్యపాపములు విధినిషేధములు లేనివారై నీ దయాదృష్టిపాతములకు పాత్రులై సచ్చిదానంద పరమపదవైభవరూపుడవైన నిన్నే సమస్తముగా అనగా విశ్వమునం దంతట నిన్నే దర్శించుచున్నారు.

**వివరణము :** కేవలశాస్త్రజ్ఞానము ఈశ్వరప్రాప్తికి ఏకైక సాధనముకాదు. ఒక్కొక్కప్పు డహంకారమును పెంపొందించి పతనహేతువు కూడా అగుచున్నది. ఎంత శాస్త్రజ్ఞానమున్నను అహంకారము వీడి గురువును చేరవలెను. తనకేమి తెలియదని ఆయన చెప్పినట్లే చేయవలెనని నిశ్చయించుకొనవలెను. **'గురు వచనరతాః'** అను సమాసము ఈ అర్థము బోధించును. 2. అఘోర విద్య స్థూలముగా నొక మంత్రము మాత్రమే యైనను విద్యయని పిలువబడినను గురువు చేత దాని యర్థము సందేహరహితముగా ఉపదేశింపబడినప్పుడే శిష్యుని సందేహములు తీరును. **'నిశ్శంకాఘోరవిద్యాః'** అను సమాసమీ యర్థము తెలుపును. 3. శాక్తశైవ గ్రంథములలో సంన్యాసమునకు కూడ పై మెట్టు అని చెప్పదగిన 'అవధూత' స్థితి యొకటి చెప్పబడినది. వారికి విధినిషేధములు పాపపుణ్యములు లేవు. వారిని **అత్యాశ్రమ** లందురు. బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మానుష్ఠానానంతరము గుర్వనుగ్రహముచే నీ స్థితి లభించును. వారి యెడ **'అనాశ్రమీ న తిష్ఠేత'** అను శాస్త్రవచనము చెల్లదు. వారు బాలురవలె అనాశ్రములు కారు. ఆశ్రమ ధర్మానుష్ఠాన పుణ్యము పండించుకొని అత్యాశ్రమ స్థితి నందిన వారు వారు. వారు పరమ శివానుగ్రహదృష్టిపాత పాత్రులు కావున వైదిక విధి నిషేధములు వారి యెడల చెల్లవు. అహంకారరహితులు కావున వారి కర్మలు పుణ్యపాపముల కలిగింపలేవు. 4. పాపమున్నచో నరకాది భోగము, పుణ్యమున్నచో స్వర్గాది భోగము తప్పదు. అది యెఱిగి విరక్తులైన ఆ అవధూతలు ప్రారబ్ధశేషము ననుభవించుచు తదనుకూల కర్మలు చేయుదురు. వారు ఆ కర్మలు చేసినట్లు కనబడు జీవన్ముక్తులు. **'నిస్త్రైగుణ్యే పథి విహ(చ)రతాం కో విధిః కో నిషేధః'** అను సూక్తి ననుసరించి వారికి విధి నిషేధములు పుణ్యపాపములు కలిగింపవు. పుణ్యపాప విహీనత అనగా ఇట్టిది. కృత్యాకృత్యవిహీనత అనగా ఇట్టిది.

**పరమశివా! మహాత్ములు భవత్పద భక్తులు కొందఱుర్విశ్రీ**
**గురువచన ప్రబుద్ధులయి కూడి నిగూఢ మఘోరవిద్య స**

**త్వరిణత బుద్ధులై భవదపారకృపేక్షణ లక్ష్యులయ్యు ద్వం**
**ద్వ రతిని వీడి నిన్నుఁ బర వైభవరూపునిఁ జూతు రంతటన్.**

**అవతారిక :** పై శ్లోకమున సంగ్రహముగా **శామ్భవ సిద్ధాంతము** చెప్పబడినది. ఈ శ్లోకమున ఉపోద్ఘాతమును ముగించుచు తాను చేయబోవు స్తోత్రమందలి దోషముల క్షమాపణము కోరబడుచున్నది.

**శ్లో॥ సిద్ధాంతః శామ్భవోఽయం శివగురువచనాఘోరవిద్యాక్షరోక్తః**
**స్తోత్రవ్యాజేన నిర్వ్యాహ్యత ఇతి భవతః శ్రీవిభో! చాపలమ్మే ।**
**అత్ర న్యూనాతిరేకోక్తిజనితమసకృత్ క్షమ్యతాం దాసబుద్ధ్యా**
**మచ్చిత్తస్థః ప్రమేయం సముపదిశ పరమ్మాతృకావర్ణరాశిమ్ ॥ 19**

**ప్రతిపదార్థము :** శ్రీ విభో! = ఓ ప్రభూ, శివగురువచనాఘోరవిద్యాక్షరోక్తః = శివగురు వచనద్వారమున లభించిన అఘోరవిద్యయందలి అక్షరముచే చెప్పబడిన, అయమ్ = ఈ, శామ్భవః = శామ్భవమైన, సిద్ధాంతః = సిద్ధాంతము, స్తోత్రవ్యాజేన = స్తోత్రము అను నెపమున, నిర్వ్యాహ్యతే = నిర్వహింపబడుచున్నది, ఇతి = అనునది, మే = నా యొక్క, చాపలమ్ = చపలత, అత్ర = ఇచట, అసకృత్ = మాటిమాటికి, న్యూనాతి రేకోక్తిజనితమ్ = తక్కువగా గాని ఎక్కువగా గాని చెప్పుటచే నేర్పడిన దోషమును, దాసబుద్ధ్యా = దాసుడను బుద్ధితో, క్షమ్యతామ్ = క్షమింపబడుగాక, మచ్చిత్తస్థః = నా చిత్తమందున్నవాడవై, ప్రమేయమ్ = తెలిసికొనదగిన, పరమ్ = గొప్పదైన, మాతృకావర్ణరాశిమ్ = మాతృకావర్ణముల సమూహమును, **సముపదిశ** = చక్కగా నుపదేశింపుము.

**తాత్పర్యము :** ఇది శామ్భవ సిద్ధాంతము. శివగురువచనరూపమైన అఘోరవిద్య (మంత్రము) లోని అక్షరములచే చెప్పబడినది. స్తోత్రవ్యాజమున ఇది నిర్వహింపదలపెట్టబడినది. ఇది నా చపలతయే. ఇట అధికముగా గాని అల్పముగా గాని చెప్పుటచే కలిగిన నా దోషమును దాసబుద్ధితో క్షమింపుము. నా చిత్తమందుండి ముందుగా చెప్పదగిన మాతృకావర్ణరాశి నుపదేశింపుము.

**వివరణము :** ఉపోద్ఘాతమున గ్రంథస్థ విషయమును స్థూలముగా చెప్పుట సంప్రదాయము. **శాంభవసిద్ధాంత మీ గ్రంథము యొక్క ప్రమేయము.** ఈ ప్రమేయమును గ్రహించుటకు ఈ గ్రంథ ముపయోగించునని కవి చెప్పుచున్నాడు. 2. తాను సంగ్రహముగా చెప్పినది

వివరముగా చెప్పబోవునది గురువచనము వలన లభించిన అఘోరవిద్యయందలి అనగా అఘోర మంత్ర మందలి అక్షరములచే చెప్పబడినదే అని కవి చెప్పుటవలన ఇది కవి యొక్క స్వకపోలకల్పితముగాదని ఇది సంప్రదాయానుసారముగా గురువు వలన లభించినది కావున ప్రమాణమేయని కవి అప్రామాణ్యశంకను పరిహరించుచున్నాడు. 3. కాని గురువు బోధించిన దానిని తాను గ్రహించిన దానిని అక్షరబద్ధము చేయుటలో గాని అనావశ్యకాంశాకథనము ఆవశ్యకాంశా కథనము (పూర్తిగా చెప్పకపోవుట, చెప్పినదానినే మరల చెప్పుట) ఇత్యాదులైన నా పురుషబుద్ధి కృతదోషముల క్షమింపుమని శివుని కవి వేడుకొను చున్నాడు. భావి కవులను ఇట్టి సందర్భములలో ఇట్లే చేయవలయునని ఉపదేశించుచున్నాడు.

**గురువచనమ్ములందున అఘోరమహోత్తమ దివ్యవిద్య య**
**క్షరము లనుక్తమైన ఘనశామ్భవతత్త్వము స్తోత్రపద్ధతిన్**
**విరచన సేయు నా చపలవృత్తి క్షమింపుము దాసబుద్ధితో**
**పరమ సుమాతృకార్ణచయవైఖరి దెల్పు మెదన్ వసించియున్.**

**-- పరాశక్తి స్కంధరశ్మి ప్రకరణమ్ --**

**అవతారిక :** ఉపోద్ఘాత ప్రకరణములోని 12వ శ్లోకములో శంభువు **షట్ఛక్తి వ్యక్త భావః** అని కవి చేత పేర్కొనబడినాడు. తదనుగుణముగా అతని ఆఱు శక్తులలోని మొదటిదైన పరాశక్తికి సంబంధించిన **పరాశక్తి స్కంధరశ్మి ప్రకరణము** నారంభించుచు ముందుగా రశ్మి ప్రభావమును వర్ణించుచున్నాడు.

**శ్లో॥ శ్రీమద్రశ్మిప్రభావం త్రిభువనభవనవ్యంజకస్వాత్మదీపం**
**కో వా వక్తుం నిరుక్త్యా ప్రభవతి యతధీరాత్తసమ్యగ్విమర్శః ।**
**యత్ర బ్రహ్మాదివిద్వన్మతిరపి విగతిర్యాతి భీత్యా వినాశం**
**శ్రుత్యాసార్ధం స కేన ప్రవితతమతినా వర్ణ్యతే తే మహేశ! ॥ 20**

**ప్రతిపదార్థము :** మహేశ! = ఓ మహేశ్వరుడా, త్రిభువన భవన వ్యంజక స్వాత్మదీపమ్ = ముజ్జగములను వెలిగించు స్వాత్మదీపముగల, శ్రీమద్రశ్మి ప్రభావమ్ = పూజనీయమైన రశ్మిప్రభావమును, ఆత్తసమ్యగ్విమర్శః = పొందబడిన మంచి విమర్శశక్తిగల, యతధీః = నిశ్చల బుద్ధిగల, కః = ఎవడు, నిరుక్త్యా = నిర్వచనముతో, వక్తుమ్ = చెప్పుటకు, ప్రభవతి వా = సమర్థుడగును, యత్ర = ఎచట, బ్రహ్మాది విద్వన్మతిః అపి = బ్రహ్మాది

విద్వాంసుల బుద్ధికూడ, విగతః = గతిలేనిదై, భీత్యా = భయముతో, వినాశమ్ = కుంతనమును, శ్రుత్యాసార్ధమ్ = వేదముతో కూడి, **యాతి** = పొందునో, సః = ఆ రశ్మి ప్రభావము, ప్రవితత మతినా = విస్తృత బుద్ధిగల, కేన = ఎవని చేత, **వర్ణ్యతే** = వర్ణింపబడును.

**తాత్పర్యము :** ఎంత బుద్ధిమంతుడైనను స్వాత్మదీపమును నిర్వచించి ఎవడు చెప్పగలడు. బ్రహ్మాది విద్వాంసుల బుద్ధి వేదమును మొక్క వోవు దాని ప్రభావము నెవడు వర్ణింపగలడు?

**వివరణము :** శ్రీశమ్భువొక రశ్మిపుంజ రూపమైన ఆత్మదీపము. తత్ప్రభావమమేయము. విమర్శశక్తి గలిగి బుద్ధిని నిశ్చలముగా నొనర్చగలవాడు కూడ, నిరుక్తి అనగా మాటల, కందకపోవుట అను కారణము చేత చెప్పలేడు. నిర్వచింపలేడు. బ్రహ్మాది విద్వాంసుల బుద్ధికాని, వేదము కాని, గతి లేక ఆగిపోవునప్పుడు ఎంత విస్తృత బుద్ధిగలవాడును వర్ణింపజాలడు. ఆ పుంజము యొక్క ప్రకాశములు భైరవనామధేయములు. వానిలో స్త్రీ పురుషాకారములు కల్పింపబడి వర్ణింపబడినవి.

**అవనిఁగలండె ఈ త్రిభువనాలయదీప నిజాత్మరశ్మి వై**
**భవమును నిర్వచింపగల భవ్యవిమర్శసుబుద్ధి పద్మస**
**మ్భవముఖవిజ్ఞబుద్ధియని బద్ధవచస్సును బాఱనట్టి వై**
**భవమును వర్ణితమ్మొనరుపంగల ధీయుతు డెవ్వ డీశ్వరా!**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **రశ్మిరూపుడుగా** వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున ఆ శమ్భువు యొక్క శక్తులన్ని **తద్రశ్మిరూపములని** అవి జగమున నిండి వెలుగుచున్నవని చెప్పబడుచున్నది.

**శ్లో॥ షణ్ణామప్యన్వయానాం క్షితిజలదహనాకాశచేతోవిరాజత్-**
**పీఠస్థానామ్పరాద్యాః పరశివ! భవతః శక్తయో మాతృకాంతాః ।**
**బ్రహ్మాదిప్రేతసింహాసనగతవిభవైస్తావకీయైః షడంగైః**
**ద్వాత్రింశద్రశ్మిముఖ్యాః స్వకిరణకరణవ్యాప్తవిశ్వైర్విభాంతి ॥ 21**

**ప్రతిపదార్థము :** క్షితిజలదహనాకాశచేతోవిరాజత్ పీఠస్థానామ్ = మనస్సహితములైన పంచభూతములనెడి పీఠములందున్న, షణ్ణామ్ = ఆఱు, అన్వయానామ్ = అన్వయముల యొక్క, పరాద్యాః = పర మొదలైన, మాతృకాంతాః = మాతృక చివఱగల, శక్తయః = శక్తులు, స్వకిరణకరణవ్యాప్తవిశ్వైః = తమ కిరణములనెడి కిరణముచేత వ్యాపించిన

విశ్వముగల, బ్రహ్మాది ప్రేతసింహాసనగతవిభవైః = బ్రహ్మ మొదలైన ప్రేత సింహాసనమందున్న విభవము గల, తావకీయైః = నీకు సంబంధించిన, షడంగైః = ఆఱు అంగములచేత, ద్వాత్రింశద్రశ్మిముఖ్యాః = ముప్పది రెండు ముఖ్యరశ్ములు, **విభాంతి** = ప్రకాశించుచున్నవి.

**తాత్పర్యము :** పరశమ్భువు యొక్క పీఠము లాఱు. అవి పంచ భూతములు, చిత్తమొకటి. ఆతనికి పరాదులు మాతృకాంతములు అనగా పర, ఇచ్ఛ, జ్ఞానము, క్రియ, కుండలిని, మాతృక అను ఆఱుశక్తులు గలవు. అతని రశ్ములలో ముఖ్యములైనవి ముప్పదిరెండు. ఆతని సింహాసనము ప్రేత సింహాసనము. సర్వజ్ఞత, తృప్తి, అనాదిబోధము, స్వాతంత్ర్యము, నిత్యత్వము అనునవి ఆతని అంగములు. బ్రహ్మాది విద్వాంసుల బుద్ధి, వేదముకూడ నాతని వర్ణింప లేనప్పుడు ఎవడు ఆ శమ్భువును వర్ణింపగలడు.

**వివరణము : క్షితిజలదహనాకాశచేతో విరాజత్ పీఠస్థానామ్** అను సమాసమున దహన శబ్దము ప్రసరణ స్వభావము గల తేజోవాయువుల రెంటిని తెలుపును. దహనశబ్దము తరువాత వాయువాచక శబ్ద ముండవలసినది లేకున్నను 'షణ్ణామ్' అను పదముతో శ్లోక మారంభింపబడుట వలన అగ్ని వాయు సహభావము కలదగుట వలన వాయు సాహాయ్యము లేక అగ్నితన ఉనికినే కోల్పోవు స్వభావము గలదగుట చేతను దహన శబ్దము వాయ్వగ్నులను రెంటిని బోధించును లేదా క్షితిజల దహనప్రాణనాకాశ చేతః అను సమాసమును పీఠశబ్దమునకు పూర్వము సవరించి చేర్చవచ్చును. 2. **పరాద్యాః మాతృకాంతాః శక్తయః** అను పదములు పరా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, కుండలినీ, మాతృకా అను ఆఱుశక్తులను తెలుపును. శక్తులన్నియు పరశమ్భువునకే చెందినవి. బ్రహ్మాది పంచకము అనగా బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు, అను ఐదుగురి యొక్క సృజన, పాలన, సంహరణ, తిరోధానానుగ్రహణ రూపశక్తి పంచకము కూడ శమ్భువునకు చేరి ఉన్నదే. శక్తిలేని వారు ప్రేతులు, శవప్రాయులు. వారాశక్తులు తమవని భావించు అజ్ఞానులు కారు. వారు తమ శక్తులకు సాక్షులుగా నుందురు. శమ్భువుకూడ తన సాక్షిత్వము నెన్నడు మఱువడు. 3. శమ్భువునకు ప్రేత సింహాసనము కలదు. దానికి నాలుగు కోళ్ళు, బ్రహ్మవిష్ణురుద్రేశ్వరులు వానిని కలుపు ఫలకము ఒకటి. పాద పీఠమునో, ఉపధానమునో కలుపుకొని ఆ సింహాసనము ఆఱు అంగములు కలిగినట్టిది. 4. శమ్భువు యొక్క పాదములు ప్రకాశ విమర్శరూపములు. రక్త శుక్ల రశ్మి పుంజములను విఱజిమ్మును. భూమి యందు ఏబదియాఱు, జలమందు ఏబది రెండు, అగ్నియందు అఱువది రెండు, వాయువు నందు ఏబది నాలుగు, ఆకాశము నందు డెబ్బది రెండు, మనసు నందు అఱువది నాలుగు,

**మొత్తము రశ్మలు మూడు వందల అఱువది.** వీనిలో ముప్పది రెండు రశ్మలు ముఖ్యములని శ్లోకమున చెప్పబడినది. ఏబది (యొక) వర్ణములుగల **మాతృకలోని ముప్పది రెండు వర్ణముల తోడనే శ్రీలలితా సహస్రనామములు ఆరంభింపబడినవి.** 5. పరశమ్భువు యొక్క పీఠము బ్రహ్మాండ గోళము. దాని ఊర్ధ్వాధోభాగముల యొక్క నాలుగు దిక్కుల యొక్క మధ్య భాగములలోని ఆఱు బిందువు లన్వయములు. చిత్తముతో కూడిన పంచ భూతములు అనగా ఆఱు పీఠములలో నున్న అన్వయములు పీఠస్థములు అని చెప్పబడినవి.

**భూమి జలాగ్ని మారుత నభో హృదయస్థ షడన్వయమ్ములన్**
**స్వామి! పరాద్యమాత్రవధిశక్తులు ముప్పది రెండు రశ్మలున్**
**దామరసాసనాది శవధామ మహాసన వైభవమ్ములౌ**
**స్వామల భాను పూర్ణ జగదాత్మ షడంగములన్ వెలింగెడున్.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువుయొక్క **పరాదిమాతృకాంత శక్తు లాఱు** వర్ణింపబడినవి. ఈ శ్లోకమున ఆ పరశమ్భువుయొక్క **పరత్వము** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ బుద్ధేస్సమ్యగ్విమర్శప్రకటితసరణేరర్థవద్వాక్ప్రవృత్తే-**
**ర్యత్ర స్థానే తురీయేఽనవకలితమహావాక్యతత్త్వే వినాశః ।**
**తత్కిం జ్యోతిస్తమో వా సదసదుభయగం కిం న్వమూర్తం ను మూర్తం**
**నిర్ధారశ్చేద్వినాశో నహి మతివచసాం దేవ! తస్మాత్పరస్త్వమ్ ॥ 22**

**ప్రతిపదార్థము :** అనవకలితమహావాక్యతత్త్వే = గ్రహించని మహావాక్యతత్త్వమైన, యత్ర = ఏ, తురీయే = నాల్గవ, స్థానే = స్థానము నందు, సమ్యగ్విమర్శ ప్రకటిత సరణేః = మంచి విమర్శచే ప్రకటింపబడిన, బుద్ధేః = బుద్ధి యొక్క (మార్గమునకు), అర్థవద్వాక్ప్రవృత్తేః = అర్థవంతమైన వాక్కు యొక్క పూనికకు, వినాశః = వినాశమో, తత్ = అది, జ్యోతిఃకిమ్ = వెలుగా, తమో వా = చీకటియా? సదసదుభయగమ్ (వా) = సదసత్తులలో నుండునదా?, అమూర్తమ్ ను = ఆకార రహితమా, మూర్తం ను = ఆకార సహితమా?, నిర్ధారః = నిర్ణయము, (భవతి) చేత్ = అగునేని, మతివచసామ్ = బుద్ధి వాక్కులకు, వినాశః = వినాశము, నహి = ఉండదు గదా!, దేవ = ఓ ప్రభూ!, తస్మాత్ = అందువలన, త్వమ్ = నీవు, పరః = పరుడవు.

**తాత్పర్యము :** విమర్శించుట అను దారిని ప్రకటించు బుద్ధికి అర్థవంతమైన వాక్కు యొక్క పూనికకు మహావాక్యతత్త్వము నెఱుగ జాలరు. తురీయస్థానమున వినాశము కలుగునో,

ఆ తత్త్వము (స్థానము) వెలుగా? చీకటియా? తదుభయగతమా! మూర్తమా? అమూర్తమా? నిర్ణయమున్నచో వాగ్బుద్ధులు నశించెడివి కావు. అందువలన ఓ ప్రభూ! నీవు ఆ వికల్పము లన్నింటికి నతీతుడవు.

**వివరణము :** జాగ్రత్స్వప్నసుషుప్తులలో ప్రథమము జాగ్రదవస్థ (స్థూల శరీరాభిమానము), రెండవది స్వప్నావస్థ (సూక్ష్మశరీరాభిమానము గలది), మూడవది నిద్రావస్థ (కారణ శరీరాభిమానము గలది). ఈ మూడు అవస్థలకు సాక్షియగు ఆత్మ శరీరత్రయాభిమానహీనము కాన సాక్షిస్థానము లేక సాక్షి తత్త్వము నాల్గవది అని చెప్పబడును. అదియే శ్లోకమున తురీయ స్థానమని చెప్పబడినది. 2. ఆ సాక్షితత్త్వము మనోవాక్కులకు అందదు. **'తత్త్వమసి'** అను మహావాక్యముయొక్క తత్త్వమే అది. అనగా అది ఆ వాక్యముయొక్క పదార్థము కాదు. అఖండవాక్యార్థము అదియు అభిధావృత్తిచే లభించునది కాదు. జహదజహల్లక్షణా వృత్తిచే మాత్రమే ఆ మహావాక్యముయొక్క అఖండార్థము బోధపడును. అది బోధపడిన పిమ్మట మనోవాక్కులు దగ్ధపట సదృశములై యుండును. అది బోధపడుటకు పూర్వము ఆత్మతత్త్వమును బోధించుటకు యత్నించి, వెనుదిరుగునేకాని బోధింపజాలవు. వాక్కు వెనుదిరుగుటయే వాక్ప్రవృత్తి యొక్క వినాశముగా, బుద్ధివెనుదిరుగుటయే బుద్ధియొక్క సమ్యగ్విమర్శప్రకటిత సరణి యొక్క వినాశముగా శ్లోకమున చెప్పబడినది. 3. ఇంతకు ఆత్మతత్త్వము వెలుగా, జ్ఞానరూపమా, చీకటియా, అనగా అజ్ఞానమా? అది సత్పదార్థమా అనగా భావపదార్థమా లేక అసత్పదార్థమా (అభావపదార్థమా) లేక తదుభయరూపమని చెప్పవచ్చునా? అన్నచో చెప్పగూడదు. వెలుగుచీకట్లొక్కచోట నుండనట్లు ఆ ఆత్మ సత్తు మరియు అసత్తు అగుట కుదరదు. పై వికల్పములలో నేదో యొక వికల్పము ఆత్మయందు సంభవించెనేని ఆ ఆత్మ మనోవాక్కులలో దేనికో ఒక దానికి అందినట్లే కాని ఏ వికల్పమును ఆ ఆత్మయందు సంభవించదు. కావున ఆ ఆత్మస్వరూపము నెఱుక పఱచ లేవు. **ఎఱుకయే ఆత్మ.** అది స్వయంప్రకాశము.

**అమలమహావచఃస్ఫురితమైన సుతత్త్వమెఱుంగమిన్ విమ**
**ర్శ మహిత ధీవచః సరణి సచ్చు, తురీయపదమ్ము తేజమో!**
**తమమొ? అసత్తొ? సత్తొ ద్వయతత్త్వమొ నిశ్చయమబ్బెనేని వా**
**క్య మతులు చావవక్కతన నన్నిటికిన్ బరుడైన వాడవే.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు మనోవాచామగోచరుడని చెప్పబడినది. ఈ శ్లోకమున అందుకు కారణము చెప్పబడుచున్నది.

శ్లో॥ జ్ఞానం యోగః ప్రకాశో విధిరుభయమతిర్దేహధీః ప్రాణశూన్యా-
హంకారశ్చాధికామః స్వవిషయమనఘం చాశ్రయన్నంతరాస్తే ।
ఇత్యాత్మాకాశసత్తా తవ పరివిదితా సమ్యగేతత్ప్రమేయా-
ధారేష్వంతః ఘృతవత్పయసి తిలచయే తైలవద్భాసి హీశ! ॥ 23

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ ఈశ్వరుడా!, యోగః = యోగము, ప్రకాశః = వెలుగు, విధిః = విధి, ఉభయమతిః = జ్ఞాన కర్మేంద్రియోభయమునందు నేననుబుద్ధి, ప్రాణశూన్యా = ప్రాణరహితమైన బుద్ధి, దేహధీః = దేహబుద్ధి, అధికామః = అధికమైన ఇచ్ఛ, అహంకారః చ = అహంకారమును, అనఘమ్ = నిర్దోషమైన, స్వవిషయమ్ = తన విషయమును, ఆశ్రయన్ = ఆశ్రయించుచు, అంతః = లోపల, **ఆస్తే** = ఉన్నది, ఇతి = అని, తవ = నీ యొక్క, ఆత్మాకాశసత్తా = ఆత్మయను ఆకాశముయొక్క ఉనికి, పరివిదితా = బాగుగా తెలియబడినది, ఏతత్ప్రమేయాధారేషు = ఈ ప్రమేయాధారములందు, తిలచయే = నూవుల రాశియందు, తైలవత్ = నూనెవలె, పయసి = పాలయందు, ఘృతవత్ = నేయివలె, అంతః = లోపల, **భాసి** హి = ప్రకాశించుచున్నావుగదా!

**తాత్పర్యము :** జ్ఞానము, యోగము, ప్రకాశము, విధి, ఉభయబుద్ధి, దేహబుద్ధి, కామము, అహంకారము ఇవి యన్నియు స్వవిషయము నాశ్రయించి లోననే యున్న వనుటచే ఓ ఈశ్వరుడా! నీ ఆత్మాకాశసత్త బాగుగా తెలియబడినది. ఈ ప్రమేయాధారములన్నింటి యందును నూవులయందు నూనెవలె, పాలయందు నేయివలె నీవు ప్రకాశించుచున్నావు.

**వివరణము :** జ్ఞానము అనగా **తత్త్వమసి** వాక్యార్థమైన జీవబ్రహ్మైక్యజ్ఞానము. ఇది చరమ వృత్తి. అది కలిగిన తరువాత మరొక వృత్తి పుట్టదు. కావున ఆ వృత్తి చరమవృత్తి జ్ఞానము. అది ఉపనిషన్మహావాక్యార్థజ్ఞానము. అనగా పరమప్రమాణమైన శబ్దమువలన కలిగిన జ్ఞానము. కావున అది పరమప్రమ, సర్వాజ్ఞాన (సంసార) మోచకము. యోగమనగా ద్రష్టయొక్క స్వరూపజ్ఞానమందు అవస్థానమును కలిగించు చిత్తవృత్తి నిరోధము. అది నిర్వికల్పసమాధ్యభ్యాసమువలన లభించునది. అవి రెండు (జ్ఞానము, యోగము) ను దాదాపు ఏకరూపములు అనగా కించిద్భేదము కలవి. ప్రకాశము చాక్షుష ప్రత్యక్షము, చాక్షుష ప్రమను కలిగించు సాధనము. ప్రకాశము లేనిదే కన్ను పని చేయదు. కావున అది తత్సాధనము. ఇది పరమ ప్రమాహేతువు కాదు కాని ప్రమకు హేతువు. విధి అనగా అర్థియు సమర్థుడు. ఇతి కర్తవ్యతాజ్ఞానము కల సాధకుని సత్కర్మయందు ప్రవృత్తినొనరించు వేదవాక్యము. సత్కర్మాచరణము చిత్తశుద్ధి ద్వారా పరంపరగా మోక్షమునకు అనగా

పరమప్రమకు సాధనము. పై మూడు ఏదో విధముగా ముక్తి సాధనములు. **ఉభయమతి, ప్రాణశూన్యదేహబుద్ధి, అహంకారము, కామము అను నీ నాలుగు సంసార బంధ హేతువులు.** జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు కర్మలందు స్వీయబుద్ధి మరియు స్వకార్యత్వ బుద్ధి ఇవి రెండు కలసి ఉభయమతి, దేహబుద్ధి యనగా దేహము నందలి స్వీయతాబుద్ధి. ఇవి రెండును మమకార రూపములు. దేహము ప్రాణశూన్య మైనపుడు అనగా కుమారాదులు త్యజించిన దేహము నందును గల స్వీయతాబుద్ధి **ప్రాణశూన్యదేహబుద్ధి** అనబడును. దానివలన శోకించుట సంసారుల స్వభావము. **అహంకారము** అనగా తాను కాని దేహేంద్రియ ప్రాణాదులందు గల స్వబుద్ధి అనగా తానను బుద్ధి. **అధికామము** అనగా అధికమైన ఇచ్ఛ, నశ్వరములైన భోగముల ననుభవించవలెనను కోరిక. పైన చెప్పిన వన్నియు ఎచ్చటనో ఒకచోట ఉండవలెగదా. అవి యన్నియు ఆత్మ యనెడు ఆకాశమునందున్నవి. ఆత్మయనెడు ఆకాశమున్నది అనుటకు హేతువులుగా నున్నవి. వాస్తవమునకు ఆత్మసత్తయే వాని సత్తకు మూలమైనను ఆత్మజ్ఞానమునకు ఏదో విధముగా సాధనములు. వాని వలన ఆత్మయొక్క ఉనికి సిద్ధించును. ఈ సిద్ధి దిక్కాలాదుల సిద్ధివంటిదే కాని మోక్షరూపమైన జీవబ్రహ్మైక్యజ్ఞానసిద్ధికాదు. వాస్తవమునకు స్వయంసిద్ధమైన ఆత్మకు సాధనాంతరసిద్ధి అక్కఱలేదు. కాని ఆత్మను నిరాకరించువారి కొఱకు చెప్పబడిన హేతురూపము కావున ప్రమేయమైన ఆత్మకు ఒక విధముగా ఆధారములు. ఆత్మ ప్రమాత కదా. ప్రమేయమనుట యెట్లు అన్న ప్రశ్న కలుగును. భగవద్గీతలోని క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగములో ఆత్మ జ్ఞేయముగా చెప్పబడినందున ఇచ్చుట ఆ ఆత్మ ప్రమేయమని చెప్పబడినది. కావున పై ఏడు ప్రమేయాధారములు అని శ్లోకమున చెప్పబడినది. వానిలో పాలలో వెన్నవలె, నువ్వుల రాశియందు నూనెవలె పరశమ్భురూప స్వాత్మ వ్యాపించి యున్నది. అనగా పాలను చిలికినట్లు, నువ్వులను గాను గాడించినట్లు పై సప్తకమును మధించుచు పోగా అనగా వానిలోని అనాత్మత్వమును గుర్తించి వదలి వేయగా సర్వనిషేధశేషమైన ఆ ఆత్మజ్ఞానము సిద్ధించును. 2. పైన చెప్పిన ఏడింటికి విషయములున్నవి. జ్ఞానమునకు బ్రహ్మైక్యము విషయము, యోగమునకు స్వరూపము విషయము, విధికి సత్కర్మవిషయములు, ఉభయమతికి శబ్దస్పర్శ రూప రసగంధములు వచన కరణ గమన విసర్గానందములు విషయములు, దేహబుద్ధికి దేహము విషయము, అహంకారమునకు దేహేంద్రియాదులు విషయము, పై ఏడింటిని తద్విషయములను (స్వస్వవిషయములను) కూడ ఆశ్రయించు ఆత్మ (జీవరూపము) లోన నున్నది. బహిర్విషయములను లోనికి పంపిన అంతఃకరణములోనను ఆత్మ ఉన్నది. ఆ ఆత్మ

బహిర్విషయములకు ఆంతరిక విషయములకు ఆధారముగా నుండి ప్రమేయాధారమై యున్నను, తదభివ్యక్తసాధనములగుటచే జ్ఞానాదులే ఆధారములుగా శ్లోకమున చెప్పబడినవి.

**జ్ఞానము యోగమున్ విధియు నాయుభయాత్త స్వబుద్ధియున్ భవిం**
**బ్రాణవిశూన్యమైయహము రాజిలు కామము దేహబుద్ధిలో**
**నానుచు నుండు స్వస్వవిషయమ్ముల నిట్లు త్వదాత్మసత్తమే**
**యానుగమంబెఱింగితిఁ బయస్థఘృతమ్మటు లీవ యొప్పవే.**

**అవతారిక :** పై శ్లోకమున తిలరాశి యందు తైలమువలె ప్రమేయ (ఆధార) మందు పరశమ్భువున్నట్లు **తైలశమ్భువుల ఔపమ్యము** చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ పరశమ్భువునకు పరమైనది లేదను అద్వైత బ్రహ్మబుద్ధిని కలిగించు శమ్భు తేజస్సు మేల్కొన్నచో నదియే పారిజాతమగునని శమ్భు తేజస్సు నందు **పారిజాత వృక్షారోపము** చేయబడుచున్నది.

**శ్లో॥ షట్త్రింశత్తత్త్వపుష్పస్తబకపరిమలస్తావకీయస్స తేజః-**
**కల్పద్రుశ్చేత్ప్రబుద్ధః శివగురువచసా సర్వతః స్వానుభూతః ।**
**అద్వైతబ్రహ్మబుద్ధిం జనయతి విదుషామేష ఏవాస్మదాది-**
**బ్రహ్మాండాంతప్రపంచే విలసతి న పరోఽస్తీతి చేత్పారిజాతః ॥ 24**

**ప్రతిపదార్థము :** షట్త్రింశత్తత్త్వ పుష్పస్తబక పరిమలః = ముప్పదిఆఱు తత్త్వములనెడి పూల గుత్తుల పరిమళముగల, తావకీయః = నీకు సంబంధించిన, సః = ఆ, తేజః కల్పద్రుః = తేజమనుకల్పవృక్షము, శివగురువచసా = శివుడేయైన దేశికుని వాక్కులచే, ప్రబుద్ధః = మేలుకొల్పబడినచో, అద్వైత బ్రహ్మబుద్ధిమ్ = బ్రహ్మ మొక్కటే అను బుద్ధిని, **జనయతి** = కలిగించినచో, ఏష పారిజాత ఏవ = ఈ కల్పవృక్షమే, ఈ పారిజాతమే, సర్వతః = అంతట, స్వానుభూతః చేత్ = తనచే అనుభవింపబడినచో, అస్మదాది బ్రహ్మాండాంత ప్రపంచే = మనము మొదలు బ్రహ్మాండము చివరగల ప్రపంచము నందు, పరః = పరుడు, న **విలసతి** = ప్రకాశింపడు.

**తాత్పర్యము :** శివతేజము కల్పవృక్షము. దీనికి షట్త్రింశత్తత్త్వములు పుష్పస్తబకములు. వాని వాసనచే ఆ కల్పవృక్షము గుబాళించు చుండును. శివగురువు యొక్క **తత్త్వమసి** అను వాక్యముచే సుప్తమై ఉన్న ఆ వృక్షము మేల్కొలుప బడును. అప్పుడు బ్రహ్మమొక్కటే అను బుద్ధి కలుగును. ఆ గురువాక్యము యొక్క అనుసంధానముచేత అస్మదాది

బ్రహ్మాండాంత ప్రపంచమున బ్రహ్మము తప్ప అన్యమేదియు లేదను స్వానుభూతి విద్వాంసులకు కలుగును.

**వివరణము :** శివుడు, శక్తి అను రెండు శివ సమరస (తురీయ) తత్త్వములు, సదాశివుడు, ఈశ్వరుడు, శుద్ధ విద్య అను మూడు విద్యాతత్త్వములు; మాయ, కాలము, కల, నియతి, రాగము, విద్య, పురుషుడు, ప్రకృతి, మహత్తు, అహంకారము, బుద్ధి, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, ఆకాశము, వాయువు, తేజము, జలము, భూమి అను ముప్పది యొకటి **ఆత్మతత్త్వములని** చెప్పబడును. మొత్తము **ముప్పది యాఱు తత్త్వములు.** ఇవి యన్నియు శమ్భుతేజము అను కల్పవృక్షమునకు పూచిన పూలగుత్తులు. వాని పరిమళములతో గుబాళించున దా వృక్షము. ఈ కల్పవృక్షము శాశ్వతము. జీవుని సంసారదశ యందును, ఇది యున్నది కాని సుప్తమైన బీజభూతముగా నుండి శివగురు వచన జలప్రోక్షణముచే అది మేలుకొని అనగా మొలకెత్తి పూచి పరిమళించును. అనగా అద్వైత బ్రహ్మ బుద్ధి కలుగును. అద్వైత బ్రహ్మ బుద్ధి అనగా శమ్భుతేజ మొక్కటే ఈ ప్రపంచమంతట నిండియున్నది అను బుద్ధి ఈ గురువచనార్థము మనన నిదిధ్యాసముల చేత దానికన్న భిన్నముగా ప్రపంచము నందేమియు ప్రకాశించుట లేదు అను స్వానుభూతి కలుగును. 2. ఈ ప్రపంచమున జీవునకు శరీరము (పిండము) యొక్క జ్ఞానము సహజముగా కలుగును. జీవుడు తన ఇంద్రియములను సాధనములతో బ్రహ్మాండ జ్ఞానము కొంత సాక్షాత్కరించు కొనును, కొంత ఊహించుకొనును. గురువు లభించి ఆతని తత్త్వమసి వాక్యము యొక్క ఉపదేశము కలిగిన, ఈ ప్రపంచమంతట బ్రహ్మమే యున్నదను పరోక్షజ్ఞానము కలుగును. ఆ గురువచనార్థ మనననిదిధ్యాసముల వలన ఈ ప్రపంచమున తాను (ప్రమాత) తన (ప్రమేయము) అనునవి వేఱుగావని అంతయు శివతేజమే అని అంతట శివ తేజమే సాక్షాత్కరించును. ఈ యర్థము **అస్మదాదిబ్రహ్మాండాంతప్రపంచే విలసతి న పరః** అను వాక్యము వలన తెలియుచున్నది. 3. స్వర్గలోకమున ఇంద్రుని నందనమను పేరుగల ఉద్యానమున **మందారము, సంతానము, హరిచందనము, పారిజాతము, కదంబము** అను నైదువృక్షము లున్నవి. వానిని దేవతరువు లందురు. కదంబము దేవతావృక్షమే ఐనను ఆ ఐదింటిలో చేరదని కొందఱందురు (మణి ద్వీపవర్ణనమున ఆ కదంబ వృక్షప్రసక్తి కనబడుచున్నది. దానికి నిఘంటువులలో సురద్రుమమను పేరు కూడ కలదు) సంకల్పములను పండించి యిచ్చు వృక్షము కావున

కల్పవృక్షమను పేరేర్పడినది. కల్పాంత స్థాయి వృక్షమగుట చేతను దాని కాపేరేర్పడినదని చెప్పవచ్చును. మందార సంతాన హరిచందన పారిజాతములకును ఈ స్వభావముండుటచే సామాన్యముగా పై వృక్షము లన్నింటికి కల్పవృక్షము అను వ్యవహారమున్నది. ఈ శ్లోకమున శమ్భుతేజము నందు మొదట సామాన్య నామముగా కల్పవృక్షారోపము చేయబడి చివఱకు పారిజాతారోపము చేయబడినది. తదనుగుణముగా షట్త్రింశత్తత్త్వములందు పుష్పస్తబకారోపము చేయబడినది. అందుచేత ఈ శ్లోకమున రూపకాలంకార మేర్పడినది.

**ముప్పదియాఱు తత్త్వముల పూవుల తావుల కల్పవృక్షమై**
**యొప్పెడు త్వత్ప్రకాశము గురూక్తుల నెప్పుడు స్వానుభూతమో**
**అప్పుడు అస్మదాదిక మజావధి విశ్వమునం దనన్యమై**
**అప్పరమాత్మ జీవపరమైక్యమతిన్ గలిగించు విజ్ఞులన్.**

**అవతారిక :** పై శ్లోకమున **వృక్ష పుష్పములు** ప్రసక్తములైనవి. ఈ శ్లోకమున **ఫలము** ప్రసక్తమగుచున్నది.

**శ్లో॥ స్వప్రత్యక్షేఽపి తత్త్వే కరతలఫలవద్వేత్తి నాసౌ స్వరూపం**
**నానాసిద్ధాంతజాలప్రలపితజనితాజ్ఞానమోహాంధకారైః ।**
**ఆకాలాంతః పుణ్యపాపైరధిగతనిధనైరాత్మ కర్మణ్యనాదౌ**
**హేయోపాదేయబుద్ధ్యా భవ ఇతి విహితస్తే మహామాయయేశ! ॥ 25**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ మహేశ్వరుడా!, తత్త్వే = తత్త్వము, స్వప్రత్యక్షే అపి = తనకు ప్రత్యక్షమేయైనను, అసౌ = ఈతడు, తే = నీ యొక్క, స్వరూపమ్ = రూపమును, మహామాయయా = మాయ చేత, కరతల ఫలవత్ = అఱచేతిలోని పండును వలె, నానా సిద్ధాంతజాల ప్రలపిత జనితాజ్ఞాన మోహాన్ధకారైః = అనేక సిద్ధాంతముల సమూహములందలి ప్రలాపములచే గలిగిన మోహములు అను చీకట్లచే, న వేత్తి = తెలిసికొనలేక పోవుచున్నాడు, అనాదౌ = ఆది(లేని) తెలియని, కర్మణి = కర్మయందు, అధిగతనిధనైః = పొందబడిన చావుగల, పుణ్యాపాపైః = పుణ్యాపాపములచేత, హేయోపాదేయబుద్ధ్యా = విడువదగినది స్వీకరింపదగినది అను బుద్ధిచేత, భవః = సంసారము, ఇతి = అనునది, విహితః = విధింపబడినది.

**తాత్పర్యము :** తనకు తానపరోక్షుడే యైనను అఱచేతి పండువలె తన యాథార్థ శివస్వరూపము తానెఱుగక పోవుటకు ఆ విషయమున అనేక సిద్ధాంత వాదముల

ప్రలాపముల వలన కలిగిన మోహాంధకారములే కారణములు. అనాది కర్మ యందు పుచ్చిపోయిన, పుణ్యపాపములచే హేయము ఉపాదేయము అను బుద్ధిని (సంసారమును) ఓ మహేశ్వరా! నీ మాయచేత కల్పించి నెత్తిమీద రుద్దినది.

**వివరణము :** తాను తప్ప ఇతర పదార్థములన్నింటి సిద్ధి ప్రమాణాధీనము. తన సిద్ధికి అనగా తానున్నాను అను జ్ఞానమునకు ఏ ప్రమాణమును అక్కఱలేదు. చీకటిలో, నిద్రలో కూడ తన ఉనికి విషయమున నెట్టి మూర్ఖునకైనను సంశయ ముండదు. తానే శివుడు కావున శివుని సిద్ధియందును ఏ ప్రమాణముల ఆవశ్యకత లేదు. కావున శివ స్వరూపమైన తన తత్త్వము లేక స్వరూపము కరతల ఫలమువలె అనుభవింపబడవలసినదేగాని ఆ తత్త్వము విషయమున పెక్కు మోహకరములైన సిద్ధాంతముల వాదములు వివాదములు పిచ్చిపిచ్చి ప్రలాపములు ఎన్నో వచ్చి ప్రత్యక్షముగా నున్న శివతత్త్వమును శివతత్త్వము గాదను భ్రమలవలలలో భ్రమలచీకట్లలో చిక్కువడున ట్లొనర్చినవి. ముంజేతి కంకణమును నీలి అద్దమందు జూపి పచ్చని బంగారు కంకణము నందు నీల భ్రమను కలిగించినట్లీ సిద్ధాంతములు వాదములు శివత్త్వమును ప్రపంచముగా భ్రమింపజేసినవి. ఏకము ననేకముగా భ్రమింపజేసినవి. దానియందు పరమాణ్వాద్యాకాశాంత భ్రమలను పిపీలికాది హిరణ్యగర్భాంత భ్రమలను కలిగించినవి. ఈ సిద్ధాంత వాదముల నొనర్చువారు స్వయముగా భ్రాంతులై తమ భ్రాంతుల నితరులపై రుద్దినారు. మొదటనే అజ్ఞానియైన తన చేతికరతలగత ద్రాక్షాఫలము నెఱుగని వాని కాసిద్ధాంతవాదముల వలన అదియేదో తెలియకపోగా, దానిని ఉంచుకొనవలెనో పారవేయవలెనో తెలియని అవస్థను గలుగజేసినవి. అది మృత్యువేమో యని భ్రమింపజేసి భీతుని దుఃఖితుని నొనర్చినవి. రజ్జువు స్వప్రత్యక్షమై స్వచక్షు స్సంయుక్తమై యుండగా సర్పభ్రమను గలిగించి భీతు నొనర్చినవి. మూర్ఛితుల నొనర్చినవి. భయముతో చచ్చునట్లొనర్చినచో రజ్జువేమి చేయగలదు. ఆ రజ్జువు నుపయోగించి నీరు తోడుకొని తృష్ణబాపుకొనవలసియుండగా మరణాంతదుఃఖములవలలో అజ్ఞుడు బంధింప బడినాడు. 2. కర్మ అనాదియై తదనుసారిణియైన బుద్ధిని కలిగించినచో పుణ్యమునందు కాని పాపము నందు కాని చచ్చినట్లు ప్రవృత్తి జీవునికి కలుగుటలో తదనుగుణముగా సుఖదుఃఖముల నొందుటలో నేమి యనౌచిత్య మున్నది. పుణ్యపాపకర్మములు జ్ఞానాగ్ని దాహ్యములు, విధి నిషేధ విషయములు, పుణ్యకర్మములు వేదవిహితములు, పాపకర్మములు వేదనిషిద్ధములు, పూర్వకర్మ ననుసరించి వేదాధ్యయనము నందు ప్రవృత్తియే లేని వానికి వైముఖ్యము కలవానికి పుణ్యము నందు ప్రవృత్తి యెట్లు

కలుగును. పాపము నుండి నివృత్తి యెట్లు కలుగును. సుఖముపాదేయమని దుఃఖము హేయమని ప్రతివానికిని తెలియును. కాని సుఖానుభవము వలన పుణ్యక్షయమని ఎఱిగిన వానికి సుఖ మెట్లుపాదేయ మగును. అట్లే దుఃఖానుభవము పాపక్షయమని యెఱిగిన వానికి దుఃఖమెట్లు హేయమగును. కావున హేయోపాదేయ బుద్ధియు భ్రాంతియే. ఈ సంసారము అనగా భవమునందు ఒకనికి హేయమైనది మరొకని కుపాదేయమై యుండును. ఒకని కుపాదేయమైనది మరొకనికి హేయమై యుండును. వానికి గల హేయత్వోపాదేయత్వములు భ్రాంతిజన్యములేకాని యథార్థములు గాదని తెలుసు. భవము నందు ప్రవర్తించు అజ్ఞాని కుపాదేయమై దాని యందు మిథ్యాత్వ నిశ్చయముగల జ్ఞాని కది హేయమై యుండును. విధి నిషేధములు తద్విషయములైన పుణ్య పాపకర్మములు తత్ఫలములైన సుఖదుఃఖములు తదనుభవమునకై వలసిన ప్రమాణములు ప్రమేయములు ఇవి యన్ని కలిపి సంసారము లేక భవము అని పిలువబడును. సంసార మనగా మనకు తెలిసిన దింతియే. ఈ భవమును జీవులకును భవనీయముగా విధించిన వాడెవ్వడు శమ్భువా! ఆతడు జీవాన్యుడా? అజ్ఞానమా! మాయయా!, అజ్ఞానము మాయా విద్యా భేదమున ద్వివిధము. మాయోపాధికుడు ఈశ్వరుడు. అవిద్యోపాధికుడు జీవుడు. ఉపాధులను తొలగించి చూచినచో జీవేశ్వరభేదము లేదు. సంసారము లేదు. అట్లు చూడబడెనేని తలబరువు దిగిపోయినట్లే. అట్లైన ఈ బరువు ఓ శమ్భూ! నీ మాయవలన నేర్పడినది. బరువు యొక్క భ్రాంతి యేర్పడినది. అది నీ కృపవలననే తొలగవలెను. తొలగినచో అంతయు బ్రహ్మమే. శమ్భువే. తదన్యము లేదు.

**నీదగు మాయచే శివ! జనించెను సంసృతి మృత్యుహేతుకా**
**నాదిక పుణ్యపాపకరణాక్రమణ మ్మవివేక దుష్ట వా**
**క్యోదిత మోహసంతమసమొప్పకరామలకాభమాత్మ సం**
**వేదనమే యెఱుంగడు వివేకవిహీనత నేమనందగున్.**

**అవతారిక :** పై శ్లోకమున సంసారము మాయాకల్పితమని చెప్పుటచే పరిశేషన్యాయమున **బ్రహ్మైకత్వము** చెప్పబడినట్లైనది. ఈ శ్లోకమున బ్రహ్మ యొక్కటే యైనచో బన్ధ మెట్లేర్పడినది? బ్రహ్మము బంధింపబడినదా? అట్లనుట చెల్లునా? అను ప్రశ్నములకు అజ్ఞానము (మాయ) యొక్క మహిమ చేత అంతయు నుపపన్నమగును అని చెప్పబడుచున్నది. పై **శ్లోకము నందలి మహామాయయా అను పదము ఈ శ్లోకమున గూడ నున్నట్లు భావింపవలెను.**

శ్లో॥ ఏకోఽసౌ లక్షణైశ్చేదఖిలతనుగతైరింద్రియార్థైరనేకై-
ర్భిన్నః స్వాత్మప్రకృత్యా విధిజనిమృతిభిః సన్నిబద్ధః కిమేతత్ ।
దేవత్వమ్మానుషత్వం వపుషి భుజగతాం సర్వజీవాత్మకత్వం
ధత్తే శైలూషవత్తే స్మరతి న తు పదం శ్రీమహాదేవమూర్తే! ॥ 26

**ప్రతిపదార్థము :** శ్రీమహాదేవమూర్తే! = ఓ మహాదేవమూర్తీ, అఖిలతనుగతైః = సర్వశరీరగతములైన, అనేకైః = అనేకములైన, ఇంద్రియార్థైః = ఇంద్రియ విషయములచేత, స్వాత్మప్రకృత్యా = స్వాత్మస్వభావముచే, లక్షణైః = లక్షణ (ప్రమాణ)ముల చేత, ఏకః = ఒక్కడైన, అసౌ = ఈ శమ్భువు, భిన్నః చేత్ = భిన్నుడైనచో, విధిజనిమృతిభిః = విధి చేత జన్మమరణముల చేత, సన్నిబద్ధ ఇతి ఏతత్ = చక్కగా బంధింపబడినా డనునది, కిమ్ = ఏమి?, దేవత్వమ్ = దేవత్వమును, మానుషత్వమ్ = మానుషత్వమును, శైలూషవత్ = నటుని వలె, ధత్తే = ధరించుచున్నాడు, తే = నీ యొక్క, పదమ్ = పదమును, **న స్మరతి** = స్మరించుట లేదు.

**తాత్పర్యము :** ప్రమాణశ్రుతులు పరమాత్మ యొక్కడని చెప్పుచుండగా బ్రహ్మాండ గతములైన, అనేకములైన శబ్దస్పర్శాదీంద్రియార్థములచేతగాని, శరీరగతములైన ఇంద్రియములచేత గాని, ఆత్మకు (జీవేశ్వరులలో నే వానికైనను) స్వప్రకృతి చేతగాని, వర్ణక్రమాచారానుగుణవిధి భేదములచేత గాని, ప్రారబ్ధకర్మఫలములైన జన్మమరణములచేత గాని బంధము కలుగునా? ఆతడు బద్ధుడగునను మాట ఎట్టి ఔచిత్యము కలిగినట్టిది? వేష భేదములచే నటునకు భేదము కలుగునా? అయినను జీవుడు నీ పదము స్మరింపక దేవత్వమనుష్యత్వాది రూపవేషమే స్వరూపముగా భావించి సంసరించు చున్నాడు.

**వివరణము : ఏకమేవాద్వితీయ**మిత్యాది శ్రుతి బ్రహ్మకు సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేవని చెప్పుచున్నది. బ్రహ్మాండగతములైన భేదములచే బ్రహ్మమున భేదమేర్పడదు. ప్రకృతి (అజ్ఞానము) మిథ్య గావున ప్రకృతిచే జ్ఞానరూపబ్రహ్మకు విజాతీయ భేదము సిద్ధించదు. జీవుడు ఆత్మయైనను బ్రహ్మేతరాత్మకాదు కావున బ్రహ్మమున సజాతీయ విభేదము సిద్ధింపదు. పిండాండ బ్రహ్మాండములకు అవయవములున్నను వాని వలన తత్సాక్షియైన బ్రహ్మమున స్వగతిభేదమును సిద్ధించదు. త్రివిధమైన భేదమే సిద్ధించనప్పుడు బంధము బ్రహ్మ కెట్లేర్పడును. భిన్నవస్తువు చేత గదా బంధము కలుగును. అసలు బ్రహ్మము బద్ధము అను మాటకే అర్థము లేదు. ఆ మాట నిరర్థకము. 2. భిన్న వేషములు ధరించిన నటుడు స్వస్వరూపము మఱచుట జరుగదు. ఒకవేళ మఱచినను స్వస్వరూపము మాఱదు.

నటించు పురుషుడు స్త్రీవేషము ధరించిన స్త్రీ అగునా? మనుష్యుడు దేవవేషమును ధరించిన దేవతయగునా? దేవత మనుష్యవేషమును ధరించిన మనుష్యుడగునా! అభినయించు వాని నా వేషము బంధించునా? వాని శరీరమున కావేషము బంధమువలె కన్పడిన కన్పడుగాక! శరీరమునకు యథార్థముగా బంధమే యగుగాక! శరీరసాక్షికి బంధమెట్లు కలుగును? ఈ అనుపపత్తులన్నియు మాయ నంగీకరింపనప్పుడేర్పడును. లేని దానిని చూపెట్టు మాయ లేని బంధమును కల్గించుటలో లేక కలిగినట్లనిపింప జేయుటలో వింత యేమున్నది? కాని వేషధారియైన జీవుడు తాను వేషధారిననుట మఱచుట అనగా తన యథార్థ బ్రహ్మత్వమును విస్మరించుట మాయచే జరిగినది. వేషముల వేయుటయే మాయావిలక్షణము. ఇతరులకు స్వరూపమును కనిపింపకుండ జేయుటయే ఆ మాయావి యొక్క నైపుణ్యము. సంసారి దుఃఖాన్యథానుపపత్తి చేత బ్రహ్మయందు ఈ మాయ ఆక్షిప్తమగుచున్నదే కాని వాస్తవమున కది యున్నదని చెప్పజాలము. 3. మొదట ఏకమైన మట్టి లేక సువర్ణము మధ్య ఘటాది భేదములను కుండలాది భేదములను పొంది చివఱకు ఏకమే యైనట్లు బ్రహ్మము సృష్ట్యాదిలో నేకమై వాని పంచభూతాదిజడ బహువిధ జరాయుజాది జీవభేదము నొంది ప్రలయమున తిరిగి ఏకత్వము నొందును. మృత్సువర్ణాదులకును మధ్య కాలమున స్వరూపము చెడకుండ నేకత్వమునే కలిగియున్నట్లు సృష్టి ప్రలయ మధ్యస్థితి కాలమున బ్రహ్మము యొక్క స్వరూప మే మాత్రము చెడకుండనే అనేకముగా కనబడును. అంత మాత్రమున బ్రహ్మము యొక్క ఏకత్వమునకు భంగము వాటిల్లదు. ఘటాద్యాకారములు మృదాదుల బంధించినట్లు కనబడుటయే కాని వానికి బంధము లేనట్లు నామరూప వైవిధ్యముచే బ్రహ్మమునకు బంధము లేదు. 4. బ్రహ్మమునందలి ఏకత్వము అనేకత్వ విరుద్ధము కాదు. అట్లే బ్రహ్మము యొక్క పూర్ణత్వము అపూర్ణత్వమునకు విరుద్ధము కాదు. అట్లే బ్రహ్మము యొక్క సత్త్వము అసత్త్వమునకు ప్రతిద్వంద్వికాదు. అట్లే బ్రహ్మము యొక్క చిత్త్వాదులు అచిత్త్వాదులకు వ్యతిరిక్తములు కావు. పూర్ణత్వాది లక్షణములు కూడ బ్రహ్మమునందు భేదమును కలిగింప జాలవు. బ్రహ్మము యొక్క ఏకత్వమును బాధింపలేవు. బ్రహ్మము యొక్క మహత్త్వము (విభుత్వము) అణుత్వమునకు విరుద్ధముకాదు. కావుననే **'అణోరణీయాన్ మహతో మహీయాన్'** అని శ్రుతి చెప్పినది. పైగా విభుత్వాది లక్షణములు బ్రహ్మము యొక్క ఏకత్వమునే సమర్థించును. ఆధునిక శాస్త్రమొక నియమము నంగీకరించినది. ఒక ద్రవ్యము వ్యాపించియున్నచోట ద్రవ్యాంతరముండదు అనునది ఆ నియమము. దాని ననుసరించి రజ్జువున్నచోట సర్పముండదు. బ్రహ్మమున్నచోట ఆకాశాదు లుండజాలవు. అనగా బ్రహ్మమొక్కటే అంతట

వ్యాపించియుండగా ద్రవ్యాంతరముండుట కవకాశము లేదు అని నియమము చెప్పుచున్నది. అట్లగుచో కనబడు జగము మాట యేమి అను ప్రశ్న మిగులును. ఆ నియమములో ద్రవ్యాంతరమనగా సత్యద్రవ్యంతర ముండదు అనియే అర్థముకాని అసత్యద్రవ్యంతర ముండదని కాదు. కావుననే సత్యరజ్జువున్న చోట అసత్యసర్పము కనబడవచ్చును. అది రజ్జు భేదమును సాధించదు కావున బ్రహ్మమొక్కటే.

**ఒక్కడు వీడు సర్వతను యుక్కరణాదికలక్షణమ్ములన్**
**పెక్కయి జన్మనాశవిధి భేదనియంత్రితుడయ్యె వింతగా**
**నొక్క నటుండు వేషముల నొప్పుచు తన్ను నెఱుంగనట్లు వీఁ**
**డొక్కడు మానుషాదితనుయుక్తి స్మరింపడు నీ పదమ్మునే.**

* * *

**-- ఇచ్ఛాశక్తి స్కంధరశ్మి ప్రకరణమ్ --**

**అవతారిక :** పరాశక్తి స్కంధరశ్మి ప్రకరణమున శ్రీ శమ్భువు యొక్క పరత్వ నిరూపకమైన **ఏకత్వము** నిరూపింపబడినది. మాయా ప్రభావమున ఆ శమ్భువు భిన్నభిన్నముగా కనబడవచ్చునని చెప్పబడినది. ఇచ్ఛాశక్తి స్కంధరశ్మి ప్రకరణమున ఆ శమ్భువు యొక్క మాయికమైన **సృష్టిస్థితిలయేచ్ఛ** వర్ణింపబడుచున్నది. శమ్భువునకు ఆ ఇచ్ఛయందు మమత్వము (మమకారము) లేదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సత్త్వం చిత్త్వమ్మహత్త్వం తవ పరమగురోరాత్మశక్తేః పరాయాః**
**పిండీకృత్య ప్రకృత్య ప్రథమరతిపతివ్యాజకాలాంతవహ్నిః ।**
**భూత్వా సంసార సృష్టిస్థితిలయనిలయాద్యాతి తోయార్ణవాంతం**
**తన్వానో నిర్మమేచ్ఛ స్త్వమిహ విజయసే విష్ణుమాయావిభూతే! ॥ 27**

**ప్రతిపదార్థము :** విష్ణుమాయావిభూతే = ఓ విష్ణుమాయయే సంపదగా గలవాడా, పరమగురోః = పరమగురుడవైన, తవ = నీ యొక్క, ఆత్మశక్తేః = ఆత్మశక్తియైన, పరాయాః = పరయొక్క, సత్త్వమ్ = సత్త్వము, చిత్త్వమ్ = చిత్త్వమును, మహత్త్వమ్ = మహత్త్వమును, పిండీకృత్య = ముద్దజేసి, ప్రకృత్య = ఆరంభించి, ప్రథమరతిపతివ్యాజకాలాంతవహ్నిః భూత్వా = మొదటి కాముడని పేరుగల కాలాంతాగ్నియై, సంసార సృష్టిస్థితిలయనిలయాత్ = సంసార సృష్టిస్థితిలయముల నివాసము నుండి, తోయార్ణవాంతమ్ = జలరాశి వఱకు, తన్వానః = విస్తరించిన వాడవై, నిర్మమేచ్ఛః = మమత్వరహితమైన ఇచ్ఛగలవాడవై, త్వమ్

= నీవు, ఇహ = ఈ లోకమున, **విజయసే** = సర్వోత్కృష్టముగా వర్ధిలుచున్నావు.

**తాత్పర్యము :** ఓ విష్ణు మాయావిభూతీ! నీవు పరమగురుడవు. నీవాత్మ శక్తియైన పరనుండి సత్త్వచిత్త్వ మహత్త్వములను పిండి ముద్దజేసి మొదటి మన్మథుడను కాలాంతవహ్నివై సంసార సృష్టిస్థితిలయముల నివాసమునుండి జలరాశివఱకు విస్తరింపజేయుచున్న వాడవై మమకారరహితమైన ఇచ్ఛగలవాడవై ఈ లోకమున సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నావు.

**వివరణము :** విష్ణుమాయయును పరశమ్భువు యొక్క విభూతియే. విష్ణువు మోహినీరూపమును ధరించి శివుని సంగమించి పరాశక్తి వలె విభూతి యే ఐయున్నాడను అంశము పురాణ ప్రసిద్ధము. 2. **'సత్యం జ్ఞానమనంతమ్బ్రహ్మ'** ఇత్యాది శ్రుతులచే చెప్పబడిన సత్త్వచిత్త్వ మహత్త్వానంత్యాదులు బ్రహ్మము యొక్క గుణములైనచో ఆయన నిర్గుణుడని చెప్పు శ్రుతులతో విరోధ మేర్పడును. కావున మాయారూపిణియైన పరశమ్భువు యొక్క పరాశక్తికి సంబంధించినదే ఆ సత్త్వాదులని చెప్పినచో పై విరోధము తొలగిపోవును. ఆ పరాశక్తి నీ ఆత్మశక్తియే కావున దానితో కూడి నీవు సత్త్వ చిత్త్వమహత్త్వ గుణములను ముద్దజేసి సృష్టిస్థితిలయముల ఆది నివాసము శ్రీపురము మొదలు ప్రలయ (సముద్ర)ము వఱకు ఆ గుణములను నింపివేసినావు అను వాక్యములు ప్రపంచమంతయు సచ్చిదానంద రూపముగానే పుట్టి పెఱిగినది అని చెప్పినట్లైనది. 3. రతిపతి యనగా కాముడు, మన్మథుడు. ఆతడు జీవులపై ప్రతాపము చూపును. ఈ రతిపతి ఆతడుకాడు. ఈతడు ప్రథమ రతిపతి. అంతే కాదు కాలాంతాగ్ని స్వరూపుడు. ప్రలయ సముద్రము బడబాగ్నివలె కొంత కాలము దాగియుండి సృష్టికాలము రాగానే ఆ సముద్రమును శోషింపజేయు మహాగ్ని రూపుడు ఈ కాముడు. **ఈ కాముడు పరశమ్భువు యొక్క సృష్టిస్థితిలయేచ్ఛా రూపుడు.** అందుకే బ్రహ్మాండ పురాణమున శివుని కామేశ్వరావతారము లేక శివకామావతారము లేక కామశంకరావతారము వర్ణింపబడినది. తదనుగుణముగా అమ్మవారు కూడ **పుండ్రేక్షుచాపపుష్పబాణ**గా వర్ణింపబడినది. పరశమ్భువు యొక్క పురము లేక శ్రీపురము సచ్చిదానందమయము. అక్కడ నుండి బయలుదేరి ఆ సచ్చిదానంద ప్రవాహము పరశమ్భువు యొక్క నిర్మమేచ్ఛ వలన (ప్రలయ) సముద్రాంతము ప్రవహించుచునే యుండును. జ్ఞానులకు సృష్టియంతయు, జగమంతయు సచ్చిదానందమయమే.

**ఆ పరసత్త్వచిత్త్వ సుమహత్త్వము లన్నియు ముద్దఁజేసి సం**
**రూపిత మాది పుష్పశరరూప యుగాంతర వహ్నివై జగ**

**త్థాపిత సృష్టిపుష్టివిలయాలయమాదిగ నర్ణవాంతమున్**
**స్థాపనఁజేయుదీవు! మమతారహితేచ్ఛుడ! విష్ణుమాయికా.**

**అవతారిక :** పై శ్లోకమున ఆది నుండి అంతము దాక ఈ **జగము సచ్చిదానందమయమే** అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ **జగమెట్లు పుట్టినదో** చెప్పబడుచున్నది.

**శ్లో॥ మాయాయామంతరస్థః కుసుమశరరసస్తావకీయః స్వకాలే**
**జ్ఞానజ్ఞేయప్రమాతృప్రకటితమహిమా స్వప్రరోహప్రసారైః ।**
**ఉత్పాద్యాద్యం విరించిం తదను భువనతామాత్మనా వ్యశ్నువానో**
**బీజాకారః స్వయమ్భూరితి కథయతి తే నామ విశ్వాత్మసృష్టేః ॥ 28**

**ప్రతిపదార్థము :** మాయాయామ్ = మాయయందు, అంతరస్థః = లోపలనున్న, తావకీయః = నీ, కుసుమశరరసః = కామరసము, స్వకాలే = తనకాలమున, జ్ఞానజ్ఞేయ ప్రమాతృ ప్రకటిత మహిమా = జ్ఞానము, జ్ఞేయము జ్ఞాత అను విధముగా ప్రకటించిన మహిమ గలదై, ఆద్యమ్ = మొదటి, విరించిమ్ = బ్రహ్మను, ఉత్పాద్య = పుట్టించి, బీజాకారః = బీజాకారమై, స్వప్రరోహప్రసారైః = తన మొలక సాగింపులచే, తదను = పిమ్మట, ఆత్మనా = ఆత్మతో, భువనతామ్ = భువనతను, వ్యశ్నువానః = పొందుచున్నదై, విశ్వాత్మసృష్టేః = విశ్వాత్మసృష్టియైన, తే = నీకు, స్వయమ్భూః ఇతి = స్వయమ్భువు అని, నామ = పేరును, **కథయతి** = చెప్పుచున్నది.

**తాత్పర్యము :** నీ మాయలోని కామరసము జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయత్రిపుటి రూపమున తన మహిమను ప్రకటించు బీజాకారమై మొదటి బ్రహ్మను పుట్టించి తన మొలకలుగా నీ లోకములను సాగించి నీకు స్వయమ్భువు అను పేరును సార్థక మొనర్చు చున్నది.

**వివరణము :** పరశమ్భువు నిష్క్రియుడని చెప్పుటకు కామరసము మాయాంతరస్థమని చెప్పబడినది. 2. **జానాతి ఇచ్ఛతి యతతే** అను తర్కసూక్తి ననుసరించి సృష్టి విషయక జ్ఞానము లేనిదే సృష్టి అసాధ్యము కావున ముందుగా ఆ కామరసము అనగా ఇచ్ఛాశక్తి త్రిపుటిగా అనగా జ్ఞాతగా, జ్ఞానముగా, జ్ఞేయముగా త్రిధాత్వము భజించినదని చెప్పబడినది. పూర్వకల్పీయమైన (సృష్టి) ప్రపంచము యొక్క జ్ఞానము స్మరించిన పిమ్మట సృజనేచ్ఛ కలిగినది. ముందుగా ఆ ఇచ్ఛాశక్తి బీజాకృతిని పొంది మొదటి బ్రహ్మను పుట్టించినది. తరువాత బీజమున కంకురవృక్షక్రమమున అనగా మహదహంకారాది క్రమమున సమస్త భువన రూపము నొందినది. అప్పుడు పరశమ్భువు స్వయమ్భువు అను పేరును పొందినాడు.

ఇచ్ఛాశక్తి పరశమ్భువునకే పేరు చెప్పినది అని చెప్పుట తాను చేసిన పనిని శివునందారోపించుటకే ఇది యంతయు (ఈ సమస్త భువన మంతయు) మాయామయమని చెప్పుటకే అని గమనింపవలెను.

**తనరుచిఁజిమ్ముచున్ భవదుదారసుమాయగలట్టి కాముఁడన్**
**తన సమయమ్మునన్ బ్రకటితమ్మొనరించె ప్రమాతృమానమే**
**య నిజమహత్త్వమున్ మొదట యబ్జజు సంసృజియించి యాత్మనా**
**త్మను జగమున్ భరించి నిను దాఁబిలుచున్ స్వయముద్భవుండుగా.**

**అవతారిక :** పై శ్లోకమున మాయలోని కామరసము బీజాంకురమైన **బ్రహ్మాది భువన సృష్టి** చేయుట వర్ణింపబడినది. ఈ శ్లోకము వర్ణ సృష్టి ఆ త్రిభువన భువనాభావ భూమి యని శివాది క్షిత్యంత తత్త్వవికృతియైన **బ్రహ్మాండాంతసృష్టిగా శివుడు రూపొందినాడని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆదిక్షాంతార్ణసృష్టిం త్రిభువనభవనాభాసభూమిం శివాది**
**క్షిత్యంతాత్మీయ తత్త్వా మవికృతిగతిం వైధసాండాంతభూమిమ్ ।**
**ఆత్మీయానుత్తరేచ్ఛాగుణపరవశతామ్ప్రాప్య సంవ్యశ్నువానః**
**శ్రీశమ్భో! విశ్వసృష్టిర్భవసి నిజమలత్రయయ్యుపప్రోషితాత్మా ॥ 29**

**ప్రతిపదార్థము :** శ్రీశమ్భో! = ఓ శమ్భూ!, త్రిభువన భవనా భాసభూమిమ్ = భువన త్రయమను భవనమును ప్రకాశింపజేయు నెలవైన, వైధసాండాంత భూమిమ్ = బ్రహ్మాండమే అంత భూమిగా గల, ఆదిక్షాంతార్ణ సృష్టిమ్ = అకారము మొదలు క్షకారము వఱకుగల వర్ణముల సృష్టిని, ఆత్మీయానుత్తరేచ్ఛా గుణపరవశతామ్ = ఆత్మకు సంబంధించిన అనుత్తరమైన ఇచ్ఛాగుణమునకు వశీభూత స్థితిని, సంవ్యశ్నువానః = బాగుగా పొందినవాడైన, నిజమలత్రయయ్యుపప్రోషితాత్మా = తన మలత్రయముతో కూడిన వాడవై, విశ్వసృష్టిః = విశ్వసృష్టివి, **భవసి** = అగుచున్నావు.

**తాత్పర్యము :** త్రిభువనభవనమును భాసింపజేయు అనగా వెలార్చునది ఆది క్షాంతార్ణసృష్టి శివాది క్షిత్యంతములైన తత్త్వములు వర్ణమాల నుండి ఆవిర్భవించినవే. ఈ తత్త్వముల వికారమే బ్రహ్మాండము. బ్రహ్మాండము, సృష్టి ప్రక్రియలో చివరిది. తన అనుత్తరేచ్ఛా గుణవశుడై మలత్రయముతో గూడిన జీవ భావమును పొంది శమ్భువే విశ్వసృష్టియగు చున్నాడు. అట్లగుటకు కారణము సృష్టమైన బ్రహ్మాండము నందంతట ఆ శమ్భువే వ్యాపించి యుండుట.

**వివరణము :** వర్ణములకు మాతృకలని పేరు. వర్ణమాలకు కూడా మాతృక అని పేరు. ఈ పేర్లు వర్ణములు స్రష్టృములు జననీత్వమును అనగా మాతృత్వమును సూచించును. వర్ణములు తల్లులు అని తేలినది. వేనికి అను ప్రశ్నము కలుగును. తత్త్వములకు అవి సమాధానము. తత్త్వములలో శివాదులు నిత్యములు. మహదాదులు అనిత్యములు. అన్నింటికి వర్ణములే ఆభాసకములు. మహదాదులు, క్షిత్యంతములునైన తత్త్వములు అనిత్యము లైనను వాని సమూహముచే నేర్పడు బ్రహ్మాండమునకు మూలములు. **తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్** అను శ్రుతి ననుసరించి స్వసృష్టమున శమ్భువే ప్రవేశించి బ్రహ్మాండరూపుడగును. ఘటాదులు క్షిత్యాది వికారములైనందున కార్య జనకములైనందున అవి తత్త్వములని చెప్పబడవు. నిత్యములలో శివుడు తప్ప మిగిలినవి ఆపేక్షిక నిత్యములు. శమ్భువు తప్ప మిగిలిన నిత్యానిత్యము లన్నియు అపరమార్థములే. అస్తు. తత్త్వములకు వర్ణములు మాతృకలు, అవి అకారాదులు క్షకారాంతములు. 2. **అనుత్తరమనగా** పైన లేనిది. కుడిచేతితో వ్రాయువాని ఎడమ భాగము ఉత్తరము. ఉత్తరమున అనగా అకారమునకు పూర్వము అనగా ముందు ఏవర్ణము లేదు. కావున అకారము **అనుత్తరమని** పిలువబడును. కాని ఆ అకారమే కకారాదులకు పరమైనప్పుడు అనుత్తర మనబడదు. అహమ్‌లోని అకారము, ఓం కారములోని మొదట నున్న అకారము అనుత్తరము. 'అహమ్' అనునది ళకార క్షకారముల విడచి మిగిలిన నలుబది ఎనిమిది వర్ణములు తనలో నింపుకొనును. క్షకారమనునది సంయుక్తాక్షరము అనగా కకారషకారముల సంయోగము మాత్రమే. అది పృథగక్షరము కాదు. సంయుక్తాక్షర మిట్లుండునని చెప్పుటయే దాని చేర్పునకు ప్రయోజనము. ళకారమనునది వర్ణమాలలో నున్నను సంస్కృతవాఙ్మయమందనుపయుక్తము. వైదికభాషలో డకారమునకు ప్రత్యామ్నాయముగా తప్ప మరొక రూపమున కనిపించదు. అందువలన క్షళకారములను విడచినను పద పదార్థ నిర్మాణమున కిబ్బందిలేదు. కావున మాతృకకు ఆది అ చివఱ హ చేర్చగా నేర్పడు అహమ్ అనునది సర్వప్రపంచమూలమైన **కామకలగా** చెప్పబడినది. 3. **పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే** అను శ్రుతి ననుసరించి పరమేశ్వరుని పరాశక్తియే బహువిధశక్తులుగా నున్నది. ఆ బహువిధశక్తులలో మొదటిది ఇచ్ఛాశక్తి కావున అది అనుత్తరమని పిలువబడినది. ఓం కారములోని మొదటి అకారము కూడ ఈ ఇచ్ఛాశక్తిని బోధించును అనుత్తరాకారబోధ్యశక్తి కావున ఇది అనుత్తర శక్తి. తార్కికులు ఇచ్ఛను **గుణ**మందురు. అందువలన ఇచ్ఛా శబ్దము గుణవాచకము అని చెప్పుటకు పరమేశ్వరుడే ప్రధానుడు. ఆతనికే ఇచ్ఛ గుణము (అప్రధానము) అని సూచించుటకు గుణ శబ్దము ప్రయోగింపబడినది. దానికి పరమేశ్వరుడే వశమగుటను చెప్పుటచే ఒక్కొక్కప్పుడు పరాశక్తికి

పరమేశ్వరుడు కూడ శేషభూతుడుగా నుండు నన్న అంశము అగుటను **వశ** శబ్దము సూచించును. 4. సృష్టియందంతట వ్యాపించి యుండు శమ్భువు విశ్వసృష్టియే యగుచున్నాడు. 5. శమ్భువు **'జీవేనాత్మనానుప్రవిశ్య'** అను శ్రుతి వాక్యము ననుసరించి జీవాత్మ రూపుడు త్రివిధమలములు గలవాడు జీవుడు. అనాత్మరూపములైన దేహేంద్రియాదులందు నేను అను బుద్ధి ఆణవ మలము అని చెప్పబడును. దాని నుండి జనించిన మలము కార్మణమలము అని చెప్పబడును. దేహాదులందు ఆత్మబుద్ధిలేని వానికి కర్మయనునదే ఉండదు. కావున దీనియందు అనాత్మయందాత్మ బుద్ధి అను ఆణవ మలముతో వ్యాపింప బడియే యుండును. కార్మణమలమే అదృష్టమనియు పిలువబడును. పూర్వ జన్మలకు చెంది దృష్టముకాని కర్మ జన్మదుఃఖాదులకు కారణము కావున కార్మణమలమున కీ పేరు ఉచితముగానే ఉన్నది. దీని నుండి జనించిన మాయీయమలము భేదబుద్ధిని జనింపజేయు చుండును కావున లేని భేదము బుద్ధి విషయమగుట మాయవలననే కావున ఈ మలమునకీ పేరు సార్థకము. ఆణవమలము మాత్రము కలవాడు విజ్ఞానకేవలుడు, **ఆణవ కార్మణ మలద్వయము** కలవాడు సకలుడు అని చెప్పబడును. ఇట్లు మలత్రయ్యుపప్రోషితుడై శమ్భువు జీవజగద్రూపమును ధరించి విశ్వసృష్టియగు చున్నాడు. విశ్వశబ్దము జాగ్రదవస్థాగత జీవునకు జగమునకు కూడ వాచకము.

**భువన గృహ ప్రభాసన సుభూమి శివాది ధరాంత వైధసాం**
**డ పరమహాంతభూమి ప్రకట స్థితి నాదియు క్షాంత మర్ణరా**
**శి వశమనుత్తరేచ్ఛకు వశిత్వము నొందియు వ్యాప్తినొంది యీ**
**భువనపు సృష్టివై తగుదు మూడు మలమ్ములు నాత్మఁగప్పగా.**

**అవతారిక :** పై శ్లోకమున శమ్భువు **సృష్టి**యగుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతడు **స్థితి**యగుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ చత్వారః కాలతత్త్వే తవ యుగపతయస్తే చ ధాతుశ్చ పుత్త్రా-**
**వ్యాఖ్యాతా ద్వాదశైతే స్థితికృతివిదితాస్స్వవతారాస్సదారాః ।**
**శ్రీ కంఠాద్యశ్చ నాథా ధృతయుగవిధయస్త్వన్నియత్యుత్థితాంతా-**
**శ్చైతన్యా ఏవ తస్మాత్ స్థితిరితి విదితస్త్వం సహస్రార్కదీప్తే! ॥** 30

**ప్రతిపదార్థము :** సహస్రార్కదీప్తే = వేయిసూర్యుల వెలుగు వంటి వెలుగు కలవాడా!, తవ = నీ యొక్క, కాలతత్త్వే = కాలతత్త్వము నందు, చత్వారః = నలుగురు, యుగపతయః =

యుగముల యొక్క పతులు, తే చ = ఆ యుగములు నాలుగును, ధాతుః = బ్రహ్మయొక్క, పుత్రాః = నలుగురు పుత్రులను, వ్యాఖ్యాతాః = వివరింపబడిన, ఏతే = ఈ, ద్వాదశ = పన్నెండుగురు, సావతారాః = అవతారసహితులు, సదారాః = భార్యా సహితులునై, స్థితికృతి విదితాః = స్థితి అను పనియందు జ్ఞానము కలవారు, శ్రీకంఠాద్యాః = శ్రీకంఠుడు మొదలైన, నాథాః చ = నాథులును, ధృతయుగ విధయః = ధరింపబడిన యుగముల విధులుకలవారై, త్వన్నియత్యుత్థితాంతాః = నీ నియమము (శాసనము) చేత కలిగిన అంతము కలవారును, చైతన్యా ఏవ = చైతన్య రూపులే, తస్మాత్ = అందువలన, స్థితిః = స్థితి, ఇతి = అని, త్వమ్ = నీవు, విదితః = తెలియబడువాడవై ఉన్నావు.

**తాత్పర్యము :** ఓ వేయి సూర్యులకాంతి వంటి కాంతి గలవాడా! నాలుగు యుగములు, నలుగురు యుగపతులు, బ్రహ్మపుత్రులు నలుగురు. ఈ పన్నెండుగురు స్థితి అను పని నెఱిగినవారు. ఇంకను యుగవిధుల నిర్వహించు శ్రీకంఠాదినాథులును తమ పనిని ముగించి నీ శాసనముచే వారును అస్తమించెదరు. వీరందఱు చైతన్యమూర్తులే అనగా స్థితి రూపులే. ఆ రూపమున నున్న నీవు స్థితియని మాచే తెలియబడితివి.

**వివరణము :** పరమేశ్వరుడు కాలస్వరూపుడు. కాలమఖండమైనను దాని యందు కలాకాష్ఠాది భేదములు కల్పింపబడినవి. మిక్కిలి పెద్దకాలము పరము. దానిలో సగము పరార్ధము. బ్రహ్మదేవుడు రెండు పరార్థముల కాలము జీవించును. ప్రథమ పరార్ధము యొక్క ఆదిలో సృష్టి ఆరంభమగును. ద్వితీయపరార్ధముయొక్క చివఱ ప్రలయ మేర్పడును. ఈ మధ్యకాలమున నెన్నో అవాంతర కల్పములు మహాయుగములు గడచుచుండును. మహాయుగమునకు మానవమానము ననుసరించి నలుబది మూడు లక్షల ఇరువది వేల వత్సరము లుండును. మహాయుగమనగా ఒక చతుర్యుగము. ఇట్టి చతుర్యుగములు వేయి గడచిన బ్రహ్మదేవున కొక పగలు. బ్రహ్మదేవుని పగటి కాలమున పదునాలుగు మన్వంతరములు గడచిపోవును. దేవమానము ననుసరించిన డెబ్బది యొక్క యుగములొక మన్వంతరము. పదునాలుగు మన్వంతరముల కాలము వేయి చతుర్యుగములు. మరల గడచిన అనగా రెండు వేల చతుర్యుగములకు బ్రహ్మదేవునకు పగలు రాత్రిగల ఒక దినము ముగియును. ఈ లెక్కన మూడు వందల అఱువది దినములు గడచిన ఒక సంవత్సరము. అట్టివి ఏబది గడచిన ఒక పరార్ధము. మరొక ఏబది సంవత్సరములు గడచిన ఒక బ్రహ్మకు పరమనబడు నూఱువత్సరముల ఆయువు పూర్తి యగును. బ్రహ్మదేవుని ప్రతి రాత్రియు ఒక అవాంతరకల్పము. ఒక చతుర్యుగమునకు నలుబది

మూడు లక్షల ఇరువదివేల సంవత్సరములని చెప్పితిమి. వానిలో మొదటిది **కృతయుగము**. దాని పరిమితి పదేడు లక్షల ఇరువది వేల సంవత్సరములు. అందులోని నాల్గవ భాగము అనగా నాలుగు లక్షల ముప్పదిరెండు వేల సంవత్సరములు తగ్గించగా **త్రేతాయుగ** పరిమితి యేర్పడును. అది పన్నెండు లక్షల తొంబదిఆఱు వేల సంవత్సరములు. దానిలోని మూడవ భాగము నాలుగు లక్షల ముప్పది రెండు వేల సంవత్సరములు తగ్గించగా నేర్పడినది **ద్వాపర యుగ పరిమితి**. ఎనిమిది లక్షల అఱువది నాలుగు వేల సంవత్సరములు. దానిలోని సగము అనగా నాలుగు లక్షల ముప్పది రెండు సంవత్సరములు **కలియుగ** పరిమితి. తంత్రము ననుసరించి మిత్రేశుడు, ఉడ్డీశుడు, షష్ఠీశుడు, చర్యానందనాథుడు ఆ యుగముల పతులు లేక కృత త్రేత ద్వాపర కలి పురుషులు యుగపతులు వారి నామములలో భిన్న ప్రకారము లున్నవి. 2. శివవిష్ణ్వాదుల అవతారములు కూడ స్థితి కృతి నిర్వహణమునకే భగవానునిచే ధరింపబడినవి. నాథులు అనబడు సిద్ధపురుషులు ఈ స్థితి కృతి నిర్వహణమున తమవంతు పాత్రను నిర్వహించి నిష్క్రమించెదరు. పైన చెప్పబడిన వారందఱిలో స్థితిరూపమున శమ్భువే వ్యాపించి యున్నాడు. కావున స్థితియని తెలియబడినవాడును శమ్భువే. 3. శమ్భువు **సహస్రార్కదీప్తి** యని సంబోధింపబడినవాడు. భగవద్గీతలో **'దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః'** వేయి సూర్యుల కాంతి యొకే సారి పైకి లేచినదేని ఆ కాంతితో పరమేశ్వరుని కాంతి సమానమైయుండును అని చెప్పబడినది. ఈ బ్రహ్మాండమునంత నొక సూర్యుడు వెలిగినప్పుడే ఆ కాంతిని మనకన్నులు చూడ లేకున్నవి. ఇక వేయిసూర్యుల కాంతి వెల్వడినచో నా పరమేశ్వరు నెవరు చూడగలరు. ఈ సంబోధనము కాలమంతయు సూర్యస్పంద రూపమని తెలియజేయు చున్నది. దానిలోని భూతభవిష్యద్వర్తమాన భేదములు, కాంతి ప్రసరణము వలన నేర్పడినవి. ఒకే దృశ్యము ఒక గోళములోని వారికి వర్తమానము కాగా మరొక గోళము వారికప్పుడును ఆ దృశ్యము అగోచరము. రాబోవు కాలమున అనగా కాంతి ఆ గోళమునకు చేరినప్పుడు మాత్రము గోచరమగును. వారి దృష్టిలో పూర్వగోళము యొక్క వర్తమానము భూతకాలమే యగును. కాలములోని కృతాది వ్యవహారము గోళభేదము నగును. విక్రమార్కుని సభలోని వినోదములు మనకు భూత కాలికములు. గోళాంతరవాసుల కావినోద దృశ్యమింకను చేరకుండుటచే వారి కది భవిష్యత్కాల దృశ్యమగును. వారి కాదృశ్యము చేరినప్పుడు వర్తమానముగానే భాసించును. ఈ వ్యవహారము యొక్క కల్పితత్వము నీ సంబోధనము వ్యంజింపజేయును. ఒక గోళమున చీకటి మరొక గోళమున వెలుగు, ఒక గోళమున పగలు మరొక గోళమున రాత్రి. ఇది

యంతయు చీకటి వెలుగుల రంగేళి. ఒక గోళమున ప్రాణిసృష్టి ఇంకను జరగలేదు. ఒక గోళమున ప్రాణి జాతము నశించి శ్మశానమైపోయినది. మన గోళమున స్థితి ప్రవర్తించు చున్నది. ఇది యంతయు సహస్రార్కదీప్తియైన శ్రీశమ్భువు యొక్క రశ్మిల విలాసము. రశ్మలన్నియు ఆయన విలాసములు.

**కాలనియుక్తి నల్వురు యుగప్రభు లబ్జజు పుత్రులున్ జగ**
**త్పాలన సావతారులును బన్నిరువు ర్యుగధారి నాథులున్**
**వ్రాలుదు రంతమందున భవన్నియతిన్ గని వారు చేతనా**
**స్ఫాలితులౌట నీవు స్థితి సంజ్ఞుడ వర్కసహస్రదీధితీ!**

**అవతారిక :** పై శ్లోకమున శమ్భువు **సహస్రార్కదీప్తిగా** సంబోధింపబడినాడు. సహస్రార్కదీప్తికి రశ్మిలుండవలెగదా. ఈ శ్లోకమున శమ్భువు యొక్క ఆత్మా విరోధముయొక్క ఆ **రశ్మిల విజయము** వర్ణింపబడు చున్నది.

**శ్లో॥ ఆత్మీయానాదిరశ్మీనిహ భవజనితానేకసిద్ధాంతజాల-**
**వ్యామోహోద్యద్వికల్పానృతనిజవిషయాన్ పుణ్యపాపాదిభేదైః ।**
**దుర్జ్ఞేయాన్ దేశికోక్త్యా ప్రవిమలవపుషి స్వప్రకాశైకవహ్నౌ**
**స్వాత్మత్వేన ప్రబుద్ధాన్ ఝటితి విజయతే యస్త్వదాత్మావిరోధః ॥ 31**

**ప్రతిపదార్థము :** యః = ఏ, త్వదాత్మావిరోధః = నీ ఆత్మయొక్క అవిరోధమో, సః = అది, ఇహ = ఇచట, భవజనితానేక సిద్ధాంతజాల వ్యామోహోద్యద్వికల్పానృతనిజవిషయాన్ = సంసారమున పుట్టిన అనేక సిద్ధాంతజాలము వలన కలిగిన వ్యామోహము నుండి పుట్టుచున్న వికల్పములైన అసత్యములైన తమ విషయములుకల, పుణ్యపాపాదిభేదైః = పుణ్యము పాపము మొదలైన భేదములచే, దుర్జ్ఞేయాన్ = తెలియరాని, దేశికోక్త్యా = గురువచనము చేత, స్వప్రకాశైకవహ్నౌ = స్వప్రకాశమను వహ్నిగల, ప్రవిమల వపుషి = స్వచ్ఛమైన దేహమునందు, స్వాత్మత్వేన = స్వాత్మరూపమున, ప్రబుద్ధాన్ = మేలు కొల్పబడిన, ఆత్మీయానాది రశ్మీన్ = తన అనాదిరశ్మిలను, విజయతే = గెలుచుచున్నది.

**తాత్పర్యము :** ఓ శమ్భూ! నీ ఆత్మ అవిరోధము కావున ఈ సంసారమున పుట్టిన అనేక సిద్ధాంతభ్రమల వ్యామోహముల వికల్పములైన స్వవిషయములు గల పుణ్యపాపాది భేదములచే తెలియరాని, గురువచనముచేత స్వప్రకాశాగ్నిరూపమైన తన స్వచ్ఛమైన శరీరమునందు స్వాత్మరూపమున మేలుకొనిన తన రశ్మిలను గెలుచుచున్నది.

**వివరణము :** ఈ శ్లోకమున మరొక సంబోధనము లేకపోవుట వలన పై శ్లోకము నందలి సహస్రార్కదీప్తే అను సంబోధనమే ఇందు కూడ అనువర్తించునని గ్రహింపవలెను. 2. ఈ సంసారమున అనేక సిద్ధాంతములు పుట్టినవి. ద్వైతమును చెప్పునవి ఒక వర్గము, అద్వైతమును చెప్పునవి మరొక వర్గము. సాంఖ్య యోగ వైశేషిక న్యాయ పూర్వమీమాంసా విశిష్టాద్వైత ద్వైతాది సిద్ధాంతములు ద్వైతవర్గములకు చెందినవి. ప్రపంచ మిథ్యాత్వమును చెప్పునని, బ్రహ్మ ప్రపంచముల భేదము మిథ్య అని చెప్పినవియైన సిద్ధాంతములు కొన్ని అద్వైత వర్గమునకు చెందినవి. ఇవి పరస్పర విరుద్ధములై కన్పడును. కాని ఆత్మైకత్వానుభవము గల జ్ఞాని వీనిలో కూడ విరోధము చూడడు. శమ్భువున కంతయు స్వాత్మయే కావున విరోధమే ఉండు నవకాశము లేదు. 3. దేశికోక్తి చేత తన శరీరమే స్వప్రకాశ వహ్నిలో జ్వలించి పోయిన జ్ఞాని ఆత్మ అవిరోధమగుటచే స్వాత్మయైన శ్రీశమ్భువు అవిరోధమే అగుటచే ఆ రశ్మిలన్నియు స్వాత్మరూపముననే మేలుకొనును కావున ఆ అవిరోధ మొక్కటే అన్నింటిని గెలిచి సర్వోత్కర్షముగా వర్ధిల్లును.

**అవిరతసంసృతి ప్రభవహారి వచోమయ మోహజాల సం**
**భవదనృతాతి సత్యమయపాతకపుణ్యకముఖ్యభేద సం**
**భవ విషయాధ్యరశ్మిలను భవ్యగురూక్తిని స్వప్రకాశ మూ**
**ర్తి విమల వహ్ని స్వాత్మగ నెఱింగిన గెల్చును నీ కనన్యుడై.**

**అవతారిక :** పై శ్లోకమున రశ్మిలన్నిటి కవిరోధమైన **ఆత్మగెలుపు** వర్ణింపబడినది. ఈ శ్లోకమున అట్లు గెలిచిన **జ్ఞానులు పరశమ్భువును చేరుదురని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ జాగ్రత్స్వప్నప్రసుప్తిప్రకటితవిభవైరాత్మమాయాగుణైః స్వైః**
**జ్ఞానేచ్ఛాక్రోధరూపైర్విధిహరిహరకైరావృతే మోక్షమార్గే ।**
**పాంథాః కేచిత్సుధీరాః శివగురువచనజ్ఞానశస్త్రాగ్నిదీప్తా-**
**స్త్వత్కారుణ్యైకరక్షాపరివిహతభియస్త్వాం ప్రయాన్త్యాదిమూర్తే! ॥ 32**

**ప్రతిపదార్థము :** ఆదిమూర్తే! = ఆదిమూర్తీ!, జాగ్రత్స్వప్నప్రసుప్తి ప్రకటిత విభవైః = జాగ్రత్స్వప్న సుషుప్తుల చేత ప్రకటింపబడిన వైభవముగల, స్వైః = తమ, ఆత్మమాయాగుణైః = ఆత్మమాయ గుణములైన, జ్ఞానేచ్ఛాక్రోధరూపైః = జ్ఞానేచ్ఛాక్రోధరూపులైన, విధిహరిహరకైః = బ్రహ్మవిష్ణుమహేశ్వరుల చేత, ఆవృతే = ఆవరింపబడిన, మోక్షమార్గే = మోక్షమార్గము నందు, సుధీరాః = మిక్కిలి ధీరులైన, కేచిత్ = కొందఱు, పాంథాః = బాటసారులు, శివ

గురువచన జ్ఞానశస్త్రాగ్నిదీప్తాః = గురువచనజ్ఞానమను శస్త్రాగ్నివెలుగుచే, త్వత్కారుణ్యైక రక్షాపరివిహతభియః = నీ దయ అను రక్షచేత కోరబడిన భయము గలవారై, త్వామ్ = నిన్ను, **ప్రయాన్తి** = చేరుచున్నారు.

**తాత్పర్యము :** ఓ ఆదిమూర్తీ! జాగ్రత్స్వప్నసుషుప్తులచే తమ ప్రకటించబడిన వైభవము కల ఆత్మమాయకు, గుణములైన జ్ఞానేచ్ఛాక్రోధములే రూపములుగా గల బ్రహ్మవిష్ణురుద్రులచే ఆవరింపబడిన మోక్షమార్గమున మిక్కిలి ధీరులై కొందఱు బాటసారులు మాత్రము గురువచనమను శస్త్రాగ్ని వెలుగుగల వారై నీ దయ అను రక్షచేత భయరహితులై నిన్ను చేరుచున్నారు.

**వివరణము :** సత్త్వరజస్తమోగుణత్రయసహిత సత్త్వచిత్త్వమహత్త్వానందాది పరశమ్భు ధర్మములు అని చెప్పదగిన ధర్మము లామెవే కావున ఆయన సాక్షిగా నిర్గుణుడుగా కూడ నున్నాడు. ఆయన ఆత్మమాయాగుణరూపులు, జ్ఞానేచ్ఛాక్రోధ రూపులునైన బ్రహ్మవిష్ణురుద్రులను సృజించినాడు. వారు స్వతంత్రులని భావించి జనులు వారి ఆరాధనలు చేయుచున్నారు. మోక్షమార్గమున వారు ఆవరింపబడి యుండుటచే పరశమ్భువు కానరాకున్నాడు. కొందఱు ధీరులు మాత్రము గురువచన శస్త్రాగ్నిచేత మాయాంధకారరూపులైన ఆ బ్రహ్మవిష్ణు మహేశ్వరులను గాల్చి వారిని దాటి పరశమ్భువును చేరుచున్నారు. 2. సత్త్వరజస్తమో గుణములు ప్రధానముగ మాయకు చెందినవి. సత్త్వగుణము వలన జాగ్రదవస్థ. రజోగుణము వలన స్వప్నావస్థ, తమోగుణమువలన నిద్రావస్థ జీవులకు కలుగు చుండును. మాండూక్యోపనిషత్తునందు వైశ్వానరుడు జాగ్రదవస్థాభిమానిగా, హిరణ్యగర్భుడు స్వప్నావస్థాభిమానిగా, అవ్యాకృతుడు నిద్రావస్థాభిమానిగా చెప్పబడినాడు. ఈ శ్లోకమున వైశ్వానరుడు బ్రహ్మగా, హిరణ్యగర్భుడు హరిగా, అవ్యాకృతుడు రుద్రుడుగా చెప్పబడినాడు. పురాణములందు రజోగుణాభిమానియైన బ్రహ్మ హిరణ్యగర్భుడుగా చెప్పబడినాడు. వైష్ణవ పురాణములలో రుద్రుడు తమోగుణాభిమాని అవ్యాకృతుడుగా, శైవ పురాణములలో విష్ణువు తమోగుణాభిమాని అవ్యాకృతుడుగా చెప్పబడును. మొత్తము మీద శైవ వైష్ణవ పురాణములలో బ్రహ్మ హిరణ్యగర్భుడుగానే చెప్పబడినాడు. కాని ఈ శ్లోకమున విధి (బ్రహ్మ) జాగ్రదవస్థాభిమాని వైశ్వానరుడుగా చెప్పబడినాడు. బ్రహ్మ సత్త్వగుణాభిమానిగా ఈ విధముగా చెప్పబడుట ఈ శ్లోకమునందలి విశేషమే. జ్ఞానేచ్ఛాక్రోధరూపైః అని ఆ బ్రహ్మవిష్ణు మహేశ్వరులు చెప్పబడినారు. సాధారణముగ శక్తులు జ్ఞానేచ్ఛా క్రియారూపములని చెప్పబడుచుండును. సత్త్వగుణమునకు జ్ఞానము

చిహ్నము. **'సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్'** అని భగవద్గీత చెప్పియున్నది. ఈ శ్లోకమున క్రియాశక్తి అని చెప్పవలసిన చోట క్రోధము చెప్పబడినది. ప్రపంచలయమొనర్పవలసిన వానికి క్రోధముండుట ఉచితమే. ఈ శ్లోకమున హరుడు (రుద్రుడు) క్రోధరూపుడుగా చెప్పబడినాడు. మాండూక్యోపనిషత్తు నందు అవ్యాకృతుని నుండి హిరణ్యగర్భుడు, హిరణ్యగర్భుని నుండి వైశ్వానరుడు ఏర్పడినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున విధిహరిహరులు మోక్షమార్గము నావరించువారుగా చెప్పబడినది. అల్పార్థక ప్రత్యయము చివఱ ఉన్న **'విధిహరిహరకైః'** అను సమాసము వీరు ముప్వురు పరశమ్భువు కన్న అల్పులు అని తెలియజేయుచున్నది. వీరు మోక్ష ప్రదాయకులు కాక పోవుటయే దానికి కారణము. ఇంతేకాక మోక్షమార్గమున పయనించువారు వీరి ఆవరణమును చీల్చుకొని వీరిని దాటి పోవలసియున్నది అని కూడ కప్రత్యయము తెలుపుచున్నది. 3. **ఆదిమూర్తే!** అను సంబోధనము వలన విధిహరిహరులు ఆది మూర్తులు కారని తెలియుచున్నది.

**జాగృతి స్వప్నమున్ నిదుర జ్ఞానము నిచ్చయు గ్రోధమున్ స్వమా**
**యాగుణరూపతన్ నిలుపు నబ్జజుచే హరిచే మహేశుచే**
**బాగుగ నావృతంబయిన మార్గము నీకృప నిర్భయమ్మునై**
**శ్రీ గురువాక్యదీప్తమయి చేర్చును ధీరుల నీకడన్ విభూ!**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **ఆదిమూర్తిగా** సంబోధింపబడినాడు, ఈ శ్లోకమున ఆతని తదనంతరమూర్తి ప్రభావము ప్రస్తావింపబడుచున్నది.

**శ్లో॥ త్వమ్మాయాకామదేవః ప్రథమమసి తతః స్వస్వ సృష్టౌ విధాతా**
**రక్షాయాం విష్ణురంతే ప్రబలతరమహారుద్రమూర్తిః స్వమూర్తౌ ।**
**సత్యోనంతః ప్రమాతా శివగురురితి చ స్వాత్మమూర్తిప్రభావైః**
**స్వేచ్ఛావస్థాగుణాఢ్యోఽప్యగుణ ఇతి విభో! వస్తుతః స్తూయసే త్వమ్ ॥ 33**

**ప్రతిపదార్థము :** విభో = ఓ ప్రభూ!, త్వమ్ = నీవు, ప్రథమమ్ = మొదట, మాయాకామదేవః = మాయామయకామదేవుడవు, అసి = అగుచున్నావు. తతః = తదనంతరము, స్వస్వ = తనయొక్క, సృష్టౌ = సృష్టియందు, విధాతా = బ్రహ్మవు, రక్షయామ్ = రక్షయందు, విష్ణుః = విష్ణుడవు, అంతే = సంహారము నందు, స్వమూర్తౌ = నీ మూర్తియందలి, ప్రబలతర మహారుద్రమూర్తిః = మిక్కిలి బలము గల మహారుద్రమూర్తివి, సత్యః = సత్యుడు, అనంతః = అనంతుడు, ప్రమాతా = దృగ్రూపుడు, శివగురుః = శివగురువు, ఇతి చ =

అనియు, స్వాత్మమూర్తి ప్రభావైః = స్వీయమూర్తుల ప్రభావములచేత, స్వేచ్ఛావస్థాగుణాఢ్యః అపి = స్వేచ్ఛచే అవస్థల గుణములతో నొప్పువాడవయినను, వస్తుతః = యథార్థముగా, అగుణః = గుణరహితుడవు, ఇతి = అని, త్వమ్ = నీవు, **స్తూయసే** = స్తుతింపబడుచున్నావు.

**తాత్పర్యము :** ఓ ప్రభూ! నీవు మొదట మాయాకామదేవుడవు. ఆ తరువాత నీ సృష్టియందు విధాతవు, రక్షయందు విష్ణుడవు, అనంతరము సంహారమున మహారుద్రమూర్తివి. సత్యుడు, అనంతుడు, ప్రమాత, శివగురువు అనియు నీ మూర్తుల ప్రభావములతో స్వేచ్ఛతో అవస్థలతో గుణములతో నొప్పువాడవైనను గుణరహితుడు అనియే స్తుతింపబడుచున్నావు.

**వివరణము :** పరశమ్భువునందు పూర్వకల్పమునందలి జీవులకర్మ పరిపాకమునకు రాగానే మొదట కామము కల్గినది. ఆతడే మొదటి కామదేవుడు. విష్ణుకుమారుడై ఇంద్రుని ప్రేరణచే యోగులలో తపోభంగాదుల కవసరమైన సంభోగేచ్ఛను కలిగించు కామదేవుడు అంతరికుడు. శమ్భువు యొక్క అనుత్తరేచ్ఛామూర్తి యైన ప్రథమ కామదేవుడు త్రిమూర్తి సమష్టి మూర్తి. క అనగా బ్రహ్మ, అ అనగా విష్ణువు, మ అనగా రుద్రుడు (క+అ+మ = కామ) పంచ బ్రహ్మలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులలో నీశ్వరుడు ఈతడే. ఈ కామదేవుని తరువాత వారు బ్రహ్మ విష్ణు రుద్రులు. సృష్టిని బ్రహ్మ, రక్షణమును విష్ణువు, సంహారమును రుద్రుడు చేయుదురు. పరశమ్భువే తన ఇచ్ఛ (ప్రథమ కాముడు) చేత వీరి సృష్టి స్థితి లయముల నొనర్చును. పరశమ్భువు యొక్క ఇచ్ఛచేత సృష్టింపబడిన వీరును పరశమ్భు రూపులే అయినను రుద్రునకు పరశమ్భువునకు పోలిక లెక్కువ, త్రినేత్రత్వాది లక్షణము లీరుద్రుని యందుండుటచే త్రిమూర్తులలో రుద్రుడూ మహాదేవుడు. **స్వమూర్త్యై** అను పదముచే ఈ అర్థము తెలియబడుచున్నది. 2. సత్యజ్ఞానానంతత్వాది ధర్మములు, జాగ్రదాద్యవస్థలు, రజస్తమస్సత్త్వాదిగుణములు (ఇచ్ఛ మొదలగు గుణములు) అన్నియు పరశమ్భువు నందు ఒకప్పుడు కనబడి మరొకప్పుడు కనబడకయు ఉండును. ఈ కనబడుట భక్తుల ఇచ్ఛ ననుసరించి జరుగుచుండును. అందువలన సగుణుడు అయినను గుణరహితుడు, అగుణుడు అని భక్తులచే స్తుతింపబడు చుండును. 3. స్వస్వ అను శబ్దము సృష్టి రక్షాంతముల కనుబంధింపజేసిన సర్వజగత్తుయొక్క సృష్టిస్థితిలయములు పరశమ్భువుయొక్క సృష్టిస్థితి లయములే అని తెలియుచున్నది. పరశమ్భువునకు బ్రహ్మాండమే శరీరము. దాని సృష్టి స్థితిలయములు నిరంతరముగా జరిగిపోవుచుండును. జీవుల కర్మపరిపాకమున అవి జరిగిపోవుట చేత పరశమ్భువు నిమిత్తమాత్రుడై సాక్షిగా నుండును. కావుననే పరశమ్భువు అగుణుడని జ్ఞాని భక్తులు స్తుతించెదరు. పరశమ్భువు సగుణుడని అంగీకరించినను ఆతని

ఆ సగుణత్వము ఆతని నిర్గుణత్వమునకు విరోధికాదు. గుణములు కూడ ఆతని కభిన్నములే. మాయయే ఆతనికి భిన్నముకానప్పుడు మాయామయగుణము లెట్లు ఆతనికి భిన్నములగును. భిన్నములుగాని గుణములాతని అగుణత్వమునెట్లు విరోధించును. ఇంతకు ఈ మాయ కార్యానుమేయము జగమును చూచువారికే దాని సృష్టిస్థితిలయము లెట్లు జరుగు చున్నవను ప్రశ్నము కలుగును. జగము యొక్క ఆధారమైన పరశమ్భువునే (యథార్థ స్వరూపమునే) చూచువారికి అనగా యథార్థరజ్జువును చూచువారికి సర్పజ్ఞానముండనే ఉండనట్లు జగత్తు యొక్క దర్శనమే ఉండదు. అప్పుడాభక్తులు అగుణుడని కాక ఏమని స్తుతించగలరు. మట్టి కార్యమైన కుండ మట్టియేయైనట్లు పరశమ్భుకార్యమైన జగము పరశమ్భువే అగుచున్నది. కార్యకారణభావము లేనప్పుడు రజ్జువివర్తమైన సర్పము కూడ రజ్జువే అయినట్లు జగము పరశమ్భువే అగుచున్నది.

**ఆదిని మాయ మన్మథుడ వంతట సృష్టి విధాతృమూర్తి దా**
**మోదరమూర్తి రక్ష, హరమూర్తి లయమ్మునఁదాల్తు నిత్యమై**
**యాదిగురు ప్రమాతృమయమైన స్వమూర్తి మహత్తుచేత స**
**త్త్వాది గుణావృతుండవు యథార్థత నిర్గుణుఁడంద్రు నిన్ విభూ!**

**అవతారిక :** పై శ్లోకమున ఇచ్ఛాశక్తి ప్రథమకామరూపమని చెప్పబడినది. ఈ శ్లోకము సృష్టిస్థితిలయములన్నియు తదధీనములే అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఇచ్ఛాశక్త్యా యయా తత్కవలితమఖిలం తే జగజ్జాలరూపం**
**సృష్టిస్థిత్యంతవృత్త్యా సరసి జలధరాసారతుల్యాత్మగత్యా ।**
**సైవానంతాంతరంగప్రసరబహువిధానేకసంకల్పభావై-**
**రావిర్భూయ త్వదంగప్రకటనకృతయే బోధసింధుస్త్వమేవ ॥ 34**

**ప్రతిపదార్థము :** సృష్టిస్థిత్యంతవృత్త్యా = సృష్టిస్థితిలయములందు వృత్తిగల, సరసి = సరస్సునందు, జలధరాసారతుల్యాత్మగత్యా = మేఘముల జడివానతో సమానమైన తనగతిగల, యయా = ఏ, తే = నీ యొక్క, ఇచ్ఛాశక్త్యా = ఇచ్ఛాశక్తి చేత, అఖిలమ్ = సమస్తమైన, జగజ్జాలరూపమ్ = జగజ్జాలమను రూపము, కవలితమ్ = మ్రింగబడినదో, సా ఏవ = ఆదియే, అంతరంగ ప్రసర బహు విధానేకసంకల్పభావైః = అంతఃకరణమునందు ప్రసారముగల అనేక విధములైన సంకల్పములచేత భావములచేత, త్వదంగ ప్రకటన కృతయే = నీ అంగముల ప్రకటించుట అను పని కొరకే, ఆవిర్భూయ = ఆవిర్భవించి,

విరాజతే = ఒప్పుచున్నది, త్వమ్ ఏవ = నీవే, బోధ సింధుః = జ్ఞాన సముద్రుడవు.

**తాత్పర్యము :** సముద్రము నుండి సిద్ధమైన మేఘముల నుండి ఏర్పడిన వానను సముద్రమే మ్రింగునట్లు, జ్ఞాన సముద్రరూపుడవైన నీ నుండి బయలుదేరిన నీ జగద్రూపమును సృష్టిస్థితిలయముల నొనర్చు ఇచ్ఛాశక్తియే అంతరంగము నందు ప్రసరించు ననేక సంకల్పభావములలో నీ యంగముల ప్రకటించుట కొఱకే ఆవిర్భవించి నీ యొక్క జగద్రూపమును మ్రింగివేయు చున్నది.

**వివరణము :** జగత్తుయొక్క సృష్టిస్థితిలయము లన్నియు పరశమ్భువు యొక్క ఇచ్ఛాశక్తి వలననే ఏర్పడుచున్నవి. సృష్టి జరుగవలెనను ఇచ్ఛతో జగత్తు నిర్మింపబడును. అది కొంత కాలము నిలిచి యుండవలెనను ఇచ్ఛతో కొంత కాలము నిలచి యుండును. ఇది నశింపవలెనను ఇచ్ఛతో నశించి పోవును. ఇది సమష్టి మాట, జగము సృష్టి మొదలు లయము వరకు నిలిచి యుండు స్థితికాలములను జీవుల సృష్టిస్థితిలయములు జరుగుచునే యుండును. సృష్టిస్థితిలయక్రియలు నిరంతరము ప్రవృత్తము లగుచునే యుండును. సముద్రము వంటి ఈ బ్రహ్మాండదేహమున సృష్టిస్థితిలయములు జరుగుచున్నను, బ్రహ్మాండమునందు పరిణామము కనబడదు. వేలకొలది జల జంతువులు పుట్టిగిట్టుచున్నను సముద్ర మేక రూపముగానే కనిపించును గదా! మహదాదిక్షిత్యంత తత్త్వములతో నేర్పబడిన ఈ బ్రహ్మాండమున జీవుల సృష్టిస్థితిలయములు నిరంతరము ప్రవృత్తము లగుచునే యుండును. మహాప్రలయమున మాత్రమే ఈ ప్రవృత్తి ఆగిపోవును.

**నీదు జగత్స్వరూపమున నిండు సరస్సున వృష్టిరీతి ను**
**త్పాదన రక్షణాంతగతి వర్తిలు నిచ్ఛ యనంత హృత్ప్రసా**
**రోదిత నైకభావముల నొందు ఁద్వదంగమునే వెలార్పగా**
**నీదగు తత్త్వమొక్కటియ నిర్మలబోధ మహార్ణవమ్మగున్.**

* * *

**-- జ్ఞానశక్తి స్కంధరశ్మి ప్రకరణమ్ --**

**అవతారిక :** బ్రహ్మాండ(జగ)ముయొక్క సృష్టిస్థితిలయహేతువైన **ఇచ్ఛాశక్తి వైభవము** పూర్వప్రకరణమున చెప్పబడినది. ప్రమేయ ప్రమాతృ ప్రమాణ రూపమైన **జ్ఞానశక్తి వైభవము** ఈ ప్రకరణమున చెప్పబడుచున్నది. ముందుగా పరశమ్భువు బోధసింధువైన (పూర్వశ్లోకమున చెప్పబడిన) జ్ఞానశక్తి వేనిని వ్యక్తీకరించునో ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ సంవేద్యం తత్త్వజాలం పరశివధరణీమూలపారం విచిత్రం**
**కర్మానంతప్రపంచం నిరుపమమహిమానాదిమధ్యావసానః ।**
**బ్రహ్మానందామృతాబ్ధిః సమరసవిధునా జృమ్భితస్వాత్మభాసో**
**హేతుత్వేన ప్రబోధజ్వలన! తవ మహాజ్ఞానశక్తిం వ్యనక్తి ॥ 35**

**ప్రతిపదార్థము :** ప్రబోధజ్వలన! = ప్రబోధాగ్నిరూపా!, పరశివధరణీమూలపారమ్ = పరశివుడు మూలమై ధరణి చివఱగాగల, సంవేద్యమ్ = చక్కగా తెలియదగిన, విచిత్రమ్ = విచిత్రమైన, తత్త్వజాలమ్ = తత్త్వముల సమూహము, అనంత ప్రపంచమ్ = అనంత విస్తారముగల, కర్మ = కర్మ, హేతుత్వేన = కారణమగుటచేత, నిరుపమమహిమా = సాటిలేని మహిమగల, అనాదిమధ్యావసానః = ఆదిమధ్యాంతములు లేని, సమరసవిధునా = సమరస చంద్రుని చేత, జృమ్భితస్వాత్మభాసః = విజృంభించిన స్వాత్మ ప్రకాశముగల, బ్రహ్మానందామృతాబ్ధిః = బ్రహ్మానందమను సముద్రము, తవ = నీ యొక్క, మహాజ్ఞానశక్తిమ్ = గొప్పదైన జ్ఞానశక్తిని, వ్యనక్తి = వ్యంజింపజేయుచున్నది.

**తాత్పర్యము :** ఓ ప్రబోధాగ్నిరూపా!, శివాదిక్షిత్యంతమైన విచిత్రమైన సంవేద్యమైన తత్త్వజాలమును అనంత విస్తారమైన కర్మను వానికి హేతువగుటచేత సాటిలేని మహిమగల ఆదిమధ్యాంతములు లేని, సమరస చంద్రుని చేత విజృమ్భించిన స్వాత్మప్రకాశముగల బ్రహ్మానంద సముద్రము – నీ మహాజ్ఞానశక్తిని వ్యంజింప జేయుచున్నది.

**వివరణము :** శివుడు తత్త్వముల కాది. పరశమ్భువు తత్త్వాతీతుడు. పరశమ్భువు ఇచ్ఛా జ్ఞానాది శక్తుల కధిష్ఠానము. జ్ఞేయముల నెఱిగినప్పుడే జ్ఞానశక్తి అనుమేయమగును. ఆ జ్ఞేయములే సంవేద్యములని శ్లోకమున చెప్పబడినవి. అవి శివాదులు క్షిత్యంతములు నైన ముప్పది యాఱు తత్త్వములు. అవి జ్ఞానశక్తిచే సంవేద్యములై జ్ఞానశక్తి ఉనికిని వ్యంజింప జేయును. పరశమ్భువు నందు బ్రహ్మానందామృత సముద్ర మున్నది. కాదుకాదు పరశమ్భువే బ్రహ్మానందామృత సముద్రము. ఆ సముద్రము సమరసమను చంద్రునిచే విజృంభింప జేయబడును. చంద్రోదయముచే సముద్రము పొంగుట లోక ప్రసిద్ధము. కవి సమయ ప్రసిద్ధము. **సమరస** మనగా ఏకముగా నుండు రసము. ఒక విషయము చర్వణాగోచర మైనప్పుడు రసముగా రూపొందును. అచ్చట చర్వణము వేఱు, విషయము వేఱుగా నుండును.బ్రహ్మానందము నిర్విషయము. అది ప్రపంచ విషయములకు సంబంధించిన ఆనందము (సుఖము) కాదు. విషయములను విసర్జించిన ఆత్మ యొక్క స్వరూపము. అప్పటి ఆనందము అమృతము త్రాగినప్పటి ఆనందము నతిశయించును. ఐనను

అమృతముతో పోల్చబడినది. లోకమున అమృతమును మించిన సుఖ హేతువైన రసము మరొకటి లేదు కావున ఆ అమృతమునే ఇచ్చట ఉపమానము గా స్వీకరించుట జరిగినది. 3. ఆ బ్రహ్మానంద మను అమృత సముద్రము సమరస చంద్రునిచే విజృంభింపజేయబడి అనగా ఏకరూపమైన నిర్విషయమైన స్వాత్మ భాసముకలిగి యుండును. తనకు తానే విషయముగా నుండు ఆ స్థితి చంద్రునితో పోల్చబడినది. ఆ స్వాత్మభాసము ఆ నిర్విషయస్థితిచే విజృంభించును. 4. వాస్తవమునకు ఆత్మయందలి భాసము స్థితి ఆనందము వేరైనవి కావు. అట్లే సత్తజ్ఞానానందములు ఏకరూపములు. సుఖానుభవము లౌకికమైనను జ్ఞానరూపమే. పారమార్థిక సుఖము అనబడు ఆనందానుభవము కలుగుట జ్ఞానశక్తి ఉన్నదనుటకు నిదర్శనము. ఈ విధముగా తత్త్వములు సంవేద్యములై బ్రహ్మానందము సంవేదనరూపమై జ్ఞానశక్తిని వ్యంజింపజేయును. 5. విషయజ్ఞానము కర్మరూపము. అంతకు ముందులేక విషయమదృశ్యమై ఉండును. విషయోపస్థితి సమకాలమున విషయ జ్ఞానము కలుగును. అనంతరము జ్ఞానాంతరముచేతగాని, నిద్రచేతగాని, నిర్విషయత్వముచేత అనగా విషయభావముచేతగాని విషయజ్ఞానముయొక్క క్రియా (కర్మ) రూపత్వమును చెప్పుచున్నవి. భగవద్గీతలో కూడ **'జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా'** అను త్రిపుటిని కర్మచోదనగా చెప్పినది. అందువలన ఈ శ్లోకము అనంతముగా విస్తరించిన కర్మ జ్ఞానశక్తియొక్క వ్యక్త నొనర్చుచున్నదని చెప్పబడినది. మానసిక వ్యాపారరూపమైన ప్రవృత్తి జన్యమైనందున ఇది క్రియా(కర్మ) రూపము. ఇది కూడ ఆత్మయందలి నిత్యజ్ఞానశక్తియొక్క ఉనికిని వ్యంజింపజేయుచున్నది. అది గాక కర్మ జ్ఞానపూర్వకముగానే జరుగును. కర్మ (కార్య) విషయకజ్ఞానములేని కర్తచేత కార్యము నిష్పన్నము కాదు కావున కర్మయు జ్ఞానశక్తిని వ్యక్తమొనర్చును. 6. స్వాత్మభాసరూపమైన బ్రహ్మానందామృతసముద్రమునకు ఆది మధ్యాంతములు లేవు. విషయావభాసకాలమున తత్పూర్వము తదనంతరము కూడ ఆది ఉండుటచే నది ఆదిమధ్యాంతరహితమని చెప్పబడినది.

**శివుడగునాది భూమి తత చిత్రము వేద్యము తత్త్వజాలమున్**
**సువిదిత కర్మ విస్తృతము శుద్ధము నీదగు జ్ఞానశక్తి వై**
**భవమును వ్యక్తమున్ సలుపు బ్రహ్మ సుఖామృతసాగరమ్ము లా**
**స్తవ మతిశోభమై సమరస ప్రకటేందు విజృంభితమ్మునై.**

**అవతారిక :** పై శ్లోకమున జ్ఞానశక్తి వ్యంజక సామగ్రి చెప్పబడినది. ఈ శ్లోకమున జ్ఞానము యొక్క ఏకత్వము చెప్పబడుచున్నది.

శ్లో॥ గోజం క్షీరం యథైకం ద్యుతివివిధగుణస్వేంద్రియార్థప్రకాశో-
ఽప్యేకస్తద్వర్ణనానారుచిరధికరణస్యైకతా కారణేన ।
నీలాద్యాభాసబుద్ధ్యా నభసి పరివృతో ధూమభాసైరివాగ్నిః
ప్రాచుర్యేణ ప్రదీప్తః పరమశివ! తతః సత్యవిశ్వాత్మకస్త్వమ్ ॥ 36

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరమశివా!, యథా = ఎట్లు, గోజమ్ = గోవులనుండి పుట్టిన, క్షీరము = క్షీరము, ఏకమ్ = ఏకమో, తథా = అట్లు, ద్యుతివివిధగుణ స్వేంద్రియార్థప్రకాశః అపి = కాంతి యొక్క వివిధగుణములుగల స్వేంద్రియార్థముల ప్రకాశము కూడ, ఏకః = ఏకమే, తద్వర్ణ నానారుచిః = ఆ వర్ణముల నానా విధములుగా భాసించుట, అధికరణస్య = ఆధారము యొక్క, ఏకతా కారణేన = ఏకత్వ కారణముచేత ధూమభాసైః = ధూమకాంతుల చేత, నభసి = ఆకసము నందు, పరివృతః = చూపబడిన, అగ్నిః ఇవ = అగ్ని వలె, నీలాద్యాభాస బుద్ధ్యా = నీలాదుల ఆభాసబుద్ధితో, ప్రాచుర్యేణ = అధికముగా, ప్రదీప్తః = వెలిగినవాడవు, తతః = అందువలన, త్వమ్ = నీవు, సత్యవిశ్వాత్మకః = సత్యమైన విశ్వమే రూపముగా గలవాడవు.

**తాత్పర్యము :** వేరు వేరు గోవులలో క్షీర మేకరూపము, అట్లే కాంతి యొక్క వివిధములైన గుణముల వంటి నీల పీతాదిరూపములతోకూడిన (ఇంద్రియార్థములు భిన్నములైనను) వాని ప్రకాశ మొక్కటే. ఆ వర్ణముల నానా విధములుగా భాసించుట ఆధారము యొక్క ఏకత్వకారణముచేత ఏర్పడును. ఆకసమందు పొగలకాంతులచే నీలాద్యభాసము బుద్ధి కలిగినను ఏకమైన అగ్నివలె విశ్వమునందు భేదములున్నను అధికముగా మెలగుచున్న నీవొకడవే.

**వివరణము :** నల్లని ఎఱ్ఱని రంగులు గల గోవులు భిన్నభిన్నము లైనను వాని పాలన్ని తెలుపే వాని రుచి కూడ ఒకటే. ఇంద్రియార్థములు అనగా ఇంద్రియములచే తెలియ దగిన విషయములలో ముఖ్యముగా చక్షురింద్రియ విషయము లన్నియు కాంతిలోని వేఱు వేఱు గుణములైన వేఱు వేఱు ఎఱ్ఱని పచ్చని మొదలైన రంగులు వేఱైనను వాని జ్ఞానములో భేదముండదు. రక్తఘటము రక్తఘటము గానే తెలియబడును. పీతఘటము పీతఘటముగానే తెలియబడుచున్నది. అనగా విషయములలో భేదము లున్నను విషయమును ప్రకాశింపజేయు తేజములో భేదము లేదు. నానావర్ణముల కేకాధికరణమైన తేజమే వర్ణనానావిధ భాసమునకు కారణము. తేజము లేనప్పుడు, స్పష్టముగా లేనప్పుడు వర్ణనానావిధ భాసముండదు. అన్నియు అన్యవర్ణముగా గాని అవర్ణముగా గాని కన్పించును.

మొదటి దృష్టాంతములో ఆధేయమైన క్షీరము ఏక రూపము. ఆధారములైన గోవులు భిన్నరూపములు. రెండవ దృష్టాంతములో ఆధారమైన తేజమొకటే. ఆధేయములైన ఘటాదుల వర్ణములు భిన్నభిన్నములు, ఆధారమై తేజ ముండుటచేతనే స్పష్టముగా నుండుట చేతనే వాని రంగులు వేఱు వేఱుగా స్పష్టముగా కనబడుచున్నవి. 2. ఆకాశమున పొగల వేఱు వేఱు కాంతులు జిమ్ముచున్న దగ్నియే. అప్పు డగ్నియే భిన్న భిన్నముగా దర్శింపబడుచున్నను ధూమముల భాసము లగ్నియం దారోపింపబడినవే కాని అవి అగ్ని యొక్క ప్రకాశమున భేదములు కల్పింప జాలవు. నీలాద్యాభాసబుద్ధిచే అగ్నియొక్క ఏకత్వమునకు భంగము రానట్లు విశ్వమునందలి భేదముచే విశ్వాత్మునిలో భేదముండదు. ఈ దృష్టాంతము (అగ్నియందు నీలాద్యాభాస బుద్ధి మిథ్యారూపమే యైనట్లు) విశ్వము నందలి భేదము మిథ్య. అది విశ్వాత్మునిలో భేదము కలిగింపజాలదని చెప్పును. కాని **సత్యవిశ్వాత్మకస్త్వమ్** అనుటచేత విశ్వము సత్యమని స్పష్టమగుచున్నది. 3. శైవశాక్తాద్వైతములలో బ్రహ్మము విశ్వము (జగము) రెండును సత్యములే అగుచో అద్వైత మెట్లు అను ప్రశ్నము కలుగును. సమాధానము బ్రహ్మము విశ్వముగానే ప్రకాశించుచున్నది. బ్రహ్మము సత్యమే, విశ్వమును సత్యమే వాని భేదము మాత్రము మిథ్య. భేదము మిథ్యయగుటచే బ్రహ్మవిశ్వములకేకత్వము కాగా అద్వైతము సిద్ధమగుచున్నది. అగ్ని సత్యమే, అగ్ని జన్యమైన ధూమము సత్యమే. ధూమ భాసములు వాస్తవమునకు అగ్నిభాసములే అయినను అగ్నిభాసమువలె ఏకరూపములు కావు. పరశమ్భువును అంతరంగ మందు సచ్చిదానంద రూపముగా దర్శించుట, ఆయన యొక్క ఏకరూపమును దర్శించుట అంతరంగదర్శనము. విశ్వములో భిన్నభిన్న రూపముగా దర్శించుట పరశమ్భువు యొక్క బహిరంగ దర్శనము. బహిరంగ దర్శనము నందలి భిన్నరూపత అంతరంగ దర్శనమందలి ఏకరూపత. ఈ దృష్టితో **సత్యవిశ్వాత్మకస్త్వమ్** అని చెప్పబడినది. మొత్తముమీద ఆధారాధేయములు రెండును సత్యములే. కారణ కార్యములు రెండును సత్యములే, వాని భేదము మిథ్యయని చెప్పుటకు ఈ శ్లోకమున భిన్నభిన్న దృష్టాంతములు చెప్పబడినవి. మొదటి దృష్టాంతము వలన ఆధేయమైన క్షీరము గోజన్యమే కావున వానికి కార్యకారణ భావసంబంధముకూడ నున్నది అనియు చెప్పబడినట్లైనది.

**ధవలము స్వాదుతాగుణయుతమ్మగు క్షీరమువోలె వర్ణముల్**
**వివిధములైన కాంతివలె పెక్కులు నీలముఖ భ్రమల్ గల**
**ట్టివి భు నభమ్మువోలె నొకటే యనలమ్ము బహుప్రభాయుతం**
**బవని వెలుంగునట్లు శివ యొాదువు సర్వజగన్మయాత్మనే.**

**అవతారిక :** పై శ్లోకమున శ్రీశమ్భువుయొక్క **సత్యవిశ్వాత్మత** చెప్పబడినది. ఈ శ్లోకమున దానితోపాటు శ్రీ శమ్భువుయొక్క సంసారిత్వమునగూడ **ఆయన మాయ** ప్రసరింప జేయుచున్నట్లు చెప్పబడినది.

**శ్లో॥ నిత్యాఖండప్రకాశాదమలతరవిభో! త్వత్సకాశాత్కదాచి-**
**న్మాయా సంజాయమానా త్రిగుణముఖగణవ్యక్తశక్తిస్వభావా ।**
**సిద్ధాంతైర్భిన్నమానప్రమితిభిరసుఖైర్భేదబుద్ధిప్రధానైః**
**సంసారిత్వం ప్రసార్య ద్రఢయతి భవతస్సత్యతాం వేదవిద్యా ॥ 37**

**ప్రతిపదార్థము :** అమలతరవిభో! = మిక్కిలి స్వచ్ఛుడవైన ఓ ప్రభూ!, నిత్యాఖండ ప్రకాశాత్ = నిత్యము అఖండమునైన ప్రకాశములైన, త్వత్సకాశాత్ = నీ సన్నిధి నుండి, సంజాయమానా = పుట్టుచున్న, మాయా = మాయ, త్రిగుణముఖ గణవ్యక్త శక్తి స్వభావా = త్రిగుణములు కలవారు మొదలైన గుణముల చేత వ్యంజింప జేయబడిన శక్తి స్వభావము గలదై యున్నది, భిన్నమాన ప్రమితిభిః = వేఱైన ప్రమాణముల నుండి పుట్టిన ప్రమలుగల, అసుఖైః = దుఃఖరూపములైన, భేద బుద్ధి ప్రధానైః = భేదబుద్ధి ప్రధానములైన, సిద్ధాంతైః = సిద్ధాంతములచేత, సంసారిత్వమ్ = సంసారిత్వమును, ప్రసార్య = విస్తరించి, వేదవిద్యా = వేదవిద్య, భవతః = నీ యొక్క, సత్యతామ్ = సత్యత్వమును, **ద్రఢయతి** = దృఢమొనర్చు చున్నది.

**తాత్పర్యము :** బ్రహ్మవిష్ణుమహేశాదిరూప త్రిమూర్త్యాదిగణములచేత మాయయొక్క శక్తి స్వభావము వ్యక్తమగును. ఆ మాయవలన దుఃఖరూపములైన వివిధ ప్రమాణప్రమేయ ప్రమితులు గల భేదబుద్ధి ప్రధానములైన వివిధ సిద్ధాంతముల ననుసరించిన జీవుల సంసారిత్వమే విస్తరించుచున్నది. ఇట్లు పరమేశ్వరుని నుండి పుట్టు మాయ తన విలాసమున పరశమ్భువుయొక్క సంసారిత్వమును చూపుచుండగా దానిలోని ఏకదేశమైన వేదవిద్య పరమేశ్వరుని సత్యత్వమును దృఢ పఱచుచున్నది.

**వివరణము :** సాధారణముగా అద్వైత ప్రక్రియలో మాయ అనాది కావున దానికి పుట్టుక లేదని చెప్పబడును. ఈ శ్లోకమున **మాయ పుట్టుచున్నదని** చెప్పబడినది. అనాదిత్వము బ్రహ్మమున కున్నట్లు మాయకును ఉన్నదని చెప్పుటచే మాయకు బ్రహ్మసామ్యము కలుగును. దీని నిష్టపడని కొన్ని పురాణములలో మాయ యని చెప్పబడు అవ్యక్తము పరమేశ్వరుని నుండి పుట్టినట్లు చెప్పబడినది. **లలితాసహస్రనామభాష్యమున** భాస్కరులును ఈ

విషయమును ప్రస్తావించినారు. భాస్కరాది శాక్తేయులు మాయామయమైనను జగము సత్యమందురు. కావున మాయయును సత్యమే. అదియే పరశమ్భువునకు సంసారిత్వమును కలిగించును. 2. వేదమనాది యని మీమాంసకుల మతము. వేదాంతులలో ఏకదేశులైన కొందఱు వేదము బ్రహ్మకృతమందురు. ఉచ్ఛ్వాస నిఃశ్వాసములు జీవుని నుండి పుట్టుచున్న లోకానుభవము కూడ ప్రసిద్ధమైనందున బ్రహ్మము యొక్క ఉచ్ఛ్వాసనిఃశ్వాసరూపమైన వేదము కూడ బ్రహ్మము నుండి పుట్టిన దందుఱు. కావున వేదవిద్యకూడ బ్రహ్మము నుండి పుట్టుచున్నట్లు ఈ శ్లోకమున చెప్పబడినది. సత్య బ్రహ్మ ప్రతిపాదకమైన వేదవిద్యయు సత్యమే. వేదవిద్యయే అసత్యమైనప్పుడు తత్ప్రతిపాద్య బ్రహ్మము సత్యమెట్లగును. కావున సత్యమైన వేదవిద్య ఇంద్రియాదిగోచరము కాని బ్రహ్మము సత్యమే యని చెప్పి బ్రహ్మము యొక్క సత్యత్వమును దృఢపఱచుచున్నది. అట్లే కుండను చూచి కుమ్మరి యున్న ట్లూహించు కొందుము. జగమును చూచిన దానికొక కర్త యుండునను అనుమానప్రమాణముచే బ్రహ్మము యొక్క సత్యత్వము తెలియబడినను ఆ అంశమును వేదవిద్య మరల చెప్పుటచే ఆ వేదవిద్య భ్రమ ప్రమాదాది దోషరహిత బ్రహ్మము నుండి పుట్టినదగుటచే బ్రహ్మము (పరశమ్భువు) యొక్క సత్యత్వము నా వేదవిద్య దృఢపఱచుచున్నది అని ఈ శ్లోకమున చెప్పబడినది. 3. అయినను ఈ శ్లోకము అసుఖములైన ప్రమాణ ప్రమేయ ప్రమితి భేద భిన్నములైన భిన్నభిన్నములైన సాంఖ్యాది సిద్ధాంతములు ప్రతిపాదించు జీవ జగదీశ్వర భేదము ననుసరించు వారికి సంసారిత్వము పెఱుగునేకాని తఱగదని ఆ సిద్ధాంతము లసుఖములని నిందించి అభేదమును ప్రతిపాదించు వేదవిద్యను కొనియాడుచున్నది. మాయ ఈశ్వరుని సంసారిత్వమును ప్రసారింపగా వేదవిద్య దానిని వృత్తిని చేయు పరశమ్భువు సత్యత్వమును దృఢపరుచుచున్నది. ఇట్లు పరశమ్భువు మాయచే జీవిగా సంచరించుచు తిరిగే వేదవిద్యద్వారమున తన స్వస్వరూపమును గ్రహించి పరశంభుత్వము నందుకొను ననుచున్నది. ఇట్లు **జీవేశ్వరైక్యము ఈ శ్లోకమున చెప్పబడినది.** లోకమున దృశ్యమైనది జగత్తు. ఈశ్వరు దదృశ్యుడు. అవి రెండు సత్యములే. వీని భేదము మాత్రము మిథ్య. భేదమునకే మిథ్యాత్వము నంగీకరించుటచే నీ శ్లోకమున అద్వైతమే ప్రతిపాదింపబడిన దనుట సూక్ష్మేక్షికతో గ్రహింప దగియున్నది. **చిద్వివర్తః ప్రపంచోఽయమ్** అనునది శంకరాద్వైత సిద్ధాంతము కాగా **చిద్విలాసప్రపంచోఽయమ్** అనునది శాక్తశైవాద్వైత సిద్ధాంతము. వివర్తవాదము, జగన్మిథ్యాత్వమను విలాసవాదము జగదీశ్వర భేద మిథ్యాత్వమును చెప్పును. జగదీశ్వర జీవులు అభిన్నులే యనుట పై మూటిలో ఏదియు

మిథ్య కాదనుట శైవా (శాక్తా) ద్వైతసిద్ధాంతము. 4. ఇంతకు మాయ యననేమి? అది యొక శక్తి. శక్తి అప్రత్యక్షము కాని అది యొక కార్యము నిర్వర్తించును. నిర్వర్తించిన పిమ్మట అది ఉన్నట్లు వ్యక్తమగును. కార్యము నిర్వర్తించుటకు పూర్వము అది ద్రవ్యముతో నేకీభూతమై యుండును. ద్రవ్యము నందది యున్నట్లు ప్రత్యక్షముగ తెలియబడదు కాని ఆ ద్రవ్యము వలన నొక కార్యము జరిగినదనగా ఆ కార్యమును నిర్వర్తించు శక్తి ఆ ద్రవ్యమున నున్నది అని అనుమానింప బడవలసినదే కావున ఆ శక్తి ఏ ద్రవ్యమున ఉన్నట్లు చెప్పలేము. అందుచే శంకరాద్వైతులు దానిని అనగా ఆ శక్తిని ఆ మాయను అనిర్వచనీయమనిరి. మాయను శక్తి అనుటకూడ శంకరాదద్వైతుల కిష్టమే. శ్లోకమున మాయకు **త్రిగుణముఖగణవ్యక్తశక్తిస్వభావా** అను విశేషణమున్నది. త్రిగుణులనగా త్రిమూర్తులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు. వారు రజస్సత్త్వ తమోగుణములచే జగముల సృష్టిస్థితిలయముల నొనర్తురు కావున వారు త్రిగుణులనబడినారు. వీరు ముగ్గురు త్రిగుణ గణము. అట్లే పంచ భూతములు మరొక గణము. ఏకాదశేంద్రియములు మరొక గణములు. ఇట్టివే ప్రాణోపప్రాణ పంచకాదు లెన్నో గణము లున్నవి. ఈ గణములు అన్నియు మాయికములు మాయోత్పన్నములు. మాయ వీనిని పుట్టించు శక్తి. వీని వలన మాయ శక్తి అని తెలియును. అనగా త్రిగుణముఖగణముల చేత తెలియ అనుమానింప బడునది శక్తి స్వభావము. శక్తి ద్రవ్యముయొక్క స్వభావమే. ప్రపంచముల పుట్టించి కాపాడి చంపుట పరశమ్భువు యొక్క స్వభావము. ఈ స్వభావము మాయ అని శక్తి అని చెప్పబడును. ఈ శ్లోకమున మాయ బ్రహ్మము యొక్క త్రిగుణముఖ గణవ్యక్తశక్తిచే ఆ బ్రహ్మము నందు గల శక్తిస్వభావము అనుమానింపబడుచున్నదని చెప్పబడినది. అంతేకాదు మాయ ఆ శక్తి స్వభావరూపమనియు తెలియబడుచున్నది. ఇట్లు వ్యక్త శక్తి స్వభావములు గల మాయ పుట్టి బ్రహ్మముయొక్క సంసారిత్వమును ప్రసరింపజేయగా తదేక దేశమైన వేదవిద్య తిరిగి బ్రహ్మముయొక్క స్వస్వరూపమును అనుభవములోనికి తెచ్చు చున్నది. మఱియు **'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే'** అను శ్రుతి ననుసరించి ఆ మాయయే అవిద్య యని (సంసారిత్వమును విస్తరించు సమయమున) స్వరూపము ననుభవింప జేయునప్పుడు విద్య యనియు పిలువబడును. ఇంకను పెక్కు ద్రవ్యములలోని వివిధ శక్తులన్నియు ఆ పరాశక్తి యొక్క వైవిధ్యములని యెఱుగవలెను. ఈ సిద్ధాంతమున మాయ యనునది మూలశక్తి కాదు. పరాశక్తి మాత్రము మూలశక్తి. **పరాశక్తి గల పరమేశ్వరుని నుండి మాయ పుట్టుచున్నదని** ఈ శ్లోకము వలన తెలియుచున్నది.

**ఎన్నడొ నీ ప్రకాశమున నేర్పడు మాయ గుణత్రయాది స**
**మ్పున్న నిజాత్మశక్తికత భావిత భేదమతి ప్రధానముల్**
**భిన్నసుమానమేయమితి విస్తృత దుఃఖకరోక్తిజాలముల్**
**పన్నుచు సంసృతిన్ బెనుచు-త్వత్పరసత్యత ఁదెల్పు వేదముల్.**

**అవతారిక :** పై శ్లోకమున చెప్పబడిన దంతయు నొక పక్షము. ఈ క్రింది శ్లోకమున మరొక పక్షము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అన్యః పక్షోఽథవాత్ర ప్రవిమలకలనానంతశక్తిప్రకాశః**
**సత్యాఖ్యః సోఽపి యత్ర ప్రవిలయమాయతే శూన్యమార్గే తదాత్మా ।**
**యౌష్మాకః సత్యభావః స చ నిజమహసాం కామరూపాత్మమాయా-**
**ముత్పాద్యైతత్ ప్రపంచం ఘటయతి తదిదం వ్యశ్నుషే స్వాత్మయోనే! ॥ 38**

**ప్రతిపదార్థము :** స్వాత్మయోనే = ఓ స్వాత్మయోనీ!, అథవా = లేక, అత్ర = ఈ సిద్ధాంతమున, అన్యః = మరియొక, పక్షః = పక్షము (అస్తి = కలదు), యత్ర = ఏ, శూన్యమార్గే = శూన్యమార్గమున, ప్రవిమలకలనానంతశక్తి ప్రకాశః = స్వచ్ఛతా సంయుక్తి అనంతశక్తి ప్రకాశమును గల, తదాత్మా = దాని ఆత్మ, ప్రవిలయమ్ = ప్రలీనతను, ఆయతే = పొందునో, సః అపి = అది (శూన్యమార్గము) కూడ, సత్యాఖ్యః = సత్యమను పేరు గలది, యౌష్మాకః = మీకు సంబంధించిన, నిజ మహసామ్ = తన కాంతుల, సః = ఆ, సత్యభావః చ = సత్యత్వము కూడ, కామరూపాత్మమాయామ్ = కామరూపమైన ఆత్మమాయను, ఉత్పాద్య = పుట్టించి, ఏతత్ ప్రపంచమ్ = ఈ ప్రపంచమును, ఘటయతి = ఏర్పఱచుచున్నది, తద్ ఇదమ్ = దానిని దీనిని, **వ్యశ్నుషే** = వ్యాపించుచున్నావు.

**తాత్పర్యము :** ఏ ఆత్మయందు మాయపుట్టుచున్నదని పై శ్లోకమున చెప్పబడినదో స్వచ్ఛత (నిర్లేపత) శక్తి ప్రకాశములు కల ఆత్మ ఏ శూన్యమున లీనమగునో ఆ శూన్యము కూడ సత్యమను పేరుగలదే అనునది మరొక పక్షము. నిజ కాంతుల ఆ సత్యభావమే కామరూపాత్మమాయను పుట్టించి ఈ ప్రపంచము నేర్పరచుచున్నది. దానిని (సగుణమును), దీనిని (నిర్గుణమును) ఓ ఆత్మయోనీ! నీవు వ్యాపించుచునే యున్నావు.

**వివరణము :** 1. **మాయపుట్టుక కలది.** అని పై శ్లోకమున చెప్పబడినది. అది ఎచట పుట్టినది? ఆత్మయందు. అనగా ఆ ఆత్మ స్వచ్ఛత గలది. మాయ పుట్టక మునుపు దానిని స్వచ్ఛమనియే భావింపవలెను. మాయ పుట్టిన పిదప దానికి సంసారిత్వమను మాలిన్య

మంటినది. అది పుట్టక మునుపు అది స్వచ్ఛమే. శక్తివ్యక్తమైన దనగా అంతకు ముందు శక్తి యున్నట్లే కదా! ఈ శక్తి కార్యనిర్వర్తనము చేత ఆత్మగూడ ప్రకాశించినట్లైనది. ఈ విధముగా ఆత్మ స్వచ్ఛత, శక్తి, ప్రకాశము కలదైనది. అనగా అది సగుణము అని చెప్పినట్లైనది. ఈ సగుణాత్మ ఏ శూన్యమార్గమున లీనమగునో ఆ శూన్యమార్గము నిర్గుణమే యైనను దానికిని సత్యమనియే పేరు. సగుణ నిర్గుణ స్వరూపములు రెండును సత్యములే. పై శ్లోకమునందు చెప్పబడిన పక్షమున శూన్యము యొక్క అనగా నిర్గుణము యొక్క ప్రస్తావనము లేదు. ఈ శ్లోకమున చెప్పబడిన పక్షాంతరమున **సగుణము నిర్గుణము నందు లీనమగునని** చెప్పబడినది. ఇదియే ఈ రెండు పక్షములకు గల ఒక భేదము. పై శ్లోకమున మాయ త్రిగుణాదివ్యక్త హేతువని చెప్పబడినది. ఈ శ్లోకమున మాయ **కామరూప** అని చెప్పబడినది. ఇది మరి యొక భేదము. **'సోఽకామయత'** అను శ్రుతి కామరూపమాయ బ్రహ్మమునందు పుట్టినదని చెప్పుచున్నది. ఆ కామరూపమాయయే బహుభువన ప్రజననేచ్ఛారూపిణి. అదియే ఈ ప్రపంచమును పుట్టించినది. 2. బ్రహ్మము (పరశమ్భువు) స్వాత్మయోని. తన రూపమైన ప్రపంచమును తననుండి ఉద్భవింపజేసినందున **స్వాత్మయోని** అని ఈ శ్లోకమున సంబోధింప బడినది.

**మఱియొక పక్షముంగల దమంద మహాద్భుత నైజశక్తి సం**
**స్ఫురణము సత్యనామకము శూన్యబలమ్మున డిందు నాత్మ మీ**
**స్వరుచుల సత్యభావమది భావిత కామమయాత్మ మాయయై**
**విరచనసేయు విశ్వమున వెల్గుచునుండెద వాత్మయోనివై.**

**అవతారిక :** పై శ్లోకమున **అసద్రూపమైన శూన్యము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున దృశ్యములైన సదసదానందములకు **పరశమ్భువే నాథుడుగా** బోధింపబడుచున్నాడు.

శ్లో॥ **ఐక్యాచ్చిదహ్లాదయోశ్చేదిదమహమితి ద్వంద్వభావస్య జీవ-**
**బ్రహ్మాదిద్వైతబుద్ధ్యోర్దినకరశశినోరండవిధ్యండయోశ్చ ।**
**ప్రాణాపానాఖ్యవాయ్వోః సుకృతదురితయోస్స్యాద్యదా సామరస్య-**
**ప్రాదుర్భావస్తదా త్వమ్భవసి సదసదానందనాథః పరోఽగ్రే ॥** 39

**ప్రతిపదార్థము :** చిద్హ్లాదయోః = జ్ఞానానందములకు, ఐక్యాత్ = ఐక్యమువలన, ఇదమ్ = ఇది, అహమ్ = నేను, ఇతి = అను, ద్వంద్వభావస్య = రెండింటి ఉనికికి, జీవ బ్రహ్మాదిద్వైతబుద్ధ్యోః = జీవుడు అను బుద్ధి, బ్రహ్మ అను బుద్ధి మొదలగు ద్వైత బుద్ధులకు,

దినకరశశినోః = సూర్యచంద్రులకు, అండవిధ్యండయోః = పిండడాండ బ్రహ్మాండములకు, ప్రాణాపానాఖ్యవాయ్వోః = ప్రాణాపానములను పేర్లుగల వాయువులకు, సుకృత దురితయోః = పాపపుణ్యములకు, యదా = ఎప్పుడు, సామరస్యప్రాదుర్భావః = సామరస్యము యొక్క స్ఫూర్తి, స్యాత్ చేత్ = కలిగినచో, తదా = అప్పుడు, త్వమ్ = నీవు, అగ్రే = తొలుత, సదసదానందనాథః = భావాభావముల యొక్క ప్రభుడవు, పరః = ఉత్కృష్టుడవు, భవసి = అగుచున్నావు.

**తాత్పర్యము :** జ్ఞానానందముల ఐక్యమువలన ఇది నేను, జీవుడు, బ్రహ్మ, మొదలగు ద్వైత బుద్ధులకు సూర్యచంద్రులకు, దేహబ్రహ్మాండములకు, ప్రాణాపానములను పేరుగల వాయువులకు, పాపపుణ్యములకు ఎప్పుడు సామరస్యమావిర్భవించునో అప్పుడు భావాభావములకు ద్రష్టయగుదువు. తొలుతటి ఉత్కృష్టత గల వాడవగుదువు.

**వివరణము : చిత్** అనగా జ్ఞానము, **హ్లాదము** అనగా ఆనందము. అనుకూల విషయజ్ఞానమే ఆనందము కావున జ్ఞానానందములకు చిద్హ్లాదములకు భేదము లేదు. చిద్హ్లాదముల ఐక్యము సామరస్యహేతువు. **ఇదమహమ్ జానామి** అనునది జీవుల విషయజ్ఞానము. ఇందు అహమ్ అనునది జ్ఞాతగా, ఇదమ్ అనునది జ్ఞేయముగా నున్నవి. అహమ్ ఇదమ్ జానామి (నేను దీనిని తెలిసికొనుచున్నాను) అను విషయజ్ఞానములో అహమ్ బుద్ధి, ఇదమ్ బుద్ధి అను రెండు బుద్ధులున్నవి. ఈ విషయమును నేను తెలిసికొన్నాను. (ఘటజ్ఞాతను నేను, ఘటము నా జ్ఞానవిషయము) అను జ్ఞానము పై విషయజ్ఞానానంతరము కలుగును. దీనికి **అను వ్యవసాయము** అని పేరు. దీని యందే ఇదమహమ్ బుద్ధుల ద్వంద్వభావము గోచరమై యున్నది. సాక్షియైన ఆత్మ ఈ జ్ఞాతృజ్ఞేయములకు భిన్నము. జ్ఞేయత్వ జ్ఞాతృత్వములు రెండు పరస్పరాశ్రయములు. అయినను జ్ఞాతృత్వము సాక్షికి సన్నిహితము. అన్ని జ్ఞానములలో భిన్నజ్ఞాతలు సాక్షియందే సన్నిహితులై యుందురు. ఇదమ్ అని చెప్పబడు విషయము, జ్ఞాత అంత సన్నిహితము కాదు. అంతఃకరణము నందు సన్నిహితములైన సుఖదుఃఖాదులు కూడ విషయములే. అవికూడ జ్ఞాత్రపేక్షతో అసన్నిహితములే. అహమ్ బుద్ధికి అహంకారము అని, విషయములైన ఘటపటాదుల జ్ఞానములు వృత్తులు అని పిలువబడును. ఈ సూక్ష్మ పరిశీలనములో ఇదమ్ బుద్ధి అహమ్ బుద్ధి ఏకములే అని తెలియుచున్నది. ఇంతేగాక దృశ్యములన్నియు దృగాధారములే కావున దృగ్రూపమే అని తెలియు చున్నవి. స్థూలమైన ఈ దృగ్దృశ్యభేదమంతరించి అవి రెండు ఏకాత్మలో లీనమగుట లేదా ఏకాకారముగా భాసించుట ఆ రెంటి అనగా ఇదమహమ్

బుద్ధుల సామరస్యము. అహమ్ జీవః అహమ్ బ్రహ్మ అనునది విశేష్య విశేషణ భావము కలిగిన బుద్ధులగుటచే ద్వైతజ్ఞానములే అని చెప్పవలసియున్నది. అట్లే అహమ్ బ్రాహ్మణ ఇత్యాది బుద్ధులుకూడ ద్వైత బుద్ధులే. ఆది పదముచే ఈ ద్వైత బుద్ధులు గ్రహింపవలెను. వీని సామరస్యము ఈ విశేషణ విశేష్య ద్వంద్వము లీనమగును. అహమ్ బ్రహ్మ జానామి అను అనువ్యవసాయమునం దీ సామరస్యము లేదు. బ్రహ్మ విషయక జ్ఞానము బ్రహ్మజ్ఞానము కాదు. జ్ఞానమున బ్రహ్మము విషయము కాజాలదు. **'యస్య మతం తస్యామతమ్'** అను ఉపనిషద్వాక్య మీ యంశమునే చెప్పుచున్నది. సూర్యచంద్రుల సామరస్య మమావాస్యయందు గోచరించును. సూర్య చంద్రులనగా బుద్ధి మనస్సులు. **సంశయాకారవృత్తికి మనస్సు, నిశ్చయాకారవృత్తికి బుద్ధి అను పేర్లు కలవు.** ఇది నిశ్చయము. ఇది సంశయము అను వికల్పములు లేని శుద్ధజ్ఞానము నందీ సూర్యచంద్రుల (మనోబుద్ధుల) సామరస్యముండును. అండము (దేహము) బ్రహ్మాండము (జగము) ఇవి రెండును పాంచభౌతికములని గుర్తించి వాని యందు మమకారము తొలగినప్పుడు ఈ రెంటి సామరస్య మేర్పడును. లోపలకు తీసికొనబడు వాయువునకు ప్రాణమని, బయటకు విడువబడు వాయువునకు అపానము అను పేర్లు గలవు. వీనికి కుంభకమునందు సామరస్యము సంభవించును. కర్తృత్వాభిమానము తొలగినప్పుడు సుకృత దుష్కృత కర్మలతో భేదము తొలగి వాని సామరస్య మేర్పడును. ఇట్లు పైన పేర్కొనబడిన ద్వంద్వముల కన్నింటికి సామరస్యము ప్రాదుర్భవించినచో జీవునకు సదసదానంద నాథత్వము కలుగును. అనగా **పరశమ్భువుతోడి ఐక్యము సిద్ధించును.** 2. **'సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్'** అను ఉపనిషద్వాక్యము ప్రపంచోపరమరూప బ్రహ్మమును సత్తుగా పేర్కొనుచున్నది. ఉన్నవి అని చెప్పబడు పదార్థము సత్తు. లేదు అని చెప్పబడునది అసత్తు. కాని ఒక కాలము నందున్నది. మరొక కాలమునందు లేనిది అయిన వస్తువయిన ఈ ప్రపంచము సత్తుకాదు. అసత్తు కాదు. దీనిని అనిర్వచనీయముగా శాంకరాద్వైతులు పేర్కొన్నారు. అనుకూల సత్పదార్థము యొక్క అనుభవము వలన ఏర్పడు ఆనందము **సదానందము.** ప్రతికూల పదార్థము యొక్క అభావము అనగా లేమిచే కలుగు దుఃఖాభావము **అసదానందము.** ఈ సదసదానందముల రెంటికి నాథుడు, పరశమ్భువు. స్వప్నజాగ్రదవస్థలలో అనుకూల విషయముల అనుభవముచే కలుగు ఆనందము సదానందము. నిద్రావస్థలో ప్రతికూల విషయానుభవ రాహిత్యముచే కలుగు దుఃఖాభావము అసదానందము. ఈ సదసదానందములకు తురీయావస్థలో సాక్షిరూపుడు అయిన **పరశమ్భువు నాథుడు**. పై ద్వంద్వముల సామరస్య మేర్పడినప్పుడు జీవునకు సదసదానంద నాథత్వము అనగా

పరశమ్భుత్వానుభవము సిద్ధించును. ఈ సదసదానందనాథు డొక్కడే పరబ్రహ్మరూపుడు. సృష్టికి అగ్రమున అనగా ముందు ఉన్నట్టి సద్రూపుడు. సృష్టికాలము నందలి బ్రహ్మాదులు అపరబ్రహ్మలు. జీవునకు తురీయావస్థా (సమాధ్యవస్థా) నుభవము కలిగినప్పుడే పరత్వము అనగా పరశమ్భుత్వము సిద్ధించును.

**ఏకత హ్లాదచిత్తులకు నేనిదినాద్వయికిన్ స్వతన్మఖా**
**నేకమతిద్వయమ్ములకు నిన్ద్వరుణాంశుల కబ్జజాండ పిం**
**డాకృతిక ద్వయమ్మునకు ప్రాణమపానము నాగ రెంటికిన్**
**ప్రాకట సామరస్యములు భావన దోప స్ఫురింతు ముందఱన్.**

**అవతారిక :** పై శ్లోకమున ఐక్యదర్శనమువలన **పరశమ్భుత్వప్రాప్తి** చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రకరణోపసంహారము చేయబడు చున్నది.

**శ్లో॥ సేయం విజ్ఞానశక్తిస్తవ శివగురుణా దర్శితా నిత్యశుద్ధా**
**నిర్ద్వంద్వబ్రహ్మతత్త్వం గమయతి సుధియాం సచ్చిదానందపూర్ణమ్ ।**
**లోకే మేయ ప్ర మాతృ ప్రమితిభిరితి చేదర్థితా భిన్నమార్గాః**
**ముద్రా నానాస్వరూపాః ప్రకటయతి ముదాహంకృతిస్థాః పరేశ! ॥ 40**

**ప్రతిపదార్థము :** పరేశ! = ఓ పరేశా!, తవ = నీ యొక్క, నిత్యశుద్ధా = నిత్యశుద్ధమైన, శివగురుణా = శివగురువు చేత, దర్శితా = చూపింపబడిన, సా = ఆ, ఇయమ్ = ఈ, విజ్ఞానశక్తిః = విజ్ఞానశక్తి, సుధియామ్ = పండితులకు, సచ్చిదానందపూర్ణమ్ = సచ్చిదానందముతో నిండిన, నిర్ద్వంద్వ బ్రహ్మతత్త్వమ్ = ద్వంద్వములులేని బ్రహ్మతత్త్వమును, గమయతి = చేకూర్చుచున్నది, లోకే = లోకమునందు, మాతృ ప్రమేయ ప్రమితిభిః = జ్ఞాతృజ్ఞేయజ్ఞానములచే, భిన్నమార్గాః = భిన్న మార్గములు, అర్థితాః ఇతి చేత్ = కోరబడు చున్నవన్నచో, అహంకృతిస్థాః = అహంకారము నందున్న, నానాస్వరూపాః = అనేక స్వరూపములు గల, ముద్రాః = ముద్రలను, ప్రకటయతి = ప్రకటించుచున్నది.

**తాత్పర్యము :** శివగురువుచే చూపబడిన నిత్యశుద్ధమైన ఈ విజ్ఞానశక్తి బుద్ధిమంతులలో సచ్చిదానంద పూర్ణమైన నిర్ద్వంద్వ బ్రహ్మతత్త్వమును ఆవిష్కరించు చున్నది. అనేకములైన ప్రమాతృ ప్రమాణ ప్రమేయ భేదభిన్నములైన మార్గములు లోకమునం దున్నవి. వానిని కోరి అనుసరించు వారికొఱకు విజ్ఞానశక్తియే అహంకృతిలోనున్న భిన్నస్వరూపములైన ముద్రలను ప్రకటించుచున్నది.

**వివరణము :** పరశమ్భువిజ్ఞానమును శివగురువే అనుగ్రహింపవలెను. ద్వంద్వముల సామరస్య ప్రాదుర్భావము ద్వారా నిర్ద్వంద్వ బ్రహ్మతత్త్వ ప్రాప్తి దీనివలన కలుగును. అనగా ఈ విజ్ఞానమే బుద్ధిమంతులలో ఏక బ్రహ్మ విజ్ఞానము కలుగున ట్లొనరించును. ఒకవేళ భిన్న ప్రమాణ ప్రమాతృ విలువలుగల భిన్న భిన్న సిద్ధాంతములు సూచించిన భిన్నమార్గములలోని భిన్నములైన లక్ష్యములను చేరగోరు వారికి కూడ ఈ విజ్ఞానము వారి వారికి కావలసిన నానాస్వరూప ముద్రలను అనగా సుఖసాధనములను వెల్లడి చేయును. బ్రహ్మానుభవమునే కలిగించగలిగిన విజ్ఞానశక్తి సకాములకు వారికోరికలను తీర్చగలిగిన భిన్న మార్గముల చూపగలిగియే యున్నది. 2. **ముదమ్ రాతీతి** = ముద్రా (సంతోషము నిచ్చునది) అను వ్యుత్పత్తి ననుసరించి ముద్రాశబ్దము హస్తపాదాది ముద్రలనే గాక సుఖసాధనములను అర్థమును కలిగియున్నది. ఈ శ్లోకమున **ముద్రాశబ్ద** మా యర్థముననే ప్రయోగింపబడినది.

**గురువెఱిగించినట్టి సునిగూఢభవచ్చితిశక్తి సచ్చిదా**
**త్మరుచిర మద్వితీయ పరతత్త్వము దెల్పు బుధాళి కీశ లో**
**క రచితమాతృమేయమితి కల్పితభేదకృతేష్టమార్గ సం**
**చరణులకై యహంకృతిగ చారు సుముద్రలఁజూపు నో పరా!**

* * *

**-- క్రియాశక్తి స్కంధరశ్మిప్రకరణమ్ --**

**అవతారిక :** పై ప్రకరణమున **జ్ఞానశక్తి** వర్ణింపబడినది. ఈ ప్రకరణమున **క్రియాశక్తి** వర్ణింపబడుచున్నది. ముందుగా నీ శ్లోకమున శివుని క్రియాత్మత చెప్పబడుచున్నది.

**శ్లో॥ బుద్ధేర్ జ్ఞానేంద్రియాణాం నిజనిజవిషయాస్వాదభోగప్రబోధ-**
**క్షీరాబ్ధిః ప్రోద్యదిచ్ఛామృతకిరణరుచా వాఙ్ముఖైః క్షాలితైశ్చ ।**
**సంక్రాంతశ్చాలితార్థప్రసరబహుపథః స్వాత్మమాయోరుపూర-**
**త్రుట్యద్బ్రహ్మాండబిందూన్ వికిరతి తవ చేత్త్వం శివాతః క్రియాత్మా ॥ 41**

**ప్రతిపదార్థము :** తవ = నీ యొక్క, బుద్ధేః = బుద్ధియొక్క, జ్ఞానేంద్రియాణామ్ = జ్ఞానేంద్రియముల యొక్క, నిజనిజ విషయాస్వాదభోగ ప్రబోధక్షీరాబ్ధిః = తమతమ విషయముల అనుభవమనెడు భోగముల మెలకువ యనెడి పాలసముద్రము, ప్రోద్య దిచ్ఛామృతకిరణరుచా = పుట్టుచున్న ఇచ్ఛ అనెడు ఇందు కాంతిచే, క్షాలితైః = కడుగబడిన,

వాఙ్ముఖైః = వాగాది కర్మేంద్రియములచేత, సంక్రాంతః = సంక్రమింప బడినదై, చాలితార్థ ప్రసరబహుపథః = కదలింపబడిన అర్థముల వ్యాప్తిచే అనేకములైన మార్గములు కలదై, స్వాత్మమాయోరుపూరత్రుట్యద్బ్రహ్మాండ బిందూన్ = స్వాత్మ మాయ యొక్క గొప్ప ప్రవాహముచే విరిగి పడుచున్న బ్రహ్మాండములనెడి బిందువులను, వికిరతి(చేత్) = వెదజల్లును, అతః = అందువలన, శివ = ఓ శివా, త్వమ్ = నీవు, క్రియాత్మా = క్రియా శక్తి స్వరూపుడవు.

**తాత్పర్యము :** అంతరింద్రియము జ్ఞానేంద్రియములు వాని వాని విషయముల అనుభవము మేలుకొను పాలసముద్రమే అగును. ఆ పాలసముద్రము కర్మేంద్రియ సంక్రాంతమై బహువిధార్థముల వైపు బహుమార్గములు కలదై యున్నది. దానిలోని మాయా వాయు ప్రవాహ వేగముచే విఱిగి పడిన బిందువులే బ్రహ్మాండములు. ఈ బ్రహ్మాండ బిందు వికిరణము వలన శివుడు క్రియాశక్తి స్వరూపుడు అగుచున్నాడు.

**వివరణము :** 1. **బుద్ధి** అంతరింద్రియములలో నొకటి. అది అంతఃకరణచతుష్టయమున కుపలక్షణము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నాలుగు అంతరింద్రియములు. **మనస్సునకు సంశయము, బుద్ధికి నిశ్చయము, చిత్తమునకు చింతనము,అహంకారమునకు గర్వము నిజవిషయములు.** జ్ఞానేంద్రియములు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు. శ్రోత్రమునకు శబ్దము, త్వక్కునకు స్పర్శము, చక్షువునకు రూపము, జిహ్వకు రసము, ఘ్రాణమునకు గంధము నిజవిషయములు. ఈ నిజవిషయాస్వాదముచే జీవునకు సుఖమో దుఃఖమో కలుగుచుండును. ఈ సుఖదుఃఖములు కూడా అంతఃకరణమునకు విషయములే. లజ్జ, భయము మొదలగునవి కూడ అంతఃకరణమునకు విషయములే. ఈ అంతఃకరణ విషయముల వలన కూడ సుఖదుఃఖములు కలుగును. **సుఖదుఃఖములకు భోగములని పేరు.** ఈ భోగముల వలన అనగా సుఖభోగము వలన పుణ్యము, దుఃఖభోగము వలన పాపము క్షీణించును. పుణ్య పాపములు వాసనారూపములు. అవి ఆచరింపబడిన కాలమున కాక భావి కాలమున అనగా అది పరిపాకము చెందిన కాలమున నీ భోగములను కలిగించును. ఈ అంతరింద్రియ బహిరింద్రియములు అవి మేల్కొను కాలము నిద్రించు కాలము స్వప్నములోని దేశకాలములు జాగ్రద్దశలోని దేశకాలములు సర్వప్రపంచము అవ్యక్తమున లీనమైయుండును. ఆ స్థితి **ప్రలయస్థితి** అనబడును. మొదట అంతఃకరణము మేల్కొనును. ఆ స్థితి స్వప్నము అనబడును. స్వప్నమున సూక్ష్మతర సూక్ష్మతమ పాపపుణ్య కర్మముల ఫలము యొక్క భోగముండును. స్థూలపుణ్యపాపకర్మల ఫలము యొక్క భోగము

అంతర్ బహిరింద్రియములు మేల్కొని యుండు జాగ్రదవస్థయందు సంభవించును. జాగ్రదవస్థయందే స్థూల సూక్ష్మ పుణ్యపాప కర్మల ఫలరూపమైన ప్రపంచము యొక్క భోగముండును. **అంతరింద్రియములు మేల్కొని యుండు స్వప్నావస్థ, వానితోపాటు బహిరింద్రియములు మేల్కొని యుండు జాగ్రదవస్థ ప్రబోధమనబడును.** ఆ ప్రబోధమే ఈ శ్లోకమున క్షీరాబ్ధిగా రూపింపబడి రూపకాలంకార మేర్పడినది. 2. ఈ క్షీరాబ్ధికి నాథుడు శివుడు. ఆ శివుడు జ్ఞానస్వరూపుడు. ఆ క్షీరాబ్ధియు జ్ఞానస్వరూపమే. జీవుల భోగహేతువులైన పుణ్యపాపకర్మల వాసనలు మేల్కొను కాలము వచ్చి నప్పుడు ఆ క్షీరసముద్రము నుండి చంద్రునివలె ఆ శివునకు బ్రహ్మాండసృష్టి జనించును. సృష్టికి ముందు బ్రహ్మాండము క్షీరసముద్రముననే దాగియున్నది. అది ఆ సముద్రము నందలి బిందుసమూహమే. ఆ బ్రహ్మాండము ఒక్కటియో పెక్కో ఒక బ్రహ్మాండము లోని వారమైన మనకు తెలియని విషయము. ఇచ్ఛాశక్తి రజోగుణ సంబద్ధమై సృష్టికి, జ్ఞానశక్తి సత్త్వగుణ సంబద్ధమై స్థితికి, క్రియాశక్తి తమోగుణ సంబద్ధమై ప్రలయమునకు కారణములగును అని కొందఱు తాత్త్వికుల అభిప్రాయము. ఈ శ్లోకమున క్రియాత్మా అని పరమేశ్వరుని క్రియాశక్తి స్వరూపము చెప్పబడినది. ఈ క్రియాశక్తి బ్రహ్మాండ ప్రలయ హేతువగును. గ్రంథకర్త అభిప్రాయము ననుసరించి బ్రహ్మాండములు అనేకములు. ఆ క్షీర సముద్రము అనేక కోటి బ్రహ్మాండ బిందువులతో నిండి ఏకముగా నున్నది. అందలి బిందువులను వేరు చేసి వికిరతి అనగా వెదజల్లును అనగా సర్వ బ్రహ్మాండ ప్రలయమున ఏకత్వము నొందిన వానిని వేరు చేసి తిరిగి వానిని ఒక్కటికొక్కటిగా సృష్టించినాడు అని అర్థము. ఈ పక్షమున ఇచ్ఛాశక్తి సృష్టిస్థితిలయ క్రియలు చేయు ఈశ్వరుని ఇచ్ఛ బ్రహ్మాండ భేదము ననుసరించి ఇచ్ఛా జ్ఞానక్రియా శక్తులు తత్సంబద్ధ రజస్సత్త్వతమస్సులును కూడ వేఱువేఱుగా నుండు నను మరొక పక్షము కూడ కలదు. ఈ పక్షమున ఏకకాలమున కొన్ని బ్రహ్మాండముల సృష్టులు, కొన్ని బ్రహ్మాండముల స్థితులు, కొన్ని బ్రహ్మాండముల లయములు ఏర్పడు చుండును. ఏది ఏమైనను పరమేశ్వరుడు క్రియాశక్తి స్వరూపుడనియే ఇచట చెప్పబడినది. 3. (పాల) సముద్రము ఉదయించుచున్న తనపుత్రుడైన చంద్రుని యుదయముచే పొంగిపోవు ననుట కవి సమయము. ఈ శ్లోకమున ఇచ్ఛ చంద్రుని కాంతిగా రూపింపబడినది. చంద్రకాంతి (ప్రవాహము) చే వాగాది కర్మేంద్రియములు క్షాలితములైనవి. వాని అర్థములవైపు అవి ప్రసరించుటకై చలించినవి. ఆ ప్రసార మార్గములు అనేకములైనవి. అనగా సర్వేంద్రియములు అర్థాభి ముఖ మార్గముల ప్రసరించుటకు విజృంభించినవి. కర్మేంద్రియములు క్రియాశక్తి ప్రధానములు గదా! ఈ క్రియాశక్తి విజృమ్భణమునకు స్వాత్మ

మాయోరు పూరము అనగా స్వాత్మమాయా వాయువు హేతువు. వాయువు యొక్క వేగముచే పదార్థముల సంయోగ వియోగములు జరుగుచుండును. బ్రహ్మాండ బిందు వికిరణ మాయా వాయుప్రేరణ ఫలవే. 4. బుద్ధిర్ జ్ఞానేంద్రియాణామ్ అనునప్పుడు బుద్ధియే క్షీరసముద్రముగా రూపింపబడిన దని కూడ చెప్పవచ్చును.

**నీమతి ధీంద్రియార్థరుచినిస్తులబోధపయోధిఁబ్రోధ్య ది**
**చ్ఛామృత కృద్రుచిన్ సువచనాదుల క్షాలితమై నితాంత సం**
**క్రామితమున్ చలార్థస్రుతిగామి పదమ్మునునై నిజాత్మ మా**
**యామిత పూరనిర్గలదజాండకణాకిరమాన్ క్రియాత్మవే.**

**అవతారిక :** పై శ్లోకమున క్రియాశక్తియొక్క వాగాదీంద్రియార్థాభిముఖ ప్రసరణము కారణముగా **పరశమ్భువు క్రియాశక్తి స్వరూపుడు** అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతని **విశ్వాత్మకత్వము** నిరూపింపబడుచున్నది.

**శ్లో॥ సృష్టిస్థిత్యంతలీలావకలితసరణి ర్యత్ప్రయత్నో యదీయం**
**ధైర్యం విఖ్యాతవీర్యం సకలమితిగతా యస్య బుద్ధిః సమృద్ధా ।**
**యత్సామర్థ్యప్రభూతం నిరవధిగణనాజాండరుద్రాండభాండా-**
**గారం యద్బ్రహ్మసత్తా జయతి తవ మనోరూపవిశ్వాత్మకత్వమ్ ॥ 42**

**ప్రతిపదార్థము :** యత్ప్రయత్నః = ఎవని ప్రయత్నము, సృష్టిస్థిత్యంతలీలావకలితసరణిః = సృష్టిస్థితిలయములను లీలలతో కూడి మార్గమో, యదీయమ్ = ఎవనికి సంబంధించిన, ధైర్యము = ధైర్యము, విఖ్యాతవీర్యమ్ = ప్రసిద్ధమైన వీరత్వమో, సకలమితిగతా = అన్ని జ్ఞానములలోనున్న, యస్య = ఎవని, బుద్ధిః = బుద్ధి, సమృద్ధా = బాగుగా సంపన్నమైనదో, యత్సామర్థ్యమ్ = ఎవని సమర్థత, నిరవధిగణనాజాండరుద్రాండభాండాగారమ్ = లెక్కించుటకు అంతులేని బ్రహ్మాండరుద్రాండ భాండములకు నిలయమో, యద్బ్రహ్మసత్తా = ఏ బ్రహ్మము యొక్క సత్త, ప్రభూతమ్ = అధికమైనదో, తత్ = ఆ, తవ = నీయొక్క, మనోరూప విశ్వాత్మకత్వమ్ = మనోరూప విశ్వాత్మకత, **జయతి** = సర్వోత్కృష్టముగా వర్ధిలుచున్నది.

**తాత్పర్యము :** సృష్టిస్థితిలయములు ఎవని క్రియాశక్తి లీలావిలాసమార్గమో, ఎవని వీర్యధైర్యములు విఖ్యాతములో, ఎవని బుద్ధి సర్వజ్ఞానానుగతితో సంపన్నమైనదో, ఎవని సామర్థ్యము అత్యధికమో, ఎవని బ్రహ్మసత్త లెక్కలేని బ్రహ్మాండ రుద్రాండ భాండములకు

నిలయమో ఆ నీ యొక్క మనోరూపవిశ్వాత్మకత్వము సర్వోత్కర్షముతో వర్ధిలుచున్నది.

**వివరణము :** జ్ఞానేచ్ఛాకృతులలోని కృతిశక్తి (క్రియాశక్తి) పరమేశ్వరుని ప్రయత్నము యొక్క రూపము. అది సృష్టి స్థిత్యంతములు అను క్రియల నొనర్చును. సృష్టిస్థితిలయముల నొనర్పవలెనను ఈశ్వరేచ్ఛ వాని నెట్లొనరింపవలెనో వానికి సంబంధించిన (ఇతి కర్తవ్యతా) జ్ఞానము అనుశక్తులతోపాటు క్రియాశక్తి పరమేశ్వరుని కధీనమై యుండును. ధైర్య శబ్దము యొక్క ప్రసిద్ధార్థము పిఱికితనము లేకపోవుట, ఎట్టి ఆటుపోటులనైన నెదుర్కొన గలిగియుండుట కూడ ధైర్యమే. వికారహేతువులున్నను వికృతి నొందక పోవుట కూడా ధైర్యమే. సృష్టి హేతువు (బీజము) ను క్షేత్రములో ప్రవేశింపజేయు వీర్యము కూడా పరమేశ్వరుని కున్నది. **'మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్'** అని భగవద్గీత చెప్పినది. భగవంతుని ఈ వీర్యము భగవద్గీతా గ్రంథములో పేర్కొనబడి విఖ్యాతమై యున్నది. పరమేశ్వరుని బుద్ధి సకల జనుల జ్ఞానములలో అనగా శ్లోకమున పేర్కొనబడిన మితులలో వ్యాపించి యుండును. కావున ఆ పరమేశ్వరుని బుద్ధి సమృద్ధమని చెప్పవలెను. పరమేశ్వరుని సామర్థ్యము సర్వజీవుల సామర్థ్యమునకన్న అధికము కావున అది ప్రభూతమైన సామర్థ్యము. ఆతని సత్త బ్రహ్మసత్త. దానిలోని లెక్కలేనన్ని కోట్లకొలది బ్రహ్మాండ రుద్రాండ భాండములకు సృష్టిస్థితిలయములకును ఆధారము. ఆతని మనస్సు విశ్వాత్మకము. ఆతని మనోరూప విశ్వాత్మకతకు జయమగుగాక. 2. విశ్వము లోని జీవులందఱి శరీరములు పిండాండము లనబడును. వాని సమష్టి **బ్రహ్మాండ** మనబడును. పిండాండము జీవుని స్థూలశరీరము, బ్రహ్మాండము ఈశ్వరుని స్థూలశరీరము. దానికి **విరాట్శరీరమని** పేరు. జీవులందఱికి సూక్ష్మ శరీరముండును. దానిలో ప్రాణములు ఇంద్రియములు మనస్సును ఉండును. సూక్ష్మశరీరమున నున్న వానినన్నింటిలో మనస్సు ప్రధానము కావున మనస్సు సూక్ష్మశరీర మనబడు చుండును. స్థూల శరీరము సూక్ష్మశరీరము నుండి ఏర్పడును. ఈ వఱకే పరమేశ్వరుని స్థూలశరీరము బ్రహ్మాండమని చెప్పబడినది. అది ఆయన సూక్ష్మ శరీరము నుండియే జనించినందున ఈ విశ్వమంతయు పరమేశ్వరుని మనస్సే అగును. అందుచేత ఈ శ్లోకమున పరమేశ్వరుని మనోరూపవిశ్వాత్మకత్వము జయించునని చెప్పబడినది. కొన్ని బ్రహ్మాండములు దేనిలో పుట్టి గిట్టు చుండునో అది రుద్రాండము. దాని సంఖ్యయు అనంతమే. బ్రహ్మాండరుద్రాండములు గుండ్రముగా నుండుటచే భాండములని (కుండలని) చెప్పబడినది.

**హాయిగ సృష్టిపుష్టివిలయమ్ములఁజేయు ప్రయత్నమున్ సువీ**
**ర్యాయత ధైర్యతా పరిగతాఖిల మానసమృద్ధ బుద్ధి దుర్**
**జ్ఞేయ మహా సమర్థత అజేయ విధాతృ మహేశ్వరాండ భాం**
**డాయతనమ్ము బ్రహ్మమయమైనది తావకసత్త గెల్చు నీ**
**మాయ మనోమయంబయిన మంజుల విశ్వతను స్వరూపమున్.**

**అవతారిక :** పై శ్లోకమున **సమస్త విశ్వము** పరశమ్భువుయొక్క మనస్సుయొక్క రూపము అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ మనస్సుతోపాటు అన్ని యింద్రియములును ఆత్మనే ఆశ్రయించి యుండుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ సంవేశం దూరదేశం కలయతి సకలం కర్మ కృత్యం చ తత్త్వం**
**స్వం యద్బాహ్యేంద్రియాణాం చలనమపి వినా స్వాంతమంతః ప్రకాశమ్ ।**
**తత్తే వీర! స్వతంత్రప్రకృతినిగమనం నిర్గతోపాధితర్కం**
**బాహ్యాఖ్యాదర్శనార్థం విమల! శివ! తతస్త్వం హృషీకాశ్రయాత్మా ॥ 43**

**ప్రతిపదార్థము :** వీర = వీరుడవైన, విమల = స్వచ్ఛుడవైన, శివ = ఓ శివుడా!, స్వమ్ = నీ, సంవేశమ్ = ప్రవేశము, దూరదేశమ్ = దూరదేశమును, **కలయతి** = లోగొనును, కృతమ్ = కృత్యము, సకలమ్ = సమస్తమైన, కర్మ = కర్మను, **కలయతి** = లోగొనును, చ = మరియు, యత్ = ఏ, బాహ్యేంద్రియాణామ్ = బహిరింద్రియముల యొక్క, చలనమ్ = చలనము, వినా = లేకుండగనే, స్వాంతమ్ = మనస్సు, అంతఃప్రకాశమ్ = లోని ప్రకాశము కలదియో, తే = నీ యొక్క, తత్ = ఆ, స్వతంత్ర ప్రకృతినిగమనమ్ = స్వతంత్ర ప్రకృతి యొక్క ఉపసంహారము, నిర్గతోపాధితర్కమ్ = తర్కమును ఉపాధులను దాటినది, బాహ్యాఖ్యా = బయటిపేరు, దర్శనార్థమ్ = ప్రదర్శనము కొఱకైనది, తతః = అందువలన, త్వమ్ = నీవు, హృషీకాశ్రయాత్మా = ఇంద్రియముల కాశ్రయమైన ఆత్మవు.

**తాత్పర్యము :** పరశమ్భువు సర్వవిశ్వమునం దొనర్చిన ప్రవేశము చేత ఆయనకు దూరదేశమనునది లేదు. సకలకర్మలు ఆయన కర్మలైన సృష్టిస్థితిలయములలోనే అంతర్భవించును. బాహ్యేంద్రియముల సహకారము లేకుండగనే ఆయన మనస్సులోని ఆత్మ తేజస్సుచేతనే అన్ని విషయములు పేరులోని బాహ్య అను పదమును చేర్చుకొనుట ఆ ఇంద్రియములు బాహ్యతను ప్రకటించుట కొఱకే. తర్కమునకు అతీతమైన ఉపాధి శూన్యమైన ఆతని స్వతంత్ర ప్రకృతి (స్వభావ) యందే సర్వమును ఉపసంహారము నొందును.

అందుచేతనే ఆతని ఇంద్రియములకు కూడ ఆతని ఆత్మయే ఆశ్రయమై యున్నది.

**వివరణము :** పరిచ్ఛిన్నవస్తువునకు లోపలి బయటి దేశముండును. పరశమ్భువు యొక్క ప్రవేశము ప్రవేశాభాస రూపమే యగుటచే దగ్గఱ దేశమనునది లేదు. అందుచేత దూరదేశము కూడ ఆయనకు లేనిదే యగును. ఈ విషయమును **'అపాణిపాదో జవనో గ్రహీతా, ఆసీనో దూరం వ్రజతి, శయానో యాతి సర్వతః'** ఇత్యాద్యుపనిషద్వాక్యములు వివరించును. సంవేశ శబ్దమునకు శయనమను నర్థముకూడ ఈ అంశమునే బలపఱచు చున్నది. చక్షువునకు చక్షువు, శ్రోత్రమునకు శ్రోత్రము ఇత్యాదిగా పరశమ్భువు యొక్క ఐశ్వర్య ముపనిషత్తులలో వర్ణింప బడినది. అట్టి పరమేశ్వరునికి బాహ్యేంద్రియముల ఆవశ్యకత లేకయే ఆతని మాయారూపమనస్సు స్వాంతః ప్రకాశరూపమైన ఆత్మ తేజము తోడనే అన్నింటిని చూడగలదు. సూర్యచంద్రాదులు ఆతని బాహ్యేంద్రియములు అని చెప్పుట ప్రదర్శనార్థమే అనగా వానిని పరమేశ్వరుని ఇంద్రియములుగా సాధకులు ధ్యానింపవలెనని ప్రదర్శించుటయే ఆ ఇంద్రియములకున్న బాహ్యత నామమాత్రమే. పరశమ్భువు యొక్క నిరంకుశ స్వతంత్రతయే స్వతంత్ర ప్రకృతియే అన్ని విరోధములను (ఇంద్రియముల యొక్క ఆవశ్యకత లేకయే మనస్సు అన్నివిషయములను గ్రహించ గలుగుట ఇత్యాదులను) పరిహరించును. అది తర్కమునకు అతీతము. ఆతడు నిరుపాధికాత్మ స్వరూపుడు. సూర్యచంద్రాదులు ఆయన ఇంద్రియములు ఖ్యాతములైనను పరమేశ్వరునకు తత్ పరాధీనత లేదు. పైగా సూర్యచంద్రాదులే ఆతని కధీనులై ఉందురు కావున వారి కాతడే ఆశ్రయము. **'చక్షుషీచంద్రసూర్యా'** దిత్యాది శ్రుతి చంద్ర సూర్యాదులే భగవానుని చక్షురాదులు అనుటకు ప్రమాణము. మొత్తము మీద పరశమ్భువు నిరంకుశ స్వతంత్ర ప్రకృతి యిందు ప్రదర్శింపబడినది. 2. **బాహ్యేఖ్యాదర్శనార్థా** అను పాఠము మేలని తలచెదను. లేక **బాహ్యేఖ్యాదర్శనార్థమ్** అను పాఠమునే అంగీకరించి బాహ్యా అను పేరును చూపించుట కొఱకు హృషీకమలకాశ్రయ వైతివి అను అర్థము చెప్పి అన్వయము కుదుర్చుకొన వచ్చును. 3. హృషీక శబ్దము జ్ఞానేంద్రియము కర్మేంద్రియో భయమునకు వాచకము. జీవులలో జ్ఞానేంద్రియములకన్న కర్మేంద్రియములే ఆతని క్రియాశక్తిని అధికముగా ప్రదర్శించును. చక్షురాదీంద్రియముల కాశ్రయములైన చక్షుర్గోళకాదుల ఉన్మీలననిమీలనాది క్రియలు అందఱకును జ్ఞాతములే. ప్రాణాది వాయు దశకము యొక్క క్రియాశక్తివలన ఉన్మీలనాదులు సంభవించును. వాగాది కర్మేంద్రియముల వలన వచనాది క్రియలు సంభవించుట సుప్రసిద్ధమే.

**గృహమును దూరదేశమును కృత్యము సర్వము కర్మతత్త్వమున్**
**బహిరఖిలేంద్రియమ్ముల నివారణలోన వెలుంగు చిత్తమే**
**గ్రహణముసేయు త్వత్ప్రకృతి కమ్మగు బాహ్యత దర్శనార్థమే**
**గహనమెఱుంగ స్వచ్ఛ శివ! కావున యౌదువు ఖాశ్రయాత్మవే.**

**అవతారిక :** పై శ్లోకమున దర్శన స్పర్శనాది క్రియల నిర్వర్తించు ఇంద్రియములకు పరశమ్భు వాశ్రయమని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతని క్రియల చేతనే ఆతని విశ్వరూపత్వము ప్రకటిత మగుచున్నదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ యద్వన్న్యగ్రోధబీజం పృథుతరవిటపానోకహత్త్వేన రూఢం**
**సామర్థ్యం దర్శయేస్త్వం పరమశివ! సదా సత్యవిజ్ఞానబీజమ్ ।**
**ఇచ్ఛాక్షేత్రేఽసుబుద్ధీంద్రియకులకలితం సర్వతః స్వక్రియాభిః**
**స్వాత్మానం విశ్వరూపం ప్రకటయతి యదా త్వం తదా గోచరః స్యాః ॥ 44**

**ప్రతిపదార్థము :** పరమశివ = ఓ పరమశివా!, న్యగ్రోధబీజమ్ = మఱ్ఱివిత్తనము, పృథుతరవిటపానోకహత్త్వేన = పెద్దకొమ్మల చెట్టుగా, రూఢమ్ యద్వత్ = పెఱిగినట్లు, త్వమ్ = నీవు, సామర్థ్యమ్ = శక్తిని, సదా = ఎల్లప్పుడు, దర్శయేః = చూపించెదవు, ఇచ్ఛాక్షేత్రే = ఇచ్ఛ అను క్షేత్రమున, అసుబుద్ధీంద్రియకులకలితమ్ = ప్రాణేంద్రియ సమూహముతో కూడిన, సత్యవిజ్ఞాన బీజమ్ = సత్యవిజ్ఞానమను విత్తనము, విశ్వరూపమ్ = విశ్వరూపమునుగా, స్వాత్మానమ్ = స్వాత్మను, యదా = ఎప్పుడు, ప్రకటయతి = ప్రకటించునో, తదా = అప్పుడు, సర్వతః = అన్నివైపుల నుండి, స్వక్రియాభిః = తన క్రియల చేత, గోచరః = గోచరుడవు, **స్యాః** = అగుదువు.

**తాత్పర్యము :** మఱ్ఱివిత్తనము శాఖోపశాఖలుగల వృక్షముగా పెఱిగినట్లు నీవు ప్రాణేంద్రియములతో కూడి విశ్వరూపముగా నిన్ను నీవు ప్రకటించు కొందువు. తొలుత నీవు సత్యవిజ్ఞానమను విత్తనముగానే ఉండి నీ సామర్థ్యమును చూపించి ప్రకటించు కొన్నప్పుడు గోచరుడ వగుదువు. ఎన్నియో నీ క్రియల ఫలరూపమే ఈ విశ్వము.

**వివరణము :** విత్తనమందు క్రియాశక్తి గూఢమై ఉండును. శాఖోపశాఖలుగా విస్తరించి నప్పుడు ఈ కనబడి కనబడని ఈ చిన్ని విత్తనమం దంతశక్తి యున్నది కదా అని మన మాశ్చర్యము నొందెదము. అట్లే పరశమ్భువు సృష్టికి ముందు సత్యవిజ్ఞాన మనెడి విత్తనముగా నుండి దానిలోని క్రియాశక్తులు విజృమ్భించి విశ్వరూపముగా తనను తాను ప్రకటించు

కొన్నప్పుడు విశ్వరూపముగానే ఆ విజ్ఞాన బీజము ఇంద్రియములకు గోచరించును. విత్తనము సూక్ష్మము. అట్లే సత్య విజ్ఞానము ఎవరికి కనబడనంత సూక్ష్మము. అంత సూక్ష్మమైన ఆ బీజమున అనంతశక్తులు గూఢముగా ఉండును. ఆ విజ్ఞాన బీజమే స్థూలవిశ్వరూపముగా ప్రకటితమైనప్పుడు మన ఇంద్రియములకు గోచరమగును. కాని విజ్ఞానబీజమే ఈ విశ్వ మహావృక్షముగా గోచరమగుచున్నదని ఎఱుగము. వేద శాస్త్రాగమాదుల వలన ఆ విషయము నెఱిగినప్పుడు ఈనాడు మనము ఆ విజ్ఞానబీజమే తన క్రియాశక్తులతో ఇంత స్థూలత్వము నొంది గోచరమగుచున్నదని ఎఱుగుదుము. ఈ విషయమునే శ్రీ శంకరులు **'జాతేఽఙ్కురే కథమిహోపలభేత బీజమ్'** అని వివరించిరి. ఈ ప్రపంచమున సత్యవిజ్ఞాన స్వరూప పరమాత్మ ఏల గోచరించదు, అను ప్రశ్నమునకు పై శంకరుల వాక్యము సమాధానము. చెట్టుగా మారినది విత్తనమే అయినను ఆ విత్తనము మొలకెత్తినప్పుడే విత్తనమేమైనదని వెదకువాని కావిత్తనము కనబడునా! ఆ విత్తనమే ఇప్పుడంకురమైనది. దాని విత్తనము యొక్క రూపము ఇప్పుడెట్లు కనబడును. అని ప్రశ్నమునకు ప్రశ్నమునే సమాధానముగా చెప్పినారు. బీజము కారణావస్థాపన్నము. సత్యవిజ్ఞాన బీజము కారణావస్థాపన్నము. విశ్వము కార్యావస్థాపన్నము. ఆ కారణ బీజము ఈ కార్య విశ్వరూపముగా గోచరించుచున్నది. కావున మనము ఈశ్వరుడు మనకు ఇంద్రియగోచరుడగుచునే యుండగా ఆతడు గోచరించ లేదనుట వట్టి అజ్ఞానము మాత్రమే. **'వాసుదేవ స్సర్వమ్'** అను జ్ఞానము కలవాడే మహాత్ముడు. అట్టివారు కోటి కొక రుందురు. వారికీశ్వరుడే ఈ విశ్వముగ గోచరించును. **విశ్వముగా నున్నది ఆ ఈశ్వరుడే** అని శ్లోకము యొక్క సారాంశము.

**బహువిటపాకులమ్ము వటపాదపమెట్టులు బీజ గూఢమై**
**బహిరుపగామియౌనటులె బాహ్యము సత్యవిబోధ బీజమున్**
**స్పృహయనుక్షేత్రమందు సుమతీంద్రియసంకులమై స్వకర్మలన్**
**మహిత జగమ్ము వెల్వఱచు మాకు ౘగనంబడెదప్పుడే శివా!**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **విశ్వరూపుడని** చెప్పబడినది. ఈ శ్లోకమున విశ్వరూపమున నున్నను పరశమ్భువున ద్వంద్వము అనగా **ద్వైతము లేదని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్వాత్మాశేషాక్షవృత్తేః పృథగయనతయా క్వాపి భూతాని పంచ**
**క్వాపి ప్రేక్షాప్రపంచః క్వ చ నినదముఖాః క్వాపి వాక్యాదయశ్చ ।**

**ఏతైరేవ ప్రవృత్తో నిజవిషయతయా సర్వవిశ్వాత్మజృంభ-**
**స్తస్మాత్త్వం లోకముఖ్యో ద్వయమితిరహితః స్వప్రకాశప్రమేయః ॥ 45**

**ప్రతిపదార్థము :** స్వాత్మాశేషాక్షవృత్తేః = స్వాత్మయొక్క అన్ని ఇంద్రియముల వృత్తికి, పృథగయనతయా = వేరువేరు స్థానముండుట చేత, క్వ+అపి = ఒకచోట, పంచ భూతాని = అయిదు భూతములు, క్వ+అపి = ఒక చోట, ప్రేక్షా ప్రపంచః = దృక్కు యొక్క విస్తృతి, క్వ అపి = ఒక చోట, నినదముఖాః = శబ్దాదులు, క్వ చ = ఒకచోట, వాక్యాదయః చ (సంతి) = వాక్యాదులు (నుండును), ఏతైః ఏవ = వీని చేతనే, సర్వవిశ్వాత్మజృమ్భః = సమస్త విశ్వ విజృంభణము, నిజవిషయతయా = స్వవిషయముగా, ప్రవృత్తః = ప్రవర్తిల్లినదైనది, తస్మాత్ = అందువలన, త్వమ్ = నీవు, లోకముఖ్యాః = లోకమున ముఖ్యుడవు, ద్వయమ్ ఇతిరహితః = ద్వంద్వము అనునది లేనివాడవు, స్వప్రకాశప్రమేయః = స్వప్రకాశ ప్రమాణము చేతనే తెలియదగిన వాడవు.

**తాత్పర్యము :** స్వాత్మ చైతన్యమే ఇంద్రియవృత్తులద్వారా బహిర్గతమై ఒకచోట పంచ భూతములను, ఒకచోట దేహేంద్రియాదులను, ఒకచోట శబ్దాది విషయములను దర్శింపజేయును. ఇవి అన్నియు ఆత్మకు విషయములే కాని అవి భిన్నదేశగతములై తోచును. ప్రపంచవిజృంభణము వీని నుండియే కలిగినది. కావున పరశమ్భువే ఈ లోకమున ముఖ్యుడు దృగ్రూపుడు. వానికి ద్వైతమనునది లేదు. వానిని తెలిసికొను మరొక ప్రమాణము లేదు కావున స్వప్రకాశప్రమేయుడు.

**వివరణము :** ఆత్మ ఒక్కటే దృక్కు. ఇతరములన్నియు దృశ్యములే ఐనను దేహేంద్రియాదు లందు దృక్త్వమారోపింపబడి నేను స్థూలుడను, నేను కృశుడను, నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను మాట్లాడుచున్నాను, ఇత్యాది వ్యవహారము జరుగుచుండుటచే దేహేంద్రియాదులు ప్రేక్షాప్రపంచమని ఈ శ్లోకమున చెప్పబడినది. అది ఆత్మయందే దృశ్యముగా కూడనై ఒకచోట నున్నదని చెప్పబడినది. శబ్దస్పర్శరసరూపగంధములు పంచేంద్రియ విషయములు వాని ద్వారమున పంచభూతములును దృశ్యములై ఒకచోట నున్నవి. ఇంద్రియముల ద్వారా అంతఃకరణము వ్యాపారించుట వృత్తి అనబడును. ఇంద్రియ భేదము ననుసరించి అంతఃకరణ బహిర్గమన వృత్తులు ఆయా ఇంద్రియవృత్తులుగానే చెప్పబడును. ఇవి గాక బహిరింద్రియాపేక్ష లేక సుఖదుఃఖలజ్జాభయాదులు అంతఃకరణము నందే ఉండి అంతఃకరణవృత్తుల ద్వారా గ్రహింపబడును. ఈ వృత్తులు ఈ విషయములు అంతఃకరణగతములైనను వ్యాపారము జరుగుచునే యుండుటచే అవి బహిరింద్రియ

వృత్తిభిన్నములైన అంతఃకరణవృత్తులుగా పేర్కొనబడును. ఈ వృత్తులు చైతన్యము ప్రతిఫలించి యున్నందున వీనిని వృత్తిజ్ఞానములని పిలిచెదరు. వృత్తులు ఆశ్రయములు ఇంద్రియములు. శబ్దస్పర్శాదులు విషయములు ఆకాశాది పంచభూతములును వానికి విషయములను ఈ శబ్దాదులు, శ్లోకమున **నినదముఖాః** అని చెప్పబడినవి. వానిలో శబ్ద మొక్కటే. వర్ణపదవాక్యమహావాక్యాది రూపమున, ధాతు ప్రాతిపదిక విభక్తిప్రత్యయకృదాది ప్రత్యయాది భేదమున భిన్నభిన్నముగానే ఉండును. ఈ ఇంద్రియవృత్తులు పృథగాశ్రయములని ఈ శ్లోకమున **'పృథగయనతయా'** అను పదముచే చెప్పబడినది లోకశబ్దము దృశ్యము అను అర్థము గలది. అది దేహాది బ్రహ్మాండాంత దృశ్య భేదములకు వాచకము. దృశ్యము దృగధీనము కావున ఈ దృశ్యములన్నిటికన్న దృగ్రూపుడైన పరశమ్భువే ముఖ్యుడు. దృగధీనసత్తగల దృశ్యము మిథ్యయని శంకరాద్వైతులు చెప్పెదరు. కొందఱు శైవశక్తాద్వైతులు వానిని మిథ్యయని అంగీకరింప కున్నను దృక్కుయొక్క ముఖ్యత్వము నంగీకరించెదరు. కావున పరశమ్భువు **లోకముఖ్యుడని** శ్లోకమున చెప్పబడినది. దృశ్యము మిథ్యయను శంకరాద్వైతుల దృష్టిలో పరశమ్భువు ద్వంద్వరహితుడు. అద్వైతమూర్తి. దృశ్యము సత్యమైనను దానియందలి దృగ్భేదము మిథ్యయని చెప్పు భాస్కరరాయాదుల దృష్టిలోను పరశమ్భువు ద్వయమ్ ఇతి రహితుడు అనగా రెండు అనునది లేనివాడు. ద్వయమితి శబ్దమునకు ద్విజ్ఞానము అను అర్థము చెప్పినను తాత్పర్యమున భేదము రాదు. ఆత్మ (పరశమ్భువు) తాను ప్రకాశించుచు ఇతరములను ప్రకాశింపజేయువాడు కావున **స్వప్రకాశరూపుడు**. ఆతని చేత ప్రకాశింపజేయబడు దేహేంద్రియభూతశబ్దాదిప్రపంచము స్వప్రకాశము కాదు. కావున జడము జడమును ఆత్మ అంతఃకరణేంద్రియాదుల ద్వారా, దీపము గాజు మొదలైన పారదర్శకముల ద్వారా కాంతిని ప్రసరింప జేసినట్లు ప్రకాశింపజేయును. స్వప్రకాశ్యజడమును వాస్తవమునకు స్వప్రకాశమే భిన్నము అనిపించును. దీపమును చూపించుటకు వేరొక దీపము అక్కరలేనట్లు ఆత్మ స్వప్రకాశప్రమేయమే అగును. భూతాదులవలె ఇంద్రియాది ప్రమాణ ద్వారమున ప్రకాశ్యము కాదు కావున ఈ శ్లోకమున పరశమ్భువు **స్వప్రకాశప్రమేయః** అని చెప్పబడినాడు. (1) అంతఃకరణభేదములైన మనోబుద్ధిచిత్తాహంకారములు (2) బహిర్జ్ఞానేంద్రియములైన త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణాదులు (3) కర్మేంద్రియములైన వాక్పాణి పాద పాయూపస్థలు అను ఈ త్రివిధేంద్రియములు అక్షములు. **అశేషాక్ష** శబ్దము శ్లోకమున నున్నది. అది పై **త్రివిధేంద్రియములను** బోధించును.

**ఒక్కెడ పంచభూతములు నొక్కెడ ప్రేక్షణజాల మొక్కెడన్**
**వాక్కులెయాదిగాగలవి ధ్వానముఖమ్ములు నొక్కెడన్ గతుల్**
**పెక్కులు స్వాత్మకాఖిల ఖవృత్తులు నైజములట్టు లాత్మయా**
**దిక్కు జనున్ సమాత్మత స్వతేజము తోచెడు నద్వితీయమై.**

**అవతారిక :** పై శ్లోకము పరశమ్భువు స్వప్రకాశప్రమేయుడని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతని సత్త్వము వలననే జాతములు జనకగుణముల ననుసరించునని చెప్పబడుచున్నది.

**శ్లో ॥ కాలావస్థాశ్చ తిస్రో గిరిశ! దశదిశః సప్తధా భూమిరాపో-**
**నానాతేజః సమీరా దశ వియదఖిలవ్యాపి చైకాదశాక్షాః ।**
**భిన్నార్థానంతబోధప్రకటితమహిమా బీజభేదాస్త్వనంతా-**
**స్త్వత్సక్తా బీజజాతాః స్వగుణమనుసరంత్యేవ తే దేవ! సత్త్వాత్ ॥ 46**

**ప్రతిపదార్థము :** గిరిశదేవ! = ఓ శివదేవా!, తిస్రః = మూడు, కాలావస్థాః = కాలములు అవస్థలు, దశదిశః = పదిదిక్కులు, దశసమీరాః = పదివాయువులు, సప్తధా = ఏడువిధములైన, భూమిః = భూమి, నానా = అనేకములైన,ఆపః = జలములు, తేజః = తేజస్సు, అఖిలవ్యాపి = సర్వమును వ్యాపించు, వియత్ = ఆకాశము, ఏకాదశ = పదునొకండు, అక్షాః చ = ఇంద్రియములును, భిన్నార్థానంతబోధ ప్రకటితమహిమాః = భిన్నములైన అనంతములైన అర్థముల బోధలచే ప్రకటింపబడిన మహిమగలవి, త్వత్సక్తాః = నీయందు సక్తి గలవి, బీజభేదాః తు = బీజవిశేషములు మాత్రము, అనంతాః = అంతులేకుండ నున్నవి, తే = నీయొక్క, సత్త్వాత్ = సత్త్వమువలన, స్వగుణమ్ = స్వగుణమును, **అనుసరంతి** ఏవ = అనుసరించుచునే యున్నవి.

**తాత్పర్యము :** ఓ శివదేవా ! మూడు కాలములు, మూడు అవస్థలు, పది దిక్కులు, సప్తద్వీప భిన్నమైన భూమి, సప్త సముద్రరూప జలములు, వివిధములైన తేజో భేదములు, ప్రాణోపప్రాణపంచకద్వయము, అన్నిట వ్యాపించు నాకాశము, పదునొకండు నింద్రియములును, భిన్న భిన్నములైన అర్థముల బోధించు మహిమ గలవి. నీశక్తి గల బీజభేదములు అనంతములు. ఆ బీజభేదముల నుండి పుట్టినవి అన్నియు పరమేశ్వరుడవైన నీసత్త్వమువలన బీజగుణములనే అనుసరించుచున్నవి.

**వివరణము :** 1. **మూడు కాలములు** అనగా భూత భావి వర్తమానములు, **మూడవస్థలు** అనగా జాగ్రత్స్వప్నసుషుప్తులు, **దశ దిశలు** అనగా తూర్పు, ఆగ్నేయము, దక్షిణము,

నైరృతి, పడమర, వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము, క్రింద, పైన అనునవి. **సప్తధా భూమి** అనగా జమ్బూ, ప్లక్ష, కుశ, క్రౌంచ, పుష్కర, శాక, శాల్మలీద్వీపములుగా విభజింప బడిన భూమి. ఆపః అనగా జలములు కూడ, పయోదధి, ఘృత, ఇక్షు, ఇరా, సర్పిద్, లవణ నామక సప్తముద్రములుగా విభజింపబడినవి. **తేజ** మనేక విధములుగా నున్నది. సూర్యచంద్రాగ్నులు మూడు తేజములు. వైద్యుత బాడబములు భౌమాగ్నితో కలిపి అగ్ని మూడు విధములు. యజ్ఞీయాగ్ని–గార్హపత్య–ఆహవనీయ దక్షిణభేదమున త్రివిధము. ద్వాదశాదిత్యులు. ఆదిత్య భేదములు. ఈవిధముగా తేజము అనేక విధములుగా నుండుటచేత నానా అని చెప్పబడినది. శరీరము నందున్న ప్రాణాపానవ్యానోదాన సమానములను అయిదు ప్రాణములు; నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములను ఉపప్రాణములైదు. మొత్తము పది వాయువులు శ్లోకమున **దశసమీరా** అని పేర్కొనబడినవి. పైన పేర్కొనబడిన అన్నింటిని వ్యాపించినదగుటచే ఆకాశము **అఖిలవ్యాపి** అని చెప్పబడినది. త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణము లైదు జ్ఞానేంద్రియములు, వాక్పాణి పాదపాయుపస్థ లైదు కర్మేంద్రియములు, అంతరింద్రియమను అంతఃకరణ మొకటి మొత్తము పదునొకండు **ఏకాదశాక్షములు**. ఇవి భిన్నభిన్నానంతార్థ బోధము చేత మహిమను ప్రకటించుకొన్నట్టివి.

2) ఈ ప్రపంచము కార్యకారణరూపము. అవ్యక్తము (అజ్ఞానము) లేక పరాశక్తి సర్వకారణము. మహదహంకార తన్మాత్రాపంచక, భూతపంచకము కార్యములయ్యు తత్త్వాంతరజనకము లైనందున కార్యకారణ రూపములు. ఘటాదులు తత్త్వాంతరజనకములు కానందున అవి కార్యములు మాత్రమే. బీజము వృక్షమునకు కారణము. వృక్షము బీజజాతము కావున కార్యము ఇట్లే ప్రపంచమున నెక్కడ చూచినను కార్యకారణభావము గోచరించును. కార్యమునందు కారణగుణసంక్రమణ ముండును. దానికి కారణము పరమేశ్వరుని ఉనికియే. **కారణగుణములు కార్యమునందు సంక్రమించును అని ఈ శ్లోకమున చెప్పబడినది.** పరమేశ్వరుడు సర్వకారణము. సర్వప్రపంచము కార్యము. శ్లోకములోని **సత్త్వశబ్ద** మీ పరమైశ్వర్యమును సూచించును. **'భీషాస్మాద్వాతః పవతే'** ఇత్యాది శ్రుతి సర్వజీవుల సమస్త కార్యములు పరమేశ్వరుని భయమువలననే జరుగుచున్నట్లు చెప్పును. శ్లోకములోని సత్త్వశబ్దమీ భయహేతుత్వమును సూచించును. మాయామయ బ్రహ్మము(పరమేశ్వరుడు) కాని బ్రహ్మ ప్రతిబింబిత మాయ(పరమేశ్వరి) కాని సర్వకారణమని నిర్గుణ బ్రహ్మవివర్త మీ ప్రపంచమనియు శంకరాద్వైతులు చెప్పెదరు. విశిష్టాద్వైతులు స్థూల చిదచిద్విశిష్ట కార్య(స్థూల) బ్రహ్మకు సూక్ష్మ చిదచిద్విశిష్టకారణ బ్రహ్మకును అద్వైతము

అనగా అభేదము చెప్పెదరు. ఏది ఏమైనను బీజజాతములలోని బీజగుణ సంక్రమణము పరమేశ్వరుని వలననే అనుట సర్వవాది సమ్మతము.

**దశదిశలున్ ద్ర్యవస్థలను ధారుణిలేదును బెక్కు నీళులున్**
**దశఘనవాయుతేజములు తానఖిలమ్మును నిండునభ్రమున్**
**దశయుతమేకమింద్రియ వితానమనంతము బీజభేదమున్**
**విశదమె బీజజాతములు బీజగుణాకలితమ్ములౌటయున్.**

**అవతారిక :** 45 వ శ్లోకమున **వాక్యాదయశ్చ** అనుపదములచే సూచింపబడిన **శబ్ద ప్రపంచము** ఈ శ్లోకమున విస్తరింపబడుచున్నది.

**శ్లో ॥ పంచాశద్వర్ణమాలా బహువిధనినదోచ్చారణాత్తత్త్వజాల-**
**వ్యక్తివ్యాపారసక్తా గిరిశ! గురుముఖామ్నాయవిద్యాస్వరూపా ।**
**ధాత్రాద్యుత్పత్తిపూర్వం శ్రుతిముఖవివిధానేకసిద్ధాంతవిద్యాః**
**నానాభాషాక్రియాభిః ప్రకటయతి తతః సైవ తే సాంగవేదాన్ ॥ 47**

**ప్రతిపదార్థము :** గిరిశ! = ఓ శివా!, పంచాశద్వర్ణమాలా = ఏబదివర్ణముల మాల, బహువిధనినదోచ్చారణాత్ = అనేకవిధములైన ధ్వనుల పలుకుట వలన, తత్త్వజాల వ్యక్తి వ్యాపారసక్తా = తత్త్వముల సమూహమును వ్యంజింప జేయుట అను వ్యాపారము నందు తగులు కొన్నది, గురుముఖామ్నాయవిద్యాస్వరూపా= గురుముఖవేదమయిన అఘోర విద్యామంత్రవిద్యాస్వరూపము గలదై, ధాత్రాద్యుత్పత్తిపూర్వమ్ = బ్రహ్మాదుల సృష్టి పూర్వకముగా, శ్రుతిముఖ వివిధానేకసిద్ధాంతవిద్యాః = వేదములు మొదలైన అనేక విధములైన సిద్ధాంత విద్యలను, సాంగవేదాన్ = అంగములతోకూడిన వేదములను, నానాభాషా క్రియాభిః = అనేక భాషోచ్చారణ ప్రక్రియలచేత, సా ఏవ = ఆ వర్ణ మాలయే, **ప్రకటయతి** = ప్రకటించుచున్నది.

**తాత్పర్యము :** ఏబది వర్ణముల మాల బహువిధనాదముల ఉచ్చారణము చేయుట వలన తత్త్వముల నావిష్కరింపజేయు వ్యాపారమున సక్తమై యుండును. అదియే అఘోరశివగురుముఖనిర్గతమంత్రవిద్యారూపము ధరించును. అదియే బ్రహ్మాద్యుత్పత్తి పూర్వకముగా వేదాద్యనేక సిద్ధాంతవిద్యలను సాంగవిద్యలను ఆవిష్కరించును.

వివరణము : తంత్ర వేద సిద్ధాంతానుసారము వర్ణమాల ఏబది వర్ణములు గలదిగా ప్రసిద్ధమై యున్నది. అచ్చులు పదునారు. హల్లులు ముప్పది నాలుగు కలిసి వర్ణములు

మొత్తమేబది. క్ష కారము కలిపికొని ఏబది యొక్క వర్ణములు గలది వర్ణమాల అనుటకూడ సమ్మతమే. తంత్రములలో వర్ణముల నుండియే జగములోని తత్త్వము లుత్పన్నములైనట్లు చెప్పబడినది. అందుచేత వర్ణముల మాల తత్త్వజాలముల వ్యంజించు వ్యాపారమునం దాసక్తమై యున్నట్లు శ్లోకమున చెప్పబడినది. వర్ణముల నినదములు భిన్న భిన్న తాల్వాద్యాభ్యంతర ప్రయత్నభేదముల వలన ఘోషాది బాహ్యప్రయత్న భేదముల వలన చెవికి వేరు వేరుగానే వినిపించును. గురుముఖమునుండి మాత్రమే ఎఱుగదగినది. గురుముఖామ్నాయ రూపమునైన అఘోరవిద్యయు వర్ణమాల నిర్మితమే. **'యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై'** అను శ్రుతి బ్రహ్మాద్యుత్పత్తిపూర్వకముగా వేదాది విద్యల నుత్పాదించుటలో కూడ వర్ణమాలయే మూలముగ నున్నదని చెప్పినది. అనేక భాషలు గూడ వర్ణమాలా రూపములే.

**గిరిశ! గురూక్తమైన శ్రుతిగీతమునైన సువిద్య నైకధో**
**చ్చరితరవాత్మతత్త్వముల జాలము వ్యక్త మొనర్చు వ్యాస్మృతిన్**
**నిరతము బ్రహ్మముఖ్యులు జనింపక పూర్వమె సాంగవేద త**
**త్పర బహు భాషలన్ గ్రియల వ్యక్త మొనర్చెడు వర్ణమాలయే.**

అవతారిక : పై శ్లోకమున వర్ణమాల వివిధ విద్యారూపముగా కనబడు ప్రక్రియ వివరింపబడినది. ఈ శ్లోకమున దాని నుండి **సర్వసిద్ధాంత ప్రతిపాదక శాస్త్ర వాఙ్మయము** రూపొందిన ప్రక్రియ వివరింపబడుచున్నది.

శ్లో ॥ **వర్ణేభ్యో ధాతవః స్యుర్వివిధపదచయస్తద్భవస్తేన వాక్యం**
**తస్మాజ్జాతప్రమాణం వివిధనిగమనం తేన సిద్ధాంతజాలమ్ ।**
**తస్మాన్నానాత్మతత్త్వప్రకటనమితి యత్తత్త్వవిద్యా త్వదీయా**
**త్వం చేదేకో ద్వితీయః క్రమరహితమహాసంవిదాత్మా మహేశః ॥ 48**

**ప్రతిపదార్థము :** వర్ణేభ్యః = వర్ణములనుండి, ధాతవః = ధాతువులు, స్యుః = పుట్టును, వివిధ పదచయః = వివిధములైన పదముల సముదాయము, తద్భవః = వానినుండి పుట్టినదైనది, తేన = దానిచేత, వాక్యమ్ = వాక్యము, తస్మాత్ = దానినుండి, ప్రమాణమ్ = ప్రమాణము, జాతమ్ = పుట్టినది, తస్మాత్ = దానినుండి, నానాత్మతత్త్వప్రకటనమ్ ఇతి యత్ = వివిధములైన ఆత్మతత్త్వముల ప్రకటన మనునది ఏదికలదో అది(పుట్టినది), త్వదీయా = నీకు సంబంధించిన, తత్త్వవిద్యా = తత్త్వవిద్య, త్వమ్ = నీవు, ఏకః =

ఒక్కడవు, అద్వితీయః = రెండవది లేనివాడవు, చేత్ = అగుచో, క్రమరహిత మహాసంవిదాత్మా = క్రమములేని మహాజ్ఞాన స్వరూపుడవు, మహేశః = మహేశ్వరుడవు.

**తాత్పర్యము :** వర్ణములనుండి ధాతువులు, వానినుండి పదములు, వానినుండి వాక్యములు, వానినుండి ప్రమాణములు, వానినుండి ఉపసంహారములు, వానినుండి సిద్ధాంతములు, వాని నుండి నానావిధములైన ఆత్మతత్త్వ ప్రకటనము అను నీ తత్త్వవిద్య ఏర్పడును. నీవేమో ఒక్కడవు, అద్వితీయుడవు, క్రమరహిత మహాజ్ఞానస్వరూపడవు, మహేశ్వరుడవు.

**వివరణము :** ధాతువులలో ఏకాక్షరములు అధికములు, అనేకాక్షరములు కూడ కొన్ని ఉన్నవి. వర్ణముల నుండి ధాతువు లేర్పడును. వర్ణములు అచ్చులు, హల్లులు అని ద్వివిధములు, హల్లుతో కూడియు కూడకయు అచ్చు అక్షరమనబడును. హల్లులు అచ్చుసాయము లేక పలుకబడవు. అట్లు పలుకుట క్లేశము కూడ. కావున హల్లుకూడ అక్షరమని చెప్పబడుట కలదు. అచ్చుతోకూడిన హల్లు ప్రాణి అనబడును. అచ్చుప్రాణము. అచ్చులేక హల్లు అర్థము నొసగజాలదు. వర్ణమాల నేర్చుకొనునప్పుడు హల్లులను అకారము చేర్చిన వానినే పిల్లలకు నేర్పుట తప్పనిసరి యగును. హల్లుల ఉచ్చారణము అచ్చుల వలన సులభ మగును. అస్తు. వర్ణములనుండి అనగా హల్లులతోకూడిన ఏకాక్షరములు, అనేకాక్షరములు నైన ధాతువులు పుట్టును. ధాతువులకు తద్ధిత కృత్ప్రత్యయములు చేర్పబడినచో పదము లేర్పడును. పదములనుండి వాక్యము లేర్పడును. వర్ణధాతువు లర్థము నొసగుట వ్యాకరణ శాస్త్రజ్ఞుల యందుండును. లోకమున పదములు వాక్యములు అర్థము నొసగును.వాక్యమున ఒక కర్త, ఒక క్రియ తప్పక ఉండును. పొమ్ము, రమ్ము వంటి వాక్యములలో క్రియ ఒక్కటే ఉండినట్లు కనబడినను నీవు అనుకర్త అధ్యాహృతుడుగా నుండును. వాక్యములలోని పదములకు అర్థము లుండును. అవి పదార్థములు. వాక్యము మొత్తము యొక్క అర్థము వాక్యార్థము అనబడును. సాధారణముగా బ్రహ్మమున్నది, దేవుడున్నాడు, అన్న వున్నాడు వంటి వాక్యములు సిద్ధార్థ బోధక వాక్యములు. వీనికి ప్రామాణ్యము లేదని అనగా ఇవి ప్రమాణ వాక్యములు కావని **పూర్వమీమాంసకులు** చెప్పెదరు. **ఉత్తరమీమాంసకులు** వీనిని ప్రమాణములుగానే భావించెదరు. ఇటువంటి కొన్ని వాక్యములు కలిసినప్పుడు మహావాక్యమగును. కొన్ని వాక్యములు కలిసి ఒకపనిని చేయవలయును అని ఈ వక్త చెప్పుచున్నాడు అని శ్రోత తెలిసికొనును. అట్టి వాక్యములు విధిపరములని చెప్పబడును లేక ఒక పని చేయవలదు అని శ్రోత తెలిసికొన్నప్పుడు ఆ వాక్యములు నిషేధపరములు అనిచెప్పబడును. విధినిషేధపరవాక్యములకే శాసకత్వ

ముండుటచే అవియే శాస్త్రములని అవియే ప్రమాణములని పూర్వమీమాంసకు లందురు. మొత్తముమీద వాక్యముల నుండి విధినిషేధముల నొనరించు ప్రమాణము సిద్ధించుటచే వాక్యముల నుండి ప్రమాణమేర్పడును, అని శ్లోకమున చెప్పబడినది. ఇట్టి ప్రమాణవాక్యముల నుండి విధివిహితము నొనరింపక పోయినచో లేక నిషేధ విషయక కర్మమును చేసినచో నరకమేర్పడును. విధి విహితము నొనర్చినచో స్వర్గమేర్పడును. ఇటువంటి నిగమనములు సిద్ధములగును. దీనివలన సిద్ధాంత సమూహము లేర్పడును. ప్రతిశాస్త్రము నందును ఇట్టి సిద్ధాంతముల సమూహము లుండును. ఇవి తత్త్వవిషయకములైనచో అవి యన్నియు కలపి తత్త్వవిద్య అనబడును. ఈ తత్త్వవిద్య వేదాంతములందు అనగా ఉపనిషత్తులందు, తంత్రాగమములందును కనిపించును. ఉపనిషత్తులలో **ఏకమేవాద్వితీయమ్ బ్రహ్మ**వంటి తత్త్వప్రతిపాదక వాక్యము లెన్నియో ఉన్నవి. వేదములు, శాస్త్రములు, వేదాంతములన్నియు ఇంకను ఇతర వాఙ్మయ విభాగములన్నియు తత్త్వాభిముఖవిషయములనే పరంపరగా గాని సాక్షాత్తుగా గాని బోధించును. కావున నన్నయ మహాభారతము నందు కృష్ణుని గూర్చి వేదాది సమస్త వాఙ్మయములందు ప్రశంసితుడైనవాడు అని చెప్పినాడు. **సర్వే వేదా యత్పదమామనంతి** వంటి ఉపనిషద్వాక్యము లీయర్థమునే చెప్పినవి. 2) న్యాయవైశేషక దర్శనములలో పంచావయవ వాక్యములున్నవి. అవి అనుమాన ప్రమాణమును వివరించు సందర్భమున చెప్పబడినవి.

(1)పర్వతమున నిప్పున్నది (ప్రతిజ్ఞ) (2) పొగవలన (హేతువు) (3) ఎచ్చట పొగవుండునో అచ్చట నిప్పుండును. వంట యింటి యందు వలె (ఉదాహరణ) (4) ఈ కొండయందు అగ్నినుండి వచ్చు లేక నిప్పు లేనిదే ఉండని పొగయున్నది (ఉపనయము) (5) కావున ఈ కొండయందు నిప్పున్నది (నిగమనము)

పై పంచావయవ వాక్యములలోని చివరిది నిగమనము ఎక్కడ పొగవున్నదో అక్కడ అగ్ని ఉండును, అనునది (వ్యాప్తి) అనుమానప్రమాణము. పరార్థ స్వార్థానుమానములుగా ద్వివిధము. ఇది ప్రత్యక్షముగా పెక్కుచోట్ల చూచి నిర్ణయింపబడును. ఇట్టి అనుమానములలో పర్వతమందు పొగ ఉన్నది వంటి నిగమనము లేర్పడుచుండును. తమ మనసులో తాము నిశ్చయించుకొన్న ఈ అంశములను ఇతరులకు చెప్పుటలో పరార్థానుమాన ముపయోగించును. ఇందు కూడ పంచావయవవాక్యములు ప్రయోగింప బడును. ఒక్కొక్కప్పుడు వీనిలో పంచావయవ వాక్యములలో మొదటి మూడు గాని చివటి

మూడుగాని ప్రయోగింపబడిన చాలునని విద్వాంసులు వానినే ప్రయోగించెదరు. అప్పుడు తాము నిశ్చయించుకొన్న అంశమునే 'పర్వతము నందు పొగ ఉన్నది' అను నిగమనమునే ఇతరుల సమక్షమున చెప్పినప్పుడు ప్రతిజ్ఞ యగును. మొదటి మూడింటిలో మూడవది, చివఱి మూడింటిలో మొదటిది వ్యాప్తియే ఈ త్ర్యవయవ వాక్యములలో పదార్థాను మానమునకై ప్రయోగింపబడినప్పుడు వినువారిలో నిగమనము లేర్పడును. **'యత్పరః స శబ్దార్థః'** అను నియమము వలన వాక్యార్థములు వాని వలన సిద్ధించిన తాత్పర్యార్థము కూడ నిగమన రూపమే. ఇట్టి నిగమనముల వలన సిద్ధాంతము లేర్పడును. సిద్ధాంతములు విద్వత్సమూహముల సమావేశములలో ప్రకటింపబడుచుండును. చర్చల అనంతరము చివఱకు నిర్ణయింపబడినవి సిద్ధాంతములు కలిసి అవి తత్త్వవిషయకములైనచో **తత్త్వవిద్య** అనబడును. తత్త్వవిద్య సాధారణముగా యథార్థవిద్య అని భావింపబడును. పరమపురుషార్థ హేతువగు నీ తత్త్వవిద్యకు మించిన మరొక విద్య ఉండదు, లేదు.

**ఉదితములయ్యె వర్ణములనుండియె ధాతువులెన్నొ వాననే**
**పదములు వానవాక్యములు వానఁబ్రమాణములెన్నొ వానిలో**
**పొదలినవెన్నొ యుక్తులును బుట్టెను వానమతమ్ములెన్నొ నీ**
**పదమగు తత్త్వవిద్యయె ప్రభాసనమూర్తి పొకండ పొటచే.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భు వొక్కడే **పరతత్త్వమని** చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతని వాసాదులైన శ్మశానాదుల తాత్పర్యము వివరింపబడుచున్నది.

**శ్లో ॥ యజ్ఞస్థానం శ్మశానం సకలమితి గృహం భాస్వదోంకారపీఠం**
**ప్రాదుర్భూతప్రయాణస్థలమితి విపులం కల్పవృక్షాధిరూఢైః ।**
**సంవీతై ర్భైరవైశ్చోరగపతిగణపైస్తత్ర దివ్యార్ఘ్యపాత్రం**
**వహ్నిబ్రధ్నేందుక్లప్తం పరశివ సకలం వ్యశ్నుషే స్వాత్మనా త్వమ్ ॥ 49**

**ప్రతిపదార్థము :** శ్మశానమ్ = శ్మశానము, యజ్ఞస్థానమ్ = పూజ యొక్క చోటు, గృహమ్ = (పూజా) గృహము, సకలమ్ ఇతి = మొత్తము విశ్వమనునది, భాస్వదోంకారపీఠమ్ = ప్రకాశించు నోంకారమను పీఠము గలది, సంవీతైః = కప్పుకొనియున్న, కల్పవృక్షాధిరూఢైః = కల్పవృక్షమునెక్కిన, తత్ర = అచట, దివ్యార్ఘ్యపాత్రమ్ = దివ్యమైన అర్ఘ్యపాత్రము, భైరవైః = భైరవులచేత, ఉరగపతిగణపైః చ = నాగనాథుల చేత గణనాథుల చేతను, విపులమ్ = విశాలమైనది, ప్రాదుర్భూత ప్రయాణ స్థలమ్ ఇతి = ఆవిర్భవించిన దారి

అనునది, వహ్ని బ్రధ్నేందుక్లప్తమ్ = అగ్నిసూర్యచంద్రులచే సిద్ధమైనది, పరశివ! = ఓ పరశమ్భో! స్వాత్మనా = నీకు నీవే, సకలమ్ = మొత్తమును, **వ్యశ్నుషే** = వ్యాపించుచున్నావు.

**తాత్పర్యము :** పరశమ్భువునకు శ్మశానమే పూజాస్థానము. అచట ప్రకాశించు నోంకారమే పీఠముగా నున్నది. మొత్తము విశ్వము పూజాగృహము. అచటికి పోవుదారి కల్పవృక్షము నెక్కిన కప్పుకొన్న భైరవులు నాగనాయకులు గణనాయకులతో విశాలముగా నున్నది. అగ్ని సూర్య చంద్రులే అర్ఘ్య పాత్రలుగా నున్నారు. అంతట వ్యాపించుటయే ఆ నీ పూజాస్వీకారము.

**వివరణము :** కాశి కాని, కైలాసము కాని శివుని నివాసమైనచో అది శ్మశానము, మహా శ్మశానము. ఆయన లయకర్త. ఆయన ఉన్నచోట శ్మశానము కాకపోవుటెట్లు! ఈ ప్రపంచమున జీవులు చనిపోనిచోటు లేదు. కాని చచ్చిన జీవుల శరీరములు కాల్చుస్థానము శ్మశాన మొకటి ముఖ్యముగా ఏర్పాటు చేయబడి యుండును. దానిని రుద్రభూమియని కూడ అనెదరు. సమస్త జీవులే లయకర్తయగు రుద్రుని కాహారము కావున జీవులందఱు ఆతనికై బలియగు చుందురు, అట్టి బలిపెట్టు చోటు యజ్ఞస్థానము. యజ్ఞములో పశుబలి చేయబడుచుండును. ఒక జీవి చచ్చినచో బలి యనవచ్చును. దానిని చంపి బలి చేసినా మనుకొనవచ్చును. కాని సకలము సకల విశ్వము ఆతని కొఱకు జీవులు బలియగు స్థలము కావున అది యంతయు ఆతనికి పూజించు స్థానము. పూజలో నైవేద్యమే ముఖ్యమైన ఉపచారము. సమస్త జీవ నివేదనము జరుగుచోటు యజ్ఞస్థానమే అగును. ఈ సమస్త విశ్వమున ఆతడున్నాడు గావున ఈ విశ్వమంతయు నాతని పూజాగృహమే బలిస్థానమే, ఓంకారమున సమస్త విశ్వము నుపసంహరించుట **మాండూక్యోపనిషత్తునందు** చెప్పబడినది. ఓంకారపీఠముననే జీవుల బలిపెట్టుట జరుగుచున్నది. సర్వసమష్టివ్యష్టి జీవుల యుపసంహరణ పీఠమోంకారము. బలిపీఠము ఆ శ్మశానమునకు ప్రయాణస్థలము అనగా దారియై యున్నది. ఆ దారికి నిటునటు కల్పవృక్షములున్నవి. వానిపై నెక్కి భైరవులు వాసుక్యాదులు గణనాథులు దాగియున్నారు. ఆ దారి రాజవీథుల కన్నను విశాలముగా నున్నది. ఒక్కొక్క జీవుడు మరణించినప్పుడు వాని దహన సంస్కారము నిమిత్తము ఆ జీవుని స్థాయి ననుసరించి వందలకొలది వేలకొలది ఆతని బంధుమిత్రులు శ్మశానమునకు వచ్చుట పరిపాటి. వారందఱి ఊరేగింపుల కెంత విశాలముగా నా దారి యుండవలెను? ప్రయాణము లందలసిన వారి సేదదీర్చుటకు భైరవులు (కుక్కలు) నాగనాథులు (సర్పములు) వినాయక గ్రహాధి నాథులు తప్ప వేరెవరుందురు. మృత్యు సమయమున భీతిలు జీవులకు

భయంకర భైరవ నాగ వినాయక విగ్రహ నాయకులు తప్ప వేరెవరు కన్పించెదరు. (పక్షాంతరమున కైలాసమున కేగు దారిలో కల్పవృక్షములున్నవను పురాణ కథనము స్మరింపదగినది). పూజయందు అర్ఘ్యపాత్ర ఆవశ్యకము. పరశమ్భు పూజయందు అగ్నిసూర్యచంద్రుల చేతనే అర్ఘ్యపాత్రములు సిద్ధమై యుండును. **రాత్రి మరణించిన వారికి చంద్రుడు, పగలు మరణించిన వారికి సూర్యుడు, సంధ్యలలో మరణించిన వారికి అగ్నియు త్రోవజూపును.** ఆ తేజస్త్రయములో నేదో యొక్కటి పుణ్య జీవునావరించియే ఉండును. సర్వజీవుల నావరించి సర్వవిశ్వమును గ్రసించు పరశమ్భువు సర్వము ననుభవించుచు సర్వమును వ్యాపించియే యుండును. అగ్ని ప్రాణాగ్ని మనో బుద్ధులు చంద్ర సూర్యులు, స్థూల శరీరమును విడచి పోవునప్పుడు పై మూడు తేజములతో కూడియే పోవును. జీవులు జ్ఞానాగ్ని స్వరూపుడు అగు శమ్భువును చేరి ఆతని యందు లీనమగుదురు. అప్పుడే పరమశాంతి. సంపూర్ణ ప్రలయకాలము నందలి శాంతి మించిన శాశ్వత శాంతి జీవులకు లభించును. జీవన మంతయు పరశమ్భువు పూజయే. విశ్వమంతయు నాతని యజ్ఞమునకు (పూజకు) స్థానమే. విశ్వమంతయు నాతని గృహమే. పరశమ్భువు యొక్క ప్రతీకములుగా సూర్యచంద్రాగ్నులు ఉపాసింపబడును. ఆతని ప్రతీకములగుటచేతనే అవి అర్ఘ్యము యొక్క (పూజ్యము యొక్క) పాత్రములు (ఆధారములు).

**సకలముగేహమౌ యజన సద్మము కాదగు పీఠమోంకృతి**
**ప్రకటము యానభూమి ప్రచురమ్మగు కల్పమహీజరూఢులౌ**
**నకలుష భైరవోరగగణాధిపులన్ కలదర్ఘ్యపాత్ర పా**
**వక రవిచంద్రక్లప్తము శివా! యఖిలమ్ము భజింతు స్వాత్మచే.**

**అవతారిక :** పై శ్లోకము యొక్క ఆరంభపదమైన యజ్ఞశబ్దము చేత **యజ్ఞపూజలు** ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున యజ్ఞమున ముఖ్యమైన **హోమము హోమకర్తలు హోమ సంప్రదాన రూప పరశమ్భువు** వర్ణింపబడుచున్నారు.

**శ్లో॥ చిత్పూజాదృక్క్రియాత్మా గురుకథితమహోరుద్రమూర్తిస్సమంతా-**
**దాత్మీయైరంగదేవైరధిగతతృషయాఽఽజ్యాహుతిర్నిర్వికల్పః ।**
**నిష్కామైరాత్మకామైరుపచితయజనైశ్చిత్స్వతంత్రైరతంద్రై-**
**రాత్మాగ్నౌ బ్రహ్మవిద్యాపరిణతమతిభిః శ్రీవిభో! హూయసే త్వమ్ ॥ 50**

**ప్రతిపదార్థము :** శ్రీవిభో! = ఓ శ్రీవిభుడా! చిత్పూజా దృక్క్రియాత్మా = చిత్పూజా దృక్క్రియా

స్వరూపుడవు, గురుకథితమహారుద్రమూర్తిః = గురువుచే చెప్పబడిన మహారుద్రమూర్తివి, సమంతాత్ = చుట్టు(అంతట), ఆత్మీయైః = ఆత్మీయులైన. అంగదేవైః = అంగదేవతలచేత, అధిగతతృషయా = పొందిన దప్పిక చేత, ఆజ్యాహుతిః = ఆజ్యాహుతి (నీకై ఈయబడినది), నిష్కామైః = నిష్కాములైన, ఉపచితయజనైః = పెంపొందించిన పూజలుగల, చిత్స్వతంత్రైః = స్వతంత్ర చిద్రూపులైన, అతంద్రైః = సోమరితనములేని, బ్రహ్మవిద్యాపరిణతమతిభిః = బ్రహ్మవిద్యచే పరిపక్వములైన బుద్ధులు గలవారిచేత, ఆత్మాగ్నౌ = ఆత్మాగ్నియందు, నిర్వికల్పః = వికల్పములు లేని, త్వమ్ = నీవు, **హూయసే** = హోమింప బడుచున్నావు.

**తాత్పర్యము :** గురుకథిత మహారుద్రమూర్తియైన పరశమ్భువు చిత్పూజయను దృక్క్రియ స్వరూపముగా గలవాడు. ఆత్మీయులైన అంగదేవతలచే దప్పిగొన్న ఆ పరశమ్భువునకై ఆజ్యాహుతి ఈయబడుచున్నది. నిష్కాములు ఆత్మకాములు స్వతంత్ర చిద్రూపులై సోమరితనములేని బ్రహ్మవిద్యపరిణతమతులచే పరశమ్భువు నుద్దేశించి ఆత్మాగ్నియందు హోమము చేయబడుచున్నది.

**వివరణము :** రుద్రుడు లయకర్త. బ్రహ్మవిష్ణురుద్రుల సృష్టిస్థితిలయముల నొనర్చువాడు మహారుద్రుడు అనగా పరశమ్భువు. ఆ మహారుద్రమూర్తి యెట్లుండునో గురుముఖముగ నెఱుగవలెను. ఆతనికి పూజ చేయవలెను. పూజ కుపచారము కావలెను గదా. స్వాత్మ చిదర్పణమే ఆ యుపచారము. ఆ పూజ ఆ యుపచారము యథార్థముగ ఉపచారము. ఔపచారికమైన ఉపచారము అనగా స్వాత్మ చైతన్యముతో ఆ రుద్రమూర్తి యొక్క చైతన్యము నభిన్నముగ భావించుటయే **ఆ యుపచారము**. ఉపచారము అనగా సేవ ద్రవ్యసమర్పణము లేక సమర్ప్యమాణ ద్రవ్యము. వీనిలో సమర్పణము క్రియారూపము. దాని కొక కర్తకావలెను. ఇచ్చట సమర్పణకర్తకు సమర్పణ సంప్రదానమునకు అనగా ఏ శమ్భువు నుద్దేశించి సమర్పణము చేయబడుచున్నదో ఆ శమ్భువునకు భేదములేదు. అట్లు భేదము లేదని భావించుటయే ఈ క్రియ. సమర్పణ కర్త దృగ్రూపుడు. సమర్పణ సంప్రదానరూప పరశమ్భువు దృగ్రూపుడు. సమర్పణ కర్త చేయు నీ భావనారూపసమర్పణము దృక్కు యొక్క క్రియ. దృక్కునందు వాస్తవిక క్రియ లేకున్నను జీవ భావమున సమర్పణ క్రియ సంభవించును. ఈ యర్థము **చిత్పూజాదృక్క్రియాత్మా** అను సమాసమున తెలుపబడినది. ఈ విధమైన పూజాక్రియ మానసిక పూజాక్రియ. జీవ పరశమ్భువులలో జీవుడు పూజకుడు, పరశమ్భువు పూజ్యుడు. మానసికముగ చేయు నీ పూజ చిత్పూజ లేక దృక్క్రియ పూజ్యపూజక భేదము అనగా జీవేశ్వరభేదము పరశమ్భువునందు వికల్పితము. ఆ వికల్పితమున

జీవునందువలే ఆ పరశమ్భువునందు అంగాంగి భావమేర్పడినది. ఇంద్రియములు వాని స్థానములైన చక్షుర్గోళాదులు అంగములు, ఇంద్రియములు సూక్ష్మములు, అవయవములు స్థూలములు, అన్నియు అంగములే. అంగి పరశంభువు. అంగములు అంగి కొఱకైనవి అనగా పరార్థములు. అంగములకు పారార్థ్యము స్వభావసిద్ధము. ఇంద్రియములకు ప్రాణములకు వాచకముగ దేవశబ్దము ఉపనిషత్తులలో కనపడును. **'సర్వేస్మై దేవా బలిమావహంతి'** అను వాక్యము శబ్దస్పర్శాది విషయరూప బలులను శ్రోత్రాదీంద్రియ దేవతలు సమర్పించుదురు అని ఆ శ్రుతి వాక్యమున కర్థము. పరశమ్భువు అంగి దేవత. దిగ్వాతార్క ప్రచేతో శ్వ్యగ్నీంద్రోపేంద్ర మృత్యు ప్రజాపతులు అను దేవతలు పరశమ్భువుయొక్క అంగములు కావున వారు అంగదేవతలు మంత్రరూపియైన పరశమ్భువు యొక్క హృదయశిరశ్శిఖాకవచ నేత్రాస్త్రములు షడంగదేవతలు ఆఱుగురు. వీరు షడంగదేవతలు అని పేర్కొనబడెదరు. ఏమంత్రమున కైనను వీరు అంగదేవతలు. జీవుని అంగములు పరశమ్భువు యొక్క అంగములు వ్యష్టి సమష్టి భావము కలిగినట్టివి. ఈ వ్యష్టి అంగములకు పైన పేర్కొనబడిన వారే అధిదేవతలు. ఆ పరశమ్భువు యొక్క అంగములైన సూర్యాదిదేవతలు అంగ దేవతలు. ఆజ్యమనగా సామాన్యార్థము మేకనేయి లేక సాధారణమైన నేయి. అజమనగా మేక అని ఒక అర్థము. **'అజామేకాం లోహితశుక్లకృష్ణామ్'** అను శ్రుతి ననుసరించి ప్రకృతి **అజ** అనబడును. ప్రకృతి సంబంధమే ఆజ్యము. ఆ దేవతలు జ్ఞానముతో తమ ప్రకృతి సంబంధము వీడుదురు. అనగా ఆజ్యమును అనగా ప్రకృతి సంబంధమును ఆత్మాగ్నిలో ఆహుతి చేయుదురు. స్వైహిక పారలౌకిక వైరాగ్యము కలవారు నిష్కాములు. వారు ఆత్మప్రాప్తికై సర్వకామముల త్యజించి నట్టివారు కావున వారు ఆత్మకాములు. వారు పైన చెప్పిన విధముగా మానసికమైన పూజావిధానమును పెంపొందించుకొని ఉపాసనామార్గమును సంపూర్ణ మొనరించుకొని ఆత్మాగ్ని వగు నీ యందు తమ జీవ భావమును హవ్యముగా నొనరించుకొని హెూమము చేయుచున్నారు సర్వమును నీ యందు ప్రవిలాపన మొనర్చుటయే ఇచట వారి హెూమము. వారు బ్రహ్మవిద్యాపరిణతమతులుకదా. తనది అనుదానిని (మమకారమును) మొదట అహుతి చేసి తాను అనుదానిని (అహంకారమును) ఆహుతి చేయుటలో ఈ హెూమము పరిసమాప్తము. పరశమ్భువుతో ఐకాత్మ్యమే మిగిలి పోవును.

**గురుకథితుండు శమ్భుడె యగున్ చితిపూజనదృక్క్రియాత్మ సం**
**గ రుచిరదేవతా విషయకమ్రఘృతాహుతి నిర్వికల్పుడున్**

**స్వరతనిరీహ విజ్ఞజనసంతతి చేత నిజాత్మవహ్నిలో**
**నిరతము హూయమానుడవు నీవె మహేశ్వర! దేవ! శ్రీవిభూ!**

**అవతారిక :** పై శ్లోకమున యజ్ఞాంగమైన **ఆజ్యాహుతి** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున సమిధాది యజ్ఞాండములు ప్రస్తావింపబడుచున్నవి.

**శ్లో ॥ ద్వైతం యత్రానఘేధ్మం పశురధిపిశితో మృత్యురక్షాణి జిహ్వా-**
**హవ్యం చాథ ప్రబోధః ప్రకటహుతవహో నిర్మలాత్మైవ హోతా!**
**అధ్వర్యుః స్వచ్ఛచేతో గురుముఖవిదితా మాతృకోద్గాతృవర్గః**
**స్వాచార్యో దేశికేంద్రః పరమఖభుగసి త్వం పరః శమ్భురీశః ॥ 51**

**ప్రతిపదార్థము :** అనఘ! = ఓ పాపహీనుడా!, యత్ర = ఎచట, ద్వైతమ్ = భేద భావము, ఇధ్మమ్ = సమిధయో, అధిపిశితః = అధికమాంసము గల, మృత్యుః = మృత్యువు, పశుః = పశువో, అక్షాణి = ఇంద్రియములు, జిహ్వాః = నాలుకలో (జ్వాలలో), అథ చ = పిమ్మటను, ప్రబోధః = జాగ్రదవస్థ, హవ్యమ్ = హోమద్రవ్యమో, నిర్మలాత్మైవ = స్వచ్ఛమైన ఆత్మయే, హోతా = హోతయో, స్వచ్ఛచేతః = నిర్మలచిత్తము, అధ్వర్యుః = అధ్వర్యువో, గురుముఖవిదితా = గురుముఖమున తెలియబడిన, మాతృకా = మాతృక, ఉద్గాతృవర్గః = ఉద్గాతృ సమూహమో, దేశికేన్ద్రః = గురుసార్వభౌముడు, స్వాచార్యః = తన ఆచార్యుడో (బ్రహ్మమో) (ఆ యజ్ఞమున), పరమఖభుక్ = శ్రేష్ఠయజ్ఞభోక్తవు, ఈశః = దేవతవు (యజ్ఞప్రభుడవు), పరః = ఉత్కృష్టుడవైన, శమ్భుః = శమ్భుడవు, త్వమ్ = నీవు, **అసి** = అగుచున్నావు.

**తాత్పర్యము :** పరమఖమున అనగా శ్రేష్ఠయజ్ఞమున ద్వైతభావమే సమిధ. అధిక మాంసముగల మృత్యువే పశువు. ఇంద్రియములే అగ్నిజిహ్వాలు, జాగ్రదవస్థయే హవ్యము, నిర్మలాత్మయే హోత, స్వచ్ఛమైన మనస్సే అధ్వర్యువు. గురుముఖవిదితమైన మంత్రమాతృకయే ఉద్గాతృవర్గము, గురుసార్వభౌముడే బ్రహ్మ, ఇవి యన్ని పరమఖాంగములు. ఈ పరమఖము యొక్క భోక్త పరదేవతయైన పరశమ్భువే.

**వివరణము :** యజ్ఞమున ఆజ్యము, సమిధలు, చరువు, పురోడాశము మొదలగునవి హవ్యద్రవ్యములు. పశువిశసనముకల యజ్ఞమున పశువు వధింపబడును. యజ్ఞమున కనీసము నలుగురు ఋత్విక్కులుందురు. 1) **హోత** – ఈయన ప్రధానముగా ఋగ్వేదమంత్రముల స్వాహాంతముగా పఠించుచు హవ్యమును ప్రధానముగా ఆజ్యమును

సృక్స్రువములతో అగ్నిలో హోమ మొనర్చును. 2) **అధ్వర్యుడు** – ఈయన ప్రధానముగా యజుస్సులను పఠించుచు యాజ్ఞిక క్రియా కలాపమును నిర్వహించును. 3) **ఉద్గాత** – ప్రధానముగా సామవేద మంత్రములను ఉచ్చైస్వరమున శాస్త్రానుసారము సప్తస్వరముల సమ్మేళించుచు పఠించును. 4) **బ్రహ్మ** – అన్ని వేదములను ఎఱిగి యున్నను ప్రధానముగా అథర్వవేదమంత్రముల పఠించుచు యజ్ఞవిఘ్నముల దొలగించుచు, యజ్ఞ నిర్వహణమున ఎట్టి లోపములు రాకుండ లోపములు కలిగినచో చేయవలసిన ప్రాయశ్చిత్తముల జేయించుచు మొత్తము యజ్ఞమున పై ముగ్గురికన్న అధికమైన బాధ్యత వహించును. 2) తైత్తిరీయారణ్యకమున ఆధ్యాత్మిక యజ్ఞము చెప్పబడినది. అందు ఆత్మ యజమానుడు, శ్రద్ధ పత్ని, శరీర మిధ్మ మిత్యాది ఆధ్యాత్మికములే యజ్ఞద్రవ్యములుగా రూపింపబడినవి. ఈ శ్లోకమున ఆ విధమైన ఆధ్యాత్మిక యజ్ఞము కొంచెము భిన్నముగా నిరూపింపబడినది. తాత్పర్యమున తైత్తిరీయ ప్రతిపాదిత యజ్ఞముతో విభేదించదు. ఆధ్యాత్మికమైన ఈ యజ్ఞము **పరమఖమని** శ్లోకమున చెప్పబడినది. పరమఖమనగా శ్రేష్ఠమైన యజ్ఞము. ఇది ఒక విధమైన జ్ఞాన యజ్ఞము. భగవద్గీతలో **'శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాద్జ్ఞానయజ్ఞం పరంతప'** అని ద్రవ్య యజ్ఞమున కన్న జ్ఞానయజ్ఞము మిన్న అని చెప్పబడినది. ఈ యజ్ఞమున ద్వైతభావమే ఇధ్మము. ఇధ్మమనగా సమిధ. సమిద్హోమమున సమిధ అగ్నిలో వ్రేల్చబడును. ఈ యజ్ఞమున ద్వైతభావము ఆత్మాగ్నిలో వ్రేల్చబడును. ఈ యజ్ఞమున పశువు కూడ విశసింపబడును. కాని ఆ పశువు సాధారణ పశువు కాదు. మృత్యువే ఇట పశువు. యజ్ఞమున విశసనీయమైన పశువు బలిసినదిగా వుండవలెను. జీవు లెందఱినో మ్రింగిన మృత్యువునకన్న బలసిన పశువు మరియొకటి ఎచట లభించును. ఈ యజ్ఞమున మృత్యు పశువు విశసింపబడినదా మృత్యుంజయత్వము సిద్ధించునని భావము. చరు పురోడాశాది ద్రవ్యములకు బదులుగా నీ యజ్ఞమున జాగ్రదవస్థయే హవ్యముగా నుండును. ఇంతకు యజ్ఞమున ముఖ్యముగా హోత ఉండవలెను గదా! ఈ యజ్ఞమున హోత ఏడి? ఈ యజ్ఞమున ఆత్మయే మొదటి ఋత్విక్కు హోత. సర్వోపాధివర్జితమైన ఆత్మ నిర్మలమని చెప్పబడును. మనుష్యత్వ బ్రాహ్మణత్వాద్యుపాధులు చివఱకు జీవత్వేశ్వరత్వోపాధులుకూడ మలరూపములే. తద్వర్జితమైన అనగా నిర్మలమైన ఆత్మయే హోత. ఆత్మకు వాస్తవముగా మాలిన్యము అనునది ఉండదు. కాని ఉపాధి దోషము (ఆత్మ) దోషముగా చెప్పబడును. కావున ఈ యజ్ఞమున నిర్మలాత్మయే హోతగా చెప్పబడినాడు. అగ్నిని మండించుట **హోత** యొక్క మొదటి పని. హోమము రెండవపని. సర్వవిషయజ్ఞానాగ్నులను ప్రకటించున

దాత్మయే. అందుచేత **ప్రకటహుతవహ** అను విశేషణము శ్లోకమున నిర్మలాత్మకు గూర్పబడినది. ఈ యజ్ఞమున ఇంద్రియములే అగ్నిజిహ్వాలు. వానిలో విషయములను హవిర్ద్రవ్యములు వ్రేల్పబడును. ఈ యజ్ఞమున స్వచ్ఛమైన చిత్తమే **అధ్వర్యువు** అను రెండవ ఋత్విక్కు. ఉపాసనాది మానసిక క్రియలు నిర్వర్తించుటలో చిత్తముయొక్క స్థానమును బట్టి అది అధ్వర్యువని చెప్పబడుట సముచితముగానే ఉన్నది. ఇక మూడవ ఋత్విక్కు ఉద్గాత. ఈ యజ్ఞమున గురుకథితమైన మంత్రమాతృకయే ఉద్గాతృవర్గమని చెప్పబడినది. వర్ణమాలలోని వర్ణము ఏదైనను మాతృక యనబడును. మంత్రములోని వర్ణము మంత్రమాతృక మనబడును. మంత్రములో వర్ణముల సముదాయముండును. కావున ఇట ఒక ఉద్గాత అనికాక ఉద్గాతృవర్గము చెప్పబడినది. అఘోరమంత్రోపదేష్టయగు దేశికసార్వభౌముడు ఈ యజ్ఞమున స్వాచార్యుడుగా చెప్పబడి నాడు. ఋత్విక్కులలో శ్రేష్ఠుడైన బ్రహ్మ ఈ శ్లోకమున స్వాచార్య శబ్దమున చెప్పబడినాడు. సాధారణముగ దేవతలు హవిర్భుక్కులు. ఈ పరమఖమున పరదేవతయైన శంభువే హవిర్భుక్కు, మఖభుక్కు అనగా యజ్ఞ భోక్త.

**హోర్యము ద్వైతమిధ్మమగు నామిషయుక్పశువంతమక్షముల్**
**హోర్యము నాల్క హవ్యములు ఆత్మయె హొతయగున్ సుచిత్తమ**
**ధ్వర్యువు సామగాయకము భవ్య గురూదిత మాతృకాలి ఆ**
**చార్యుడు దేశికుండె పరశమ్భుడ వీవు మఖాదివీశ్వరా!**

**అవతారిక :** పై శ్లోకమున ఆధ్యాత్మికమైన ఒకానొక **జ్ఞానయజ్ఞ ప్రకారము** వర్ణింప బడినది. ఈ శ్లోకమున ఇతర యాగములు పశుకృతములు అని అవియన్ని కర్మను పెంచునవియని చెప్పబడుచున్నది.

**శ్లో ॥ యాగాశ్చాన్యే సకామైః పశుభిరిహ కృతాః సర్వసిద్ధాంతకృత్యా-**
**నానాయజ్ఞక్రియాశ్చ త్రిభువనభవనే చిత్రకర్మప్రసారాః ।**
**విశ్వోత్పత్తిప్రతిష్ఠావిహరణవిధయః స్వక్రియాశక్తిబీజాః**
**సంజాతాస్సర్వతస్త్వం ప్రభవసి మనసా చిత్రనిర్మాణమూర్తే! ॥ 52**

**ప్రతిపదార్థము :** చిత్రనిర్మాణమూర్తే! = చిత్రనిర్మాణమూర్తిగల వాడా !, ఇహ = ఈ లోకమున, సకామైః = కోరికలు గల, అజ్ఞానులైన, పశుభిః = జీవులచేత, కృతాః = చేయబడిన, అన్యే = ఇతరములైన, యాగాః చ = యాగములును, త్రిభువనభవనే =

త్రిభువనమను భవనమందు, చిత్రకర్మప్రసారాః = చిత్రములైన కర్మల ప్రసారములుగల, సర్వసిద్ధాంతకృత్యాః = సర్వసిద్ధాంతములనే చేయదగిన, యజ్ఞక్రియాః చ = యజ్ఞక్రియలును, విశ్వోత్పత్తి ప్రతిష్ఠావిహరణ విధయః = విశ్వము యొక్క ఉత్పత్తి స్థితి లయముల విధులుకల, స్వక్రియాశక్తి బీజాః = నీక్రియాశక్తి యొక్క విత్తనములు, సంజాతాః = పుట్టినవి, త్వమ్ = నీవు, సర్వతః = అంతట, మనసా = మనసుతోడనే, **ప్రభవసి** = పుట్టుచున్నావు, సమర్థుడ వగుచున్నావు, ఏలుచున్నావు.

**తాత్పర్యము :** యాగములు అజ్ఞానులైన జీవులచే చేయబడునవి పెక్కులున్నవి. సర్వసిద్ధాంతావలంబులాచరించు యజ్ఞక్రియలు పెక్కులున్నవి. అవి త్రిభువన భవనమున చిత్రకర్మలు విస్తారములై ఉన్నవి. అవి సమష్ట్యపూర్వరూపములై విశ్వోత్పత్తిస్థితిలయములకు హేతువులగుచున్నవి. ఓ చిత్రముగా నిర్మాణము నొనర్చు ఓ పరశమ్భూ !నీ క్రియాశక్తి యొక్క బీజములు అంతట యజ్ఞరూపమున పుట్టి యున్నవి. నీవు మనసుతోడనే అన్ని చేయగల సమర్థుడవు.

**వివరణము :** పశువులనగా అజ్ఞానులు. అజ్ఞానముతో బ్రహ్మరూపమైన తనను అబ్రహ్మగా జీవునిగా చూచువాడు అను అర్థము **పశు**శబ్దమున కున్నది. ప్రపంచమును బ్రహ్మగా దర్శింపక సుఖదుఃఖసాధనముగా దర్శించువాడు అజ్ఞజీవుడు. జ్ఞానియైన వాడు తనను జగమును బ్రహ్మగానే దర్శించును. స్వర్గాది ఫలములందు కోరికలు గలవారు సకాములు. అట్టి పశుభావము గల జీవులు ఈ శ్లోకమున పశుశబ్దముచే చెప్పబడినారు. ఇట్టి కోరికలతో యజ్ఞములందు పశువిశసనముచేయించు తాము పశువులమను మాట మఱచి జ్ఞానుల మనుకొనువారు పశువులు. అజాది పశువులు తమకు స్వాధీనములు కావున వానిని హింసించు పశుకర్మను చేయువారు పశువులు. పశువులు తమ సౌఖ్యము కొఱకు ఇతర పశువుల హింసించును. అట్లే తమ సుఖముకొఱకు పశువుల హింసించు వారు పశువు లనుటలో తప్పేమి? పశువులు కాపరిచే బంధింపబడి విడువబడుచుండును. అట్లే జీవులు పరశమ్భువుచే బంధింపబడి విడువ బడుచుండును. కావున పశువులన బడినారు. ఇట్లు జీవుల యజ్ఞాది కర్మలన్నియు సమష్టిరూపమున సుఖదుఃఖసాధన విశ్వోత్పత్తిస్థితిలయ హేతువులుగా నుండుటచే అవి చిత్రకర్మ ప్రసారములని చెప్పబడినవి. భోగముల కలిగించి వారిని మరల తద్భోగసాధనకర్మలందు ప్రేరేపించుటచే కర్మలు విస్తరించుచుండును. అవియన్నియు పరమేశ్వరుని క్రియాశక్తియను మహాబీజమునుండి పుట్టి శాఖోపశాఖలుగా విస్తరించి విశ్వవృక్షముగా రూపొంది మరల ఆ విశ్వవృక్షమునం దన్ని వైపుల బీజములై

జీవుల పునః పునర్జనన మరణ ప్రవాహ సంసారమున పశుపతియైన పరమేశ్వరుని చేతిలోని బంధన రజ్జువులుగా జీవుల బంధించును. నిష్కామ కర్మను తత్త్వశాస్త్రోక్త ప్రకారమాచరించి పరమేశ్వరునిచే విడువబడు చుండును. 2)పరమేశ్వరుడు స్వతంత్రుడు కావున కర్మాధీనుడై సృష్ట్యాదులనొనర్పడు. స్వతంత్రముగానే లీలారూపమున విలాసరూపమున సృష్ట్యాదుల నొనర్చును. లేక సృష్ట్యాదుల నొనర్చుట పరమేశ్వరుని స్వభావము కావున సృష్ట్యాదుల నొనర్చును. జడకర్మ పురుషుడొనర్చి పరమేశ్వరు సంతోషింప జేయవలెను. చేతనుని సంతసింప జేయజాలని జడకర్మ స్వతంత్రముగా ఫలము నొసంగ జాలదు. కావున బద్ధజీవులు నిష్కామముగా పరమేశ్వరరూపముగా వైదికకర్మల నాచరింపవలెను. పరమేశ్వరుడు సంతసించి జీవులకు సుఖదుఃఖములనో తదతీతమైన మోక్షహేతువైన అద్వైతవాసననో జ్ఞానమునో అనుగ్రహించును. కావున పరమేశ్వరుని ప్రభవసి ప్రభుత్వము చేయుదువు. సృష్ట్యాదుల నొనర్ప జాలినవాడవు అని కవి ఈ శ్లోకమున ప్రశంసించియున్నాడు. ఉపనిషత్తున పరమేశ్వరు డెవని నుద్ధరింపదలచినాడో వానిచే సత్కర్మల నొనరింప జేయునని క్రింద కెవరిని పంపగోరునో వారిచేత పాపకర్మల జేయించునని యున్నది. అన్నిటికిని స్వతంత్రుడు పశుపతి, పరతంత్రుడు పశువు. పరతంత్రుడైన పశువు తన రక్షణాది భారము నంతను పరశమ్భువు నందుంచి నిశ్చింతగా నుండవచ్చును. అట్లుండుటయే శరణాగతి. తన భారమును పరమేశ్వరునందు మోపుటయే **భరన్యాసము**. పాశుపతమతసిద్ధాంత మొకించుక ఈ శ్లోకమున సూచింపబడినది.

**కామిపశుప్రవృత్త ఘన కర్మములన్యములన్నియున్ ద్రిలో**
**కీమహితాలయమ్మున వికీలిత చిత్రకృతి ప్రసారముల్**
**స్వామి సమస్తవిశ్వజనివర్తననాశవిధుల్ భవత్క్రియా**
**సీమిత శక్తిబీజములె చిత్రవినిర్మితమూర్తికా! శివా!**

* * *

## -- కుండలినీశక్తి స్కంధరశ్మి ప్రకరణమ్ --

కుండలినీ శక్తి స్కంధరశ్మి ప్రకరణము– పై ప్రకరణమున ముఖ్యముగా పై శ్లోకమున పరశమ్భువు యొక్క క్రియాశక్తి ప్రకారములైన సృష్టిస్థితిలయములు వానికి ప్రేరకములైన సమష్టి జీవుల కర్మములు వానివలన కలుగు ఈశ్వర సృష్టీచ్ఛాదులు జీవుల వ్యష్టికర్మలు, (యజ్ఞయాగాది) సత్కర్మలు వివరింపబడినవి. ఈ ప్రకరణమున ముఖ్యముగా

నీ శ్లోకమున పరశమ్భువు యొక్క **కుండలినీశక్తి స్వరూపాదులు** వివరింపబడుచున్నవి.

**శ్లో ॥ నిత్యాలుప్తాత్మశక్తిః సకలతిథిఫణాపంచదశ్యా ప్రదీప్త-**
**స్త్రుట్యాదీన్ కాలవాయూన్ గ్రసదురురసనశ్చక్రవల్మీకవర్తీ ।**
**సమ్యక్చైతన్యగుమ్ఫైరవగతకిరణో విశ్వజృమ్భైకభర్తా**
**కృష్ణాధ్వార్కేందుయోనిర్భుజగపతితనుస్త్వం తతః కుండలీశః ॥ 53**

**ప్రతిపదార్థము :** నిత్యాలుప్తాత్మశక్తిః = ఎల్లప్పుడు లోపించని ఆత్మశక్తిగల, సకలతిథిఫణాపంచదశ్యా = కలలతోగూడిన పదేను తిథులనెడు పడగలచేత, ప్రదీప్తః = ప్రకాశించిన, త్రుట్యాదీన్ = త్రుటిమొదలగు, కాలవాయూన్ = కాలవాయువులను, గ్రసదురురసనః = మ్రింగు చున్న గొప్ప నాలుకలుగల, చక్రవల్మీకవర్తీ = చక్రములనెడు పుట్టలలో నివసించు, సమ్యక్చైతన్యగుంఫైః = మంచి చైతన్యపు గుత్తులతో, అవగతకిరణః = తెలియబడిన కిరణములుగల, విశ్వజృమ్భైకభర్తా = విశ్వమనెడి ఆవులింతకు ఏకైక ప్రభువైన, కృష్ణాధ్వార్కేందుయోనిః = అగ్ని సూర్య చంద్రులకు హేతువైన, త్వమ్ = నీవు, భుజగపతితనుః = సర్పనాయక శరీరము గలవాడవు, తతః = అందువలన, కుండలీశః = కుండలులకు ఈశ్వరుడవు కుండలినీశక్తి కీశ్వరుడవు.

**తాత్పర్యము :** పరశమ్భువు ఎల్లప్పుడు లోపించని ఆత్మశక్తి గలవాడు. కలలతో కూడిన పదేను తిథులనెడి పడగలతో వెలిగినవాడు. త్రుట్యాది కాలవాయువుల మ్రింగు గొప్పనాలుకలు గలవాడు. చక్రములను పుట్టలలో వర్తించువాడు. చైతన్యపుబుసలచే తెలియబడు కిరణములు గలవాడు. విశ్వమును ఆవులించువాడు. అగ్ని సూర్య చంద్రులకు హేతువు. సర్పపతిశరీరము గలవాడు కావుననే కుండలినీశు డనబడు చున్నాడు.

**వివరణము :** సర్వజ్ఞతే త్యాది శ్లోకములో వ్యస్తములై ఉన్న నిత్యమలుప్తశక్తిః అనుపదములే ఈ శ్లోకమున నిత్యాలుప్తాత్మశక్తిః అను సమాసరూపము ధరించినవి. ఆయన ఆత్మశక్తి ఎన్నడును లోపించనిదని అర్థము. ఆతని ఆత్మ శక్తి లోపించనిది మాత్రమే కాదు దానిలో ఎక్కువ తక్కువలు లేక అది ఎప్పుడు పూర్ణముగనే ఉండును. అట్టి ఆ పరశమ్భువొక మహానాగరాజు. ఆతనికి పదేను పడగలున్నవి. పదేను తిథులే పదేను పడగలు. ఆ పడగలలో కలాభేదములున్నవి. అనగా ప్రతిపదమందొక కల, ద్వితీయ యందు రెండు కలలు. ఈ క్రమముగ పూర్ణిమ యందు పదేను కలలుండును. పదారవకల చంద్రుడు. సూర్యునితో ఐక్యమగునట్టి అమావాస్య యందుండును. అమా అనగా చంద్రుని పదారవకల.

అది శివుని శిరోభూషణము. ఆ అమాకల ఉన్నందున అమావాస్యకు అమావాస్య అను పేరువచ్చినది. 'అమా అస్యాం వసతీతి' అనిగాని, 'అమావాస్యాయస్యామ్' అనిగాని అమావాస్యాశబ్దము యొక్క వ్యుత్పత్తులను పెద్దలు చెప్పియున్నారు. శమ్భు నాగరాజునకు తిథులపడగలు చెప్పబడినవి. సరే. నాగరాజునకు వాయువు ఆహారమందురు. నాగము వాయువు ఆహారముగా గలది అను ప్రసిద్ధి కూడ లోకమున ఉన్నది. ఈ పరశమ్భు నాగరాజు త్రుట్యాది కాలములనే గ్రసించు చుండును. పరశమ్భువునకు కాలకాలుడను పేరున్నది. కాలమును మ్రింగువాడు అని దాని అర్థము. కాలమఖండమే యైనను దానియందు త్రుట్యాదులు (కల్పాంతములైన అనేక పరిమాణములు గల ఖండములు) కల్పింపబడినవి. ఈ పరశమ్భు నాగరాజు కాలవాయువుయొక్క అణువులవంటి చిన్నిముక్కలను త్రుటులు మొదలగు వానిని మ్రింగు చుండును. ఇదే పరశమ్భు నాగరాజుయొక్క కాలకాలత్వము. కాలవాయువు నాహారముగా కొను విధానము నాగరాజు వలె పరశమ్భువు శరీరములోని మూలాధారాది చక్రములనెడు వల్మీకములందు అనగా పుట్టలలో తిరుగు చుండును. నాగరాజు బుసలుకొట్టును. ఈ పరశమ్భు నాగరాజు చైత్యన్యపు బుసలుకొట్టును అనగా చైతన్యకిరణములున్నవవి తెలియును. ఊపిరివిడచుట, మాట్లాడుట మొదలగు జీవక్రియలచేత జీవుని శక్తులు తెలియబడును. వృత్తి జ్ఞానకిరణములవలన ఆత్మచైతన్యకిరణము లవగతములగుచుండును. పరశమ్భువు నాగరాజు ఆవులించునప్పుడు సకల విశ్వ మాతని నోట కనబడును. కావున **విశ్వజృమ్భైకభర్తా** అని శ్లోకమున చెప్పబడినది. అగ్నిసూర్యచంద్రులు తేజస్త్రయము అని చెప్పబడును. ఈ మూడు తేజము లా శమ్భువు ముఖమున మూడు నేత్రములుగా నున్నవి. అట్లే శరీరమందలి **మూలాధార స్వాధిష్ఠానము లగ్ని ఖండమని** లేక అగ్ని మండలమని లేక అగ్ని కుండలమని, **మణిపూరనాహతములు సూర్యఖండమని**, సూర్య మండలమని లేక సూర్యకుండలమని పిలువబడును. అట్లే విశుద్ధ్యాజ్ఞా చక్రములు చంద్రఖండమని, చంద్రమండలమని, చంద్రకుండలమని పిలువబడును. ఈ మూడు కుండలములు గల జీవుడు వ్యష్టికుండలియని, పరశమ్భువు సమష్టికుండలియని చెప్పబడును. ఈ యర్థమంతయు **కృష్ణాధ్వార్కేందుయోని** అనువిశేషణముచే చెప్పబడినది. ఈ విధముగా పరశమ్భువు వ్యష్టి పిండాండమున జీవకుండలిగా, సమష్టిబ్రహ్మాండమున శివకుండలిగా ఈ శ్లోకమున నిరూపించబడినాడు. అనగా ఆతని కుండలీశత్వము సమర్థింపబడినది. ఇట్లు కుండలినీశక్తిస్కంధరశ్మిప్రకరణారంభ శ్లోకమునందే పరశమ్భువు యొక్క కుండలీశత్వము రూపకాలంకారరూపమున నిరూపించబడినది.

**శ్రితతిథిభోగపంచదశి చేత వెలుంగుచు కాలవాయు సం**
**హతిరసనన్ గ్రసించుచు ననష్టనిరంతర నైజశక్తివై**
**సతత సుచక్ర నాకు సరిచారణ దక్షుడవై భుజంగమేం**
**ద్రతనుడవై తనర్చుట సుతథ్యము కుండలి నాయకుండవే.**

**అవతారిక :** పై శ్లోకమున శక్తి యుక్తుడైన పరశమ్భువు **కుండలీశుడుగా** రూపింప బడినాడు ఈ శ్లోకమున పరాశక్తి ప్రభేదమైన **ఆ కుండలినీశక్తిని పరశమ్భు వనుభవించుచున్నట్లు** చెప్పబడుచున్నది.

**శ్లో ॥ స్వస్థాత్మా చిత్తపూర్వం రవిశశిపదవీం పూరితాంశుప్రచారాం**
**దీపాంతర్వహ్నిదేవైరవితరగతిభిర్బోధితాధారశక్తిమ్ ।**
**తత్తచ్చక్రప్రభేదోద్భవవివిధమహాశబ్దరూపామనంత-**
**బ్రహ్మానన్దప్రవాహామనుభవసి పరామాదిసౌషుమ్నమూర్తే! ॥ 54**

**ప్రతిపదార్థము :** ఆదిసౌషుమ్నమూర్తే! = తొల్లిటి సుషుమ్న యందలి ఆకారము గలవాడా!, చిత్తపూర్వమ్ = చిత్తపూర్వకముగా, స్వస్థాత్మా = స్వస్థమైన ఆత్మగలవాడవై, అవితరగతిభిః = వ్యర్థము కాని గతిగల, దీపాంతర్వహ్నిదేవైః = దీపము లోపలి వహ్నిదేవులచేత, బోధితాధారశక్తిమ్ = మేల్కొలుపబడిన ఆధార శక్తిగల, పూరితాంశుప్రచారామ్ = నింపబడిన కిరణముల ప్రసారముగల, తత్తచ్చక్ర ప్రభేదోద్భవవివిధ మహాశబ్దరూపామ్ = ఆయాచక్రముల ప్రభేదముల వలన పుట్టిన అనేక విధములైన మహాశబ్దములే రూపములుగా గలిగిన, అనంత బ్రహ్మానంద ప్రవాహామ్ = అంతులేని బ్రహ్మానందము యొక్క ప్రవాహము కల, పరామ్ = పరాశక్తిని (పరావాక్స్వరూపిణిని), **అనుభవసి** = అనుభవించుచున్నావు.

**తాత్పర్యము :** సుషుమ్నలో మొదటి నుండి ఉన్న ఓ పరశమ్భూ! మనస్సును ఆత్మను స్వస్థ మొనరించుకొని యున్నవాడవై అగ్నిఖండమైన మూలాధార స్వాధిష్ఠానాగ్ని కీలయగు దీపము నందు నిరంతరము సంచరించు కిరణ దేవతలచే బోధింపబడిన ఆధారశక్తిగల పూజింపబడిన సంచారము గల, అనాహతాది ఆజ్ఞాంతమైన సూర్యచంద్రమార్గముగల ఆయాచక్రముల ప్రభేదమును శబ్ద మొనరించునట్టి అనంత బ్రహ్మానందమును ప్రవహింపజేయునట్టి నీ పరాశక్తి ననుభవించెదవు.

**వివరణము :** మూలాధార స్వాధిష్ఠాన గతమైన యొక కుండలము (చుట్టు) **అగ్ని మండల** మనబడును. అక్కడి అగ్ని జ్వాల దీపాకారము గలట్టిది. దాని యందు కిరణ దేవతల

సంచారముండును. ఆ దేవతలు పది అగ్నికలలు. తంత్రములలో వాని పేర్లిట్లున్నవి.

| | | |
|---|---|---|
| 1) ధూమ్రర్చికాకళ | – | యంకార రూపము |
| 2) ఊష్మాకళ | – | రంకార రూపము |
| 3) జ్వలినీ కళ | – | లంకార రూపము |
| 4) జ్వాలినీ కళ | – | వంకార రూపము |
| 5) విస్ఫులింగినీ కళ | – | శంకర రూపము |
| 6) సుశ్రీ కళ | – | షంకార రూపము |
| 7) సురూపాకళ | – | సంకార రూపము |
| 8) కపిలా కళ | – | హంకార రూపము |
| 9) ఈవ్యవాహినీ కళ | – | ళంకార రూపము |
| 10) కవనావాహినీ కళ | – | క్షంకార రూపముమ |

మణిపూరానాహతములు **సూర్యఖండము.** ఇది మరొక కుండలము. సూర్యమండల మనబడును. విశుద్ధ్యాజ్ఞా చక్రములు **చంద్రఖండము.** ఇది మరొక కుండలము చంద్రమండల మనబడును. ఈ సూర్య చంద్ర మార్గము నందును కలలు గలవు. సూర్యమండలమున కంకారాది భంకారాంత కల లిరువది నాలుగు; చంద్రమండలమున అంకారాది అఃకారాంత కలలు పదునారు నున్నవి. వాని పేర్లను తంత్రములందు చెప్పబడినవి. అగ్నిమండలకలా దేవతలచే నాధారాశక్తి మేల్కొల్పబడును. సమయాచారము ననుసరించి ఈ కుండలినీ శక్తికి మణిపూరమునందే పూజ ఆరంభమగును. మూలాధార స్వాధిష్ఠానములలో పూజ చేయరాదని సమయాచారులు భావించెదరు. కౌలులు మూలాధారగతగా కుండలిని ఉన్నప్పుడే పూజ ఆరంభించెదరు. మొత్తము మీద కుండలిని **పూరితాంశుప్రచార** సమయమతము ననుసరించి కుండలిని రవిశశిపదవి గానే ఉపాసింపబడును. కావున అగ్నిని విడిచి రవిశశి పదవియని కుండలిని పేర్కొన బడినది. సుషుమ్నా మార్గము నందలి మూలాధారాది చక్రముల భేదించుచునే కుండలిని ఊర్ధ్వముగా ప్రయాణించును. ఆ చక్రభేదన సమయమున శబ్ద ముద్భవించునని సాధకుల దగ్గఱ కూర్చొన్న వారికిని ఆ శబ్దము మహా శబ్దముగా వినబడునని చెప్పెదరు. **ఆదిసౌషుమ్నమూర్తి** అనగా సుషుమ్నలో వ్యాపించి యుండు పరశమ్భువు. ఆతడు మూలాధారమున పరారూపమున ఆవిర్భవించిన వాగ్రూపిణియగు కుండలి ననుభవించుచుండును. బ్రహ్మాండమునందలి సుషుమ్న యందుండుటచే పరశమ్భువు **ఆదిసౌషుమ్నమూర్తి** అని

చెప్పబడినాడు. జీవులు జన్మాదులు గలవారు. కావున వారి సుషుమ్న వ్యష్టికావున వారి పిండాండములు తరువాత పుట్టినవి కావున వారు ఆదిసౌషుమ్నమూర్తులు కాజాలరు. మూలాధారమున పరా వాగ్రూపిణియైన కుండలిని ఆజ్ఞాచక్రము దాటి రుద్రగ్రంథిని భేదించి పరచంద్రమండల (నాల్గవమండల) మును భేదించుటతో బ్రహ్మానందమును ప్రవహింపజేయును. అట్టి పరాశక్తిని పరశమ్భువు అనుభవించుచుండును.

**సారవిహారదీపగతచార్వనిల ప్రలివేధబోధితా**
**ధార సుశక్తి సూర్య శశిధామము పూరితకాంతిచక్రభే**
**దేరితనైక శబ్దమయమేకము బ్రహ్మసుఖప్రవాహ సం**
**పూరమునౌ పరానుభవ పూర్ణతనుందు సుషుమ్న శ్రీశివా!**

**అవతారిక :** పై శ్లోకమున **కుండలిని పరశమ్భు వనుభవించుట** వర్ణింపబడినది. ఈ శ్లోకమున పరశమ్భువు యొక్క **హంస స్వరూపము** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ యస్మాత్ప్రాణః ప్రరోహత్యుపరిగతిరధః సమ్ప్రధావత్యపాన-**
**స్తస్మాదేవావిరోధాత్తదుభయజనికృద్వాయుసంరోధమాత్రాత్ ।**
**విద్యావిద్యాదియుగ్మప్రసరసమరసామ్భోధిజృంభైరదంభైః**
**సార్థం హంసః పరస్మిన్మహసి ఖలు లయం ప్రైతి తే ప్రాణసూత్రః ॥ 55**

**ప్రతిపదార్థము :** యస్మాత్ = దేనినుండి, ఉపరిగతిః = పైకిపోవు, ప్రాణః = ప్రాణము, ప్రరోహతి = మొలచునో, అపానః = అపానము, అధః = క్రిందికి, సమ్ప్రధావతి = పరుగిడునో, తస్మాత్ = ఆ, అవిరోధాత్ = విరోధము లేని, తదుభయజనికృద్వాయు సంరోధమాత్రాత్ = వాని (ప్రాణాపానముల) జన్మమును కలిగించు వాయునిరోధ మాత్రారూప కుంభకస్థితినుండి, అదమ్భైః = దమ్భములేని, విద్యావిద్యాది యుగ్మ ప్రసర సమరసామ్భోధిజృమ్భైః = విద్యావిద్యాది ద్వంద్వముల ప్రసారముల సమరసతయను సముద్రము యొక్క జృమ్భణములచేత, తే = నీయొక్క, ప్రాణసూత్రః = ప్రాణాధారమైన, హంసః = హంసము, పరస్మిన్ = శ్రేష్ఠమైన, మహసి = తేజము నందు, లయమ్ = లయమును, ప్రైతి ఖలు = పొందుచున్నది గదా!

**తాత్పర్యము :** పైకి పోవు ప్రాణము, క్రిందికి పరుగిడు అపానమును పుట్టుచోటైన విరోధము లేని వాయునిరోధమునుండి విద్యావిద్యాది ద్వంద్వముల సామరస్య సముద్రము యొక్క దమ్భ రహితములైన విజృమ్భణములతో కూడి నీ ప్రాణసూత్రము అను కలహంస

పరతేజస్సున లయమును పొందుచుండును గదా!

**వివరణము :** ఉచ్ఛ్వాసముతో ప్రాణవాయువును పీల్చుకొనుట, నిఃశ్వాసముతో అపానవాయువును విడుచుట మన మెఱుగుదుము. ఈ ప్రాణాపాన వాయుభేదమును గుర్తించుచున్నామనగా వాని మధ్య త్రుటికాల శూన్యావస్థ ఉండవలెను. అనగా ప్రాణాపానములు దానినుండియే బయలు దేరినను అది ప్రాణా పానముల కతీతము. ప్రాణమునకు అపానమునకు అట నిరోధము మాత్రమే ఉండును. అందుకే శ్లోకమున **'తదుభయజనికృద్వాయుసంరోధమాత్రాత్'** అను సమాసము ప్రయోగింపబడినది. ఈ వాయు సంరోధస్థానము భ్రూమధ్యము కావచ్చును. లేక మూలాధారము కావచ్చును లేక నాభి ప్రదేశము కావచ్చును లేక అనాహతము కావచ్చును. ఈ ప్రాణవాయువును తమకిచ్చ వచ్చిన చోట నిలుపు పనిని యోగు లొనర్చెదరు. ప్రాణమునకు అపానమునకు రెంటికిని గతి అనగా చలనమున్నది. ఊర్ధ్వమునకు చలించునది ప్రాణవాయువు. క్రిందికి చలించునది అపానవాయువు. ఇది స్థూలముగా మాత్రమే సరిపోవును. భ్రూమధ్యము దాకా బయటి ప్రాణవాయువు ఊర్ధ్వగతి కలిగియున్నను అది గుండెకు చేరుట కధోగతి నాశ్రయింపక తప్పదు. అట్లే గుండె విడచిన అపానవాయువు భ్రూమధ్యము ద్వారా పైకి పోయిన పిమ్మట నాసారంధ్రముల నుండి క్రిందకు పోవును. ప్రాణపానముల మధ్య త్రుటి కాలశూన్యావస్థ నాసికకు పన్నెండంగుళముల దూరమునం దుండవచ్చును. అక్కడ త్రుటి కాలపు శూన్యావస్థ రిక్తక మనబడును. అక్కడిదాక పోయిన అపాన వాయువు బాహ్య వాయువునందు లీనమై పోవును. ఆ తరువాత బాహ్యవాయువులోని ప్రాణ వాయువు నాసారంధ్రములనుండి పైకి భ్రూమధ్యము దాకా పోవును. కావున ప్రాణము ఊర్ధ్వగతి అని, అపానము అధోగతి అని చెప్పబడినది. ప్రాణాపానవాయువుల చలన మున్నప్పుడు మనస్సులో రాగమో ద్వేషమో సుఖమో దుఃఖమో స్పందించు చుండు నా రాగద్వేషాత్మకము లేక సుఖదుఃఖాత్మకము అయిన ద్వంద్వము మనస్సు ఆగినప్పుడు సామరస్యము నందును. సాధకునకు కుంభకము నందు ఈ సామరస్యము కలుగవచ్చును. లేదా రిక్తకము నందీ సామరస్యము కలుగవచ్చును. హఠయోగమున **'చలే వాతే చలం చిత్తం నిశ్చలే నిశ్చలం భవేత్'** అని చెప్పబడినది. కావున మనోనిశ్చలత్వమునకు ప్రాణాపాననిరోధమునకు సంబంధమున్నది. యోగాభ్యాసి కుంభకరిక్తకములందు వాయు నిరోధము కలిగియుండును. కావున అవియే ప్రాణాపానోత్పత్తి స్థానములు. ప్రాణశబ్దమందును అపానశబ్దమందును అన ఉన్నది అదియే యథార్థప్రాణము. **ప్రాణము మలినమై అపానమని పిలువబడును. అపానము శుద్ధమై ప్రాణము అని**

**పిలువబడును.** దీని శుద్ధి బాహ్యావాయువున సంభవించును. బాహ్యావాయువులలో కొంత అశుద్ధి ఉన్నను అన అనునది దానిని శుద్ధ మొనర్చి అనగా ప్రాణముగా చేసి లోపలకు నెట్టి వేయును. ఇంతేకాక మన శరీరమున వ్యానము ఉదానము సమానము అను మూడు వాయువులు కూడ ఉన్నవి. **హృదిప్రాణః = ప్రాణవాయువు ఎదలో, గుదేఽపానః = గుదమందు అపాన వాయువు, సమానోనాభిసంస్థితః = సమాన వాయువు నాభియందు ఉన్నది, ఉదానఃకంఠదేశస్థః = ఉదాన వాయువు కంఠమున, వ్యాన స్సర్వశరీరగః = వ్యానవాయువు శరీరమంతటా ఉండునని, భారతీయయోగ శాస్త్రము చెప్పినది.** ఇవికాక ఆకలిని కలిగించు వాయువు **కృకరమని**, కన్నులలో ఉన్మేష నిమేషముల కలిగించు వాయువు కూర్మమని, ఇట్లే నాగవాయువు, దేవదత్త, ధనంజయులు – త్రేన్పులు, తుమ్ములు, దగ్గులు, ఆవులింతలు మొదలగు క్రియల నెన్నిటినో నిర్వర్తించును. ఈ అన్ని వాయువులు బాహ్యావాయువునుండి మొదట భ్రూమధ్యము వఱకు పైకి పోయి గుండెవఱకు క్రిందకుపోవు ప్రాణవాయువు మీదనే ఆధారపడియున్నవి. ఇంద్రియములకును ప్రాణములను పేరున్నది. ఇంద్రియముల వృత్తిరహితములైనప్పుడును ద్వంద్వ సామరస్యము సంభవించును. ఆ ఇంద్రియములు ప్రాణాధీనములై యుండును. దారముతోవలె ప్రాణముతో బంధింపబడుట ప్రాణమునకు సూత్రమను పేరుచితముగానున్నది. సుఖమో దుఃఖమో చెప్పలేని స్థితి. సుఖదుఃఖ ద్వంద్వ సామరస్యమున సంభవించును. అదియే చిత్తనిరోధము. ప్రాణమో అపానమో చెప్పలేని సామరస్యము కుంభకరిక్తములందు సంభవించును. రాగమో ద్వేషమో చెప్పరాని సామరస్యము చిత్తముయొక్క నిరోధమందు సంభవించును. ఈ సామరస్య మహాసముద్రమునందు ప్రాణహంస ఉండును. ఆ సముద్రములోని ఆటుపోటులలో ప్రాణహంస యూగిస లాడును. ఇంతకు ముందు చెప్పిన ప్రాణవాయు పంచక, ఉపప్రాణవాయుపంచకములలో ప్రాణాపానములే ముఖ్యములు. ప్రాణహంసమునకు ప్రాణాపానములు రెండు రెక్కలు. ఉచ్ఛ్వాసము ప్రాణమునకు, నిఃశ్వాసము అపానమునకు గతిని కల్పించును. మామూలు హంసము ఒకే సారి రెండు రెక్కలు కదిలించును. ప్రాణహంసము ఒక రెక్కను కదిలించిన పిమ్మట రెండవ రెక్కను కదిలించి మరల మొదటి రెక్కను కదిలించును. ఉచ్ఛ్వాసమున సోకారధ్వని, నిఃశ్వాసమున హకారధ్వని గర్భితమై యుండుటచే ఉచ్ఛ్వాస నిఃశ్వాసాత్మక పక్షద్వయముగల ప్రాణమునకు హంసయను పేరు కలుగుట ఉచితముగా ఉన్నది. **సోహం సోహం సోహమ్** సో ఇత్యాదిగా నున్న సోహమ్మంత్రమునకు కూడ **హంస మంత్రమను** పేరున్నది. ఆ వృత్తిలో హంసో అని

పిలువబడుటయే దానికి కారణము ఈ ఉచ్ఛ్వాస నిఃశ్వాసాత్మక హంస మంత్రమునకు **అజపాగాయత్రి** అను పేరు గలదు. ప్రాణహంసము 'సోఽహమ్' అను జపము చేయును. ఇది జపము కాని జపము. కావున దీనికి **అజప** అని పేరు ఉచితముగానే ఉన్నది. హంసకు విశేషణముగా **ప్రాణసూత్ర** శబ్దము ప్రయోగింపబడినది. ఒక మనుష్యుడు ఒకడుగా భావింపబడినను వానిలో ననేక జీవపదార్థము లున్నవి. అవి సూత్రమువంటి ప్రాణముతో బంధింపబడి మనుష్యార్థముగా తమ పరార్థక్రియ చేయుచున్నవి. వానికి నేను అను భావనము లేదు వాని సమష్టియైన మనుష్యుడు నేను భావనము కలిగియున్నాడు. కావున వాని ఏకత్వము సమష్టి గతైకత్వము. అట్లే సమష్టి స్వప్నాభిమాన ప్రాణియైన హిరణ్యగర్భునకు సూత్రాత్మయను పేరున్నది. ప్రాణః సూత్రాత్మ అను పేర్లు కూడ ఆ హిరణ్యగర్భున కున్నది. ఆ రెండు పేర్లు ఈ శ్లోకమున కలిసి **'ప్రాణ సూత్ర'** అను రూపుదిద్దుకొన్నది. ఆత్మజ్ఞానియైన జీవన్ముక్తుడు మరణసమయమున తన్మాత్రల రాజసాంశ సమష్టిచే నేర్పడిన ఈ ప్రాణసూత్రరూపహంసము పరతేజోరూపమై శమ్భువు యొక్క జ్ఞానాగ్ని యందు దగ్ధమగును. సోహమ్(శబ్ద) వాక్య తాత్పర్యభూతమైన శుద్ధాత్మకు కూడ హంస అను పేరున్నది. సృష్టి అవ్యాకృతు నుండి ఏర్పడినది. అవ్యాకృతునకు జన్మలేదు కావున ఆతడు ఈశ్వరు డనబడును. అవ్యాకృతుని మాయారూప నిద్రయందు గలిగిన సమష్టి స్వప్నాభిమానియే హిరణ్యగర్భుడు కావున ఆయన తైజస సమష్టి యైనందున ఈశ్వరత్వ మున్నను దానితోపాటు ఆతనికి ప్రథమ జీవత్వము శాస్త్రజ్ఞులచే అంగీకరింప బడినది. ప్రథమజీవుడైన హిరణ్యగర్భునకు ప్రాణపదవాచ్యత్వ మీ వఱకే చెప్పబడినది. కావున ప్రాణమే జీవత్వవ్యవహారమునకు హేతువు. అవ్యాకృత శబ్దము ఆ అవ్యాకృతునకు నామమెట్లగును? నామరూపవ్యాకరణమును అవ్యాకృతుడే చేయును. ఆ వ్యాకరణము జరుగక ముందు ఆతని నవ్యాకృతుడనుట ఎట్లు కుదురును? మన కర్థమగు కొఱకు మాత్రమే దాని నామత్వ మంగీకరింప వలసియున్నది.

**పైకి గమించు ప్రాణము నపానము క్రిందికి బోవు తద్ద్వయీ**
**ప్రాకటజన్మకృత్పవన వైరవిహీనగతిప్రరోధ మా**
**త్రాకలితమ్మునౌ సమరసాంబు విజృంభణయుక్తి ప్రాణ సూ**
**త్రాకృతి హంస నీ పరమహస్సున లీనమగున్ మహేశ్వరా!**

**అవతారిక :** పై శ్లోకమున **హంసరూప యొక్క లయము** పరశమ్భు తేజమున జరుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున **సర్వవిషయభోగస్పంద మూలము, మహాస్పందరూపము**

పరశమ్భువే అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ సర్వేషామింద్రియాణాం నిజనిజవిషయోద్యోతనం యత్ప్రసూతం**
**సారాస్సర్వేషు కర్మస్వనుపమవిషయాః సాధ్వసానందకోపాః ।**
**యజ్జాతాః సర్వనాడీపథచలదనిలవ్యాప్తయః సర్వభావాః**
**నానారూపాశ్చ సర్వాయనపథికమహాస్పందకః స త్వమేవ ॥ 56**

**ప్రతిపదార్థము :** సర్వేషామ్ = అన్ని, ఇంద్రియాణామ్ = ఇంద్రియముల యొక్క, నిజనిజ విషయోద్యోతనమ్ = తమతమ విషయముల ప్రకాశనము, యత్ప్రసూతమ్ = దేనినుండి పుట్టినదో, సర్వేషు = అన్ని, అన్ని, కర్మసు = కర్మల యందు, అనుపమవిషయాః = సాటిలేని విషయములుకల, సారాః = సారములైన, సాధ్వసానందకోపాః = భయము ఆనందము కోపము (మొదలగునవి), నానారూపాః = అనేక రూపములైన, సర్వనాడీపథచలదనిలవ్యాప్తయః = అన్ని నాడీ మార్గములలో కదలువాయువు యొక్క వ్యాప్తులు, సర్వభావాః = అన్నిభావములు, యజ్జాతాః = దేనినుండి పుట్టినవో, సః = ఆ, సర్వాయనపథిక మహాస్పందకః = అన్నిమార్గములలో సంచరించు మహాస్పందరూపుడవు, త్వమ్ ఏవ = నీవే.

**తాత్పర్యము :** అన్ని ఇంద్రియములు తమ తమ విషయముల ప్రకాశింప జేయుట దేనివలన కలుగుచున్నదో, అన్ని కర్మలు సారరూపములైన సాటిలేని నానా రూపములైన విషయములు, అన్ని నాడులలో కదలు వాయువు యొక్క వ్యాప్తులు దేనినుండి పుట్టినవో ఆ సర్వ మార్గములలో సంచరించు పథికుడవైన. మహాస్పందరూపుడవు నీవే.

**వివరణము :** ప్రతి ఇంద్రియమునకు విషయము వేఱు వేఱుగా నుండును. ఆయా ఇంద్రియములు నియతముగా ఆయా విషయములనే ప్రకాశింప జేయుచుండును. ఆ ప్రకాశమునకు మూలము పరశమ్భువు యొక్క మహాస్పందమే. అట్లే నాడులలో వాయువు యొక్క సంచారము, కర్మేంద్రియముల యొక్క అనగా వాగాదీంద్రియముల యొక్క సర్వకర్మ రూపములైన వచన, గమనాదాన విసర్గానందములు, భయము, ఆనందము, కోపము మొదలగు నానావిధములైన భావములన్నియు ఆ మహాస్పందమే రూపముగా గల పరశమ్భువు నుండియే కలుగుచున్నవి. ఆ మహాస్పందరూపుడు పరశమ్భువే.

**విషయములందు నక్షముల వెల్గగ ఁజేయు సమస్త కర్మలన్**
**విషయకకోపసౌఖ్యభయవేగములన్ నిఖిల ప్రకోప కో**

న్మిషదనిలాప్తి సర్వవిధనిశ్చయభావములన్ వెలార్చు ని
ర్విషయక సర్వమార్గగతి వేదనమూర్తివి నీవె శ్రీశివా!

**అవతారిక :** పై శ్లోకమున శారీరక వ్యాపార హేతువు **పరశమ్భు మహాస్పందమని** చెప్పబడినది. ఈ శ్లోకమున చిత్తము నిరోధించిన యోగికి అంతరంగములోని **జ్యోతిర్దర్శనము** తదనంతరము **నిర్వాణము** కలుగునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ బుద్ధ్వా సద్దేశికోక్త్యా సువిదితవిభవాం ఖేచరీం దివ్యముద్రా-**
**మర్థానంతప్రపంచాన్వితనిజకరణాన్యాత్మచిత్తే నిరుధ్య।**
**తచ్చిత్తం జ్యోతిరంగం నిరవధికరణం చింతయేద్యస్స యోగీ**
**నిర్వాణః కృష్ణవర్త్మా భవతి తవ మహాస్పందతామేత్య శమ్భో! ॥ 57**

**ప్రతిపదార్థము :** శమ్భో! = ఓ శమ్భూ, సద్దేశికోక్త్యా = సద్గురువచనముచేత, సువిదిత విభవామ్ = బాగుగా తెలియబడిన వైభవముగల, ఖేచరీమ్ = ఖేచరియను, దివ్యముద్రామ్ = దివ్యముద్రను, బుద్ధ్వా = తెలిసికొని, అర్థానంత ప్రపంచాన్విత నిజకరణాని = అర్థముల అనంతమైన విస్తారముతో కూడిన తన ఇంద్రియములను, ఆత్మచిత్తే = తనచిత్తమున, నిరుధ్య = నిరోధించి, నిరవధికరణమ్ = అంతులేని కర్మ (ధ్యానమున)కు సాధనమైన, జ్యోతిరంగమ్ = వెలుగునకు నిలయమైన, తత్ చిత్తమ్ = ఆ చిత్తమును, యః = ఏ, యోగీ = యోగి, చింతయేత్ = చింతించునో, సః = ఆతడు, తవ = నీయొక్క, మహాస్పందతామ్ = మహాస్పందతను, ఏత్య = పొంది, కృష్ణవర్త్మా = అగ్ని, నిర్వాణః = చల్లారినది, భవతి = అగును.

**తాత్పర్యము :** సద్గురువు వచనము వలన ప్రసిద్ధవైభవము గల ఖేచరీ అను దివ్యముద్ర నెఱిగి విషయసహితముగ నింద్రియములను చిత్తమున నిరోధించి వెలుగుగా మారిన ఆ చిత్తమును చింతించు యోగి దేహపాతానంతరము నిర్వాణమును అనగా కైవల్యమును పొందును. అనగా చిత్తమను అంతరంగమును మండించిన జ్ఞానాగ్ని శమించి చల్లారి పోవును. చరమవృత్తి నశించుటయే జ్ఞానాగ్ని చల్లారిపోవుట.

**వివరణము :** 1. మూలాధారము భూమి, విశుద్ధి ఆకాశము. మొదటిది గుదస్థానము పైన, రెండవది కంఠమున ఉండును. ప్రాణవాయువు శరీరములోని మలములను స్వీకరించి బరువును పొంది అపానముగా మారి గుదమువైపు ప్రయాణించును. అట్లు ప్రయాణించు వాయువు అపానము అని చెప్పబడును. ఆహారము స్వీకరించు వారందఱికి ప్రాణవాయువు

అపానముగా మారును. అది మలమును గుదము క్రిందకు నెట్టి వేయును. ఇట్లు ప్రాణవాయువు అపానముగా మారి మూలాధారమున అనగా భూమియందు చరించును. ఈ స్థితి భూచరి అనబడును. దీనికి వ్యతిరిక్తమైన స్థితి ఖేచరి. ప్రాణవాయువు మలరహితమైనది. తేలికగా ఉండును. అది కంఠము వఱకు పైకి తేలిపోవును. అందుకే దానికి **ఉదానము** అను పేరు కలుగును. ఆ స్థితిలో దాని నట్లే యోగాభ్యాసము చేయు యోగి నిలుపు స్థితి **ఖేచరి** అనబడును.. యోగ శాస్త్రమున దీని నిర్వచనము కొంత భిన్నముగా నుండును. గురుముఖమున సాధకులు దాని నెఱుగుదురు గాక! సాధారణముగా ఉదానవాయువు మాట్లాడుటలో సహకరించును. మౌనము నాశ్రయించి యోగాభ్యాసము చేయు యోగి ప్రాణాయామోపవాసాదులచే తన శరీరమును తేలికగా చేసినప్పుడు ఆ యోగి శరీరము భూమిపై నుండి కొంత పైకి లేచును. **ఇది దివ్యస్థితి.** ఈ శ్లోకమున ఖేచరి దివ్యముద్ర అని చెప్పబడినది. దివ్యశబ్దము ఆకాశమున తేలియాడు అను అర్థము కలిగియున్నది. భ్రూమధ్యము మనస్సు యొక్క స్థానము. అందు దృష్టి నిలయ మొనర్చినప్పు డొక తేజమచట గోచరించును. ఈ శ్లోకమున చిత్తమును నిరోధించిన అది జ్యోతిర్మయమగునని చెప్పబడినది. ఇదియే తృతీయనేత్రము. తత్ప్రాప్తితో శివత్వమొందును. ఈ యోగ ప్రక్రియ నింతటితో ఇచట నిలిపి, జ్ఞానయోగము వైపు సాగిపోవుదము. జీవేశ్వరైక్యవృత్తి **అహమ్ బ్రహ్మాస్మి**యను ఆకాశముగల వృత్తి ఇది చివరి వృత్తి అని చెప్పబడును. అదియే జ్ఞానాగ్ని. దానియందు చిత్తము మండుచుండును. ఆ మంటయే జ్యోతి. దానిలో కాలిపోయిన మనస్సు దగ్ధ పటమగును. ఆ మనస్సు అమనస్సు అని చెప్పబడును. ఈ అమనస్కస్థితిని పొందిన వాడు జీవన్ముక్తుడు. ఈ శ్లోకమున ఈ స్థితి **మహాస్పందతా** అని చెప్పబడినది. ఆ చివరివృత్తి తరువాత మరొక వృత్తి జ్ఞానము లేక పోవుట వలన ఇంధనము లేకపోవుట వలన అగ్ని ఆరినట్లు, ప్రారబ్ధకర్మాంతమున దగ్ధ పటతుల్యములై శరీరము ఇంద్రియములు ప్రాణములు మనస్సు అన్నియు బూడిదగా మిగిలి పోవును. అందుచేత జీవన్ముక్తుని మనస్సు దగ్ధపటసదృశమని చెప్పబడినది. జీవన్ముక్తునకు కైవల్య ముక్తి లభించును. కుండలినీ యోగ సాధకునకు విశుద్ధి చక్రమును దాటి కుండలినీశక్తిని భ్రూమధ్య సహస్రారములవైపు ప్రయాణింపజేయు యోగికీ స్థితి శివశక్తి సామరస్యము కలుగుట మహాస్పందతను పొందుటగా చెప్పబడినది. 2) ఇంద్రియశక్తులన్నియు మనోమూలకములే. కావుననే స్వప్నమున మనసొక్కటియే అన్ని ఇంద్రియముల పని నొనరించును. అట్టి మనసు చలించునప్పుడే ఇంద్రియములవలన

విషయజ్ఞానము కలుగును. ఇంద్రియము లన్నిటిని వాని విషయములలో అనగా శబ్దస్పర్శరూప రసగంధసహితముగ మనసు నందు లయింపజేసిన యోగి యొక్క మనసునందు దివ్యశక్తి ఉదయించును. అప్పుడు పరిమితములైన ఇంద్రియశక్తు లపరిమితములై మనసున నుండును. అనగా దూరశ్రవణ దూరదర్శనాదు లా మనోగతేంద్రియ శక్తులవలన సిద్ధించును. ఈ ప్రపంచమున అర్థానంతము అనగా అనంతములైన అర్థములు కలిగినట్టి ఇంద్రియములోని కొన్ని అర్థములనే మనము కొంతవఱకే అనుభవింపగలము. ఇంద్రియ శక్తులను మనస్సున లయింప జేసిన యోగి కపరిమిత దూరదర్శన శ్రవణాశక్తులు లభించును. ఈ విషయము శ్లోకమున **నిరవధికరణము** అను సమాసముచే చెప్పబడినది.

**మానిత దేశికోక్తి మహిమప్రథ ఖేచరి తానెటింగి చి**
**త్తాన బిగించి అర్థసహితమ్ముల నక్షములన్ హృతిన్ స్వభా**
**సానవధీంద్రియాంగక చిదగ్నిగ నెంచిన యోగియౌను ని**
**ర్వాణ మహోగ్ని నీదయిన స్పందత నంది చిదాత్మ! శ్రీ శివా!**

**అవతారిక :** పై శ్లోకమున కుండలనీ **సాధకుని ఖేచరీముద్రాప్రభావము** చెప్పబడినది. కుండలినీశక్తి **సమస్తజగమున నిండి యున్నద**ని చెప్పబడుచున్నది.

**శ్లో ॥ ప్రాణాఖ్యా కుండలిన్యా జగదిదమఖిలప్రాణితం తే యయేశ!**
**జ్ఞాత్వా యాం యోగినస్తే పరతరమభయం యాన్తి శాంతమ్పదం తత్ ।**
**యామజ్ఞాత్వా భవాబ్ధౌ జననమరణకృత్క్రూరకర్మప్రబద్ధా**
**మజ్జంత్యాద్యంతహీనా యది కృపయతి సా మోచయేన్మృత్యుబన్ధాత్ ॥ 58**

**ప్రతిపదార్థము :** యా = ఏది, ప్రాణాఖ్యా = ప్రాణమను పేరుగలదో, యయా = ఏ, కుండలిన్యా = కుండలిని చేత, ఇదమ్ = ఈ, అఖిలమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, ప్రాణితమ్ = ప్రాణము కలదయినదో, యామ్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, తే = ఆ, యోగినః = యోగులు, పరతరమ్ = అత్యుత్కృష్టమైన, అభయమ్ = భయరహితమైన, శాంతమ్ = శాంతమైన, తత్ = ఆ, పదమ్ = పదమును, **యాంతి** = పొందెదరో, యామ్ = దేనిని, అజ్ఞాత్వా = తెలియక, భవాబ్ధౌ = సంసారసముద్రమున, జనన మరణ కృత్క్రూర కర్మ ప్రబద్ధాః = పుట్టుకను చావును కలిగించు క్రూరకర్మచే మిక్కిలి బంధింపబడినవారై, ఆద్యంతహీనాః = మొదలు చివఱలేనివారై, **మజ్జంతి** = మునిగెదరో,

యది = ఒకవేళ, సా = అది, కృపయతి = అనుగ్రహించినచో, మృత్యుబంధాత్ = మృత్యుబంధము నుండి, (తాన్ = వారిని) సా = ఆ కుండలిని, **మోచయేత్** = విడిపించును.

**తాత్పర్యము :** ప్రాణమను పేరుగల కుండలిని లోకము నంతను ప్రాణమంత మొనర్చును. కుండలిని నెరిగిన యోగులు అభయము శాంతమునైన తత్పదమును అనగా పరతరమైన పరమ పదమును పొందుదురు. కుండలిని నెఱుగని వారు జననమరణహేతువులైన కర్మలచే బంధింపబడినవారై సంసారసముద్రమున మునుగుచుందురు. వారికి మొదలు చివఱలేదు. అనగా మిథ్యాభూతులై యుందురు. ఒకవేళ ఆ కుండలినీశక్తి ఎవరి ననుగ్రహించినచో వారికి సంసారబంధము నుండి ముక్తిని కలిగించును.

**వివరణము :** కుండలినీ శక్తికి అగ్నియను పేరు సుప్రసిద్ధము. శ్రీ సూక్తమగ్ని పేరుతోడనే దుర్గాసూక్తము కూడ ఆ పేరు తోడనే కుండలినీ శక్తిని స్తుతించి యున్నవి. శ్రీసూక్తమున **'జాతవేదో మమావహ'** అగ్నిని తనకా మహామహిమగల శక్తిని ప్రసాదింపుమని సాధకుడు కోరుచున్నాడు. **'తామగ్ని వర్ణామ్'** అని దుర్గా సూక్త మాశక్తి నగ్ని వర్ణగా పేర్కొనుచున్నది. **'అగ్నిమ్చిద్భ్వమ్భారతా'** అని అరుణోపనిషత్తు అగ్నిశబ్ద వాచ్యమైన కుండలినీశక్తిని సిద్ధింప వేడుకొనుడని చెప్పినది. అది ప్రాణమను పేరుగలది అని ఆ మాట కర్థము. అంతేగాక జగమునంత నా కుండలినీ శక్తియే ప్రాణవంత మొనర్చుచున్నదని చెప్పబడినది. కుండలిని వ్యష్టి రూపమున పిండాండమున, సమష్టి రూపమున బ్రహ్మాండమున నెలకొనియున్నది. 2) చిత్కలకు మూర్ధము స్థానము. ప్రాణశక్తికి మూలాధారమే ఆధారము. ఈ రెండింటికి సర్వదేహవ్యాప్తి ఉన్నను అవి ప్రధానములైన స్థానములని అవి అక్కడినుండియే సర్వదేహమున ప్రసరించునని గమనింపవలసి యున్నది. ఈ రెండు శక్తులు వెన్నెముకలోని సుషుమ్న ఊర్ధ్వాధః స్థానములలో నుండును. ఇవి పిండాండమున పరిమితమైన శక్తిని గలిగి యున్నవి. కుండలినీ సాధకుడు ప్రాణాఖ్యయైన అధోముఖమైన కుండలిని నూర్ధ్వముఖముగ నొనర్చి మనఃస్థానమైన భ్రూమధ్యమును దాటి మూర్ధము చేర్చగలిగినప్పుడు ఆతనికి మహానందము కలుగును అని యోగశాస్త్ర గ్రంథములలో చెప్పబడియున్నది. ఆ యానందము బ్రహ్మానందమో మతాంతరము ననుసరించి బ్రహ్మానంద సబ్రహ్మచారియో ఐ యుండును. ఈ ప్రయాణమున బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులు అనగా స్థూల సూక్ష్మ కారణశరీరాభిమానములు తొలగిపోవలసి యున్నది. ఈ గ్రంథుల భేదనము ఉపనిషద్విచారముననను సాధ్యమే. ఈ శ్లోకమున కుండలిని నెఱిగిన వానికి బ్రహ్మపదము లభించునని చెప్పబడినది. జ్ఞానయోగదృష్టిలో జీవరూప కుండలినియొక్క స్వస్వరూపమున

అనగా బ్రహ్మత్వమును నెఱుగుట అని తెలియవలెను. యోగ శాస్త్ర దృష్టిలో కుండలిని నూర్ధ్వముఖముగ కొని పోవలెనని ఈ వరకే చెప్పబడినది. 3) ఈ కుండలిని నెఱుగని వారు కర్మ బంధమును వీడజాలక సంసార సముద్రమును ఈదజాల కుందురు. జననమరణచక్రమున పరిభ్రమించుచుందురు. ఆ కుండలినీ శక్తి ఎవరిని అనుగ్రహించునో వారికి సంసారబంధమునుండి ముక్తి కలుగునని శ్లోకమున చెప్పబడినది. ఆ కుండలినీ శక్తి ఎవరి ననుగ్రహించును? నిష్కామకర్మ నొనర్చిన వారినా? తన నూర్ధ్వ ముఖముగా కొనిపోవుటకు యత్నించిన వానినా? గురుకృపచే శక్తి నొందిన సాధకునా? భక్తితో శరణాగతుడైన వానినా? వేదాంతవిచారము చేసిన వానినా? ఇవి యన్నియు ఖలేకపోత న్యాయమున సిద్ధించు చరమ జన్మనొందిన వాని నామె అనుగ్రహించు ననుట యథార్థము. ఆ కుండలినీ శక్తి యీవ్యాఖ్యను శ్రద్ధతో పఠించు వారి ననుగ్రహించుగాక!

**ఈ యఖిల ప్రపంచము మహేశ్వర! ప్రాణితమయ్యె దేనిచే**
**ధీయుత యోగులెద్ది స్వహృదిన్ గని నీపదమందు వారలో**
**మాయభవాబ్ధి మున్గుదు రమాన్యులు దేనినెఱుంగకట్టి నీ**
**ప్రేయసి ౘ్రాణకుండలిని బ్రేమ ౘగనన్ భవబంధముక్తుడౌ.**

***

## -- మాతృకాశక్తి స్కంధరశ్మి ప్రకరణమ్ --

**అవతారిక :** పై ప్రకరణమున ప్రధానముగా అందలి చివరి శ్లోకమున పరశమ్భువు యొక్క శక్తులలో నొకటైన కుండలినియొక్క వ్యష్టి సమష్టి స్వరూపము తదనుగ్రహముచే **బ్రహ్మ పదప్రాప్తి** వర్ణింపబడినది. ఈ ప్రకరణమున ప్రధానముగా అందలి మొదటి శ్లోకమున పరశమ్భువు **అజ్ఞాతబ్రహ్మతత్త్వమును** పొంది  నాడని చెప్పబడుచున్నది.

**శ్లో ॥ అజ్ఞాతమ్బ్రహ్మతత్త్వం నిజహృదయదరీలీనమాత్మప్రకాశం**
**వ్యక్తీకర్తుం స్వనిత్యాక్షరవిదితమహామాతృకాత్వం ప్రపన్నః ।**
**త్వం దివ్యామ్నాయవిద్యాసువిదితమహిమానంతశక్తిప్రకాశః**
**తత్తద్వర్ణాత్మభేదైరుపదిశసి పదం శ్రీగురో! స్వస్వరూపమ్ ॥ 59**

**ప్రతిపదార్థము :** శ్రీగురో = ఓ శ్రీగురూ!, అజ్ఞాతమ్ = తెలియబడని, బ్రహ్మతత్త్వమ్ = బ్రహ్మతత్త్వమును, నిజహృదయదరీలీనమ్ = తన హృదయమను గుహలో లీనమైన, ఆత్మప్రకాశమ్ = ఆత్మప్రకాశమును, వ్యక్తీకర్తుమ్ = వ్యక్తీరించుటకు, స్వనిత్యాక్షర విదిత

మహో మాతృకాత్వమ్ = తన నిత్యాక్షరములచే తెలియబడిన మహో మాతృకత్త్వమును, ప్రపన్నః = పొందిన, దివ్యామ్నాయవిద్యా సువిదిత మహిమానంతశక్తిప్రకాశః = దివ్యమైన ఆమ్నాయ విద్యచే బాగుగా తెలియబడిన మహిమ యొక్క అనంత శక్తుల ప్రకాశరూపుడవైన, త్వమ్ = నీవు, తత్తద్వర్ణాత్మభేదైః = ఆయా వర్ణరూపభేదములతో, స్వస్వరూపమ్ = స్వస్వరూపమును, **ఉపదిశసి** = ఉపదేశించుచున్నావు.

**తాత్పర్యము :** శ్రీగురుమూర్తి వైన ఓ పరశమ్భూ! తెలియబడిన బ్రహ్మతత్త్వమును తన హృదయమను గుహలో లీనమైన ఆత్మప్రకాశమును వ్యక్తీకరించుటకు తన నిత్యాక్షరములచే తెలియబడిన మహోమాతృకాత్వమును పొందిన నీవు దివ్యమైన ఆమ్నాయవిద్యచే బాగుగా తెలియబడిన మహిమ యొక్క అనంత శక్తుల ప్రకాశమే రూపముగా గలవాడవై ఆయా వర్ణరూపభేదములతో స్వస్వరూపమునే ఉపదేశించుచున్నావు.

**వివరణము :** 1. శ్రీ గురువునకు ఇష్టదేవతకు అభేదమును భావించుట దాదాపు అన్ని సంప్రదాయము లందును ఉన్నదే కావున ఈ శ్లోకమున **పరశమ్భువే శ్రీ గురూ** అని సంబోధింపబడు చున్నాడు. 2. బ్రహ్మ దృగ్రూపుడే కాని దృశ్యము కాదు కావున బ్రహ్మతత్త్వము తెలియబడునది కాదు. తాను దృగ్రూప బ్రహ్మనని తెలిసికొనుటయే బ్రహ్మతత్త్వ జ్ఞానము. తనకన్న భిన్నమైనది బ్రహ్మమను జ్ఞానము బ్రహ్మతత్త్వజ్ఞానము కాదు. ఈ విషయమే ఉపనిషత్తు **'యస్యామతమ్ తస్య మతమ్'** (ఎవనికి బ్రహ్మతత్త్వము తెలియబడలేదో వానికే బ్రహ్మతత్త్వము తెలిసినట్లు) అను వాక్యముతో చెప్పినది. ఈ బ్రహ్మమేమి? అను ప్రశ్నకు **నిజహృదయదరీలీనమాత్మప్రకాశమ్** తన హృదయగుహలో లీనమైన ఆత్మ ప్రకాశమే అను సమాధానము శ్లోకమున చెప్పబడినది. **'అజ్ఞాతమ్'** అను విశేషణమే ముందుంచి వాక్యము నారంభించుటచే ఆత్మయు బ్రహ్మమును దృగ్రూపములే అభిన్నములే అను తాత్పర్యము వ్యక్తీకరింపబడినది. బ్రహ్మ తత్త్వ మట్టిదని వ్యక్తీకరించుటకే బ్రహ్మము (పరశమ్భువు) మహోమాతృకాత్వము నొందినది. మాతృక అనగా వర్ణమాల. దానిలోని మొదటి వర్ణము 'అ', చివరి వర్ణము 'హ'. ఆ రెండు కలిపి అహమ్ అను మహోమాతృక ఏర్పడినది. 'మహ' అను అక్షరములలో కూడ అహమ్‌లోని వర్ణములు కించిద్వ్యస్తములుగా నున్నవి. కావున మహోమాతృక అన్నను అహమ్ అన్నను ఒకటే. ఈ యర్థమంతయు **స్వనిత్యాక్షర** శబ్దముచే శ్లోకమున వ్యక్తము చేయబడినది. స్వనిత్యాక్షరములనగా స్వవాచక నిత్యాక్షరములు అనగా అహమ్ అను అక్షరములు అని అర్థము చెప్పుటలో విప్రతిపత్తి వుండ నక్కరలేదు. ఆమ్నాయశబ్దమునకు వేదమని అర్థము. విద్యాశబ్దమునకు మంత్రమని

అర్థము. దివ్యామ్నాయ విద్య అనగా మంత్ర వీర్య మంత్ర చైతన్యములను సంయోజించి గురువుచే నుపదేశింపబడిన వేదమువంటి మంత్రము అని అర్థము. దివ్యామ్నాయ విద్య అనగా వేదోపనిషద్రహస్యము తనలో నింపుకొన్న గురూపదిష్ట మంత్రమని తాత్పర్యము. మంత్రము దేవతకు వాచకము. మంత్రాక్షరములు దేవతా నామావయవములని శ్రీ శంకరులు చెప్పినారు. వాచ్యవాచకములకు అభేదము కావున మంత్ర దేవతల కైక్యము కలదు. ఆ విద్యచేత భగవానుని అనంతశక్తి మహిమలు సాధకునిలో ప్రకాశించును. మంత్రములోని వర్ణములకు కూడ మాతృకలను పేరున్నది. ఆ దృష్టితో మంత్రము మహామాతృక యని చెప్పబడినది. ఆ మంత్రములోని ప్రతివర్ణమును పరమేశ్వరుని అంగరూపములైన దేవతలను గూడ బోధించును. మంత్రము మొత్తముగా తాత్పర్యరూపమున స్వస్వరూపబోధకము. స్వస్వరూపము బ్రహ్మమే అని ఈవఱకే చెప్పబడినది. గాయత్రీ పంచదశీ ప్రభృతి మంత్రములలోని వర్ణములన్ని సమష్టిగా జీవబ్రహ్మైక్యమునే బోధించునని తత్తన్మంత్రవ్యాఖ్యాతలు చెప్పినారు. భిన్న వర్ణములు భిన్నపథములు వేఱు వేఱు అర్థములు కలిగియున్నను అవి యన్నియు కలిసి తాత్పర్యరూపమైన జీవబ్రహ్మైక్యమను వాక్యార్థమునే బోధించును. యోగియైన జీవునకు పూర్ణాహంతానుభవము కలిగినప్పుడు సర్వేశ్వరునిలో దాదాపు అన్ని శక్తులు లభించును. దాదాపు అనుట ఏలననగా జగద్వ్యాపారాదులు మాత్ర మాతనికి లభింపవు. అహమ్ అను అక్షరములు వర్ణమాల ఆద్యంతములు. కావున సర్వవిశ్వము దానిలోని పదార్థములు అన్నియు దానిలో అంతర్భవించును. సాధారణముగా పిండాండమునే అహమ్ అనుకొనుట జీవులందఱకు అలవాటు కాని బ్రహ్మాండము అంతయు అహమ్‌లో అంతర్భవించును. కావున యోగి యొక్క అహమ్ అనగా బ్రహ్మాండమంత తనలో ఐక్యము నొందినది అను అనుభవమే ఆ బ్రహ్మమే అని చెప్పవలసియున్నది. బృహ్ ధాతువు బ్రహ్మశబ్దమునకు మూలము. వ్యాకరణ నియమము ననుసరించి బృహ్ బ్రహ్ అగును. బ్రహ్ హ్మ అని బ్రహ్మ పదమును విడదీయవచ్చును. వ్యాకరణ నియమము ననుసరించి హకారద్విత్వము సాధించవచ్చును. లేక నిరుక్త పద్ధతి ననుసరించి బృహితార్థమున బృంహ ఉన్నదని చెప్పవచ్చును. అస్తు. హ్మ అను వర్ణములలో అహమ్ అను వర్ణములు కించిద్వ్యత్యస్తములుగానున్నవి. బృంహితమైన అనగా విస్తరించిన అహమ్ అనునదే బ్రహ్మము. **బ్రహ్మము పూర్ణమైన అహమ్ అని చెప్పుట పై వివరణలోని తాత్పర్యము.** ఈ పూర్ణాహంతయే మహామాతృకాత్వము. దీని అనుభవము వలన సర్వేశ్వరుని అనంత శక్తులు మహిమలు యోగిలో ప్రకాశించును. ఈ యర్థమంతయు **'దివ్యామ్నాయ విద్యా సువిదిత మహిమానంత శక్తి ప్రకాశః'** అను సమాసముచే తెల్పబడినది.

**అవిదితమైన బ్రహ్మము మహార్థగుహాంతరితాత్మ భాసమున్**
**సువిదితముం బొనర్పగను సుందరమాతృమయాక్షరాత్మ వి**
**ద్య విదితవైభవుండవయి యంత విహీన సుశక్తి భాసివై**
**వివిధ సువర్ణ భేదముల వేగ స్వరూపము ఁదెల్పెదో గురూ!**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు యొక్క **మహామాతృకాత్వము** నొందుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతడు **శ్రీశబ్దబ్రహ్మమూర్తే** అని సంబోధింప బడునున్నాడు.

**శ్లో ॥ శ్రీశబ్దబ్రహ్మమూర్తే! సకలరవమయానాహతధ్వానభేదా-**
**నాత్మీయానక్షరస్థాన్ బహువిధనినదైర్భూరివాద్యప్రభేదైః ।**
**భేరీనిస్సాణఘంటాదరమురజమహాశృంగనాలోరునాదై-**
**ర్వంశైర్యంత్రైశ్చ గాత్రైర్జలధరపటలైస్త్వమ్బ్రవీషి ధ్వనిజ్ఞః ॥ 60**

**ప్రతిపదార్థము :** శ్రీ శబ్ద బ్రహ్మ మూర్తే = శ్రీ శబ్ద బ్రహ్మమూర్తివైన ఓ పరశమ్భూ!, ధ్వనిజ్ఞః = ధ్వనులనెఱిగిన, త్వమ్ = నీవు, బహువిధనినదైః = అనేక విధములైన ధ్వనులు గల, భేరీనిస్సాణ ఘంటాదరమురజమహాశృంగనాలోరునాదైః = భేరి, నగార, గంట, శంఖము, తబల, పెద్దకొమ్ము వంటి పెద్దధ్వనులుగల, భూరివాద్య ప్రభేదైః = అనేకములైన వాద్యవిశేషములచేత, వంశైః = వెదురు గొట్టములచేత, యంత్రైః = యంత్రములచేత, గాత్రైః = కంఠధ్వనులచేత, జలధరపటలైః = మేఘసమూహముల గర్జనల చేత, ఆత్మీయాన్ = స్వీయములైన, అక్షరస్థాన్ = అక్షరములలో నున్న, సకలరవమయానాహతధ్వానభేదాన్ = సర్వధ్వని రూపమైన అనాహత ధ్వని విశేషములను, **బ్రవీషి** = పలుకుచున్నావు.

తాత్పర్యము : ఓ శ్రీ శబ్దబ్రహ్మమూర్తీ! ధ్వనుల నెఱుగు నీవు అనాహతధ్వనులకు ఆహతధ్వనులై భేరీనిస్సాణఘంటా శంఖమృదంగతాలాది ధ్వనులను యంత్రవాద్య ధ్వనులను గాత్రసంగీత ధ్వనులను అక్షరోచ్చారణధ్వనులను ఇవి అవి అననేల సమస్త ధ్వనులను నీవే (పలుకు) చేయుచున్నావు.

**వివరణము :** ఈ ప్రపంచము నామరూపాత్మకము. రూప ప్రపంచమునకు అర్థ ప్రపంచము యని మరియొక పేరున్నది. అట్లే నామ ప్రపంచమునకు శబ్ద ప్రపంచమని మరియొక పేరున్నది. ఈ రెండును పంచాంగమైన బ్రహ్మలోని చివరి రెండు అంగములు. నామరూపములు మొదటి మూడు అంశములు సత్ చిత్ ఆనందములు (సత్యములు). మిథ్యలైన నామరూపములలో రూపము నామ జన్యమని తంత్రసిద్ధాంతము. వేదశబ్దేభ్య

**ఏవాదౌజగన్నిర్మమే** వంటి వాక్యములు శబ్ద (ప్రపంచ)మునుండి అర్థ(ప్రపంచ)ము పుట్టినదనుటకు నిదర్శనములు. మిథ్య వాస్తవము యొక్క అనగా సత్యము యొక్క రూపాంతరమే కావున నామ రూపములు బ్రహ్మమే. శబ్ద ప్రపంచమున వేదము ముఖ్యము. దానికి ఓంకారము మూలము. **ఓంకారము బ్రహ్మము యొక్క నామము.** వాచకము వాచ్య వాచకములు అభిన్నములు కావున ఓంకారమే బ్రహ్మము. ఈ ఓంకారమునకే శబ్దబ్రహ్మమని పేరు. ఈ శ్లోకమున **పరశమ్భువు శ్రీ శబ్ద బ్రహ్మమూర్తే** అని సంబోధింపబడినాడు. శబ్దము ద్వివిధము. వర్ణాత్మకము, ధ్వన్యాత్మకము. వర్ణాత్మకశబ్దమునకు ధ్వన్యాత్మకశబ్దము వ్యంజకము. వర్ణాత్మకశబ్దము అర్థవ్యంజకము. వర్ణసముదాయ రూపమైన ప్రాతిపదికాధాతుప్రత్యముల నుండి పదమేర్పడును. ఇది అర్థమునకు వాచకము లక్షకము వ్యంజకము కూడ. ఇట్టి పదములవలన వాక్యము లేర్పడును. ఆ వాక్యముల సముదాయము మహావాక్యము అగును. పదమునకు పదార్థము వాచ్యము వాక్యార్థము కూడ వాక్యమునకు అర్థము. అర్థము వాచ్యలక్షణ వ్యంగ్యములలో నేదోయొక రూపమున నుండును. సంగీతము నాదప్రధానము. సాహిత్యమున అర్థమునకు ప్రాధాన్యము. ఆ అర్థము వాచ్యలక్ష వ్యంగ్యములలో నేదైన కావచ్చును. నాదము లనేక విధములు. ముఖ్యముగా కొన్ని నాదములు ఆహతములు. భేరీగంట మొదలగునవి ఆహతములైన నాదములను సృజించును. శరీరములో ప్రాణగతమైన శబ్దము చెవులు మూసికొన్నప్పుడు వినిపించును. ఈ శబ్దము కొట్టబడకుండ వచ్చిన దగుటచే అనాహత శబ్దమని పిలువబడును. భేరీనిస్సాణమురజములు మొదలగునవి లయ ప్రధాన వాద్యములు. మహాశృంగనాలము, వంశము మొదలగునవి శ్రుతి ప్రధాన వాద్యములు. జీవేశ్వరచేతన రూపమున పరశమ్భువే ఈ సర్వవిధధ్వనులను గ్రహించుచున్నాడు గావున ఆయన ధ్వనిజ్ఞుడు. ఆకాశ రూపమున ఆ పరశమ్భువే తనలోనున్న ఈ శబ్దములను పలుకు చున్నదని శ్లోకమున చెప్పబడినది. ఈ అన్ని విధములైన శబ్దములును మాతృకాస్వరూపములు. పరశమ్భువు యొక్క శక్తియే ఆ మాతృక. **సకలరవమయానాహతధ్వానభేదాన్** అను సమాసమును విడగొట్టి **సకలరవమయాన్, ఆహతధ్వానభేదాన్** అని రెండు సమాసములగా భావించుట ఉచితమనిపించుచున్నది. మాతృక **పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ** అను నాలుగు శబ్దశక్తులలో చివరిదైన వైఖరి యొక్క రూపమే అని గమనింపవలసి యున్నది. పైన చెప్పిన సమాసవిఘటనము ననుసరించి కంఠతాల్వాద్యాహతములగుటచే అక్షరస్థధ్వనులును ఆహతములే కాని అనాహతములు కావు అని గమనింపవలెను. పరమేశ్వరుడెవని తోడను మాట్లాడడు. మాట్లాడుటకు కావలసిన అవయవము లాతనివి కనబడవు. ఆయన మనదృష్టిలో మూగ

కాని **మూకం కరోతి వాచాలం** అన్నట్లు మూగవానినిగా వాచాలునిగా చేయును. అంతేకాదు ప్రపంచమున వినిపించు వినిపించని (అతిసూక్ష్మ) ధ్వనులన్నియు ఆతని పలుకులే అని శ్లోకమున కవి మనోహరముగ తన అనుభూతిని ప్రకటించుచున్నాడు. **మనము మూగవారమై ప్రపంచధ్వనుల నన్నింటిని పరమేశ్వరుని పలుకులుగా అనుభూతి నందెదము గాక!** సాహిత్యరసికుడు కవి రచితకావ్యములోని వర్ణవిన్యాసరామణీయకమును తెలిసికొనగలడు కావున ఆతడు ఆ వర్ణముల ధ్వని నెరిగిన వాడగుచున్నాడు. కావ్యకర్త పైన చెప్పిన వర్ణవిన్యాస రామణీయకమును శబ్దములతో వ్యంజించును, పలుకును. బ్రహ్మము నకు కవి యను పేరు కూడ ఉన్నది. ఆ బ్రహ్మము విశ్వకావ్యకర్త. ఆతడీ ప్రపంచమునే పలుకుచున్నాడు. అందుకు ధ్వనిజ్ఞుడైన కవి కావ్యమును పలుకునట్లు బ్రహ్మయను కవి విశ్వకావ్యమును పలుకుచున్నాడు. మొత్తము మీద విన్న ధ్వనిని విశ్లేషించి తెలిసికొన గలవాడే, అట్టి ధ్వనులను పలికి ఎదుటి వారిని ధ్వనిజ్ఞుల చేయగలడు. పరశమ్భు వట్టివాడు.

**బహువిధనాదయుక్తముల వాద్యవిశేషములన్ సతోయవా**
**ర్వహగణ గాత్రయంత్రముల ఁబల్కెద వీవు ధ్వనిజ్ఞమూర్తివై**
**మహిత సమస్తవర్ణలసమాన సమస్త నినాదరూప సం**
**గ్రహకృదనాహత ధ్వని వికారములన్ నినదాత్మ! బ్రహ్మమా!.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు యొక్క **ధ్వనిజ్ఞత** సమస్తధ్వానములతో ఆయన మాట్లడుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆయన **అక్షరస్వరూపము** చెప్పబడుచున్నది.

శ్లో ॥ **తత్త్వానాం వ్యక్తిహేతుః సకలతిథిగతః సప్తపుర్యష్టకాంగః**
**స్త్రీపుంసద్వంద్వరూపో ద్యుమణిశశిమహావహ్నిపాదః షడాత్మా ।**
**సర్వాభిప్రాయసంవిత్ప్రకటితవిభవస్త్వమ్మహామ్నాయవిద్యా-**
**సారస్ఫారస్వరూపః పురుష ఇతి తతః సోఽక్షరాత్మాదివర్ణః ॥ 61**

**ప్రతిపదార్థము :** తత్త్వానామ్ = తత్త్వముల యొక్క, వ్యక్తిహేతుః = ఆవిర్భావమునకు కారణము, సకలతిథిగతః = అన్నితిథులలో నున్న, సప్తపుర్యష్టకాంగః = పదేను అంగములుగల, స్త్రీపుంసద్వంద్వరూపః = స్త్రీపుమ్మిథునరూపుడు, ద్యుమణిశశి మహావహ్నిపాదః = సూర్యచంద్రమహాగ్నులు పాదములుగాగల, షడాత్మా = షట్కోశ స్వరూపుడైన, సర్వాభిప్రాయ సంవిత్ప్రకటితవిభవః = అన్ని అభిప్రాయజ్ఞానములచేత ప్రకటింపబడిన వైభవముగల, మహామ్నాయవిద్యా సారస్ఫార స్వరూపః = మహామంత్ర

విద్యాసారముయొక్క విస్తృతి స్వరూపముగా గల, త్వమ్ = నీవు, పురుషః = పురుషుడవు, ఇతి తతః = ఈ కారణమున, సోఽక్షరాత్మా = ఆతడు లేక సో అను అక్షరము స్వరూపముగా గలవాడవు, ఆదివర్ణః = అకారస్వరూపుడు లేక అహం స్వరూపుడవు.

**తాత్పర్యము :** పరశమ్భువు సకల తత్త్వముల అభివ్యక్తికి కారణము, అన్ని తిథులందున్నవాడు, పదేను అంగములు కలవాడు, స్త్రీపురుష మిథున స్వరూపుడు, చంద్రసూర్యాగ్నులను మూడు పాదములు గలవాడు. ఏ అభిప్రాయజ్ఞానమైనను ఆతని మహిమనే ప్రకటించును. గొప్పవేదమైన గురూపదిష్టమంత్రముయొక్క సారవిస్తృతిస్వరూపుడు **'పురుషుడు'** అని పిలువ బడువాడు కావున ఆతడు అక్షర స్వరూపుడు లేక సో అను అక్షరమే స్వరూపముగా గలవాడు, అకార స్వరూపుడు లేక అహమ్ అని స్ఫురించువాడు.

**వివరణము :** తత్త్వముల వ్యక్తి కా పరశమ్భువు హేతువు. తత్త్వము లేవో వాని సంఖ్య యేదో 25 వ శ్లోకము యొక్క వ్యాఖ్యలో వివరింపబడినవి. తత్త్వముల వ్యక్తికి పరశమ్భువు హేతువనుటచే తత్త్వములు మిథ్యలని తెలియుచున్నది. తత్త్వములు మిథ్యలు కావున వానికి హేతువు అని అనక తత్త్వముల వ్యక్తికి హేతువు పరశమ్భువు అని చెప్పబడినది. మిథ్యావస్తువులకు వ్యక్తి అనగా భాసనమందునే కాని ఉత్పత్తి ఉండదు. లేదా వ్యక్తి శబ్దము అనిర్వచనీయ (మిథ్యా) వస్తువుయొక్క ఉత్పత్తిని మాత్రమే చెప్పును కాని సత్యవస్తువుయొక్క ఉత్పత్తి నావ్యక్తి శబ్దము చెప్పజాలదు. ప్రతిపదాది పూర్ణిమా పర్యంతతిథులు పదేను. అవి చంద్రునం దవి ఏకోత్తరవృద్ధిని శుక్లపక్షమున పొందును. కృష్ణపక్షమున దినమున కొకటి చొప్పున హ్రాసము నందును. **అమ** యనకళ వృద్ధిక్షయములు లేనిది చంద్రుడు కనబడని అమావాస్యా తిథియందును అది ఉండును. అందుచేతనే ఆ తిథి అమావాస్యా అని అనబడినది. దీనికి **సాదము** అని, **అమృత** అని పేర్లు కలవు. అమావాస్యనాడు చంద్రుడు కనిపించడు అనగా ఆతడు సూర్యునితో కలసి యుండును. అమావాస్య దృష్టచంద్ర, నష్టచంద్ర అని ద్వివిధముగానుండును. దృష్టచంద్రయైన అమావాస్యకు **సినీవాలి** అని, నష్టచంద్రయైన అమావాస్యకు **కుహూ** (గుంగూ) అని పిలువబడును. నష్ట అనగా కనబడని అని మాత్రమే అర్థము. సూర్యునితో కలిసి చంద్రుడు కనిపించకపోవుట సంభవించును కాని చంద్రుడు సర్వదా నశింపడు కదా! కొందఱు ఈ అమ సమష్టికల అన్ని తిథులలోను వ్యాపించి ఉండునని చెప్పెదరు. అట్టి **అమాకలాస్వరూపుడు పరశమ్భువు.** పుర్యష్టకమనగా పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములు మూడు. ఈ ఎనిమిది పురాలు అనగా ఎనిమిది శివుని మూర్తులు ఈ మూర్త్యష్టకము కలవాడు గనుకనే **పరశమ్భువు అష్టమూర్తి**

**అనబడును**. పంచతన్మాత్రలు మాయావిద్యలు ఇవి ఏడుకూడ ఆతని కంగములే. వీనితో కలసి శివుని అంగములు పదేను. దానికి అమను(చిత్కలను) కలిపినచో **షోడశకలాత్మకః పురుషః** అను ఉపనిషద్వాక్యము యొక్క అర్థమును వివరించి నట్లగును. మధ్యలోని పురీశబ్దము **దేహళీదత్తదీపన్యాయమున** పూర్వోత్తరము లందున్న సప్తఅష్టకములకు అన్వయింపజేసి అర్థమును గ్రహింపవలెను లేక సప్తసహిత పుర్యష్టకమని మధ్యమ పదలోప సమాసమును చెప్పుకొని అర్థమును గ్రహింపవలెను. **సకలతిథిగతసప్తపుర్యష్టకాంగ** అను రెండు సమాసములను కలిపి కాలాత్మకుడైన పరశమ్భువుని పదేను అంగములకు పై పదేను తిథులకు అభేదాధ్యవసాయము చేసి పై పదేను అంగములను తిథులుగా, తిథులను పదేను అంగములుగా భావించుకొనుట సముచితముగా నుండును. అస్తు. **పరశమ్భువు స్త్రీ పుంస ద్వంద్వరూపుడు** అనగా లోకములోని భార్యాభర్తల జంటలకు అమ్మవారితో కూడిన పరశమ్భువు గానే భావింపవలెను. కాదుకాదు దర్శింపవలెను. పరశమ్భువు స్వయముగా **అర్ధనారీశ్వరుడు. స్త్రీపుంసద్వంద్వరూపుడు.** ఆ ద్వంద్వమునుండి ఏ ఒకని వేఱు చేయరాదు. ఈ ప్రపంచమంతయు మాయాశబలబ్రహ్మరూపము. ఏ ఒకరిని వస్తువునుండి విడదీసిన ఆ వస్తువు అంతర్హితమగును. వర్ణములలో కూడ అచ్చులు స్త్రీరూపములు, హల్లులు పుంరూపములు. కావున వర్ణాత్మక పరశమ్భువు కూడ **స్త్రీ పుంస ద్వంద్వ రూపుడు.** మరొక దృష్టితో వర్ణాత్మక వాక్కు స్త్రీరూపము, దాని అర్థమంతయు శివుని రూపము. అవి పరస్పర సంపృక్తములు. అవిభాజ్యములైన స్త్రీపుంసద్వంద్వ రూపుడైన పరశమ్భువు యొక్క రూపాంతరములు. మనము సాధారణముగా ప్రపంచమును గూర్చి మాట్లాడుకొనుచున్నాము. కావున ప్రాపంచికులము సంసారులము అజ్ఞానులము ఇతరులు అనుకొనును. అట్లనుకొనువారు యథార్థముగా అజ్ఞానులే. వారు తమను తాము పారమార్థికులుగా ముద్రవేసి కొనుచుందురు.యథార్థమునకు అన్ని వాగ్వ్యవహారముల ఏకైక తాత్పర్యము అన్ని అభిప్రాయముల తాత్పర్యము పరశమ్భువు యొక్క సంవిత్తే. ఈ ప్రపంచమంతయు ఆతని వైభవము. ఇదికూడ జ్ఞానులకీ విషయము లోతుగా నాలోచించినచో జగములోని పదార్థములన్నియు ఇంద్రియద్వారమున జ్ఞానాకృతులుగా చేయబడియే జ్ఞాతకు గోచరములగును. కావున జ్ఞానాధీనము గాని వస్తువేదియు లేదు. ఉన్నదని చెప్పుటకు జ్ఞాన విషయము గావలెను. జ్ఞానవిషయముగా దున్నదని చెప్పుచో కుందేటి కొమ్ముకూడ ఉన్నదని చెప్పవలసి వచ్చును. కావున సర్వాభిప్రాయ సంవిత్తులు సంవిద్రూపుడైన పరశమ్భువు వైభవమునే ప్రకటించును. అనగా **దృక్కు దృశ్యము దర్శనము అన్నియు ఆయనే.** పరశమ్భువు **మహామ్నాయ విద్యా సారస్ఫార స్వరూపుడు.** గురూపదిష్టమైన

మంత్రము వేద సదృశము కాదు. వేదమే గురువు. పరమాత్మ స్వరూపుడు. పరమాత్మ వాక్కే వేదము కావున గురూపదిష్టమంత్రము వేదమే యనవలెను. పైగా ప్రత్యక్షముగా గురువు గోచరమగును. ఆయనచే ఉపదేశింపబడిన మంత్రము దివ్యమైన ఆమ్నాయ విద్యయే. దాని యొక్క అనగా ఆ మంత్రము యొక్క సారము స్ఫారము పరశమ్భువే. పాలయొక్క సారము వెన్న. వెన్న తిరిగి వెనుకకు పరిణమించినచో విస్తారములైన పాలగను. ఇట్లు విస్తరించుట స్ఫారము. స్ఫారమును చిలికి సారమును, సారమును విస్తరించి స్ఫారమును పొందవలెను. పరశమ్భువు దివ్యామ్నాయవిద్యయొక్క సారము. పరశమ్భువు యొక్క స్ఫారము దివ్యామ్నాయవిద్య. **పరశమ్భువు పురుషుడు అనగా క్షేత్రజ్ఞుడు.** పురువులు అనేకములు. అనేక శరీరములను కల్పించి వానిలో నుండు వాడు కావున ఆతడు పురుషుడు. పురువులు క్షేత్రములు అనగా అవి అనేకములు. వానిలో నుండువాడు ఒక్కడే. క్షేత్రజ్ఞుడు ఒక్కడే అనుటకు **'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత'** అను గీతా వచనము ప్రమాణము. క్షత్రములు అనగా క్షీణించునని అనగా క్షరములు. వానిలో అక్షరుడై ఉండువాడు క్షేత్రజ్ఞు డనబడు పురుషుడు. కావున అక్షరపురుషుడు ఆతడు. అనగా ఆ పరశమ్భువు 'క్షరపురుషరూపములు సర్వ భూతములు' అని భగవద్గీత చెప్పుచున్నది. **'సోఽక్షరాత్మా'** అను పదములు సః అక్షరాత్మా అని విభజించి పైన అర్థము చెప్పబడినది. **'సోఽక్షరాత్మా'** అనునది సమాసముగా భావింప బడునప్పుడు సో అను అక్షరమే స్వరూపముగా గలవాడు అను అర్థము వచ్చును. అహమర్థము జీవుడు. సో అను పదము యొక్క అనగా తత్పాదము యొక్క ప్రథమావిభక్త్యేకవచన రూపమైనది. 'సో' అనునది అక్షరము కావున సోఽక్షరాత్మా అనగా పరశమ్భువు. పరశమ్భువు ఆదివర్ణుడు అనగా అకారము ఆదిగాగల 'అహమ్' అను పదముచే వర్ణింపబడువాడు లేదా వర్ణములలో ప్రథమాక్షరము అనుత్తరమైన అకారము హకారార్థము. జీవుడు **'సోఽహమ్ అహమ్ బ్రహ్మాస్మి'** అను పదత్రయము అవసరం లేకుండగ అహమ్ అను పదమే జీవబ్రహ్మైక్యమును బోధించును. ఇది తంత్రరహస్యము కావున తంత్రములలో **అహంత పరాహంత పూర్ణాహంత** అను మాటలు తఱచు వినబడుచుండును. వాని అర్థము వేదాంత పరిభాషలో తాత్పర్యమున విరోధించదు. సోహమ్ అహమ్ బ్రహ్మాస్మి అను వాక్యముల యొక్క సారమీ అహమ్పదార్థము. పరశమ్భువు మూడు పాదములు గలవాడు. **త్రిపాదూర్ధ్వ ఉదైత్ పురుషః** అని పురుషసూక్తము పురుషునకు మూడు పాదము లున్నట్లు చెప్పినది. కాని **'పాదోఽస్య విశ్వా భూతాని'** అని ఆతని నాలుగవపాదమే సమస్త భూతరూపము అని పాదములు నాలుగని చెప్పినది.

మాండూక్యోపనిషత్తు కూడ **'సోఽయమాత్మా చతుష్పాత్'** అని ఆత్మను చతుష్పాత్తుగా వర్ణించినది. ఈ శ్లోకమున పరశమ్భువునకు మూడు పాదములున్నట్లు చెప్పినది అంతేకాక ఆ పాదములు సూర్యచంద్రాగ్నులు అని కూడ చెప్పినది. శమ్భువు త్రినేత్రుడుగా ప్రసిద్ధుడే. అవి సూర్యచంద్రాగ్నులే. కాని ఈ శ్లోకమోన అవి పాదములుగా చెప్పబడినవి. **'చత్వారి శృంగా త్రయో అస్య పాదాః ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య త్రిధా బద్ధో ఋషభో రోరవీతి మహోదేవో మర్త్యాన్ ఆవివేశ'** అను మంత్రము అగ్ని ధ్యానమున కంగమైనది ఉన్నది. అందు మూడు పాదములు అని చెప్పబడినది. ఈ మంత్రమును మహాభాష్యమున పతంజలి శబ్దపరముగా వ్యాఖ్యానించినాడు. ఈ ప్రకరణము మాతృకా స్కంధరశ్మి ప్రకరణము. అది శబ్ద సంబంధి కావున ఇక్కడ మూడు పాదములు అని పై శృతి కనుగుణముగ చెప్పుట సమంజసము గనే ఉన్నది. మాతృకలో కకారము మొదలు భకారము వఱకు గల ఇరువది నాలుగు వర్ణములు సూర్యకళలు అని తంత్రగ్రంథములలో చెప్పబడియున్నది. అట్లే యకారాది క్షకారము వఱకు గల పదివర్ణములు అగ్నికళలని చెప్పబడినది. అట్లే పదాఱు అచ్చులు చంద్రకళలు అని చెప్పబడినది. విశుద్ధిచక్రము చంద్రస్థానము. దానియందు పదాఱు అచ్చులున్నవి. అనాహతములోని కకారాది **ద్వాదశ వర్ణములు,** మణిపూరములోని డకారాది **దశవర్ణములు,** బభలు మొత్తము ఇరువది నాలుగు. కళలలో ఇరువది రెండుకళలకు స్థానములైన అనాహత మణిపూరములు సూర్యకళ స్థానములు సౌరమండలము అని ప్రసిద్ధి చెందినట్టివే. బభలు మాత్ర మధికముగా సూర్య కళలలో చేర్పబడినవి. ప్రపంచసారమున మకారము సూర్యకళయని చెప్పబడినది. శ్లోకమునందలి పాదశబ్దము నంశవాచకముగా గ్రహించి దానికి కళ అనిఅర్థము చెప్పవచ్చును. అప్పుడు సూర్యచంద్రాగ్ని పాదములు అనగా సూర్య చంద్రాగ్ని కళలు అని అర్థ మేర్పడును. ఇవి కలిగిన పరశమ్భువు ద్యుమణిశశిమహాగ్ని పాదుడు. ఓంకారములోని అ-సూర్యుడు, ఉ-చంద్రుడు, మ్-అగ్ని, ఓంకార వాచ్యుడైన పరమేశ్వరుని కివి మూడు పాదములు అనగా వాచకముల కావున పరశమ్భువు ద్యుమణి(అ), శశి(ఉ) మహాగ్ని(మ్) పాదములుగా గలవాడు. సమష్టి జాగ్రదవస్థేశ్వరుడైన వైశ్వానరుడు అకారము, సమష్టి స్వప్నావస్థేశ్వరుడు హిరణ్యగర్భుడు ఉకారము, సమష్టి నిద్రావస్థేశ్వరుడు మకారము అను మూడు పాదములు పరశమ్భువునకున్నవి. అనుట మాండూక్యోపనిషత్సము. వైశ్వానరశబ్దము అగ్నివాచకము, హిరణ్యగర్భశబ్దము హరిణగర్భ చంద్రునకు లక్షకము, అవ్యాకృత శబ్దము సూర్యునకు లక్షకము అని గ్రహించి ఈ మూడు (ద్యుమణి శశి వహ్ని పాదములు) గలవాడు అనియు

చెప్పవచ్చును. లేదా అనాహతము సూర్య మండలము అకారము, విశుద్ధి చంద్రమండలము ఉకారము, శివుని భ్రూమధ్యనున్న తృతీయ నేత్రము మహాగ్ని మకారము (క్రింది అగ్ని మండలములోని అగ్నికాదు). సూర్యుడు అగ్ని రూపుడు అనుటలో ఏ విప్రతిపత్తిలేదు. ఆతనిచే ప్రకాశ్యుడైన చంద్రునందలి ప్రకాశమును అగ్నిదే అనుటలో కూడ విప్రతిపత్తి ఉండనక్కఱలేదు. కాని సూర్యునందు తాపనదోషము, చంద్రునందు కళంకితాక్షయ దోషములున్నవి. జ్ఞానరూపమైన భ్రూమధ్యగతాగ్నిలో నీ దోషములు లేక పోవుటచే దానిని మహాగ్ని అనుట ఉచితముగా నుండును. మహా శబ్దమునకు సార్థకత కలుగును. వెనుక చెప్పిన శృతి మంత్రమున 'త్రయో ఆస్య పాదాః' (ద్యుమణిశశివహ్నులు పాదములు) అని ఉండుటచే నీ అర్థము పైశృతికి సన్నిహితముగా నున్నది. షడాత్మా అను శబ్దము పరశమ్భువు యొక్క షట్కోశరూపతను సూచించుచున్నది. **'పిండే షాట్కౌశికే'** అను శ్లోకము యొక్క వ్యాఖ్యానమున షట్కోశములు వివరింపబడినవి. షట్చక్రాత్మకుడు కావున షడాత్మ అనబడినాడు. 1. కవర్గము 2. చవర్గము 3. టవర్గము 4. తవర్గము 5. పవర్గము 6. యవర్గము అను ఆఱు వర్గములు శివరూపములగుటచే పరశమ్భు వీ శ్లోకమున షడాత్మ అని చెప్పబడినాడు ఈ అర్థము ప్రకరణమునకు సన్నిహితముగానున్నది.

**అనలశశీందుపాదము షడాత్మము స్త్రీపురుషోభయాత్మ త**
**త్త్వనివహ సుప్రకాశకమవారిత సంవిదుదార వైభవ**
**మ్మునిఖిలవేదవిద్యలకు మూలము సర్వతిథిప్రచారి య**
**ష్టనుత శరీరధారి పురుష ప్రథమాదిమవర్ణమీవహో!**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు యొక్క **వ్యంజనాత్మకత** విశేషముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతని **స్వరాత్మకత** చెప్పబడుచున్నది.

**శ్లో ॥ రమ్యోదాత్తానుదాత్తస్వరితవికృతిగః ప్రోచ్చనీచోభయస్థో**
**భేదా దష్టాదశాత్మా మహితనిజమహాస్ఫూర్తిరేకోఽక్షరాదిః ।**
**షడ్జాదిగ్రామజాతశ్రుతివితతలసద్గీతసప్తస్వరోద్య-**
**న్నానారాగాన్ ప్రబన్ధానధివసతి భవానాదినిత్యస్వరాత్మన్ ॥ 62**

**ప్రతిపదార్థము :** రమ్యోదాత్తానుదాత్తస్వరితవికృతిగః = అందమైన ఉదాత్తానుదాత్త స్వరిత వికృతులైన, ప్రోచ్చనీచోభయస్థః = పైన, క్రింద, పైన క్రిందను ఉన్నట్టి, భేదాత్ = భేదమువలన, అష్టాదశాత్మా = పదునెనిమిది విధములైన స్వరూపములుగల,

మహితనిజమహాస్ఫూర్తి = పూజింపబడిన తన మహా స్ఫూర్తి గల, ఏకః = ఒక్కడైన, అక్షరాదిః = అక్షరములలో మొదటిదైన, షడ్జాదిగ్రామ జాతశ్రుతి వితత లసద్గీత సప్తస్వరోద్య న్నానారాగాన్ = షడ్జము మొదలైన, స్వరములతో, గ్రామములతో శ్రుతులతో విస్తరించిన ప్రకాశించిన పాటల సప్తస్వరములనుండి ఏర్పడిన అనేక రాగములు గల, ప్రబన్ధాన్ = ప్రబన్ధములను, ఆదినిత్యస్వరాత్మన్ = మొదటి నిత్యస్వరరూపుడా, భవాన్ = నీవు, **అధివసతి** = అధివసించుచున్నావు.

**తాత్పర్యము :** ఉదాత్తానుదాత్తస్వరితములు కంఠాదిస్థానముల పైన, క్రింద, పైన క్రింద నుండునవి. వికృతులైన దీర్ఘాదులు వానికి కలిపినచో ఒక్కొక్క స్వరము పదునెనిమిది భేదములు కలదగును. దానిలో ఆత్మయొక్క మహాస్ఫూర్తి ఉన్నది. అక్షరములలో మొదటిదైన అకారము పరశమ్భువు. షడ్జాది సప్తస్వరములతో గ్రామములతో మూర్ఛనలతో శ్రుతులతో విస్తరించిన పాటలుగల, సప్తస్వరములనుండి ఏర్పడిన రాగములుగల ప్రబంధములందు నిత్య స్వరాత్మకుడవైన ఓ పరశమ్భూ నీవు వ్యాపించియున్నావు.

**వివరణము :** 'మహేశ్వర సూత్రములలో అ ఇ ఉణ్ ఋ ఌక్ అను రెండు సూత్రములలో హ్రస్వములైన అ, ఇ, ఉ, ఋ, ఌ అను అయిదు అచ్చులు పేర్కొన బడినవి వాని వికృతులే దీర్ఘములు ప్లుతములు. ఇవి కంఠాది స్థానములలోని ఊర్ధ్వభాగమున ఉచ్చరింపబడిన **ఉదాత్తములని,** క్రింది భాగమున ఉచ్చరింపబడిన **అనుదాత్తములని,** ఉభయ భాగములలో ఉచ్చరింపబడి **స్వరితములని** పిలువబడును. ఈ విధముగా అ, ఇ, ఉ అను అచ్చులు ఒక్కొక్కటి తొమ్మిది విధములైనవి. అనునాసిక అననునాసిక భేదమున మరల రెండు విధములైనవి. ఒక్కొక్కటి పదునెనిమిది విధములగు చున్నవి. ఋ ఌ అను వర్ణములకు సావర్ణ్యము చెప్పబడినందున ఋ, వర్ణమునకు పదునెనిమిది భేదములున్నవి. దీర్ఘము లేకపోవుట వలన ఆఋభేదములు తగ్గిన ఌ కారమునకు పన్నెండు భేదములు అవి రెండు కలిపి ముప్పది భేదములు కలవగు చున్నవి. 'ఏ ఓ ఙ్; ఐ ఔ చ్ అను రెండు సూత్రములలో ఏ, ఓ, ఐ, ఔ, అను నాలుగు దీర్ఘములైన అచ్చులు మాత్రమే పేర్కొనబడినవి. వాని వికృతులైన ప్లుతములు, వాని యొక్క ఉదాత్తానుదాత్త స్వరితభేదములు, అనునాసికాననునాసిక భేదములు కలిపినచో హ్రస్వము లేని వగుటచే అవి ఒక్కొక్కటి పన్నెండు భేదములు కలిగియున్నవి. ఈ అన్ని అక్షరములలో మొదటిదైనను **అకారము** వర్ణమాలలోని హల్లులన్నింటి మూర్ధములలో మహితమైన తన మహాస్ఫూర్తితో విరాజిల్లు చుండును. 2) పైన పేర్కొనబడిన అక్షరములు స్వరములు అని పేర్కొనబడినను అవి

షడ్జాది స్వరములు కావు. షడ్జాది స్వరములు సంగీతశాస్త్రమున ప్రకృతిస్వరములు అని పేర్కొనబడును. అవి స,రి,గ,మ,ప,ద,ని అనునవి షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, దైవతము, నిషాదము అని పేర్కొనబడు ఆ స్వరములకును వికృతిస్వరములున్నవి. వాని వలన అనంతములైన రాగము లేర్పడును. ఆ రాగములతో స్వరపఱచబడిన పాటలతో ప్రబంధము లేర్పడును. వాని అన్నింటను ఆది నిత్యస్వరమైన **అకారరూపముతో పరశమ్భువు** వ్యాపించి యున్నాడు.

**ఆదిమశాశ్వతస్వరమయా స్వరితాదివికారహేతు వ**
**ష్టాదశభేదమూర్తి స్వమహోస్ఫురణాత్మక మక్షరాది ష**
**డ్జాదులగ్రామజాతములనైన సుగీతగరాగబంధముల్**
**ప్రోదియొనర్చుచుండెడి విభుండవు వాఙ్మయ విశ్వమందునన్.**

**అవతారిక :** పై శ్లోకమున స్వరముల (అచ్చుల) లోని **అకారరూపుడైన పరశమ్భువు** యొక్క వ్యాప్తి చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ పదాఅచ్చులలో వ్యాపించుటచే నేర్పడిన ఆతని **షోడశత్వము, వికృతిజనకత్వము** మొదలగు నంశములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ సర్వాస్యస్థానవర్ణః ప్రథమవిగణితస్త్వం స్తుతః షోడశీతి**
**స్వేచ్ఛాశక్త్యా నిరుద్ధద్రఢిమనిజమహాప్రౌఢిమాఢౌకమానః ।**
**కాలవ్యక్తిస్త్రిలింగాన్నిజగతివిలయాన్ హ్రస్వదీర్ఘప్లుతాదీన్**
**విద్యావిద్యోభయాత్మా జనయతి పరితః శ్రీమహావర్ణజాత్మన్! ॥ 63**

**ప్రతిపదార్థము :** సర్వాస్యస్థానవర్ణః = అన్ని ఆస్యములలో స్థానములనుండి పుట్టిన వర్ణములుగల, ప్రథమవిగణితః = మొదలు లెక్కింపబడిన, త్వమ్ = నీవు, షోడశి, ఇతి = షోడశీ అని, స్తుతః = పొగడబడిన వాడవు, శ్రీమహావర్ణజాత్మన్ = శ్రీ అను మహావర్ణముచే బోధింపబడువాడా, స్వేచ్ఛాశక్త్యా = నీ ఇచ్ఛాశక్తిచే, నిరుద్ధద్రఢిమ నిజమహాప్రౌఢిమ్ = అడ్డగింపబడిన దార్ఢ్యము యొక్క ప్రౌఢిని, ఆఢౌకమానః = పూర్తిగా పొందిన, కాలవ్యక్తిః = కాలముల ప్రకటనము, త్రిలింగాన్ = మూడు లింగములను, నిజగతివిలయాన్ = తనను చేరుటతో లయముగల, హ్రస్వదీర్ఘప్లుతాదీన్ = హ్రస్వదీర్ఘప్లుతాదులను, విద్యావిద్యోభయాత్మా = విద్యావిద్యోభయస్వ రూపుడవై, పరితః = చుట్టు, జనయతి = పుట్టించుచున్నది.

**తాత్పర్యము :** కంఠతాల్వాది ముఖ స్థితస్థానముల నన్నిటి నుండి పుట్టిన, మొదట లెక్కింపబడు

అచ్చులు పదాఱు నీ స్వరూపములు కావున నీవును **షోడశి**యని పొగడ బడినావు. శ్రీ అను మహావర్ణముచే నిజస్వరూపమునే విస్తరించుకొన్న ఓ పరశమ్భూ! నీ విద్యావిద్యోభయాత్మకమైన కాల ప్రకటనము మూడులింగములు గల హ్రస్వదీర్ఘప్లుతాదులను నిన్నుచేరి లయించునట్టి వానిని నీ చుట్టు పుట్టించుచున్నది. అది స్వేచ్ఛాశక్తిచే దార్ఢ్య ప్రౌఢిమల నఱికట్ట గలిగినట్టిది.

**వివరణము :** కంఠము, తాలువు, ఓష్ఠము, మూర్ధము, దంతములు, జిహ్వామూలము, దంతములు ఇవి ఆస్యస్థానములు. వర్ణములన్నియు వీని నుండే జనించును కావున అన్ని వర్ణములు ఆస్యస్థానములే. అ,క వర్గము, హ, విసర్జనీయము కంఠము నుండి; ఇ, చవర్గము, య, శ, తాలువు నుండి; ఉ, పవర్గము ఉపధ్మానీయము ఓష్ఠము నుండి; ఋ, టవర్గము, ర, ష, మూర్ధము నుండి; ఌ , తవర్గము, ల, స దంతముల నుండి; వ, దంతోష్ఠములనుండి; జిహ్వామూలీయము జిహ్వామూలము నుండి జనించును. త్రిపురోపనిషత్తునందు ఈ వర్ణములన్ని **అకథ** అను మూడు షోడశులుగా చెప్పబడినవి. వర్ణమాలలో అచ్చులు పదాఱు. అవి మొదట నున్నవి కావున **ప్రథమవిగణితషోడశి.** క నుండి త వఱకు గల పదాఱు వర్ణములు **ద్వితీయ షోడశి.** థ నుండి స వఱకు గల పదాఱు వర్ణములు **తృతీయ షోడశి.** చివఱి రెండు **శివ షోడశద్వయము**. మొదటిది **శక్తి షోడశి.** ఇదియే శివషోడశద్వయము నందు ప్రవేశించి శక్తి వంతమొనర్చుటచే వర్ణములన్నియు మాతృకా శక్తులుగా పేర్కొనబడినవి. అకారము నుండి అమ్ వఱకు గల పదేను వర్ణముల తరువాత నుండుటచే 'అః' అను మాతృక, కకారమునుండి ణ వఱకు గల పదేను వర్ణముల తరువాత నుండుటచే 'త' అను మాతృక, థ మొదలు షవరకు గల పదేను వర్ణముల తరువాత నుండుటచే 'స' అను మాతృక షోడశులు అని చెప్పదగినవి. **పంచదశీమంత్రమునకు** చివఱ లక్ష్మీధరులచే చేర్చబడవలెనని ఆదేశింపబడిన 'శ్రీ' అను మాతృక కూడ షోడశియే. ప్రతిపద నుండి పూర్ణిమ వఱకు గల అన్ని తిథుల చివఱ నుండి **'అమ'** అను చంద్రకళ కూడ షోడశియే. 61 వ శ్లోకమున **సకలతిథిగత** అని ఉండుటచే ఈ షోడశు లన్నియు పూర్వ పంచదశ వర్ణముల సమష్టిరూపములుగా కూడ భావింపదగినవి. ఈ విధముగా వర్ణమాల (మాతృక) యు **కాలవ్యక్తి** అగుచున్నది. పరశమ్భువు యొక్క స్వేచ్ఛాశక్తిచే నీ వర్ణమాలలోని ద్రఢిమ ప్రౌఢి నిరోధింపబడుచున్నవి. కావున తత్తద్వర్ణముల తత్తత్పదార్థములనే జనింపజేయగలిగినవి. ప్రపంచాభిముఖముగా సృష్ట్యున్ముఖముగా ప్రవర్తిల్లిన ఈ వర్ణమాల తనగతిలో నెంత విస్తరించినను చివఱకు

సంహారాభి ముఖముగా పరమేశ్వరాభిముఖముగా గమించి లయమును పొందుచున్నది. సవిసర్గమైన సాధారణముగా హ్రస్వము పుంలింగమును, దీర్ఘము స్త్రీలింగమును, మకారసహితమైన అకారము నపుంసకమును సూచించును. భాషలో ప్లుతము ఎక్కడో తప్ప ఉపయోగింపబడదు. త్రిమాత్రకమైన ఓమ్ కారములోని ఓకారము ప్లుతము. దాని నపుంసకత్వమును చివఱి మకారము (లేక అనుస్వారము) సూచించును. హ్రస్వము ఏకమాత్రాకాలికము, దీర్ఘము ద్విమాత్రాకాలికము, ప్లుతము త్రిమాత్రాకాలికము కావున కాలవ్యక్తియే హ్రస్వదీర్ఘప్లుత భేదములను సృజించుచున్నది. ఓంకారమవ్యయమైనను దాని సుబంతత్వము వ్యాకరణ శాస్త్రసమ్మతము. సృష్ట్యున్ముఖమైన వర్ణమాల అవిద్యాత్మకము, సంసారభావాభిముఖమైన వర్ణమాల విద్యాత్మకము, అకారము శ్రీ మహావర్ణము. **'అకారో వై సర్వవాక్'** అని శ్రుతి బోధించు చున్నది. మహావర్ణ అను సమాసమును మహా అవర్ణ అని విభజించుకొనవచ్చును. మహాశబ్దములో అహమ్ అను శబ్ద మున్నదని పూర్వశ్లోక వ్యాఖ్యలో సూచించితిని. 'అహమ్' అను దాని ఆద్యంతములలో అకారమే ఉన్నది. సృష్టి యొక్క ఆద్యంతములలో ఆత్మయే ఉన్నది. **'శ్రీమహావర్ణజాత్మన్'** అను సంబోధనము పరశమ్భువు ఆత్మరూపుడని సృష్టి ఆద్యంతములలో ఉన్నాడని వ్యంజింపజేయును. 'అహమ్ ఆత్మా' అను రెండు శబ్దములలో మొదటిదాని హ్రస్వాకారములు రెండవ దానిలో ఆకారములు ఆద్యంతములలో నున్నవి. అవి యన్నియు అవర్ణజములే. **అహమ్ బ్రహ్మాస్మి** అను వాక్యార్థ జన్య జ్ఞాన మొక్కటే విద్య. మిగిలిన జ్ఞానము లన్నియు అవిద్యయే లేదా గురూక్త మంత్రమొకటియే విద్య, తదితరమంతయు అవిద్యయే. విద్యావిద్యలు రెండును పరశమ్భు స్వరూపములే. బ్రహ్మ శబ్దగత బృంహితా హంత (పూర్ణాహంత) ని పూర్వశ్లోక వ్యాఖ్యానమున చెప్పితిని. హ్రస్వదీర్ఘప్లుతముల ఉదాత్తానుదాత్తస్వరితములు, స్త్రీపుంనపుంసక లింగములు అన్నియు కాలాత్మిక వర్ణమాలయే సృజించుచున్నది అని శ్లోకమునందలి ముఖ్య భావము.

**శ్రీమహితాక్షరాత్మక! అశేషమహాక్షరమూర్తి!షోడశీ**
**నామమునన్ బ్రసిద్ధిఁగని నైజమహేచ్ఛ త్రికాల లింగ సం**
**ఖ్యామల సుస్వరమ్ములను ఖ్యాతివెలుంగగ ఁజేయునట్టి శో**
**భా మహనీయమూర్తివి స్వభాసివి విద్యవవిద్యవో శివా!**

**అవతారిక :** పై శ్లోకమున స్వర (అచ్) రూపమైన **ప్రథమవిగణితషోడశిగా** పరశమ్భువు చెప్పబడినాడు. ఈ శ్లోకమున వర్గములవలన కూడ పరశమ్భువే చెప్పబడునని చెప్పబడు

చున్నది.

**శ్లో॥ పక్షద్వంద్వైకకర్తాఽవనిజలహుతభుఙ్మారుతాకాశమూర్తే!**
**శ్రోత్రాద్యక్షాణి సర్వాణ్యధిగతచరణః స్వప్రకృత్యా నిరుద్ధః!**
**అంతఃస్థో విశ్వరూపః పురుష ఇతి యతో జ్ఞాయసే స్వక్రమేణ**
**జ్ఞాతా వర్గాక్షరాణామ్పరమశివ! జనై స్త్వం తతో వర్గజోఽసి ॥ 64**

**ప్రతిపదార్థము :** అవనిజలహుతభుఙ్మారుతాకాశమూర్తే! = భూమి నీరు నిప్పు వాయువు ఆకాశములు దేహముగాగల, పరమశివ = ఓ పరశమ్భో !, త్వమ్ = నీవు, పక్షద్వంద్వైకకర్తా = పక్షయుగమున కొకడవైన కర్తవు, సర్వాణి = అన్ని, శ్రోత్రాద్యక్షాణి = చెవి మొదలగు నింద్రియములు, అధిగతచరణః = పొందబడిన పాదములుగా గలవాడవు, స్వప్రకృత్యా = నీ స్వభావముచే, నిరుద్ధః = అడ్డగింపబడినవాడవై, విశ్వరూపః = విశ్వరూపుడవయ్యు, అంతఃస్థః = లోపలనున్న వాడవు, యతః = ఏకారణము వలన, స్వక్రమేణ = నీక్రమముతో, వర్గాక్షరాణామ్ = వర్గాక్షరముల యొక్క, జ్ఞాతా = జ్ఞాతవై, పురుష ఇతి = పురుషుడు అని, జనైః = జనులచేత, **జ్ఞాయసే** = తెలియబడుచున్నావో, తతః = ఆ కారణమున, వర్గజః = వర్గములచే తెలియబడువాడవు, **అసి** = అగుచున్నావు.

**తాత్పర్యము :** పంచభూతాత్మకుడవైన ఓ పరశమ్భో! పక్ష యుగమున కొకడవైన కర్తవు శ్రోత్రాదీంద్రియములు పాదములుగా సమస్త లోకముల సంచరించువాడవు విశ్వరూపుడవయ్యు నీ స్వభావముచేతనే అడ్డగింపబడిన వాడవై అంతస్థుడవైనావు. వర్గాక్షరముల జ్ఞాతవు. జనులచే పురుషుడుగా తెలియబడుచున్నావు కావున వర్గజుడవు.

**వివరణము :** వ్యష్టి స్థూలదేహము పంచీకృత పంచభూతాంశ నిర్మితము, సమష్టి స్థూల దేహము అపంచీకృత పంచభూత నిర్మితము. వ్యష్టి సూక్ష్మదేహము అపంచీకృత పంచభూత జన్యము. వ్యష్టి కారణదేహము అవిద్య, సమష్టి కారణదేహము మాయ, పరశమ్భువు యొక్క స్థూలదేహమైన బ్రహ్మాండము పంచభూతనిర్మితము అని **'అవనిజలహుత భుఙ్మారుతాకాశమూర్తే'** అను సంబోధనము వలన తెలియుచున్నది. 2) పరలోకమున కేగు హంస వంటి జీవునకు కర్మోపాసనలు అను రెండు ఱెక్కలు గలవు. ఈ లోకమున జీవించు జీవుని ప్రాణహంసమునకు ప్రాణాపానములు రెండు ఱెక్కలు. సంవత్సరము అను పక్షికి (సూర్యునకు) దక్షిణాయనోత్తరాయణములు అను రెండుఱెక్కలు. దేహము అను పక్షికి రెండు చేతులు ఱెక్కలు. మాసము (చంద్రుడు) నకు పంచదశ ప్రతిపదాది

తిథియుక్త శుద్ధ బహులపక్షములు రెండు ఱెక్కలు. ఇట్లు చెప్పుకొనుచు పోయినచో ఎన్నియో పక్షద్వంద్వములు కనిపించును. తైత్తిరీయోపనిషత్తున అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయనామక (కోశ) పురుష (పక్ష) లకు రెండేసి ఱెక్కలు చెప్పబడినవి. ఒక ఆత్మ జీవేశ్వరులుగా, ఒక పురుషోత్తముడు క్షరాక్షర పురుషులుగా ద్వైత భావము నొందుటయే పక్షద్వయము నందలి కర్త్రైక్యము. అచ్చులొకపక్షము, హల్లులొకపక్షము ఆ రెంటియొక్క ఒక కర్త పరశమ్భువు. ఈతని కొకవైపు శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకము, మరొక వైపు వాగాది కర్మేంద్రియ పంచకము అను పాదములున్నవి. ఱెక్కలు పాదములున్నను ఆ పరశమ్భు పక్షి స్వప్రకృతి (మాయ) తోడనే నిరోధింపబడి స్వేచ్ఛగా తిరుగజాలకున్నది. స్వప్రకృతి తోడనే ఆ ప్రకృతి నిరోధము నుండి విడివడి (ముక్తినొంది) పరమాకాశమున విహరించు చున్నది. ఆతడు విశ్వరూపుడయ్యు అంతఃస్థుడై యున్నాడు. అంతస్థుడయ్యు విశ్వరూపుడై యున్నాడు. వర్గాక్షరములకు జ్ఞాతయై పురుషుడుగా జనులచే తెలియబడుచు వర్గజుడగుచున్నాడు. వర్గాక్షరము లిరువదియైదు. స్పర్శములు అంతస్థములు అని పిలువబడు యరల(ళ) వలు, ఊష్మములు అని పిలువబడు శషసహలు, సంయుక్తాక్షరమైన క్ష కారము. ఇవి ముప్పదియైదు. ఈ ముప్పదియైదు వర్ణములు ముప్పదియైదు తత్త్వములకు జనకములు. ముప్పది యాఱవ తత్త్వమైన పరశమ్భువు వీని నన్నింట వ్యాపించి యుండును. 1) కర్మేంద్రియ పంచకము, 2) జ్ఞానేంద్రియ పంచకము, 3) అంతఃకరణ పంచకము, 4) భూత పంచకము, 5) ప్రాణపంచకము, 6) ఉపప్రాణపంచకము, 7) తన్మాత్రా పంచకము. ఇవి ముప్పది యైదు తత్త్వములు లేక కర్మ, జ్ఞాన, భూత, తన్మాత్రా, ప్రాణోపప్రాణ, పంచకములు ($6\times5=30$) అంతఃకరణ చతుష్టయము, అవిద్య లేక మాయ మొత్తము ముప్పది యైదు తత్త్వములు. ఈ ముప్పది యైదు హల్లులు మూర్ధమున ప్రకాశించు అకారము ముప్పదియాఱవ తత్త్వమైన పరశమ్భువు. యరల(ళ) వ అను అంతస్థ వర్ణములు, అంతఃకరణ చతుష్టయము లేక అంతఃకరణ పంచకము. 61వ శ్లోకము యొక్క వ్యాఖ్యలో వర్గముల పేర్లు చెప్పబడినవి. ఒకవైపు **విశ్వరూప శబ్దము** అకారముయొక్క సమస్త **వర్ణాత్మకతను,** మరొకవైపు **అంతస్థ శబ్దము** పరశమ్భువు యొక్క **వర్ణాత్మకతను** వ్యంజింప జేయుచున్నవి. అంతస్థ విశ్వరూపత్వములు జ్ఞాతృ జ్ఞేయములు పరస్పరవిరుద్ధ ధర్మములు ఒకే పరశమ్భువునందు చెప్పబడుటచే విరోధాభాసాలంకారము ఈ శ్లోకమున వ్యంగ్య మగుచున్నది. **స్వప్రకృత్యానిరుద్ధః** అనుచోట **స్వప్రకృత్యా, అనిరుద్ధః** అని విభజించి పరశంభువు యొక్క నిరంకుశ స్వాతంత్ర్యమును వ్యంజింపజేయు ననియు చెప్పవచ్చును. దాని చేత అంతఃస్థ విశ్వరూపత్వముల విరోధము పరిహృత మగును. వర్గజశబ్దము జీవ

వర్గజ్ఞేయత్వము శంభువునం దున్నదని వ్యంజించుననియు చెప్పవచ్చును.

**పక్షయుగైకకారుఁడ వవన్యుదకాగ్నిమరుత్థ మూర్తి వ**
**ధ్యక్షుడ వంబరస్థుడ వనంత నిజ ప్రకృతి ప్రబద్ధ చి**
**త్సాక్షిక విశ్వమూర్తి పురుష ప్రథితుండవు సర్వవర్గ సం**
**స్థాక్షరవేదివయ్యును జనాళి యెఱుంగుట వర్గజుండవే.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **వర్గవేద్యుడుగా** చెప్పబడినాడు. ఈ శ్లోకమున ధాత్వాది సమస్త శబ్దములు వర్ణసంయోగరూపములని ఆ వర్ణసంయోగము పరశమ్భువును వదలి నశించునదే అని చెప్పబడుచున్నది.

**శ్లో ॥ సర్వాత్మాఽతీతధామాఽనలనిలయపదజ్ఞాపికా మంత్రవిద్యా**
**సత్యాభిప్రాయబుద్ధ్యా శివగురువదనామ్భోరుహోద్భాసమానా ।**
**నానార్థా ధాతవశ్చ ప్రకటితవిభవాశ్చిత్రవాగ్బ్రహ్మవేదాః**
**సర్వం నశ్యద్వినా త్వాం పరశివ! సహజం వర్ణసంయోగరూపమ్॥ 65**

**ప్రతిపదార్థము :** పరశివ! = ఓ పరశమ్భూ! సత్యాభిప్రాయబుద్ధ్యా = సత్యమైన అభిప్రాయముగలదను బుద్ధిచేత, శివగురువదనామ్భోరుహాత్ = శివగురువు యొక్క ముఖకమలమునుండి, భాసమానా = ప్రకాశించునది, ప్రకటితవిభవాః = ప్రకటింపబడిన వైభవముగల, నానార్థాః = అనేకార్థములు గల, ధాతవః చ = ధాతువులును, సర్వాత్మా = సర్వాత్మకము, అతీతధామా = పరంధామము, అనలనిలయపదజ్ఞాపికా = జ్ఞానాగ్ని నిలయమైన పదమునకు జ్ఞాపికయైన, మంత్రవిద్యా = మంత్రవిద్య, చిత్రవాగ్బ్రహ్మవేదాః = చిత్రశబ్దబ్రహ్మ రూప వేదములు, సర్వమ్ = అంతయు, సహజమ్ = సహజమైన, వర్ణసంయోగరూపమ్ = వర్ణముల కలయికయే, త్వామ్ వినా = నీవులేక, నశ్యత్ = నశించునదే.

**తాత్పర్యము :** శివగురు ముఖమునుండి బయలు వెడలి ప్రకాశించు మంత్రవిద్య సర్వాత్మకము. ధామములను దాటినది. జ్ఞానాగ్ని స్థానమునైన పదముకు జ్ఞాపిక (బోధపఱచునది). ధాతువులు మొదలు వేదము వఱకు గల సహజవర్ణసంయోగరూపశబ్ద బ్రహ్మము నశించునట్టిదే.

**వివరణము :** గురుముఖము నుండి వచ్చు మంత్రవిద్య ఓంకారార్థమైన బ్రహ్మమునకు జ్ఞాపికగానే ఉండును. ఓంకారము జ్ఞానాగ్నికి కుండమువంటిది కావున అనల నిలయమని

చెప్పబడినది. శబ్ద బ్రహ్మరూపములైన ధాతువులు మొదలు వేదముల వఱకు నున్న వాఙ్మయ మంతయు సహజవర్ణసంయోగ రూపమే నిన్ను బోధించుటకే ఏర్పడి, నిన్ను బోధింపలేక చివఱకు నిన్ను మిగిల్చి, సర్వము నశించి పోవుచున్నది. 2) ధాతువు లనేకార్థకములగుట వ్యాకరణశాస్త్రసిద్ధమైన అంశము.

**శివగురువక్త్రపద్మమున చెన్ను వహించెడు నాత్మ ధామ వ**
**హ్నివలయిత ప్రసిద్ధ పదమేర్పడ ఁజేసెడు మంత్రవిద్యలున్**
**వివిధ మహార్ణ ధాతువులు వేదములాదిగ నశ్వరమ్మె వ**
**ర్ణవితతి యోగరూపి అవినాశివి శ్రీశివ నీవొకండవే.**

**అవతారిక :** పై శ్లోకమున **గురుముఖనిర్గతమంత్రవిద్య** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ఆ **మంత్రవిద్య** ఉద్ధరింపబడుచున్నది.

**శ్లో ॥ ఓంకారం స్వాత్మవాసం శ్రుతిభిరభిమతం వాగ్భవం శక్తిబీజం**
**మాబీజం స్మారబీజం పరతరవిభవం మాతృకాబీజయుగ్మమ్ ।**
**శైవాంత్యం చాపి గత్వా షడయనవిలసత్కూటషట్కం చ భిత్త్వా**
**హంసస్సోహం తథా త్వం విరమసి మనసామంతరే మంత్రమూర్తే!॥ 66**

**ప్రతిపదార్థము :** మంత్రమూర్తే! = ఓ మంత్రస్వరూపుడా!, స్వాత్మవాసమ్ = స్వాత్మకు నివాసముగా, శ్రుతిభిః = వేదములచేత, అభిమతమ్ = అంగీకరింపబడిన, ఓంకారమ్ = ఓంకారము, వాగ్భవమ్ = ఐంకారము, శక్తి బీజమ్ = సౌః, మాబీజమ్ = శ్రీమ్, స్మారబీజమ్ = క్లీమ్, పరతరవిభవమ్ = గొప్పవైభవముగల, మాతృకా బీజయుగ్మమ్ = రెండు మాతృకా బీజములు, శైవాంత్యమ్ అపి చ = శైవమైన చివఱి అక్షరమును, గత్వా = పొంది, షడయన విలసత్కూటషట్కం చ భిత్త్వా = ఆఱు అయనములతో ప్రకాశించు ఆఱు కూటములను భేదించుకొని, హంసఃసోఽహమ్ = హంస సోఽమ్, తథా = ఆ విధముగా, మనసామ్ = మనస్సుల యొక్క, అంతరే = లోపల, **విరమసి** = మిక్కిలి రమించుచున్నావు.

**తాత్పర్యము :** ఓ మంత్రమూర్తీ! శ్రుతి సమ్మతమైన స్వాత్మవాసమైన ఓంకారమును మొదట నిల్పి **ఐం సౌః క్లీమ్** అను వానిని, తరువాత శ్రీమ్ అను బీజమును నిల్పి, ఆ తరువాత మాతృకా బీజముల రెంటిని నిల్పి, శైవము అంత్యమునైన హకారమును నిల్పి ఆఱు అయనములలో కూడిన ఆఱు కూటములను భేదించి 'హంసఃసోఽహమ్' అను పదముల చివఱ నిల్పి నీ మంత్రము పూర్తి అగును.

**వివరణము :** మంత్రము నసలు ప్రకాశింపజేయక పోయినచో మంత్రము నశించును. పూర్తిగా బహిరంగపఱచుటను శాస్త్రమంగీకరించదు. అలా బహిరంగపఱచిన వానికి వేధ కలుగుననియు హెచ్చరించుచున్నది. కావున స్పష్టాస్పష్టముగా మంత్రమును గ్రంథములో చెప్పుట సంప్రదాయమై ఉన్నది. ఈ శ్లోకమున స్పష్టాస్పష్టముగానే మంత్ర ముద్భవింపబడినది. మిగిలిన మంత్ర భాగము గురుముఖముననే గ్రహింపదగినది.

**ప్రణవము వాగ్భవమ్ము శ్రుతివర్ణితమై తగు శక్తి బీజమున్**
**వినుతరమారతీశ పరబీజ యుగమ్మును మాతృబీజ నిః**
**స్వనయుగి యంతమందుగల శైవము దాటియు కూటషట్క భే**
**దనమున హంస సోఽహమని తత్పరతన్ విరమింతు శ్రీశివా!**

**అవతారిక :** పై శ్లోకమున **మంత్రోద్ధారము** చేయబడినది. ఈ శ్లోకమున మంత్ర జపాదులందు చేయదగిన **న్యాసాది విశేషములు** సూచింపబడుచున్నవి.

**శ్లో ॥ బింద్వింందోరూర్ధ్వనాదైరవకలితకలావ్యాప్తిభిః సాధిదేవై-**
**ర్నానానంతాదిదేవైః పరిణతిసులభైః శ్రీగురూక్తాగమస్థైః ।**
**న్యాసైర్విద్యావిశేషైః శ్రుతిముఖవివిధానేకసిద్ధాంతమంత్రై-**
**ర్విష్వక్ప్రోతప్రతీకో దహసి భవమఘం దుష్ప్రభామంత్రవహ్నౌ ॥ 67**

**ప్రతిపదార్థము :** బింద్వింందోః = బిందువను చంద్రుని యొక్క, ఊర్ధ్వనాదైః = పైనుండు నాదములచేత, అవకలితకలావ్యాప్తిభిః = చేయబడిన కలల వ్యాప్తులు గల, శ్రీగురూక్తాగమస్థైః = శ్రీగురువుచే చెప్పబడిన ఆగమమందున్న, సాధిదేవైః = అధి దేవతలతో కూడిన, నానానంతాది దేవైః = అనేకులైన అనంతుడు మొదలైన దేవతలుగల, విద్యావిశేషైః = ఉపాసనావిశేషముల చేత, న్యాసైః = న్యాసముల చేత, శ్రుతిముఖ వివిధానేక సిద్ధాంత మంత్రైః = వేదములు మొదలైన అనేక విధములైన సిద్ధాంతములలోని మంత్రములచేత, విష్వక్ప్రోత ప్రతీకః = అంతట వ్యాపించిన ప్రతీకములు గలవాడవై, దుష్ప్రభామంత్రవహ్నౌ = దుర్దర్శము లైన వెలుగులతో కూడిన మంత్రమను అగ్నియందు, భవమ్ = సంసారమును, అఘమ్ = పాపమును, దహసి = కాల్చెదవు.

**తాత్పర్యము :** బిందువు అను చంద్రునకు పై నున్న నాదములతో కలావ్యాప్తులు గల శ్రీగురూక్తాగమ మందున్న అధిదేవతలతో కూడిన అనేక విధములైన అనంతుడు మొదలైన దేవతలు గల మంత్రములచే న్యాసములచే వేదాది సిద్ధాంత భేదములందున్న మంత్రములచేత

అంతట వ్యాపించిన ప్రతీకములుగల నీవు సంసారమును పాపమును దుష్ప్రభమైన మంత్రాగ్ని యందు కాల్చి వైచెదవు.

**వివరణము :** హల్లులుపైన నిల్చిన అచ్చులకు మకారమును లేక అనుస్వారమును కలిపినప్పుడు అవి బీజాక్షరములు అని పిలువబడును. ఓంకారమట్టి బీజాక్షరము. మకారము తరువాత బిందువు లేక చంద్రుడు (అనుస్వారము) అర్ధచంద్రము నాదము మొదలైన అవయవపదము లుండును. బిందువును చంద్రుడని, అర్ధబిందువును అర్ధచంద్రుడని అందురు. ఇట్టి అర్ధచంద్రాది నాదములు బింద్విందువున కూర్ధ్వముగా నుండుటచే అవి ఊర్ధ్వనాదములని శ్లోకమున చెప్పబడినవి. బీజాక్షరములోని అచ్చులు హల్లులు అన్నింటికిని అధిదైవతము లుండును. బిందువు అను ఇందువునకు ఊర్ధ్వములైయున్న నాదములందు చంద్రుని కలలు వ్యాపించి యుండును. అందుచేత **అవకలితకలావ్యాప్తిభిః** అని చెప్పబడినది. మంత్రాక్షరములలో నొక్కక్క దానికి ఒక్కొక్క అధి దేవత యుండును. మాతృక (వర్ణమాల) లోని ప్రతివర్ణమునకు అధిదేవత వుండును. అకారమునకు అనంతుడు ఇత్యాదిగా దేవతలు వర్ణదేవతలై ఉందురు. **'నానానంతాదిదేవైః'** అను సమాసముచే ఈ విషయము చెప్పబడినది. శైవ శాక్తవైష్ణవాది మతభేదము ననుసరించి దేవతాభేదముండునని ఆ సమాసము నందలి నానాపదము సూచించుచున్నది. మంత్రశాస్త్రవేత్తలై మంత్రసాధనల సాధించిన సిద్ధులై శ్రీగురువులచే స్వానుభవరూపమున చెప్పబడినదేవతలు ఆగమము లందలి దేవతలేకాన తత్తన్మంత్ర న్యాసభేదములు పెక్కులు పేర్కొన బడినవి. ఫలభేదము ననుసరించి, మంత్ర ద్రష్టృ భేదముననుసరించి వారి వేదాది సిద్ధాంతములలో ద్వైతాద్వైత విశిష్టాద్వైతాదుల భేదము ననుసరించి, శైవశాక్తగాణాపతసౌరవైష్ణవాది దేవతాభేదనిమిత్తకములైన మతభేదముల ననుసరించిన సిద్ధాంతముల భేదము ననుసరించి, పాశుపతాది శైవతంత్ర భేదము ననుసరించి, వైష్ణవతంత్రభేదము ననుసరించి, ఇట్లే గాణపతశాక్తసౌరాది తంత్ర భేదము ననుసరించి, మాతృకా దేవతా భేదము, న్యాసభేదము, విద్యాభేదము మొదలగు భేదములు ఆయా గురువుల ఆగమములలో భిన్న భిన్న ప్రకారము లున్నవి. **ఎన్ని భేదము లున్నను మంత్రము లన్నియు పరశమ్భువునకు తదుపాసనకు శబ్ద ప్రతీకములు.** ధేయ దేవతా రూపములు రూప ప్రతీకములు. నామ రూపాత్మక ప్రపంచములోని ఏ నామమైనను ఏ రూపమైనను పరశమ్భువునకు ప్రతీకమే యగుటచే ప్రపంచమంతయు ఆయన ప్రతీకములచే వ్యాపించి యున్నది. ఈ యర్థమే **విష్వక్ప్రోతప్రతీక** అను సమాసముచే చెప్పబడినది. ఈ ప్రతీక మంత్రోపాసనల వలన మంత్రము దుర్ధర్శ ప్రభమైన వహ్నివలె

మండి పోవును. ఆ మంటలో ఉపాసకుల సంసారము తన్మూలమైన కర్మ (అఘము) అంతయు దహించి పోయి జీవుడు (సాధకుడు) మోక్షమును కలిగించు జ్ఞానముయొక్క ప్రాప్తికి అర్హతను సంపాదించును.

**బిందు సుధాకరోర్ధ్వరవవేద్యకలాప్తుల సాధిదేవులన్**
**నందిత సద్గురూక్తముల న్యాసములన్ బహువిద్యలన్ శ్రుతి**
**స్యందిత మంత్రజాలముల ౘక్కగ దుష్ప్రభమంత్రవహ్నిలో**
**క్రందిత లోకమున్ భవమఘమ్మును వ్రేల్చెదు విశ్వమూర్తివై.**

**అవతారిక :** పై శ్లోకమున సిద్ధాంతభేదముచేత భిన్నములైన **మంత్రన్యాసభేదములు** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున పరాగ్నిరూపుడైన పరశమ్భువునుండియే **సమస్తవాఙ్మయ సృష్టి** యేర్పడినదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ వర్ణాస్తే మంత్రవిద్యా దశవికరణగా ధాతవో నిత్యశబ్దా**
**వాక్యాన్యామ్నాయభేదా బహువిధమతజాః సాంగవేదాశ్చ భాషాః।**
**నానాచ్ఛందాంసి తాలాః స్వరవికృతిగుణాః సర్వతో వాఙ్మయస్థా**
**నానారూపాః పరాగ్నేః సమజనిషత తే మాతృకాశక్తిబీజాత్ ॥ 68**

**ప్రతిపదార్థము :** తే = నీయొక్క, మంత్రవిద్యాః = మంత్రవిద్యా రూపములైన, వర్ణాః = వర్ణములు, దశవికరణగాః = పది వికరణములలో నున్న, ధాతవః = ధాతువులు, నిత్యశబ్దాః = అవ్యయములు, వాక్యాని = వాక్యములు, బహువిధమతజాః = అనేక విధములైన మతములనుండి పుట్టిన, ఆమ్నాయభేదాః = ఆమ్నాయ భేదములు, సాంగవేదాః = అంగములతో కూడిన వేదములు, భాషాః చ = భాషలును, నానాచ్ఛందాంసి = అనేక విధములైన ఛందస్సులును, తాలాః = తాలములు, స్వరవికృతిగుణాః = స్వర వికారములైన గుణములును, సర్వతః = అంతట, వాఙ్మయస్థాః = వాఙ్మయములోనున్న, నానారూపాః = అనేకరూపములైన, పరాగ్నేః = పరాగ్నియైన, తే = నీ యొక్క, మాతృకాశక్తి బీజాత్ = మాతృకాశక్తి బీజమునుండి, **సమజనిషత** = పుట్టినవి.

**తాత్పర్యము :** మంత్రవిద్యారూపములైన వర్ణములు, పది వికరణములలోని ధాతువులు, అవ్యయములు, వాక్యములు, భిన్నమతజములైన మంత్రములు, షడంగములతో కూడిన వేదములు, భాషలు, ఛందస్సులు, తాలములు, స్వర వికారములైన గుణములు, వాఙ్మయము నందంతట నున్న నానా రూపములన్నియు పరాగ్ని రూపమైన నీ మాతృకాశక్తి నుండి పుట్టినవి.

**వివరణము :** 1.ఒక్కొక్క వర్ణము ఒక్కొక్క దేవతావాచకము కావున ఆ దేవతకు అది నామము అంతే కాదు ఆ వర్ణమును జపించిన వారికి ఆ దేవతానుగ్రహము కలిగించును కావున ఆ దేవత కది మంత్రమే. 2. బహువర్ణక మంత్రములు మంత్రవిద్యలు. 3. వ్యాకరణశాస్త్రము పాణిన్యాది నిర్మితము. పాణిని ధాతు పాఠమును రచించెను. అందు పది వికరణు లున్నవి, అవి భ్వాదులు, అదాదులు మొదలగునవి. 4. లింగవిభక్తి వచన భేదమున భిన్నరూపముల నొందునవి, నామ క్రియాది శబ్దములు అట్లు భిన్నరూపతనందనివి అవ్యయములు. 5. పదసమూహరూపములు వాక్యములు. 6. శైవవైష్ణవాది వివిధ మత తాంత్రిక మంత్రములు ఆమ్నాయములు. 7.శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను ఆఱంగములతో కూడిన సంహితా బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషద్భేద భిన్నములైన ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వణవేదములు సాంగవేదములు. 8. సంస్కృత ప్రాకృతాదులు భాషలు. 9. ఉక్తాత్యుక్తా మధ్యా, ప్రతిష్ఠా, సుప్రతిష్ఠా, గాయత్రి ఉష్ణిక్, అనుష్టుప్, త్రిష్టుప్, జగతి మొదలగునవి ఛందస్సులు. 10. త్రిపుట మొదలగునవి తాలములు. 11. గుణము (అ,ఏ,ఓ,అర్) వృద్ధి (ఆ,ఐ,ఔ,ఆర్) మొదలగు స్వర వికారములు. ఇంకను వాఙ్మయమందలి అనేక రూపములు పరాగ్ని రూపమైన పరశమ్భువు యొక్క మాతృకా శక్తి బీజము నుండియే పుట్టినవి.

**ఆమనువిద్య వర్ణములు ఆగమవాక్కులు ధాతురాశి నా**
**నామత భాషలున్ స్వరగణమ్ములు ఛందములెన్నొ నిత్య శ**
**బ్దామల సాంగవేదములు అంతయు వాఙ్మయమున్ పరాగ్ని ని**
**ర్భీమయ మాతృశక్తి మయబీజమునుండి జనించె శ్రీశివా.**

* * *

## -- షడన్వయ సమష్టి స్కంధ రశ్మి వివేక ప్రకరణమ్ --

**అవతారిక :** ఈ శ్లోకమున పరశమ్భువు యొక్క రశ్ములే యుగ విభాగ రూపమున **కాలములు,** జాగ్రదాది భేదమున **అవస్థలు** ఏర్పడునని చెప్పబడినవి.

శ్లో ॥ **ఏవం రాత్రిందివస్థాః పరశివ! ఘుటికా ఏవ తే రశ్మిభూతాః**
**స్త్రీపుంసద్వంద్వరూపా రవిశశిచరణాక్రాంతయో రక్తశుక్లాః।**
**షట్చక్ర్యంశప్రభేదా దహరపురయుగే కోణషట్కాంతరస్థాః**
**కాలావస్థాశ్చతుర్భిః ప్రవిదధతి యుగైర్విశ్వభూతైర్నిదానైః ॥** 69

**ప్రతిపదార్థము :** పరశివ! = ఓ పరశమ్భో, ఏవమ్ = ఇదే విధముగా, రాత్రిందివస్థాః = రాత్రింబవళ్ళలో నుండునట్టి, స్త్రీపుంస ద్వంద్వరూపాః = స్త్రీపురుషుల జంటలైనట్టి, రవిశశి చరణాక్రాంతయః = సూర్య చంద్రాదులు కిరణముల వ్యాప్తులు గలిగినట్టి, రక్తశుక్లాః = ఎఱుపు తెలుపు వన్నెలుగల, ఘటికా ఏవ = గడియలే, తే = నీయొక్క, రశ్మిభూతాః = కిరణ రూపములు, షట్చక్త్యంశ ప్రభేదాః = ఆఱుశక్తుల అంశల భేదములు గలవై, దహర పురయుగే = దహరాకాశ మందలి నగరముల (మణిపూరానాహతముల) జంటయందు, కోణషట్కాంతరస్థాః = ఆఱుకోణముల లోపల నున్నవై, కాలావస్థాః = కాలములు అవస్థలును, నిదానైః = కారణములైన, విశ్వభూతైః = విశ్వరూపములైన, చతుర్భిః = నాలుగు, యుగైః = యుగములచే, **ప్రవిదధతి** = చేయుచున్నవి.

**తాత్పర్యము :** ఇదే విధముగా రాత్రిందినములలో నున్నట్టి, స్త్రీపుంరూపములైనట్టి, సూర్యచంద్ర కిరణముల వ్యాప్తులు గలిగినట్టి ఎఱ్ఱని తెల్లని వన్నెలుగల గడియలు, నీ యొక్క కిరణ రూపముల షట్చక్త్యంశ భేదములై దహరాకాశమునందలి పురముల జంటయైన అనాహత మణిపూరముల యందు కోణషట్కాంతరస్థాః = ఆఱుకోణములలోపల నున్నవై విశ్వభూతములు విశ్వకారణములునైన నాలుగు యుగములతో కాలావస్థలను చేయుచున్నవి.

**వివరణము :** రాత్రి స్త్రీరూపము. పగలు పుంరూపము. ఈ భావనము ననుసరించి ఱేయింబవళ్ళలోని గడియలు స్త్రీ పుం రూపములుగా ఈ శ్లోకమున చెప్పబడినవి. రాత్రికాలమున వెలుగుచు చంద్రుని యొక్క, పగలు వెలుగు సూర్యుని యొక్క కిరణముల వెలుగు లా గడియలలో నున్నవి. పరశమ్భువుయొక్క పదములు రక్తశుక్ల ప్రభములు. వాని కిరణముల నుండియే చంద్రసూర్యుల కిరణములు, వాని వలన కాలములు అవస్థలు అన్నియు ఏర్పడు చున్నవి. ప్రతి దేవతకు స్త్రీరూపమో, పుంరూపమో ఉండును. అవి రెండు పురుషవిధములు అనగా మానవాకృతుల బోలినవి. చతుర్భుజత్వ త్రినేత్రత్వాది విశేషములుండినను వారి పురుష విధత్వమునకు అవి భంజకములు గావు. మణి పూరానాహతములు సౌరఖండమని చెప్పబడినది. రాత్రిందివములు రెండును సూర్యుని వలన నేర్పడునవే, వాని వలననే మాస, అయన వత్సర యుగాది భేదము లేర్పడును. వానివలన అఖండకాలమునందు భూతభవిష్యవర్తమానము లేర్పడును. ఈ కాలములు జాగ్రదవస్థాగతములు, స్వప్నావస్థాగతములు, నిద్రావస్థాగతములు అని వేరువేరుగా కాలములు ఉండును.

**మూలచతుర్యుగాలను ప్రభూ! దినరాత్రిగతమ్ములైన పుం**
**స్త్రీలయుగాల రూపయిన దివ్యరవీందు పదాత్తరక్త శు**
**క్లాలయరశ్మిభూత ఘటికల్ దహరోన్నత పూర్యుగమ్మునన్**
**మూలలనాంటిటన్ నిలుపుమొత్తమవస్థలు కాలముల్ శివా!**

**అవతారిక :** ఈ శ్లోకమున పరశమ్భువు యొక్క **పరతత్త్వప్రకాశకత్వము** చెప్పబడుచున్నది.

**శ్లో ॥ షట్త్రింశత్తత్త్వమాలామవనిముఖశివాంతాముపేతాత్మవృత్తిః**
**ఖే వాయౌ సప్తవింశత్యుడుగణవికృతీర్జీవమాయాశివాంశాత్ ।**
**తేజః స్థాః స్వాంతరాత్మాంతరతనువికృతీరస్థిమాంసప్రముఖ్యాః**
**క్షోణ్యాం త్వం జీవమాయాగుణగణమభితో భాసయస్యంశుమాలిన్ ॥ 70**

**ప్రతిపదార్థము :** అంశుమాలిన్, అవనిముఖ శివాంతామ్ = భూమిమొదలు శివునివరకు గల, షట్త్రింశత్త్వమాలామ్ = ముప్పది యాఱు తత్త్వముల మాలను, ఉపేతాత్మవృత్తిః = పొందిన ఆత్మవృత్తి గల, త్వమ్ = నీవు, జీవమాయా శివాంశాత్ = జీవమాయా శివాంశలవలన, సప్తవింశత్యుడుగణవికృతీః = ఇరువదియేడు నక్షత్రముల వికృతులను, ఖే = ఆకాశమునందు, వాయౌ = వాయువునందు, తేజఃస్థాః = తేజమునందున్న, స్వాంతరాత్మాంతర = నీ అంతరాత్మలోపల నున్న, తనువికృతీః = శరీరవికారములను, అస్థిమాంసప్రముఖ్యాః = ఎముకలు మాంసము మొదలగువానిని, క్షోణ్యామ్ = భూమియందు, జీవమాయాగుణగణమ్ అభితః = జీవమాయాగుణగణము చుట్టు, **భాసయసి** = ప్రకాశించుచున్నావు.

**తాత్పర్యము :** భూమిమొదలు శివునివఱకు గల ముప్పది యాఱు తత్త్వముల మాల ఉనికిని నిర్ణయించుటకు వాని యందాత్మ ప్రకాశము వ్యాపించవలెను. ఆకాశమునందు, వాయువునందు, తేజమునందు ఇరువదియేడు నక్షత్రవికృతులు, శరీరవికారములై అస్థి మాంసాది వికారములు భూమి యందు జీవమాయాగుణములచుట్టు ప్రకాశింపజేయు చున్నావు.

**వివరణము :** ఒక వస్తువున్నదని చెప్పుటకు ఆత్మప్రకాశము దానిని భాసింపజేయుట కారణము. ఈ విధముగ షట్త్రింశత్తత్త్వముల ఉనికి ఆత్మ ప్రకాశము చేతనే నిశ్చయింపబడి యున్నది. ఆకాశమునందు, వాయువు నందు ఇరువది యేడు నక్షత్రరూప తేజో వికారములు పరశమ్భువు చేతనే భాసింప జేయబడుచున్నవి. అట్లే పార్థివశరీరమందలి అస్థి మాంసాది

వికారములు ఆతని చేతనే భాసింపజేయబడుచున్నవి. 2. షట్త్రింశత్తత్త్వములలో అవిద్యాదులు జీవాంశములు; పంచభూతాదులు మాయాంశములు; విద్యాదులు శివాంశములు; తేజోవికారములు రూపవంతములు; అవి ఆకాశమునందు వాయువునందు కనబడుచున్నవి. ఆకాశవాయువులు రూపహీనములు. రూపరహితాకాశవాయువులందు రూపవన్నక్షత్ర వికృతులు కనబడుచున్నవి. అట్లే భూమియందలి జీవుల శరీరగతములైన అస్థి మాంసాది వికారములు భూమియందును కనిపించు కారణములే వాని నన్నింటిని ప్రకాశింపజేయు చున్నాడు. 3. కిరణములు గల సూర్యుడు జగమునందలి పదార్థముల భాసింపజేయుట మన మెఱుగుదుము. రాత్రిపూట నక్షత్రములు కొంత వెలుగునిచ్చు చున్నవి. సూర్యనక్షత్రాది సహకారమున వానిని మనము దర్శింపగలుగు చున్నాము. చాక్షుష ప్రత్యక్ష జ్ఞానమునకు వెలుగు అత్యావశ్యకము. అట్లే తన(జ్ఞాత) కిరణములతో అన్ని జ్ఞానముల కలిగించువాడు పరశమ్భువు కావున అతనిని **అంశుమాలిన్** అని సంబోధించుట సముచితముగా నున్నది.

**భూమి మొదల్ తుదిన్ శివుడు ముప్పదియాఱు సుతత్త్వముల్ మహా**
**వ్యోమమునందు వాయువున నొప్పెడు నిర్వదియేడు తారకల్**
**క్రామితతేజమందు సకలమ్ము శరీరవికారమున్ మహా**
**భూమిని జీవు మాయగుణముల్ వెలయించెడు నంశుమాలివే.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు సూర్యావాచకమైన **అంశుమాలిని** అను శబ్దముచే సంబోధింపబడినాడు. ఈ శ్లోకమున ఆ పరశమ్భువు **చిద్భైరవాగ్నిగా** సంబోధింప బడుచున్నాడు.

**శ్లో ॥ యావంతస్తే మయూఖాః క్షితిజలదహనస్పర్శనాకాశచేతః-**
**పీఠస్థాః షట్ప్రమాణాః పరమధిపతయో భైరవా ఏవ సర్వే ।**
**తేషామ్మధ్యే త్వమేకః పరతరమహిమోజ్జృంభమాణః ప్రచండో**
**మార్తాండో రశ్మిమధ్యస్థిత ఇవ పరితో భాసి చిద్భైరవాగ్నే! ॥ 71**

**ప్రతిపదార్థము :** చిద్భైరవాగ్నే = ఓ చిద్భైరవాగ్ని రూపా!, తే = నీయొక్క, మయూఖాః = కిరణములు, యావంతః = ఎన్నియో, క్షితిజలదహనస్పర్శనాకాశ చేతః పీఠస్థాః = భూజలాగ్నివాయ్వాకాశచేతః పీఠములందున్న, షట్ప్రమాణాః = ఆఱు ప్రమాణములుగల, పరమ్ = కాని, అధిపతయః = అధిపతులైన, తే = వారందఱు, భైరవా ఏవ = భైరవులే, తేషామ్ = వారియొక్క, మధ్యే = నడుమ, ఏకః = ఒక్కడవైన, త్వమ్ = నీవు,

పరతరమహిమోజ్జృంభమాణః = మిక్కిలి గొప్పనైన మహిమతో ప్రకాశించు, ప్రచండః = అతికోపమును, రశ్మిమధ్యస్థితః = కిరణముల మధ్యనున్న, మార్తాండ ఇవ = సూర్యునివలె, పరితః = అంతట, భాసి = ప్రకాశించుచున్నావు.

**తాత్పర్యము :** నీ కిరణము లెన్నియో అందఱు భైరవులు. వారు భూమ్యంబ్వగ్ని వాయ్వాకాశచేతస్సు లనెడి పీఠములందు ప్రభువులుగా నుండువారే. వారి మధ్య సూర్యునివలె నుండి అంతట ప్రకాశించుచున్నావు.

**వివరణము :** భూమియందు గంధముండును. దానికి ప్రమాణము ఘ్రాణము. జలమందు రసముండును. దానికి ప్రమాణము జిహ్వా. అగ్ని యందు రూపముండును. దానికి ప్రమాణము చక్షువు. వాయువునందు స్పర్శ ఉండును. దానికి ప్రమాణము త్వక్కు. ఆకాశమందు శబ్దముండును. దానికి ప్రమాణము శ్రోత్రము. సుఖదుఃఖములు పైన చెప్పిన విషయజ్ఞానముల వలన కలుగును. కలుగుననుటకు ప్రమాణము చేతస్సు. కావున పరశమ్భు రూప సూర్యునిరశ్మి రూపులైన భైరవులు భూమ్యంబ్వగ్ని వాయ్వాకాశ చేతః పీఠస్థులని చెప్పబడినది. పై విషయము లైదుగా పేర్కొనబడినను వాని వైవిధ్య మనంతముగా నుండును. కావున భైరవులు కూడ అనంతరశ్మిరూపులై యున్నారు. అనంతకిరణముల మధ్య సూర్యునివలె ఆ భైరవుల మధ్యచిద్భైరవరూపుడైన పరశమ్భువు ప్రకాశించుచున్నాడు. పరశమ్భువు చిదగ్ని. తత్కిరణములు భైరవులు. చిదగ్నికూడ భైరవుడే. పైన చెప్పిన తత్పీఠములు మనఃషష్ఠములైన ఇంద్రియములే. వానిలో చేతస్సు అంతరింద్రియము. మిగిలిన ఘ్రాణజిహ్వాచక్షుస్త్వక్శ్రోత్రములు బాహ్యేంద్రియములు అన్నియు జ్ఞానేంద్రియములే, వాని వలన గంధాది విషయజ్ఞానములు కలుగును. ఆత్మ ప్రకాశము ఆయా విషయములుపై బడినప్పుడే ఆయా విషయజ్ఞానములు కల్గును. అవి యన్నియు వృత్తిజ్ఞానములని చెప్పబడును. భైరవులందఱు వృత్తిజ్ఞాన రూపులుకాగా ఆత్మ చైతన్యరూపుడు. మహాభైరవుడైన పరశమ్భువు. షట్ప్రమాణ శబ్దము ఒక్కొక్క భైరవుడు ఆఱు నిలువుల ఎత్తున్నాడని తెలుపును. సంసారమును పెంచు విషయజ్ఞాన రూపులు కావున సంసారభీరువులకు భయము కలిగించువారు భైరవులుగా చెప్పబడినారు. 'భై' అను రవము (శబ్దము) కలవారు భైరవులు. కాపాలికులు భైరవారాధకులు. ఇది బాహ్యదృష్టి, అంతర్దృష్టితో వారు భేదజ్ఞాన రూపులు. ఐక్యజ్ఞానరూపుడు మహాభైరవుడైన పరశమ్భువు. సంసారాసక్తులకు ముక్తి యనిన భయము. వారు జనన మరణ మలపంకమున క్రిములవలె ముక్తి సుఖమెఱుగని వారగుటచే తామనుభవించునదే మహాసుఖమని, సంసారము వీడిన దుఃఖమని భయపడుచుందురు.

అట్టి వారికి అదృష్ట విశేషమున ముక్తి కలిగించుటకై వచ్చిన సద్గురురూప భైరవుడు మొదట భయమునే కలిగించినను 'భై' భయము నక్కఱలేదు అని శబ్దము చేయుచు మహావాక్యరూప శబ్దము చేయుచు వారి భయమును పోగొట్టును. శిష్యుల భీరుత్వమును భై శబ్దముతో తొలగించు వాడు సద్గురురూపమహాభైరవుడు. సంసారులైన భైరవుల మధ్యనుండి మహాభైరవరూపుడు సద్గురువు. మహాభైరవుడైన పరశమ్భువు జీవత్వము నందగా ఆతని అనుచరులైన భైరవులు విషయజ్ఞానరూపులై జీవుని సంస్కరింపజేయుటకు సహకరించుచుందురు. ఆతడు మరల శివత్వము నంద గోరినప్పుడు సద్విషయజ్ఞానరూపులై విషయదోషదృష్టిరూపులై ఆ సంసారిని ముక్తు నొనరింప సహకరించెదరు. ఇదివఱకు భూమ్యాది షట్పీఠములు ఇంద్రియములని చెప్పబడినవి. అవి ప్రత్యక్ష ప్రమాణములు. ప్రత్యక్షముగాక అనుమాన ఉపమాన శబ్ద అర్థాపత్తి అనుపలబ్ధులు అను మఱి ఐదు ప్రమాణము లున్నవి. వాని వలన జనించు విషయ జ్ఞానములు కూడ సంసారమును పెంచునవే. కావున విషయజ్ఞానరూపులైన భైరవులు **షట్ప్రమాణాః** అని చెప్పబడినారు.

**క్షితిజలవహ్నిమారుతఖచిత్త సుపీఠక షట్ప్రమాణ స**
**త్పతులగు భైరవుల్ కిరణవర్గము నీవొక భైరవుండవై**
**యతుల మహత్త్వజృంభణమునందుచు నంశులమధ్య సూర్యుడో**
**లి తనరుచుందు వంతటనలిప్త చిదాత్మక భైరవాత్మకా.**

**అవతారిక :** పై శ్లోకమున రశ్మి భైరవగణములు చెప్పబడినవి ఈ శ్లోకమున రశ్మి భైరవ దేవీ గణ స్వరూపము చెప్పబడుచున్నది.

**శ్లో ॥ భైరవ్యో రశ్మిదేవ్యస్తవ శివ! కరుణాపూరితాక్షాః ప్రసన్నా-**
**స్త్వత్సత్తాకాశవాహోదితనిజగతయశ్చర్వితాత్మార్థకృత్యాః।**
**తద్ధామన్యేవ శాంతాః సురమునిపితృభిః పుణ్యపాపైశ్చ బద్ధాన్**
**భక్తాంశ్చానేకబంధాన్ ఝటితి విఘటయంత్యాత్మబోధాగ్నిజృమ్భైః॥ 72**

**ప్రతిపదార్థము :** శివ! = ఓ పరశమ్భూ! తవ = నీయొక్క, రశ్మిదేవ్యః = రశ్మి దేవీరూపలైన, భైరవ్యః = భైరవీ(గణము)లు, కరుణాపూరితాక్షాః = దయతోనిండిన కన్నులు కలవారై, ప్రసన్నాః = ప్రసన్నులై, త్వత్సత్తాకాశవాహోదితనిజగతయః = నీ ఉనికి అనెడు ఆకాశ ప్రవాహమున పుట్టిన తమ గమనము గలవారై, చర్వితాత్మార్థకృత్యాః = నశింపజేయబడిన స్వార్థకృత్యములు గలవారై, తద్ధామని ఏవ = ఆ పరపదస్థానము నందే, శాంతాః =

శాంతులై, సురమునిపితృభిః = దేవఋషిపితృఋణములచేత, పుణ్యాపాపైః చ = పుణ్యాపాపములచేతను, బద్ధాన్ = బంధింపబడిన, అనేక బంధాన్ = అనేక బంధములుగల, భక్తాన్ చ = భక్తులను గూడ, ఆత్మబోధాగ్నిజృమ్భైః = ఆత్మబోధ మనెడి అగ్నియొక్క జృంభణములచేత, ఝటితి = శీఘ్రముగా, **విఘటయంతి** = (బంధబాధ) ముక్తుల నొనరించెదరు.

**తాత్పర్యము :** ఓ పరశమ్భూ! రశ్మిదేవీరూప భైరవీగణము కరుణతో నిండిన కన్నులు గలదై ప్రసన్నమై, పరమేశ్వరుని ఉనికి అనెడి ఆకాశ ప్రవాహమున పుట్టును. వారు తమ గమనము గలవారై నశింపజేయబడిన స్వార్థకృత్యములు గలవారలై ఆ పరమపద స్థానమునందే శాంతులై దేవతాపితృఋషి ఋణముల చేత, పుణ్యాపాపములచేత బంధింపబడిన వారిని, అనేక బాధలు గల భక్తులను, బంధములనుండి, బాధలనుండి శీఘ్రముగా విడిపించెదరు.

**వివరణము :** సంసారమును పెంచు భైరవులు (రశ్మిదేవులు) పురుషరూపులు కాగా విముక్త్యభిముఖముగా జీవుని కొనిపోవు భైరవులు స్త్రీరూపులుగా ఈ శ్లోకమున చెప్పబడుచున్నది. ఆ దేవీగణ మట్లు చేయుటకు కారణము వారి ప్రసన్నత, కన్నులలో నిండిన దయ, శాంతత, పరమేశ్వర సత్తాభిముఖగతి స్వభావము కారణములు. పుణ్యాపాపములు, దేవర్షి పితౄణములు జీవుని బంధించును. రశ్మిదేవి గణము అట్టి వారిని ఆ బంధము నుండి విడిపించెదరు. భక్తులకు కూడ పెక్కు బాధలుండును. అవి పరమేశ్వరునిచే పరీక్షార్థము కల్పింపబడినవి కావచ్చును. అట్టి బాధలుకల వారిబాధలను కూడ వారు పొగొట్టి వారికి సాధనమునందు సాయపడి వారి పరమేశ్వరాభిముఖ ప్రయాణమున సాయమొనరించు నట్టి దీ భైరవీగణము. కరుణ స్త్రీ స్వభావమగుటచే ఈ నివృత్తి భైరవులను స్త్రీలు అని చెప్పబడి యుండవచ్చును.

**కరుణ వెలార్చునట్టివగు కన్నులుగల్గు ప్రసన్నభైరవీ**
**పరిణత రశ్మిదేవతలు త్వద్గతసత్త ఁజరించువారలై**
**ఖరతరపుణ్యాపాపముల కట్లను ద్రెంపుచు భక్తలోకమున్**
**పరతరముక్తి యోగ్యముగ భాసిల నాత్మ చిదగ్ని జృంభణన్.**

**అవతారిక :** పై శ్లోకమున స్త్రీ **రూప భైరవుల స్వరూపము** చెప్పబడినది ఈ శ్లోకమున ఈ రశ్ముల నెటిగి స్తుతించుట బ్రహ్మాదులకును అసాధ్యము గావున మానవమాత్రు డెట్లెటిగి స్తుతించగలడని **కవి అశక్తత** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రీనాథ! శ్రీపరేశ్వర! పరశివ! తే దివ్యదివ్యా మరీచీ-**
**ర్బ్రహ్మాదీనామ్మనోవాగనవగతమహాచిత్రనానార్థరూఢాః।**
**గూఢప్రౌఢప్రకాశాః సురమునివచనైరప్యబుద్ధాః కథం తే**
**స్తోతుం జ్ఞాతుం సమర్థో భవతి కవిజనః కోఽత్ర మన్దో నృమాత్రః॥ 73**

**ప్రతిపదార్థము :** శ్రీనాథ! = ఓ శ్రీనాథా!, శ్రీపరేశ్వర! = ఓ శ్రీపరేశ్వరా!, పరశివ! = ఓ పరశమ్భూ!, దివ్యదివ్యాః = మిక్కిలి దివ్యములైన, బ్రహ్మాదీనామ్ = బ్రహ్మాదుల యొక్క మనోవాగనవగత మహా చిత్ర నానార్థరూఢాః = మనస్సులకు వాక్కులకు తెలియ రాని గొప్ప చిత్రములైన నానార్థములందు రూఢములైన, గూఢప్రౌఢప్రకాశాః = గూఢములు ప్రౌఢములునైన ప్రకాశములుగల, సురమునివచనైః + అపి = దేవతల మునుల వాక్కుల చేత గూడ, అబుద్ధాః = తెలియబడని, తే = నీయొక్క, మరీచీః = కిరణములను, స్తోతుమ్ = స్తుతించుటకు, జ్ఞాతుం చ = తెలియుటకును, అత్ర = ఈ లోకమున, మందః = మందుడైన, నృమాత్రః = మనుష్య మాత్రుడైన, కః = ఏ, కవిజనః = కవిజనుడు, సమర్థః = సమర్థుడు, **భవతి** = అగును.

**తాత్పర్యము :** ఓ శ్రీనాథా! ఓ పరమేశ్వరా! ఓ పరశమ్భూ! బ్రహ్మాదుల మనోవాక్కులకు తెలియరాని గూఢ ప్రౌఢ ప్రకాశములుగల, సురముని వాక్కుల చేతను తెలియరాని నీ దివ్యదివ్య కిరణములను తెలియుటకు స్తుతించుటకు ఏ మందమతి నరమాత్రుడైన కవిజనుడు సమర్థుడగును.

**వివరణము :** బ్రహ్మాది దేవతామునుల మనములకు పరమేశ్వరుని మరీచు లవగతములు కాజాలవు. వాక్కుల కందవు. కావున ఏదేవతా మునులు చెప్పినను వినువారికి తెలియబడవు. వానిని తెలియుటయే కష్టమైనపుడు స్తుతించుట ఎట్లు? అందును మానవ మాత్రుడైన కవి జనుడెట్లు స్తుతించగలడు? అసాధ్యము కావున నాయీ స్తుతిప్రయత్నమును విరమించుచున్నానని కవిచే చెప్పబడుట ప్రకరణోపసంహారోచితముగా నున్నది.

**శ్రీపతి! శ్రీపరేశ్వర! ప్రసిద్ధ విరించిముఖోక్తి చిత్తముల్**
**నీ పరరశ్ములన్ బొగడనేర వెఱుంగగనట్టి దివ్య మూ**
**ఢాపరిమేయకాంతులను నజ్ఞుడు మూఢుడునైన మానవుం**
**డేపగిదిన్ యథావిధి నుతింప నెఱుంగ సమర్థుడయ్యెడున్.**

* * *

## -- పరశంభు పావక ధ్యానయోగ ప్రకరణమ్ --

**అవతారిక :** పై ప్రకరణమున పరశమ్భువు **అగ్నిగా** పేర్కొనబడినాడు. ఈ ప్రకరణము ఆతని నగ్నిగా ధ్యానించుట యెట్లో వివరించుచున్నది. ముందుగా నీ ప్రథమశ్లోకమున **పితృభూమ్యగ్ని** (శ్మశానాగ్ని)గా ధ్యానింపబడుట వివరింపబడుచున్నది.

**శ్లో॥ సాంగా భూమిః శతాంగః శతధృతిరపి తత్సారథిః సప్తయస్తే**
**వేదా బ్రహ్మైకవేద్యాః పృథుతరచరణౌ పుష్పవంతౌ తదక్షః।**
**మేరు స్తత్కీలబంధః కమఠపతిరిభాస్తత్పృథుస్తమ్భపంక్తిః**
**శేషస్తద్రజ్జుబన్ధస్తదుపరి పితృభూస్తత్ర చిన్త్యో రథీ త్వమ్॥ 74**

**ప్రతిపదార్థము :** తే = నీకు, సాంగాః = అంగములతో కూడిన, భూమిః = భూమి, శతాంగః = రథము, శతధృతిః = బ్రహ్మ, తత్సారథిః = దానికి సారథి, అపి = మరియు, బ్రహ్మైకవేద్యాః = బ్రహ్మచేతనే తెలియదగిన, వేదాః = వేదములు, సప్తయః = గుఱ్ఱములు, పుష్పవంతౌ = పరివేషములు గలిగిన సూర్యచంద్రులు, పృథుతరచరణౌ = పెద్దచక్రములు, మేరుః = మేరుపర్వతము, తదక్షః = దాని ఇరుసు, కమఠపతిః = మహాకూర్మము, తత్కీల బంధః = సాయ చీలల బిగింపు, ఇభాః = ఏనుగులు, తత్పృథుస్తమ్భపంక్తిః = దానియొక్క పెద్ద స్తంభముల వరుస, శేషః = శేషుడు, తద్రజ్జుబంధః = దాని పగ్గము, తదుపరి = దానిపైన, పితృభూః =శ్మశానము, తత్ర = అచ్చట, రథీ = రథిగా, త్వమ్ = నీవు, చింత్యః = చింతింపదగిన వాడవు.

**తాత్పర్యము :** అంగములతో కూడిన భూమి రథము; దాని సారథి బ్రహ్మ, బ్రహ్మచేతనే దెలియదగిన వేదములు గుఱ్ఱములు, పరివేషముగల సూర్య చంద్రములు చక్రములు, మేరు పర్వతము దాని యిరుసు, దాని సాయచీలల బిగింపు మహాకూర్మము, దిగ్గజములు దానిలోని స్తంభములు, శేషుడు పగ్గము, ఆ రథము పైననున్న వేదిక శ్మశానము. ఆ వేదికపై కూర్చొని యున్న రథికుడైన అగ్నిగా పరశమ్భువు ధ్యానింపదగిన వాడు.

**వివరణము :** వృక్షలతాదులు భూమికి కరపాదముల వంటి అంగములు. వానితో కూడిన భూమి సాంగభూమి. వంద అవయవములుగలది రథము కావున దానికి శతాంగమని పేరు. వంద ధృతులు కలవాడు కావున బ్రహ్మ **శతధృతి**. ఆయన సాంగభూమి రూప శతాంగ సారథి. అంగశబ్దము శతశబ్దము పునరావృత్తములగుటచే శబ్దసౌందర్య మేర్పడినది. ప్రథమపాదము తకారావృత్తి చే వృత్త్యనుప్రాస మేర్పడి యున్నది. సారథి అశ్వహృదయవిద్య

నెఱిగి యుండును. ఇచట అశ్వములు వేదములు. వాని హృదయము బ్రహ్మకు మాత్రమే తెలియును. కావున ఆయనే తగిన సారథి. **బ్రహ్మైకవేద్య** అను సమాసముచే నీ యర్థము వ్యంగ్యమగుచున్నది. ఈ శ్లోకమున సావయవ రూపకాలంకారమున్నది. రథి కూర్చొనదగిన వేదిక పితృభూమియను రూపకము వేదీ శబ్దము లేకుండనే స్ఫురించుచున్నది. అట్లే అగ్ని పదము లేకున్నను పితృభూమి యందు అగ్ని ఉండును. కావున పరశమ్భువు అగ్ని అను అవయవి వ్యక్తుల యొక్క రూపకము అవయవముల రూపకముచే స్ఫురించుచున్నది.

**రథమిల యంత బ్రహ్మమతి రథ్యము లాగమముల్ రథాంగముల్**
**ప్రథిత రవీందు బింబములు భవ్యరథాక్షము మేరు భూధ్రమౌ**
**పృథుతరకీలబంధము వరిష్ఠమహాకమలేశ్వరుండు త**
**త్పృథురథమందు స్తంభములు దిగ్గజముల్ గుణ మాదిశేషుడున్**
**ప్రథితము దానిపై పితృధరాస్థలి యందు రథిన్ దలంచెదన్.**

**అవతారిక :** ఈ శ్లోకమున ఆ పరశమ్భువు **కల్పాంతానంతసూర్యద్యుతిగా** వర్ణింపబడు చున్నాడు.

**శ్లో॥ కల్పాంతానంతసూర్యద్యుతిమతివికటానేకదంష్ట్రం షడాస్యం**
**వహ్నీంద్వర్కాంబుకాష్ఠాదశయుతమభితః ప్రజ్వలంతమ్మయూఖైః ।**
**శూలాసీషూగ్రశక్త్యంకుశవరనృశిరః శ్రీఫలేష్వాసవారి–**
**ప్రోతత్పాశాభయాంకైర్నిజభుజపరిఘైస్త్వాం గురుం శమ్భుమీడే॥ 75**

**ప్రతిపదార్థము :** అభితః = చుట్టు, మయూఖైః = కిరణములతో, ప్రజ్వలంతమ్ = మండుచున్న, కల్పాంతానంత సూర్యద్యుతిమ్ = కల్పాంత మందలి అనంత సూర్యుల కాంతిగల, వహ్నీంద్వర్కామ్బుకాష్ఠాదశయుతమ్ = అగ్ని చంద్ర సూర్యజల కాష్ఠాదశకముతో కూడిన, అతి వికటానేక దంష్ట్రమ్ = మిక్కిలి భీకరములైన అనేకములైన దంష్ట్రలుగల, షడాస్యమ్ = ఆఱు ముఖములు గల, శూలాసీషూగ్రశక్త్యంకుశవరనృశిరః శ్రీఫలేష్వాసవారి ప్రోతత్పాశాభయాంకైః = శూలము, కత్తి, బాణము, ఉగ్రశక్తి, అంకుశ శ్రేష్ఠము, పుఱ్ఱె, మారేడుకాయ, ధనువు, చక్రము, విస్తరించు పాశము, అభయచిహ్నము గల, నిజభుజ పరిఘైః = తనభుజముల కోటగోడలతో, గురుమ్ = గొప్పవాడవైన, శమ్భుమ్ = శమ్భుడవైన, త్వామ్ = నిన్ను, ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :** ప్రలయకాలానంత సూర్యకాంతి గల, అనేకములైన భీకరములైన కోరలుగల

ఆఱు ముఖములు గల సూర్యచంద్రాగ్ని జలకాష్ఠా దశకముతో కూడిన కిరణములతో చుట్టు ప్రకాశించుచున్న శూలము, కత్తి, బాణము,శక్తి, అంకుశము, పుఱ్ఱె, పాశము, శ్రీఫలము, ధనువు, చక్రము, వరాభయ చిహ్నములు కల బాహువుల కోటగోడలతో విరాజిల్లు గురు రూపుడవు, శమ్భుడవు నైన నిన్ను స్తుతించెదను.

**వివరణము :** ఒక సూర్యుని ప్రచండప్రతాపమును మనమెఱుగుదుము. అట్టి సూర్యులు పన్నెండుగురని (అగ్ని) ప్రలయకాలమున ఆ పన్నెండుగురు మండు చుందురని ప్రసిద్ధి యున్నది. కల్పాంతము నందా అనంత సూర్యులు వెలిగి నప్పుడెంతకాంతి యేర్పడునో ఊహకును అసాధ్యము. అంతకాంతి ఎల్లవేళల తన కిరణములతో చుట్టు వెదజల్లుచున్న పరశమ్భువు మండుచున్నట్లే కనిపించుటలో వింతేమున్నది? ఆయనకు ఆఱు ముఖము లున్నవి. అవి యన్నియు భీకర దంష్ట్రాకరాళములై యున్నవి. ఆ ఆఱుముఖములు అగ్నులే అవి దంష్ట్రాజ్వాలా కీలములై యున్నవి. శివుడు పంచముఖుడనియే ప్రసిద్ధము. కాని మహాన్యాసమున **పాతాళం షష్ఠమ్ముఖమ్** అని ఆ ఆఱు ముఖములు వర్ణింపబడినవి. పంచముఖములున్నప్పుడు పూర్వ పశ్చిమ దక్షిణోత్తరోర్ధ్వాభిముఖములైన ముఖములు వర్ణింపబడినట్లైనవి. దిక్కులలో ఊర్ధ్వ దిక్కునకు ప్రతీకమైన అధోదిశ చెప్పవలెగదా! అధోదిశాభిముఖమైన ముఖమును పై అయిదింటికి చేర్చినచో శివునకాఱు ముఖములనుట సమంజసమే అగును. పురాణములలో షడాస్యశబ్దము కుమారస్వామిని బోధించుననుట ప్రసిద్ధమే. అప్పుడును ఆ ముఖములు పూర్వ పశ్చిమ దక్షిణోత్తర ఊర్ధ్వాధోదిగభి ముఖము లనియే చెప్పవలెను. ఈ శ్లోకమున శమ్భువే షణ్ముఖుడుగా చెప్పబడినాడు. అయిదు ముఖము లన్నప్పుడు పది చేతులు ఆఱు ముఖము లున్నప్పుడు పన్నెండు చేతు లుండవలెను. ఈ శ్లోకమున పన్నెండు చేతులు వానిలోని ఆయుధములును చెప్పబడినవి. ఒక చేత శూలము, మరొక చేత కత్తి, ఇంకొక చేత బాణము, మరొక చేత ఉగ్రశక్తి, ఇంకొక చేత అంకుశము, మరొక చేత వరచిహ్నము ఈ ఆఱు చేతులు దక్షిణములు. ఎడమచేతులలోని ఒక చేత పుఱ్ఱె, మరొక చేత ధనువు, ఇంకొక చేత చక్రము, మరొక చేత పాశము, ఇంకొక చేత మారేడుకాయ, మరియొక చేత అభయచిహ్నము. ఆయుధములనే ఎత్తైన అతని బాహువులు ఆయనకు పెట్టనికోటగోడలై యున్నవి. ఈ శ్లోకమున **జ్వలంతమ్మయూఖైః కల్పాంతానంత సూర్యద్యుతిమ్** వంటి పదముల శమ్భువు యొక్క పావకత్వమును వ్యక్తీకరించుట యుచితము గానే ఉన్నది. ఇది **పావక ధ్యానయోగ ప్రకరణము** గదా!

విలయమహార్కకోటి రుచి విస్తృతదంతపరంపరున్ షడా
స్యు లసదినేందు వహ్నియుతు నుజ్జ్వలదీధితి శూల బిల్వస
త్ఫల శర చాప శక్తి సృణి పాశ కపాల సుదర్శనాభయా
సి లలితబాహు దండయుతు శ్రీగురు శంభు నినున్ నుతించెదన్.

**అవతారిక :** పై శ్లోకమున **పరశమ్భువుయొక్క ద్వాదశ భుజములు ద్వాదశ ఆయుధములు** చెప్పబడినవి. ఈ శ్లోకమున **అంగుష్ఠమాత్రవైశ్వానరరూపుడుగా** నాతడు వర్ణింపబడుచున్నాడు.

**శ్లో॥ నాగాస్థీందుప్రసూతైః శ్రవణగతమహాభూషణైః కుండలీంద్రై-**
**రాక్రోశన్ముండమాలాపరిహృతవపుషా దిక్షు జాజ్వల్యమానమ్।**
**మత్తేభేన్ద్రోరుకృత్త్యంతరఘటితకటీమండలం సాట్టహాసం**
**తమ్భాస్వద్వ్యోమ గర్భోదర విధృత కరాంగుష్ఠమాత్ర మ్ప్రపద్యే॥ 76**

**ప్రతిపదార్థము :** నాగాస్థీందుప్రసూతైః = గజదంతచంద్రజాతములైన, శ్రవణగత మహాభూషణైః = చెవులలో నున్న గొప్పభూషణములైన, కుండలీంద్రైః = సర్పరాజుల చేత, ఆక్రోశన్ముండమాలాపరివృతవపుషా = అఱచు చున్న పుఱ్ఱెలమాలతోకూడిన శరీరము చేత, జాజ్వల్యమానమ్ = మిక్కిలి ప్రకాశించుచున్న, మత్తేభేంద్రోరుకృత్త్యంతర ఘటిత కటీ మండలమ్ = గజేంద్రము యొక్క గొప్పదైన, మరియొక్కతోలు చేత కట్టబడిన నడుముగల, సాట్టహాసమ్ = అట్టహాసముతో కూడిన, భాస్వద్వ్యోమపృష్ఠో(గర్భో) దర విధృత కరాంగుష్ఠమాత్రమ్ = ప్రకాశించు ఆకాశమనెడు వీపు పొట్టను పట్టుకొన్న కరము యొక్క బొటన వ్రేలుగల, తమ్ = ఆ పరశమ్భువును, ప్రపద్యే = శరణువేడు చున్నాను.

**తాత్పర్యము :** గజదంత చంద్ర జాతములైన చెవుల కలంకరింపబడిన గొప్ప సొమ్ములైన సర్పములతో అఱచుచున్న పుఱ్ఱెల హారముతో కూడిన శరీరముతో, దిక్కులలో మిక్కిలి ప్రకాశించుచున్న గజచర్మవస్త్రముతో చుట్టబడిన నడుముగల అట్టహాసముతో కూడిన ఆకాశ గర్భము వంటి పొట్టను పట్టుకొన్న బొటన వ్రేలియంత పరిమాణముతో కూడిన పరశమ్భువును శరణువేడు కొనుచున్నాను.

**వివరణము :** శివుని చెవులకు సర్పభూషణములున్నవి. మెడలో పుఱ్ఱెల హారములున్నవి. అవి ఆక్రోశించుచున్నవి. ఆ ఆక్రోశధ్వని ఓంకారము (తారకము) కావచ్చును, ఆ శివుని వెలుగులు దిక్కులలో వ్యాపించి యున్నవి. ఆతని నడుము పై గజచర్మము వస్త్రమువలె

ఆవరించి యున్నది. ఆతని నడుము పిడికిట నడగి యున్నది. ఆతడు హృదయమున **అంగుష్ఠమాత్రుడుగా** ప్రకాశించుచున్నాడు ఆతనినే నేను శరణువేడెదను. మిక్కిలి మండుచున్న అను అర్థము నిచ్చు **'జాజ్వల్యమానమ్'** అను శబ్దము పావకధ్యాన యోగోచితముగా ప్రయోగింపబడినది.

**చెవులకు కుండలమ్ములగు చివ్వలమస్తమణీందురేఖ నా**
**ర్చు వరకపాలమాలికను చుట్టిన దేహమునన్ వెలుంగు మ**
**త్తవరగజేంద్రకృత్తి ఘటితమ్మగు దివ్యకటిన్ దనర్చు న**
**వ్వులి మలికాంబరాత్త భుజభుగ్నుని వ్రేలెడు శమ్భు నెన్నెదన్.**

**అవతారిక :** పై శ్లోకమున **జాజ్వల్యమానాంగుష్ఠమాత్రుడుగా** పరశమ్భువు వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున ఆతడు **ఆధ్యాత్మదీపముగా** చెప్పబడుచున్నాడు.

**శ్లో॥ నాగేంద్రైః కల్పవృక్షైరధిగతవిహగైర్భైరవైర్దేవదైత్యైః**
**భూతైః ప్రేతైః పిశాచైః పరివృతమభితో యోగినీభిః శ్మశానే।**
**సర్వప్రజ్ఞైకవాసం త్రిభువననిలయం స్వాత్మనాధ్యాత్మదీపం**
**సర్వోత్తీర్ణాత్మతత్త్వేశ్వరమనలముఖం త్వాం గురుం శమ్భుమీడే ॥ 77**

**ప్రతిపదార్థము :** నాగేంద్రైః = సర్పరాజుల చేత, అధిగతవిహగైః = పొందబడిన పక్షులుగల, కల్పవృక్షైః = కల్పవృక్షములచేత, భైరవైః = భైరవులచేత, దేవదైత్యైః = సురాసురులచేత, భూతైః = భూతముల చేత, ప్రేతైః = దయ్యముల చేత, పిశాచైః = పిశాచములచేత, అభితః = చుట్టు, శ్మశానే = శ్మశానమునందు, యోగినీభిః = యోగినులచేత, పరివృతమ్ = చుట్టబడిన, సర్వప్రజ్ఞైకవాసమ్ = సర్వజ్ఞానములకు ఒకే చోటైన, త్రిభువననిలయమ్ = మూడు లోకములు నివాసములుగాగల, స్వాత్మనా = స్వాత్మచేత, ఆధ్యాత్మదీపమ్ = శరీరము నందు దీపమువలె ప్రకాశించు, సర్వోత్తీర్ణాత్మతత్త్వేశ్వరమ్ = అన్నిటిని దాటిన ఆత్మతత్త్వ రూపుడైన ఈశ్వరుడైన, అనలముఖమ్ = అగ్నిముఖుడైన, గురుమ్ = గురుడవైన, శమ్భుమ్ = శమ్భుడవైన, త్వామ్ = నిన్ను, ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :** సర్పరాజులచేత, పక్షులతో కూడిన కల్పవృక్షములచేత, భైరవుల చేత, దేవరాక్షసుల చేత, భూతప్రేతములచేత, పిశాచములచేత, శ్మశానము నందు చుట్టుముట్టిన యోగినులచేతను గూడిన సర్వజ్ఞానములకే కాధారమైన త్రిభువనములందు నివసించు, ఆత్మరూపముతో శరీరమును ప్రకాశింపజేయు దీపమువలె నుండు సర్వాతీతమైన

ఆత్మస్వరూపుడైన అగ్నిముఖుడునైన గురుడువైన శమ్భుడవైన నిన్ను స్తుతించెదను.

**వివరణము :** పరశమ్భువు నాగేంద్రములచేత చుట్టబడినవాడు. వానిని కంఠాభరణములుగా కటిసూత్రములుగా కటక కేయూరములుగా ధరించినవాడు. కంఠమునో బాహువులనో పాదములనో కటినో అననేల ఆ నాగములు అన్నిటిని చుట్టియే యున్నవి. పరశమ్భువు యొక్క లోకమందున్న వృక్షములన్నియు కల్పవృక్షములే. వానిపై పక్షులు వాలి యున్నవి. అట్టి కల్పవృక్షములచే చుట్టబడిన భవనమున పరశమ్భువు నివసించును. అట్లయినను ముల్లోకముల నాతడు వ్యాపించి యుండుటచేత ఆ లోకములన్నియు ఆయన నివాసములే ఐ యున్నవి. ఆయన **దీపరూపుడు**. కావున ఆయన చుట్టు కాంతులు చుట్టి యున్నవి. అవియే భైరవులు. దేవదానవు లాతని కొలువవచ్చి ఆయన చుట్టు మూగియున్నారు. శ్మశానవాసియైన ఆతని చుట్టు భూతప్రేతపిశాచయోగినులు చుట్టు ముట్టి యున్నారు. అన్ని జ్ఞానములు కలవాడు ఆ శమ్భువు సర్వమునకు సాక్షియునై యున్నాడు. సాక్షిత్వమున కావల కూడ ఆయనయే ఉన్నాడు. ఆతడు సర్వాత్మకుడగుటయే కాక సర్వోత్తీర్ణుడు. ఆయన అన్నిటికి అందఱకు ఆత్మయై యున్నాడు. తత్త్వములకు అన్నిటికి ఆయన ఈశ్వరుడు కూడనై యున్నాడు. సర్వజీవులకు ఆతడు గురుడై యున్నాడు. అట్టి ఆ పరశమ్భువే స్తుత్యుడు. కావున ఆయనకే నా స్తుతిని సమర్పించెదను. ఆయన **అనలముఖుడని చెప్పుట పావకధ్యానయోగప్రకరణోచితము.**

**నాగవరామరాగఖగనాకి దనూద్భవ భూతజాతముల్**
**యోగినులున్ శ్మశానమున నుజ్జ్వల రీతిని జుట్టుకొన్న యా**
**త్మాగమబోధదీప్తిమయు నాత్మపతిన్ భువనత్రయాలయున్**
**శ్రీగురుశమ్భు వహ్నిముఖ చిన్మయు నిన్నెద వేడుచుండెదన్.**

**అవతారిక :** పై శ్లోకమున **అనలముఖపరశమ్భువు** వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున ఆతని మృత్యుంజయత్వము నిరూపించ బడుచున్నది.

**శ్లో॥ నానాధ్యానాత్మయోగప్రకటితశివతారూపసిద్ధిప్రసాదః**
**స్వేచ్ఛాజ్ఞానక్రియాత్మాత్రిశిఖవిదలితత్రయ్యుదీర్ణప్రమోహః।**
**సత్యజ్ఞానాసిభిన్నప్రమితిజనిరిపుః స్వాత్మయోగేషు ధారా-**
**చ్ఛిన్నావిద్యాసులక్ష్యః పరమశివ! విభో! తేన మృత్యుంజయస్త్వమ్॥ 78**

**ప్రతిపదార్థము :** విభో! = ప్రభుడవైన, పరమశివ! = ఓ పరమశివా, నానాధ్యానాత్మ

యోగ ప్రకటిత శివతారూపసిద్ధి ప్రసాదః = అనేక ధ్యానముల చేత ఆత్మయోగము చేత సిద్ధించిన శివత్వము అనెడి సిద్ధియే అనుగ్రహముగా గలవాడవు, స్వేచ్ఛాజ్ఞాన క్రియాత్మా త్రిశిఖ విదలిత త్రయ్యుదీర్ణప్రమోహః = తన ఇచ్ఛాజ్ఞానక్రియ లనెడి మూడు మొనలుగల త్రిశూలములచేత చీల్చబడిన వేదముల కతీతమైన అధికమోహము కలవాడవు, సత్యజ్ఞానాసి భిన్న ప్రమితి జనిరిపుః = సత్యజ్ఞానములనెడి కత్తిచేత చీల్చబడిన జ్ఞానము జన్మ అను శత్రువులు గల వాడవు, స్వాత్మయోగేషు ధారాచ్ఛిన్నావిద్యాసులక్ష్యః = స్వాత్మయోగమను బాణధారచే చీల్చబడిన అవిద్య అను లక్ష్యము గలవాడవు. తేన = అందుచేత, త్వమ్ = నీవు, మృత్యుంజయః = మృత్యుంజయుడవు.

**తాత్పర్యము :** నానాధ్యానరూప యోగము నభ్యసించు వారికి శివత్వసిద్ధి ననుగ్రహించు వాడవు. ఇచ్ఛాజ్ఞానక్రియ లెడి మొనలుగల త్రిశూలముచే వేదాతీత మోహమును చీల్చినవాడవు సత్యజ్ఞానము లనెడి కత్తిచే జ్ఞాన జన్మ శత్రువుల చీల్చినవాడవు, స్వాత్మ యోగములనెడి బాణధారచే అవిద్యాలక్ష్యమును భేదించిన వాడవు నైన వాడవగుటచే ఓ పరమశివ ప్రభూ! నీవు మృత్యుంజయుడవు.

**వివరణము :** ఒక్కొక్క జీవ గుణమును జయించుటకు ఒక్కొక్క ఈశ్వర గుణమును ధ్యానించుట అవసరము. తన పరిమితత్వమును జయించుటకు శివుని అపరిమితత్వమును ధ్యానింపవలెను. అట్లే తన అజ్ఞతను లేక కించిజ్ఞతను జయించుటకు శివుని సర్వజ్ఞతను ధ్యానింపవలెను. ఇట్టి విరోధి (ప్రతిద్వంద్వ) గుణ ధ్యానము చేత జీవత్వము తొలగి శివత్వము క్రమముగ సిద్ధించును. జీవుని ఈ వివిధ ధ్యానములచే శివుని కనుగ్రహము కలిగి ఆతనికి శివుడు శివత్వము ననుగ్రహించును. 2. శివుడు త్రిశూలధారి. ఆ త్రిశూలములోని మూడు శూలములు (మొనలు) ఇచ్ఛాజ్ఞానక్రియలే. వానిచే జీవుని గుణత్రయ మోహమును శివుడు నశింపజేయును. అట్లే శివుడు ఆత్మయోగము అను బాణ వర్షమును గురిపించుచు జీవుని (సాధకుని) అవిద్య అను లక్ష్యమును ఛేదించి వైచును. అప్పుడు జీవుడు అవిద్యా విముక్తుడగును. 3. అసత్యములు అనిత్యములునైన విషయ జ్ఞానములు నిరంతరము జీవుని మనస్సున కలుగుచుండును. శివుని యథార్థజ్ఞానము అను కత్తి విషయజ్ఞానశత్రువుల ఛేదించి వైచును. అప్పుడు జీవుడు విషయజ్ఞానముల నుండియే గాక జన్మపరంపర నుండియు విముక్తుడగును. 4. సత్త్వరజస్తమోరూప గుణత్రయము విషయముల నెఱుగవలె నను ఇచ్ఛ, వాని నెఱుగుట అను విషయజ్ఞానము విషయప్రాప్తి విషయాసక్తిని పెంచును. అందుచేత దానికి జీవుడు పెక్కు క్రియలను చేయును.

ఈ ఇచ్ఛాజ్ఞానక్రియలు వీని కాధారమైన అవిద్య, ఇవి యన్నియు జీవులకు మృత్యురూపములు. మృత్యు రూపములైన వీనిని జయించుటయే **మృత్యుంజయత్వము**. శివుడీ వివిధ మృత్యువుల జయించిన వాడగుటచే మృత్యుంజయు డనబడినాడు. 5. పూర్వము పరశమ్భువు ఆఱుముఖములు గలవాడని, పంద్రెండు భుజములు కలవాడని ఆ భుజములలో ఆతడు త్రిశూలాది బహువిధాయుధముల ధరించినాడని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ ఆయుధముల అంతరార్థము చెప్పుట ఆరంభింప బడినది. శివుని త్రిశూలము అనగా పరమేశ్వరుని **ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు** అను మూడు మొనలు గల ఒక ఆయుధము. అది జీవుని అవిద్యాసంబంధి గుణత్రయ ప్రతిద్వంద్విగా ఇచట చెప్పబడినది. ఆయన ధరించిన బాణముల ధార జీవుని అవిద్య అను లక్ష్యమును ఛేదించుటయే లక్ష్యముగా గలదిగా చెప్పబడినది.

**ధ్యాన విభావితాత్మ శివతా వరసిద్ధి మహాప్రసాదుడై**
**జ్ఞానకృతీషణ త్రిశిఖ శామిత దుర్గతి హేతుమోహు డై**
**జ్ఞానవరాసిభిన్నవరశాత్రవుడయ్యు నవిద్య చావగా**
**తాన వెలుంగుచుండు మృతి దాటినవాఁడని న్నుతింపరే.**

**అవతారిక :** పై శ్లోకమున త్రిశూలాసి బాణ (ధారా) ధారణముయొక్క **ఆధ్యాత్మిక ప్రయోజనము** చెప్పబడినది. ఈ శ్లోకమున అంకుశాదిధారణముయొక్క **ఆధ్యాత్మిక ప్రయోజనము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ దేవ! బ్రహ్మాండసృష్టిస్థితిలయసమయధ్వంసినీ తే త్రిశక్తి-**
**ర్మాయాశక్తిప్రచండోద్ధతఘనకరిణీవారిణీ సా సృణిస్తే।**
**ధర్మార్థేష్టప్రముక్తిప్రవితరణచణస్తే వర స్తేఽ ప్యభీతి-**
**ర్విశ్వగ్రాసోగ్రమృత్యుప్రతిభయదలనీ తద్భవాన్ మృత్యుమృత్యుః ॥ 79**

**ప్రతిపదార్థము :** దేవ = ఓ ప్రభూ!, తే = నీయొక్క, త్రిశక్తిః = శక్తి త్రయము, బ్రహ్మాండ సృష్టి స్థితి లయ సమయ ధ్వంసినీ = బ్రహ్మాండముల సృష్టిస్థితి లయముల సమయముల నశింపజేయునది, తే = నీయొక్క, సృణిః = అంకుశము, మాయాశక్తి ప్రచండోద్ధతఘనకరణీ వారిణీ = మాయాశక్తి అనెడి ప్రచండమైన ఉద్ధతమైన ఆడుఏనుగును వారించునది, తే = నీయొక్క, వరః = వరముద్ర, ధర్మార్థేష్టప్రముక్తిప్రవితరణచణః = ధర్మార్థకామమోక్షముల ప్రదానమున సమర్థమైనది, తే = నీయొక్క, అభీతిః = అభయముద్ర, విశ్వగ్రాసోగ్ర

మృత్యు ప్రతి భయదలనీ = విశ్వము యొక్క మ్రింగుట యందు ఉగ్రమైన మృత్యువు యొక్క తీవ్రభయమును విఱుచునది, తత్ = అందువలన, భవాన్ = నీవు, మృత్యుమృత్యుః = మృత్యువునకే మృత్యువు.

**తాత్పర్యము :** ఓ దేవా! నీ త్రిశక్తి సృష్టి స్థితి లయ సమయములనే నశింపజేయును. నీ అంకుశము మాయాశక్తి అను ప్రచండోగ్రకరణిని వారించును. నీ వరముద్ర ధర్మార్థకామ మోక్షముల నిచ్చుటలోని పుణ్యమైనది. నీ అభయముద్ర విశ్వమునే మ్రింగు మృత్యువు యొక్క భయమును బ్రద్దలు చేయును. అందువలన నీవు మృత్యువునకే మృత్యువని చెప్పదగినవాడవు.

**వివరణము :** పూర్వ శ్లోకమునందలి **ఉగ్రశక్తియే** ఈ శ్లోకమున **త్రిశక్తిగా** చెప్పబడినది. వరశబ్దము **వరదానముద్రను**, అభీతి శబ్దము **అభయదానముద్రను** లక్షించును. ఇష్టశబ్దము ఇష ఇచ్ఛాయామ్ అను ధాతువు నుండి నిష్పన్నమైనది. కావున కామమును (ఇచ్ఛను సంభోగమును) సూచించును.

**నీదు త్రిశక్తియే భువననిర్మితిపాలననాశకాల సం**
**ఛేదిని సిల్లె మాయయను సింధురమున్ దొలగింపఁజాలు ధ**
**ర్మాదికపూరుషార్థముల నందగ జేయు వరమ్మభీతి వి**
**శ్వాది మృతి ప్రభీతిహరమౌట వెలింగెడు మృత్యుమృత్యుతన్.**

**అవతారిక :** పై శ్లోకమున **త్రిశక్త్యంకుశ వరాభయ ముద్రల ప్రయోజనము** చెప్పబడినది. ఈ శ్లోకమున **పాశచక్రాదుల ప్రయోజనము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ పాశస్తే విశ్వవశ్యః పితృపతికృతభీహస్తినీసింహవృత్తి–**
**శ్చక్రస్సంసారరాత్రిద్యుమణిసముదయస్తావకస్తే పినాకః।**
**ఆక్రాంతాశేషమోహప్రకృతివికృతికో మాతృకా చిత్పరాత్మా**
**ప్రాణా స్తే తత్కపాలం హతవిధిముఖ సత్రేత చిద్రూప మీశ! ॥ 80**

**ప్రతిపదార్థము :** ఈశ = ఓ ఈశ్వరా!, తే = నీయొక్క, విశ్వవశ్యః = విశ్వమువశ్యముగా గల, పాశః = పాశము, పితృపతికృత భీహస్తినీ సింహ వృత్తిః = యమునిచే కలిగింపబడిన భయము అను ఆడు ఏనుగునందు సింహముయొక్క వ్యాపారము గలది, తావకః = నీకు సంబంధించిన, చక్రః = చక్రము, సంసారరాత్రి ద్యుమణి సముదయః = సంసారము అను రాత్రికి సూర్య సమూహమైనది, తే = నీయొక్క పినాకః = పినాకధనువు,

ఆక్రాంతాశేషమోహ ప్రకృతి వికృతి కః = ఆక్రమింపబడిన మోహము యొక్క సమస్త ప్రకృతి, వికృతి రూపమైనది, మాతృకా = మాతృక, చిత్ = చిత్తు, తే = నీ యొక్క, ప్రాణాః = ప్రాణములు, పరాత్మా = పరాత్మ, కపాలమ్ = కపాలము, తత్ = ఆ, హతవిధి ముఖ సత్ ప్రేత చిత్ రూపమ్ = చంపబడిన బ్రహ్మ ముఖము యొక్క సద్రూపము యొక్క చిద్రూపము.

**తాత్పర్యము :** ఓ ఈశా! విశ్వమును వశమందుంచుకొను నీ పాశము మృత్యుభయమను ఏనుగునందు సింహమువలె విక్రమించును. నీ చక్రము సంసారరాత్రికి సూర్య సముదాయము. నీ పినాకము మోహప్రకృతి వికృతి రూపము. నీ కపాలము చంపబడిన బ్రహ్మ ముఖము యొక్క నాశము లేని శవము యొక్క చిద్రూపము. నీ మాతృక చిత్తు. నీ ప్రాణములు పరాత్మ.

**వివరణము :** తంత్రగ్రంథములలో పాశాంకుశధారులైన దేవతలు తమ భక్తులు ఇష్టకామ్యములను పాశముతో బంధించి అంకుశముతో ఆకర్షించి వారి కందజేయుదురని చెప్పబడినది. ప్రకృతమున పరశమ్భువు యొక్క అంకుశము పై శ్లోకమున పాశ మీ శ్లోకమున వర్ణింపబడినవి. 2. మోహమునకు ప్రకృతి అవిద్యతమము అని పిలువబడు మూలప్రకృతి. మిగిలిన తత్త్వములలో మహదాది సప్తకము ప్రకృతి వికృతులని ఆకాశాది షోడశకము వికృతి అని చెప్పబడును. మొత్తము ఇవి యన్నియు మోహమునకు ప్రకృతులో వికృతులో కావలసినవే. ఇవి యన్నియు పినాక రూపములు. మోహము ప్రధానముగ బుద్ధిగతమై యుండును. చక్రము మనస్తత్త్వాత్మకముగా విష్ణుపురాణమున చెప్పబడగా ఈ శ్లోకమున మనస్సులోని సంసారరాత్రిని తొలగించు సూర్యసముదాయముగా చెప్పబడినది. మాతృక చిత్తుగా, ప్రాణములు పరాత్మగా, చెప్పబడుట సంప్రదాయానుసరణముగ లేకున్నను విచిత్రముగా మాత్రమున్నవి.

**ఈశ యమ ప్రభీతికరమేనిక సింగముతోలు వస్త్రమున్**
**నాశము విశ్వవశ్యము పినాకము మోహవిదారకమ్ము లౌ**
**పాశయ సంసృతి ప్రతిమిరారి మదాలియె చక్రమౌను మో**
**హాశన మాతృచేతనము ప్రాణముపుట్టిహతాజ ముఖ్యమౌ.**

**అవతారిక :** పై శ్లోకమున **పాశపినాకచక్రధారణ ప్రయోజనము** చెప్పబడినవి. ఈ శ్లోకమున **సర్వ (దేవతా) నియామకత్వము** చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏవం తే దివ్య! దివ్యాయుధపరమహిమా గీయతే వేదశాస్త్రైః
ప్రాగుక్తస్తే శతాంగోఽప్యపి చ పితృగణప్రేతశీర్షోచ్చరంగే।
ఉచ్చండం తాండవం తే త్రిభువనభయకృద్వజ్రపాతోఽట్టహాసో
భీషాస్మాత్త్వత్సకాశాదపర ఇవ పరో నాస్తి తేనోగ్రవీరః ॥ 81

**ప్రతిపదార్థము :** దివ్య! = ఓ పరమాకాశము నందుండు వాడా!, దివ్యాయుధ పర మహిమా = దివ్యాయుధముల గొప్ప మహిమ, వేదశాస్త్రైః = వేదములచేత, శాస్త్రములచేత, ఏవమ్ = ఇట్లు, **గీయతే** = గానము చేయబడుచున్నది, ప్రాగుక్తః = పూర్వము చెప్పబడిన, తే = నీయొక్క, శతాంగః అపి = రథముకూడ. పితృగణప్రేత శీర్షోచ్చరంగే = పితృసమూహము యొక్క శవశీర్షము యొక్క ఉన్నతమైన రంగమున, **అస్తి** = ఉన్నది, తే = నీయొక్క, ఉచ్చండమ్ = భయంకరమైన, తాండవమ్ = తాండవము, త్రిభువనభయకృత్ = త్రిభువనములకు భయమును కలిగించునది, అట్టహాసః = పెద్దనవ్వు, వజ్రపాతః = పిడుగుపాటే, అస్మాత్ = ఈ, త్వత్సకాశాత్ = నీ సమీపము నుండి, భీషా = భయముచే, అపరః = మరొకడు, పరః ఇవ = శత్రువువలె, న అస్తి = ఉండడు, తేన = అందుచేత, ఉగ్రవీరః = భయంకర వీరుడవు.

**తాత్పర్యము :** ఓ పరమాకాశమున నుండు వాడా, నీ ఈ దివ్యాయుధముల గొప్ప మహిమ వేదములచేత, శాస్త్రములచేతను స్తుతించబడుచున్నది. పూర్వము చెప్పబడిన నీ రథము కూడ పితృగణము యొక్క శవ శీర్షము యొక్క ఉన్నత రంగమున ఉన్నది. నీ తాండవమేమో త్రిభువనభయంకరమై ఉన్నది. నీ అట్టహాసము పిడుగుపాటే అన వచ్చును. నీ నుండి కలుగు ఇట్టి భయము చేతనే నీ కెవడును శత్రువుగా నుండుటకు సాహసింప లేకున్నాడు కావున నీ యంతటి మరొక ఉగ్రవీరుడు లేడు.

**వివరణము :** శ్మశానమున ప్రేతము లుండును. దానిని పితృభూమి యని చెప్పెదరు. అచట యుద్ధమృత వీరుల శీర్షము లుండును. శివుని గోటిచే గిల్లి వేయబడిన బ్రహ్మ యొక్క శీర్షము గూడ శ్మశానమున నున్నది. అది చాల పెద్దది. గావున శివుని రథము ఆ ఎత్తైన బ్రహ్మకపాలము యొక్క ఏత్తైన రంగస్థలమున నిలువబడి యున్నది. ఆ రథమే పూర్వము వర్ణింపబడినది. ఆ ఉన్నతరంగస్థలము శివుడు చేయు తాండవము. (ప్రలయ నృత్యము). త్రిభువనములలోని వారందరికి చావు సమీపించినదను భయమును కలిగించు చున్నది. అట్టహాసము విద్యుత్తువలె మెఱిసి పోవుచున్నది. అట్టహాసధ్వని పిడుగు పడినప్పటి ధ్వని యంత భయంకరముగా నున్నది. నీ సమీపమునుండి బయలుదేరిన భయము

చేతనే నీ ఎదుట పడుటకే ఎవడును సాహసింపలేకపోవుటచే నీకు ప్రతివీరుడున్నాడని చెప్పుట కుదరనే కుదరదు. కావున నీవు ఉగ్రవీరుడవుగా చెప్పబడుచున్నావు. శ్మశానాగ్ని వలెనే శివుడు భయంకరుడై ఉన్నట్లు స్ఫురింపజేయు నీ శ్లోకార్థము ఈ ప్రకరణమున ఔచిత్యశోభితమై యున్నది. భీషాశబ్దము **'భీషాస్మాద్వాతః పవతే'** ఇత్యాది మంత్రమును స్ఫురింపజేయుచున్నది.

**ఈ విధి వేదశాస్త్రచయమెన్నును నీ పరమాయుధోన్నతిన్**
**పావనమౌ శతాంగమున పైతృకమాతుగు ప్రేతశీర్ష రం**
**గావృతి లోకభీకరమహానటనమ్మును సాట్టహాసమున్**
**నీవపరుండవై సలుప నీకు పరుం డెవ డుగ్రవీరతన్.**

**అవతారిక :** పూర్వ శ్లోకమున ప్రేతశీర్షోచ్చరంగమున శివుని రథమున్నట్టు చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతడు ప్రేతసింహాసనస్థుడుగా చెప్పబడు చున్నాడు.

**శ్లో॥ చిత్తాకాశానిలాగ్న్యంబ్వవనితలమహాప్రేతసింహాసనస్థః**
**షట్ఛక్తివ్యక్తమూర్తిః షడయనపథికః సోమసూర్యాగ్నిపాదః।**
**బ్రహ్మాగ్నిస్సప్తజిహ్వాకవలితవిషయీభూతవిశ్వప్రపంచః**
**స్థూలోఽపి ధ్యానదృష్టేస్త్వమధికతమసాం జ్యోతిషామప్యగమ్యః ॥ 82**

**ప్రతిపదార్థము :** చిత్తాకాశానిలాగ్న్యంబ్వవనితల మహాప్రేత సింహాసనస్థః = చిత్తము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అను ప్రేతములతో కూర్చబడిన గొప్ప సింహాసనమునం దున్నట్టి, షట్ఛక్తివ్యక్తమూర్తిః = ఆఱుశక్తులచే స్పష్టమగు ఆకారముగల, షడయన పథికః = ఆఱు అయనములలో సంచరించునట్టి, సోమసూర్యాగ్నిపాదః = చంద్రసూర్యాగ్నులు పాదములుగా గలిగినట్టి, సప్త జిహ్వా కవలిత విషయీభూతవిశ్వప్రపంచః = ఏడు నాలుకలచే మ్రింగ బడిన విషయముగా చేయబడిన సర్వప్రపంచముగల, బ్రహ్మాగ్నిః = చైతన్యాగ్ని రూపుడవైన, త్వమ్ = నీవు, ధ్యానదృష్టేః = ధ్యానదృష్టికి, స్థూలుడ వైనను, అధికతమసామ్ = గొప్పచీకట్లకు, జ్యోతిషామ్ అపి = వెలుగులకును, అగమ్యః = చేరరానివాడవు.

**తాత్పర్యము :** మనస్సుతో కూడిన పంచభూతములు మొత్తమాఱు. ప్రేతములతో కూర్చబడిన సింహాసనమునం దున్నవాడు ఆఱుగురు శక్తులతో తెలియబడు మూర్తిగలవాడు, ఆఱు అయనములలో సంచరించు సోమసూర్యాగ్నులు అను మూడుపాదములు గలవాడు, ఏడు

నాలుకలతో విషయమైన సర్వప్రపంచమును మ్రింగువాడు, ధ్యానదృష్టికి స్థూలుడుగా నున్నను చీకట్ల మరియు వెలుగుల వ్యాప్తికి అందరాని ఆ చైతన్యాగ్నిరూపపరశమ్భువు మిక్కిలి సూక్ష్ముడు.

**వివరణము :** అమ్మవారికి **'పంచప్రేతాసనాసీనా'** అని పంచ ప్రేతాసనము ప్రసిద్ధమైయున్నది. పంచకృత్యములలో నొకటైన అనుగ్రహము అను కృత్యము ముఖ్యమైనది. బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు సదాశివుడు నొనరించుదురు. వారే పంచప్రేతములు. పై నామమునకు పంచభూతములే ప్రేతములని వాని యందు వ్యాపించు అమ్మవారు 'పంచప్రేతాసనాసీనా' అను వ్యాఖ్యాంతరము మరొకటి యున్నది. ఈ శ్లోకమున పరశమ్భువు కూడ ప్రేతసింహాసనస్థుడుగా వర్ణింపబడినాడు. ప్రేతముల సంఖ్య మాత్రము మారినది. పంచభూతములకు చిత్తము చేర్చబడినది. ప్రేతముల సంఖ్య ఆఱైనది. పైన చెప్పబడిన పంచభూతములు జడములే, చిత్తము కూడ జడమే కాని దానికి చిచ్ఛాయాప్తి యోగ్యత అధికముగా నున్నది. ఆకాశము చైతన్యప్రతిబింబితమైన నే వాయువునకు ఆ వాయువు కూడ అట్లైన నే అగ్నికి ఈ విధముగా ఉత్తరోత్తర భూతములకు పూర్వపూర్వభూతములు కారణములు కావలెనన్న వానికి చైతన్యప్రతిబింబన మవసరము. అస్తు. ప్రేతమనగా ప్రాణశక్తి వెడలిపోగా బోసిగా మిగిలినది. అట్టి ప్రేతముల ఆసనము ప్రాణశక్తి ప్రవేశముచే ప్రాణవంతమగును. అప్పుడా ఆసనము ప్రాణశక్తికి ఆసనము అగును. ప్రాణశక్తి వెడలిపోయిన అది ప్రేతమగును. జీవుడు చిత్తరూపుడని, ఈశ్వరుడు చిద్రూపుడు అని తంత్రములు చెప్పుచున్నవి. (శక్తి సూత్రములు) జీవుడు కూడ చిద్రూపుడే అనుట వేదాంత సిద్ధాంతము. ఏమైనను చిత్ప్రతిబింబము లేని చిత్తము ప్రేతమే. పైగా చిత్తము అపంచీకృత భూతముల సాత్త్విక సమష్ట్యంశమునుండి జనించినది. సమష్టి లెక్కింపబడనిచో వ్యష్టి భూతములు పంచప్రేతములు తత్సమష్టిని విడిగా లెక్కించినచో ప్రేతము లాఱగును. సమష్టివ్యష్టుల భేదాభేదము శాస్త్రసమ్మతమే అగుటచే పంచప్రేతములు చిత్తముతో కలిసి షట్ప్రేతములు అని చెప్పుట ఈ **పరశమ్భు తంత్రములోని ప్రత్యేకత.** పరశమ్భువు యొక్క ఆసనము లాఱైనట్లే ఆయన శక్తులు కూడ ఆఱే. అవి పరా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, మాతృకా, కుండలినీ నామికలు. పరశమ్భు సాక్షాత్కార హేతువులు షడ్దర్శనములలో ఆయన సంచరించును. అవి ఆయన సంచరించు మార్గములుగా **'షడయనపథికః'** అను సమాసము చెప్పుచున్నది. సంచరించుటకు సాధనములు (కరణములు) పాదములు అవి మాత్రము మూడున్నవి. అవి సోమసూర్యాగ్ని రూపములు. సోమసూర్యాగ్నులు అగ్నియొక్క

త్రిభేదములు. అగ్నికి ఏడు నాలుకలుండును. కావున ఆయనకు **సప్తజిహ్వుడని** పేరు. కాంతిలోని సప్తవర్ణములే ఆ నాలుకలు. వాస్తవమునకు అగ్నికాని పరశమ్భువు అగ్నిగా ఆరోపింపబడి ఈ ప్రకరణమున స్తుతింపబడుచున్నాడు. వాస్తవమునకా పరశమ్భువు బ్రహ్మాగ్నిరూపుడు. బ్రహ్మమనగా చైతన్యము. **చిదగ్నికుండసంభూతా** అని అమ్మవారు చెప్పబడినది. శక్తి అగ్ని నిష్ఠము. అది అగ్నికి అభిన్నముగా భిన్నముగా కూడ వ్యవహరింబడును. బ్రహ్మము సృష్ట్యాదుల నొనరించిన పిమ్మట ఆ శక్తి ఆ బ్రహ్మమునం దున్నదని అనుమానింపబడును. ఈ అనుమానము దాని భిన్నతను సూచించును. సృష్ట్యాది కార్యములే లేని అవ్యవహార్య దశ యందలి ఆ బ్రహ్మమునకు శక్తి అభిన్నము. సంసారమున అగ్ని ప్రసిద్ధుడు. ఆతడు తన ఏడు నాలుకలతో ప్రపంచము నంతను దహించును. దృశ్యము నంతను దృక్కు తనకు నభిన్నముగా భావించుట చైతన్యాగ్ని యొక్క ప్రధానకృత్యము. అప్పుడుకాని పూర్తిగా దృశ్యోపసంహారము జరగదు. ప్రలయమునందు దహించి అగ్ని రుద్రుడుగా పేర్కొన బడుట వైదిక వ్యవహారమున నున్నట్టిదే. ఈ అర్థమును **విషయీభూత** శబ్దము వ్యంజింప జేయుచున్నది. పరశమ్భువు నందు అగ్న్యారోపము చేసినప్పుడు ధ్యానదృష్టికి పరశమ్భువు సులభగోచరుడగును, ఎంత సులభగోచరుడగు ననగా స్థూలవస్తువంత సులభగోచరుడు అగును. అంతమాత్రమున ఆతని ధ్యానము పూర్తి అయినట్లు కాదు. ధ్యానముచేయుట కాతని మహిమ ఇంకెంతయో ఉన్నది. ఆ పరశమ్భువును చీకట్లు చూపలేవు. పూర్ణజ్యోతిని కన్ను చూడలేదు. వస్తువులను కొన్నిటిని చూచుచున్నప్పుడు వానిలో కొంత అంధకార మున్నదని తెలియువలెను. అవి పూర్ణజ్యోతిరూపములు కావు అని గమనింపవలెను. వాస్తవమునకు కన్నుకూడ జ్యోతిలోని భాగమే. రూపము జ్యోతి యొక్క మరొకభాగము. ఇవి దృగ్దృశ్యములగుటలో అంధకారము కూడ కొంతసాయము చేసినది. వాస్తవమునకు పూర్ణాంధకార పూర్ణజ్యోతులు మాయాబ్రహ్మములు. వాని **వెలుగు నీడల సయ్యాట ఈ ప్రపంచక్రీడ.** అస్తు. వెలుగువలె చీకటి కూడ దర్శనసహకారి. కొన్ని జంతువులు గుడ్లగూబలు మొదలగునవి చీకటి ఎక్కువగా నున్నప్పుడే బాగుగా చూడగలుగును. పరశమ్భువు యొక్క యాథార్థ్యమును దర్శించుటకీ వెలుగులుకాని ఘనాంధకారములు కాని అసమర్థములు. వాని సాయమున పరశమ్భువును దర్శించుటకు మనమును అసమర్థలము. ఆ దర్శనమునకు చిదగ్నిజ్వలనమే సహకరించును. ఆ చిదగ్నిలోని దృగ్దృశ్యభేదోపసంహారరూపమే ఆ జ్వలనము. ఈ అంశము శ్లోకములోని నాల్గవ పాదము సూచించుచున్నది. ఇటనొక ప్రశ్నము పుట్టును. అంధకారము జ్యోతి ప్రతిద్వంద్విభావ ద్రవ్యమా? లేక భావ ప్రతిద్వంద్వి అభావరూప పదార్థమా?

నైయాయికులు వైశేషికులు తమస్సు తేజోఽభావరూపమే అని చెప్పగా, పూర్వమీమాంసకులు వేదప్రామాణ్యము ననుసరించి తమస్సును తేజఃప్రతిద్వంద్విభావపదార్థరూపద్రవ్యమని చెప్పిరి. అభావ పక్షమున అంధకారరూపమాయ అభావమే యై బ్రహ్మమున కద్వితీయత్వమును సంపాదించును. భావపక్షమున బ్రహ్మజ్ఞాన రూపతేజోఽన్యమైన కార్యనాశమైన ప్రాగభావము వంటి అనాదియు సాంతమునైన సత్తని గాని అసత్తనిగాని నిర్వచింపరాని పదార్థము. పూర్ణజ్యోతీరూపబ్రహ్మముకూడ సదసద్విలక్షణపదార్థము, లక్ష్యమైన పదార్థము.

**హృదయ ఖ వాయు వహ్నిక మహీమయప్రేత హరీంద్ర పీఠిపై**
**గదలనివాడవై షడయగా ప్రపథానుచరుండవై (షడు**
**క్తదయిత శక్తి భాసివయి (గ్రస్తసమస్తజగత్తువై) హిమాం**
**శు దినకరాగ్ని పాదివయి స్థూలుడవయ్యును ధ్యానదృష్టికిన్**
**మెదలవు చిమ్మచీకటులమీది వెలుంగుల కందవీశ్వరా!**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **తమోజ్యోతిరగమ్యుడని** చెప్పబడినది. ఈశ్లోకమున ఆతడు **మనోవాగగోచరుడని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఇత్యుక్తధ్యానచింత్యోప్యనవగతమనోవాక్ప్రవృత్తిస్వభావః**
**స్వచ్ఛందాత్మీయసత్తా చిదుచితవిభవః పావకః శమ్భురూపః।**
**సర్వాతీతస్వభావోఽ ప్యుపనిషదుదితజ్ఞానమీమాంస్యమానః**
**స త్వం యస్యాంతరంగే నివససి స శివస్త్వన్మయస్స్యాన్మహేశః ॥ 83**

**ప్రతిపదార్థము :** ఇత్యుక్త ధ్యాన చింత్యోపి = ఇట్లు చెప్పబడిన ధ్యానముచే చింతింప దగినవాడైనను, అనవగతమనోవాక్ప్రవృత్తిస్వభావః = తెలియరాని మనోవాక్కుల ప్రవృత్తియే స్వచ్ఛన్దాత్మీయసత్తా = స్వతంత్ర మైన ఆత్మీయమైన, చిదుచితవిభవః = సత్తకు చిత్తునకు తగిన వైభవము కల, శమ్భురూపః = శమ్భురూపమైన, పావకః = అగ్ని, సర్వాతీతస్వభావః అపి = అన్నిటికి అతీతమైన స్వభావము కలిగినదైనను, ఉపనిషదుదిత జ్ఞాన మీమాంస్యమానః = ఉపనిషత్తులలో చెప్పబడిన జ్ఞానమున విచారింపబడుచున్న, సః = ఆ, త్వమ్ = నీవు, యస్య = ఎవని యొక్క, అంతరంగే = అంతఃకరణమున, **నివససి** = నివసించెదవో, సః = వాడు, త్వన్మయః = తన్మయుడై, శివః = శివుడై మహేశః = మహేశుడై, చిన్మయః = చిన్మయుడై, స్యాత్ = ఉండును.

**తాత్పర్యము :** ఈ విధమున ధ్యానింపదగిన వాడైనను పరశమ్భువు మనోవాక్కుల ప్రవృత్తికి

అందని స్వభావముగలవాడు స్వతంత్రాత్మగుణములైన సత్త్వచిత్త్వములకు తగిన వైభవముగల శమ్భురూపాగ్ని సర్వాతీతస్వభావము గలదైనను ఉపనిషత్తులలో చెప్పబడిన జ్ఞానముతో విచారింపబడుచున్నదై ఎవరి అంతరంగమున నివసించునో ఆతడు శమ్భ్వగ్నిరూపుడై శివుడై మహేశ్వరుడై చిన్మయుడై వెలుగొందును.

**వివరణము :** ఎంతెంత స్థూలమగునో వస్తువు అంతంత ఎక్కువగా ధ్యేయమై ఉండును. వస్తువు సూక్ష్మమగుకొలది ధ్యేయత తగ్గిపోవు చుండును. రూపమున్న వస్తువు స్థూలము కావున దాని నొకపరి చూచి కనులు మూసికొన్న మనసుతో దానిని ధ్యానించుట సులభము. రూపములేని శబ్దము మాత్రమే యున్న వస్తువు నామరూపోభయమున్న దానికన్న సూక్ష్మమని చెప్పవలెను. ఒక్క నామమున్న దానికన్న నామరూపోభయము కల వస్తువు స్థూలమనుటలో విప్రతిపత్తి లేదు. అట్లే నామమున్నదానికన్న నామరూపోభయముకల వస్తువు కన్న సూక్ష్మము. శబ్దాదివిషయ పంచకముగల భూమి భూతములలో స్థూలతమము. దానికన్న శబ్దాది చతుష్టయముకల జలము సూక్షము. దానికన్న శబ్దాదిత్రయమున్న అగ్ని సూక్ష్మము, దానికన్న శబ్దస్పర్శములున్న వాయువు సూక్ష్మము. దానికన్న శబ్దమొకటే కల ఆకాశము భూతములలో సూక్ష్మతమము. అల్పసంఖ్యేంద్రియగ్రాహ్యవస్తువున కన్న అధిక సంఖ్యేంద్రియ గ్రాహ్యవస్తువు స్థూలము. అట్లే అధిక సంఖ్యేంద్రియ గ్రాహ్యవస్తువునకన్న అల్పసంఖ్యేంద్రియ గ్రాహ్యవస్తువు సూక్ష్మము. బాహ్యేంద్రియ గ్రాహ్యవస్తువు సూక్ష్మము. బాహ్యేంద్రియ గ్రాహ్య వస్తువున కన్న అంతరింద్రియ మాత్ర గ్రాహ్య వస్తువు సూక్ష్మము. అంతరింద్రియము మాత్ర గ్రాహ్య వస్తువునకన్న బహిరింద్రియ గ్రాహ్య వస్తువు స్థూలము. పరశమ్భువు అంతర్బహి రింద్రియోభయమునకు అగ్రాహ్యము అని **'యతో వాచో నివర్తంతే'** ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి. అంతరింద్రియమైన మనస్సు ఆత్మ (శమ్భు) విషయకవృత్తి వ్యాపృత కలిగి యుండుటచే శంకరులు శమదమాది సంస్కృత మనస్సు ఆత్మ స్వరూపోపలబ్ధికి కారణమని చెప్పియున్నారు. ఫలవ్యాప్యత లేదనుటతో పై శ్రుతి గతార్థమగును. 2. **పూర్వమీమాంసా శాస్త్రము** కర్మకాండ ప్రతిపాదకవేదార్థవిచారరూపము. బ్రహ్మకాండ ప్రతిపాదకోపనిషద్వి **చారముత్తరమీమాంసాశాస్త్రము**. దీనికే **వేదాంతశాస్త్రమని** నామాంతరము. సంహితా బ్రాహ్మణారణ్యకములు వైదికములైన శరీరమనోనిర్వర్త్యములైన (సాధ్య) కర్మల ప్రతిపాదించును. ఉపనిషత్తులు సిద్ధ బ్రహ్మ ప్రతిపాదకములు కావున ఈ శ్లోకమున **ఉపనిషదుదితజ్ఞాన మీమాంస్యమానుడుగా** పరశమ్భువు చెప్పబడినాడు. 3. చిదగ్నియైన శమ్భువును ఈ విధముగా పావకరూపమున ధ్యానించువా

డుపనిషదర్థమీమాంసయందు అధికారి యగును. వాని మనసున శివుడు నివసించును. అనగా వాని మనస్సుధ్యేయ శమ్భ్వాకృతిని పొందును. చిత్తము శమ్భ్వాకారాకారము నొనరింపగల సాధకుడు శివరూపుడగు ననుటలోగాని ఈశిత్వసిద్ధిని సంపాదించు ననుటలోగాని చివఱకాతడు జ్ఞానియే, మహేశ్వరుడే అగుననుటలో గాని విప్రతిపత్తి ఉండనక్కఱ లేదు.

**ఈవిధి చింత్యుడయ్యును వచింపగ నెంచగరానివాడె స్వే**
**చ్ఛావరణాత్మ సత్త నిగమాంత విచార్యుడు శమ్భురూపుడౌ**
**పావకు దేమనుష్యుని శుభమ్మగు చిత్తమునందు నుండునో**
**పావను డానరుండగును త్వన్మయుజీవును తన్మయుండవే.**

**అవతారిక :** పూర్వశ్లోకమున చింత్యుడైనను మనస్సున కందడు అను విరోధాభాసము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ఆ సంగతి ననుసరించి పరశమ్భువు నందు మరికొన్ని విరోధాభాసములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ శ్రీమానప్యాదిభిక్షుస్త్రిభువనజనకోఽప్యాత్మభూరాగమోక్తి-**
**వ్యాఖ్యావేద్యోఽప్యవాచ్యః ప్రకృతిసువిమలోఽప్యాత్మమాయావిలాసః ।**
**తత్త్వాదేకోఽ ప్యనేకః పరయువతిరతోఽప్యాత్మవిత్సేవ్యమాన-**
**స్తస్మాత్స్వచ్ఛందలీలస్త్వమిహ విజయసే మానసీమ్భావవృత్తిమ్ ॥ 84**

**ప్రతిపదార్థము :** శ్రీమాన్ అపి = సిరిగలవాడైనను, ఆదిభిక్షుః = మొదటి బిచ్చగాడు, త్రిభువనజనకః+అపి = ముల్లోకముల తండ్రియైనను, ఆత్మభూః = తనకు తానే జనించినవాడు, ఆగమోక్తి వ్యాఖ్యావేద్యః+అపి = వేదవాక్కుల వ్యాఖ్యానముతో తెలియదగిన వాడైనను, అవాచ్యః = వాచ్యుడుకానివాడు, ప్రకృతిసువిమలః+అపి = స్వచ్ఛ ప్రకృతి కలవాడైనను, ఆత్మమాయావిలాసః = స్వీయమాయా విలాసములు గలవాడవు, తత్త్వాత్ = తత్త్వము వలన, ఏకః+అపి = ఒక్కడైనను, అనేకః = అనేకుడు, పరయువతిరతః+అపి = పరస్త్రీలోలుడైనను, ఆత్మవిత్సేవ్యమానః = ఆత్మజ్ఞులచే సేవింపబడుచున్నవాడు, తస్మాత్ = అందువలన, స్వచ్ఛందలీలః = స్వతంత్ర లీలలుగల, త్వమ్ = నీవు, ఇహ = ఇచట, మానసీమ్ = మనసునకు సంబంధించిన, భావవృత్తిమ్ = ప్రేమ వ్యాపారమును, **విజయసే** = గెలుచుకొను చున్నావు.

**తాత్పర్యము :** పరశమ్భువు సిరిగలవాడైనను మొదటి బిచ్చగాడు, మూడు లోకముల

బుట్టించు వాడైనను తాను స్వయముగానే పుట్టువాడు, వేదోక్తి వ్యాఖ్యలతో తెలియబడు వాడైనను వాక్కులకందని వాడు, స్వచ్ఛప్రకృతి కలవాడైనను స్వమాయావిలాసముల ప్రదర్శించువాడు, తాత్త్వికముగా ఒక్కడైనను పెక్కుగా ఐనవాడు, పరస్త్రీలోలుడైనను ఆత్మజ్ఞులచే సేవింపబడు చున్నాడు, అందువలన స్వతంత్ర లీలలుగల ఆ పరశమ్భువు ప్రేమ వ్యాపారమును గెలుచుకొనుచునే యున్నాడు.

**వివరణము :** శ్రీ శబ్దము లక్ష్మి మొదలగు ముగురమ్మల బోధించును. శివుడు పార్వతీపతి. శ్రీ శబ్దము పార్వతీవాచకము కావున ఆ పరశమ్భువు శ్రీమంతుడు అయినను ఆతడు ఆది భిక్షువు. తొలిబిచ్చగాడు పెద్ద బిచ్చగాడు. **శ్రీమానప్యాదిభిక్షుః** అను పదములు పరశమ్భు గతమైన హరిహరైక్యమును బోధించును. పరశమ్భువు త్రిభువనములకు జనకుడు. త్రిభువనము లాయనచే జనింప జేయబడినవి. కావున ఆయనకు జన్యత ఉండకూడదు. కాని ఆ త్రిభువన రూపమున ఆయనయే తనకు తానే జన్మించినాడు కావున జన్య జనక భేదము త్రిభువనరూప పరశమ్భువు నందు కనిపించదు. పరశమ్భువు మాటల కందరాని వాడని శ్రుతియే చెప్పుచు ఆతనిని చెప్పకయే చెప్పుచున్నది. తత్త్వమసీత్యాది వేదవాక్యము యొక్క వాచ్యార్థము అనన్వితమే ఐనను ఆ వాక్యముయొక్క వ్యాఖ్యాతలు తత్త్వమసీత్యాది వాక్యమునకు లక్ష్యమైన అఖండబ్రహ్మరూపార్థమునందే తాత్పర్యము కలిగి యున్నదని వ్యాఖ్య చేసినారు. తత్త్వమసీత్యాది వాక్యవ్యాఖ్యావేద్యుడే యైనను పరశమ్భువు వాక్కులు లేనివాడే. ఆయన జ్ఞానమే గాని జ్ఞాతృజ్ఞానజ్ఞేయత్రిపుటిలోని విషయజ్ఞానరూపుడు కాడు. జాతిగుణ క్రియాది శబ్ద ప్రవృత్తిలేనివాడు. కావున ఆయన **అవాచ్యః** అని చెప్పబడినాడు. ఏవాక్కు చేతను ఆయన చెప్పరానివాడు. **అనుభూతి మూకము కావున అనుభూతి స్వరూపుడైన ఆతడు మాటలు లేని అనుభూతివలె మాటల చేత చెప్పరానివాడే ఐ యున్నాడు.** పరశమ్భువు స్వచ్ఛప్రకృతికలవాడు. త్రిగుణరహితుడు కావున గుణమాలిన్యము లేనివాడు. శుద్ధసత్త్వ రూపుడు కావున రజస్తమోమాలిన్యములు లేనివాడు. కల్యాణగుణములు కలవాడు కావున దోష (మాలిన్యము) ములు లేనివాడు. మాయలో ప్రతిబింబించిన బింబమునకు దర్పణ మాలిన్యము అంటనట్లు మాయయను ఉపాధి దోషముల నంటక బింబమువలె స్వచ్ఛుడై విమలుడై యున్నాడు. **'బహుస్యామ్'** అను బహుభవనరూపస్వసంకల్పము చేతనే ఒక్కడే అయ్యి పెక్కు అయినాడు. కావున తాత్త్వికముగా అనేకత్వము లేదు కావున ఆయన ఏకత్వమునకు భంగము కలుగదు. సంకల్పరూపమాయచేతనే బహుత్వము నందుటచే ఆ బహుత్వము మాయావిలాసమే కాని పరశమ్భుగతము కాదు. మాయాధిష్ఠానముకూడ

ఆతడే కావున మాయ మిథ్య కావున ఆ విలాసమంతయు ఆతనిదే యని భావించి **ఆత్మమాయావిలాస** అని పేర్కొనబడినాడు. పరయువతి అనగా పరాశక్తి. పరశమ్భువు పరయువతి రతుడనగా ఉత్కృష్టమైన పరయువతి పరాశక్తియందు ఆసక్తి గలవాడు. అంతేకాని పరస్త్రీ లోలుడుకాడు. పరశబ్దముచే శ్లేష ననుసరించి పరస్త్రీలోలుడని చెప్పబడినను ఈ రహస్యమెఱిగిన ఆత్మవేత్త లాతని సేవింపక మానుదురా? వారును స్త్రీ సంగము విడచినవారే. స్వస్త్రీసంగము విడచిన ఆ ఆత్మవేత్తలకు పరస్త్రీసంగము లేనేలేదు. ఉండనే ఉండదు. వారిచే సేవింపబడుచు వారికి ప్రభుడైన పరశమ్భువునకు పరస్త్రీ సంగమెట్లుండును. ఉన్నచో వారతనిని విడచివేయక సేవించెదరా? వారిచేతనే ఆతడు సేవింపబడుచున్నాడనగా ఆతడు వారి కాదర్శముగా నున్నాడని తన ప్రతిబింబముచేతనే ఆ మాయ ననుగ్రహించుటచే కొందఱు పరస్త్రీ లౌల్యముగా పురాణాదులలో దారుకావన విహారాది వృత్తాంతరూపమున వర్ణించినారని వారెఱుగరా? ఆ కథలలోని **పరస్త్రీలు మనోవృత్తిరూపులని వారెఱిగియే శివుని స్త్రీ సంగ రాహిత్యమున కాశ్చర్యపడి కైవల్యము నందుటకై కైవల్యానాథుడైన ఆతనిని ఆత్మవేత్తలు సేవించు చున్నారని** గమనింపవలెను. పరశమ్భువునకు విధి నిషేధములు లేవని, విధి నిషేధముల శాసించు వేదము లాతని ఆజ్ఞారూపము లని చెప్పుటచే ఆ కథలు ప్రవర్తిల్లినవి కాని యథార్థముగా ఆతడు పరస్త్రీ లౌల్యము కలవాడని చెప్పుటకు కాదు. ఇవి ఆ ప్రభువు యొక్క స్వచ్ఛందలీలలు. స్వచ్ఛంద లీలుడైన ఆతనిని సర్వులు ఆత్మరూపమున ఆతనిని ముఖ్యముగా జ్ఞానులు సేవించెదరు. కావుననే ఆతడు **మానసమైన ప్రేమవ్యాపారమును గెలుచుకొనుచున్నాడని** నాల్గవ పాదమున చెప్పబడినది.

**శ్రీపతి ఆదిభిక్షుకుడు సిద్ధవచోవిదితుండు వాక్కునన్**
**దోపనివాడు నిర్మలుడు దుస్తరమాయి యొకండనేకుడున్**
**హా! పరకామినీరతుడు ఆత్మవిదర్చితపాదుడున్ త్రిలో**
**కీ పితయున్ స్వయమ్భువుడు ఖేలనలన్ తలపుల్ జయించెడున్.**

* * *

## -- మహావిభూతి ప్రకరణమ్ --

**అవతారిక :** పై ప్రకరణమున పావక రూపమున శమ్భుని ధ్యానము చేయు ప్రకారము చెప్పబడినది. ఈ ప్రకరణమున ఆతని మహావిభూతి చెప్పబడుచున్నది. పై శ్లోకమున విరోధాభాసములకు నిలయమైన విరోధముల సమాప్తికి హేతువైన పరశమ్భువుయొక్క

మహావిభూతి ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున మహావిభూతి కాస్పదమైన ఆ పరశమ్భువు తప్ప మరేదియు ద్రష్టవ్యముకాదు, శ్రోతవ్యము కాదు, మంతవ్యము కాదు, ధ్యాతవ్యము కాదు. ఆ పరశమ్భువే **ద్రష్టవ్యుడు శ్రోతవ్యుడు మంతవ్యుడు ధ్యాతవ్యుడని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ద్రష్టవ్యస్త్వం జగద్భిర్బహువిధవిధిభిః సర్వసిద్ధాంతవాక్యైః**
**శ్రోతవ్యో నిర్వికల్పః శివగురువదనామ్భోరుహేణ ప్రబుద్ధః।**
**మన్తవ్యస్సర్వతత్త్వావకలితచరణస్సన్నిదిధ్యాసితవ్యః**
**సత్తామాత్రావలంబీత్యమరనుతపదో నాస్తి దేవస్త్వదన్యః॥ 85**

**ప్రతిపదార్థము :** బహువిధవిధిభిః = అనేక విధములైన విధములుగల, జగద్భిః = జగముల చేత, త్వమ్ = నీవు, ద్రష్టవ్యః = చూడదగినవాడవు, సర్వసిద్ధాంతవాక్యైః = అన్నిసిద్ధాంత వాక్యములచేత, శ్రోతవ్యః = వినదగిన వాడు, శివగురువదనామ్భోరుహేణ = శివగురు ముఖమున, నిర్వికల్పః = నిర్వికల్పుడుగా, ప్రబుద్ధః = తెలిసికొనబడి, మంతవ్యః = మననము చేయదగినవాడు, సర్వతత్త్వావకలితచరణః = సర్వతత్త్వములచే కూడిన పాదములు కలవాడుగా, సన్నిదిధ్యాసితవ్యః = ధ్యాతవ్యుడు, సత్తామాత్రావలంబి + ఇతి = సత్త మాత్రము నవలంబించువాడవని, అమరనుతపదః = దేవతలచే స్తుతింపబడిన పాదములుకల, త్వదన్యః = నీకంటే వేరైన, దేవః = దేవుడు, న **అస్తి** = లేడు.

**తాత్పర్యము :** లోకు లెట్టి విధుల నాచరించు వారైనను వారిచే చూడదగిన వాడవు నీవే. ఎన్ని సిద్ధాంతవాక్యముల వర్ణించువారు, బోధించువారైనను వారిచే నీవే వినదగిన వాడవు. గురువాక్యముచే నిర్వికల్పుడవని తెలిసినను వారిచే నీ మననమే చేయదగినది. సర్వతత్త్వములు పాదములుగా గల నీవే ఆ తత్త్వములచే నిర్మితులైన వారందఱిచేత నీవే ధ్యానింప దగిన వాడవు. నీవేమో సత్తా మాత్రము నవలంబించిన వాడవు అని దేవతలు నీ పాదములను స్తుతించెదరు. ఇట్టి దేవుడు నీకంటె వేరైన వాడు వాడు మరొకడు లేడు.

**వివరణము : 'ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'** అను శ్రుతి (ఉపనిషద్) వాక్యమీ శ్లోకమున వివరింపబడుచున్నది. ఈ వాక్యము విధి వాక్యమని కొందఱు, విధిచ్ఛాయా పన్న వాక్యము మాత్రమే అని మరికొందఱు ఈ వాక్య వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించి యున్నారు. ఈ సంసారమున ఎందఱో బ్రతుకుచున్నారు? ఎందుకు బ్రతుకుచున్నామో తెలియకయే బ్రతుకువారే పెక్కురు. వారి నుద్దేశించి **జీవనగమ్యమును నిర్దేశించు వాక్యమిది.** బ్రతుకునకు ప్రయోజనము ఆత్మను దర్శించుట. జీవనమును తత్ ప్రయోజనాభిముఖముగా

చేసికొనవలెను. **ఆత్మ దర్శనమే జీవిత ప్రయోజనము** కావలెను. దర్శనమునకు సాధనము తత్త్వమసీత్యాది వాక్యవిచారము శ్రోతవ్యః (వినదగినది) అను పదము విచారము చేయదగినది అని తెలుపును. ఆత్మజ్ఞానదార్ఢ్య హేతువులుగా మనననిదిధ్యాసములని కొందఱు, ఆత్మ దర్శనమునకే శ్రవణముతో పాటు సాధనములే అని కొందఱు చెప్పుచున్నారు. 2. శ్రుతి వాక్యములలో బహువిధవిధు లున్నవి. అపూర్వవిధి నియమవిధి పరిసంఖ్యావిధి విశిష్ట విధి అంగవిధి ఇత్యాదు లున్నవి. అట్టి వాని తాత్పర్యము మాత్రము ఆత్మ దర్శనమందే ఉన్నది. సర్వసిద్ధాంతవాక్యములకు బ్రహ్మదర్శనమందే తాత్పర్యమున్నది. వారు వైశేషికులో నైయాయికులో సాంఖ్యులో యోగులో మీమాంసకులో ఎవరైన నేమి ఆత్మదర్శన పర్యవసాయులైన సిద్ధాంతములే చేసియున్నారు. 3) సిద్ధాన్తమైన ఆత్మైక్యమే యుక్తులతో చింతించుట **మననమని** చెప్పబడును. గురువాక్యములు వేదసదృశములు. గురువు సిద్ధుడైనచో ఆయన ఉపదేశము అనర్హునికి సాధనాంతర శూన్యునకు సైతము ఆత్మదర్శనము కలిగించును. నిర్వికల్పమైన ఆత్మ ప్రతివాక్యములచే వికల్పింపజేయుట ఎట్లు? ఏమాట చెప్పినను ఏదో కల్పించినట్లే. నిర్వికల్పుడని చెప్పుటయు వికల్పమే. అయినను అట్లు చెప్పుట నిర్వికల్పిత అను వికల్పము చెప్పుట కాదు. వికల్పములు లేవని చెప్పుట కొఱకే అని గ్రహింపవలెను. నిర్వికల్పమైన ఆ ఆత్మ ప్రబోధము గురుముఖముననే శిష్యుల చిత్తములలో కలుగును. అప్పుడే వారిలోని బ్రహ్మము మేలుకొనును. **నేను జీవుని కాదు బ్రహ్మము నను జ్ఞానము కలుగును**. ఈ జ్ఞానమే ప్రబోధము. ఈ ప్రబోధము కలవాడే ప్రబుద్ధుడు. బుద్ధ శబ్దమునకు ప్ర అను ఉపసర్గమును చేర్చుట నాస్తిక బుద్ధవ్యావృత్తి కొఱకు. మందమధ్యమాధికారుల విషయమున వేదాంతగురువాక్యశ్రవణమాత్రముచే ఆత్మజ్ఞానానుభవము సిద్ధించదు. అట్టివారు మనననిదిధ్యాస లొనర్పవలెను. మననమనగా యుక్తలతో చింతనమని ఈ వఱకే చెప్పబడినది. ఆత్మకు వికల్పములు సిద్ధింపవనుటకు తగిన యక్తులనుద్భావించు మననము చేయవలెను. **'ఆత్మసంస్థమ్మనః కృత్వా న కించిదపి చింతయేత్** ' మనస్సు ఆత్మలో లీన మొనరించి తూష్ణీం భావము వహించుటయే **నిర్వికల్పనిదిధ్యాసము**. సర్వబ్రహ్మాండము పరశమ్భు రూపమని ధ్యానించుట సవికల్ప నిదిధ్యాసలలో శ్రేష్ఠమైనది. **సర్వతత్త్వావకలిత చరణః** అను సమాసము సర్వ తత్త్వావకలితసర్వబ్రహ్మాండము ఆయన యొక్క పాదమే అని చెప్పుచున్నది. ఆయనలోని పాదము ఇంత గొప్పది కాగా ఆయన ఇంకెంతయో మహనీయుడు అను ధ్యాన మీ సమాసమున చెప్పబడినది. ఇంతకు ఆ పరశమ్భువు సత్తా మాత్రుడుగానే దేవతలచే

స్తుతింపబడుచున్నాడు. దేవతలమాట యథార్థముగానే ఉండును. మనము కూడ ఆతని నట్లే ధ్యానించెదము గాక ధ్యానించుట చేతకానిచో స్తుతినైనను చేయుదము గాక!

**అవ్యయ! నీవునైకవిధమైన జగమ్ముల గుంపుచేత ద్ర**
**ష్టవ్యుడ వాప్తవాగుపనిషన్మత సిద్ధవచస్సుచేత శ్రో**
**తవ్యుడ వామహాగురుకృతప్రవికల్పవిహీనబోధ జ్ఞా**
**తవ్యుడ వచ్ఛమాచరణ తత్త్వమెటింగి యెటింగియున్ ప్రవ**
**క్తవ్యుడ వాత్త సత్తవు బుధస్తుత దేవుడ వీవొకండవే.**

**అవతారిక :** పై శ్లోకమున సగుణ నిర్గుణబ్రహ్మల ధ్యేయతా జ్ఞేయతలు శ్రోతవ్యతా మంతవ్యతలు ప్రధానముగా సగుణ బ్రహ్మధ్యేయత, నిర్గుణ బ్రహ్మ జ్ఞేయత సూచింపబడినవి. ఈ శ్లోకమున సగుణ బ్రహ్మ యొక్క మంతవ్యత ప్రధానముగా **మంత్ర జప మంత్రార్థధ్యాన పూర్వకముగా** వివరింపబడుచున్నది.

**శ్లో॥ ఉగ్రం శాంతం చ వీరం సకలమయమహావిష్ణుమగ్నిం జ్వలంతం**
**సర్వత్రానంతవక్త్రం నరమృగవపుషం భీషణం సర్వభద్రమ్ ।**
**సర్వజ్ఞం మృత్యుమృత్యుం బహువిధనుతిభిర్వందితం సర్వలోకై-**
**ర్విశ్వాహంకారబీజమ్పరమశివ! గురుం త్వాం భజే మంత్రరాజమ్ ॥ 86**

**ప్రతిపదార్థము :** ఉగ్రమ్ = ఉగ్రుడైన, శాంతమ్ = శాంతుడైన, వీరమ్ = వీరుడైన, సకలమయమహావిష్ణుమ్ = సర్వాత్మకుడు సర్వవ్యాపియైన, జ్వలంతమ్ = మండుచున్న, అగ్నిమ్ = అగ్నియైన, సర్వత్ర = అంతట, అనంతవక్త్రమ్ = అనంతముఖములుగల, నరమృగవపుషమ్ = నరుని యొక్క మృగము యొక్క శరీరములుగల, భీషణమ్ = భయంకరుడైన, సర్వభద్రమ్ = సర్వమంగళుడైన, సర్వజ్ఞమ్ = సర్వజ్ఞుడైన, మృత్యుమృత్యుమ్ = మృత్యువునకే మృత్యువైన, బహువిధనుతిభిః = అనేక విధములైన స్తోత్రములతో, సర్వలోకైః = సర్వలోకముల చేత, వందితమ్ = నమస్కరింపబడు, విశ్వాహంకార బీజమ్ = విశ్వమే నేనను అహంకారమునకు హేతువైన, పరమశివగురుమ్ = పరమశివ గురుడువైన, మంత్రరాజమ్ = మంత్రములకు రాజువైన, త్వామ్ = నిన్ను, **భజే** = సేవించెదను.

**తాత్పర్యము :** ఉగ్రుడు, శాంతుడు, వీరుడు, సర్వాత్మకమహావిష్ణువు, మండుచున్న అగ్నియునైన, అన్నిచోట్ల అనంతముఖములుగల, నరమృగశరీరధారియైన, భయంకరుడైన,

సర్వులకు మంగళముల నొసగునట్టి, సర్వజ్ఞుడువైన, మృత్యువునకే మృత్యువువైన, అనేక స్తోత్రములతో సర్వలోకములచే నమస్కరింపబడు విశ్వాహంకార హేతువైన పరమశివ గురుడవైన వాడవు, మంత్రరాజువునైన నిన్ను సేవించెదను.

**వివరణము : 'అణోరణీయాన్ మహితో మహీయాన్'** అను ఉపనిషద్వాక్యము పరస్పర విరుద్ధములైన అణీయస్త్వ మహీయస్త్వ ధర్మముల కాశ్రయయము పరబ్రహ్మమని చెప్పినది. అట్లే ఈ శ్లోకమున ఉగ్రత్వ శాంతత్వములను పరస్పర విరుద్ధధర్మముల కాశ్రయయముగా పరశమ్భువు చెప్పబడుచున్నాడు. అంతేకాదు. ఆయన వీరుడు. అనగా శూరుడు లేక మౌని లేక జ్ఞాని. ఆయన సర్వాత్మకుడు, సర్వవ్యాపియైన మహావిష్ణువే, మండుచున్న అగ్నియే, ఆయన ముఖము లనంతములు లేక ఆదిశేషునివలె పెక్కు ముఖములు కలవాడు. ఆ పరశమ్భువు నృసింహ స్వరూపుడు. కావున భయంకరుడు అయినను ఆయన సర్వ మంగళ స్వరూపుడు. అందరికి శుభముల కలిగించువాడు. ఆయన సర్వజ్ఞుడు. **'పాదోఽస్య విశ్వా భూతాని'** అని పురుషసూక్తమున చెప్పబడినట్లు సర్వతత్త్వములు ఆయన పాదరూపములు, అన్ని తత్త్వములు ఆయనలోని అంశములు మాత్రమే. మృత్యువునకు ఆతడు మృత్యువు. అనగా ఆయన మృత్యువును మ్రింగువాడు. అనగా శాశ్వతుడు. సమస్తలోకవాసులు బహువిధస్తుతులతో ఆయనను స్తుతించెదరు. నమస్క రించెదరు. విశ్వాహంకారరూపుడైన వైశ్వానరునకును ఆతడు హేతువైన హిరణ్యగర్భుడు లేక అవ్యాకృతుడు. ఆయన ప్రథమ శైవాచార్యుడు. ఆయన మంత్రములన్నిటికి ప్రభువు. శ్రేష్ఠమైన అఘోరవిద్యఅను మంత్రమునకు అర్థమైనవాడు. ఆ మంత్రమునకు ఆయనకు అభేదము. వాచ్య వాచకములకు అభేదము. శాస్త్రసమ్మతము.

**ఉగ్రుని శాంతు వీరు సక(లోన్నతు)లోత్తమ విష్ణుని మండునగ్ని సం**
**వ్యగ్రు ననంతవక్త్రు మృగమానుషదేహుని భీము భద్రునిన్**
**ప్రాగ్రసరున్ సమస్తవిదునైకవిధ స్తుతు మృత్యుమృత్యునిన్**
**జాగ్రదహంకృతిన్ గురుని శమ్భుని మంత్రపతిన్ భజింతు నిన్ (చెదన్).**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **మంత్రస్వరూపుడుగా** చెప్పబడినాడు. ఈ శ్లోకమున మంత్రార్థభావనారూపము, మానసధ్యానరూపము నైన యోగము నభ్యసించుట చేత సాధకునకు **యోగిత తదనంతరము బ్రహ్మత** సిద్ధించునని చెప్పబడుచున్నది.

శ్లో॥ **శమ్భో! త్వాం భూర్భువఃస్వర్మహరుదితతనుం త్వంతరిక్ష ద్యు సూర్యా-**
**ఙ్గారాచార్యేందుశుక్రార్కిభిరపి నిగమబ్రహ్మభిః ప్రోతశక్తిమ్ ।**
**ప్రాణాపానాదిభేదైః కలయతి సకలం మానసం ధ్యానయోగం**
**యేషాం తేషాం సపర్యా భవతి సురకృతా బ్రహ్మతా యోగితా చ ॥ 87**

**ప్రతిపదార్థము :** శమ్భో! = ఓశమ్భూ!, భూర్భువఃస్వర్మహః+ఉదితతనుమ్ = భూర్భువస్స్వర్లోకములచే నేర్పడిన శరీరము కల, అంతరిక్షద్యుసూర్యాఙ్గారాచార్యేందుశుక్రార్కిభిః = అంతరిక్షద్యులోకములు, సూర్యాంగారకబుధచంద్రగురుశుక్రశనులచేత, ప్రాణాపానాదిభేదైః = ప్రాణాపానాది భేదములచేత, నిగమబ్రహ్మభిః = నిగమాగమముల చేతను, ప్రోతశక్తిమ్ = వ్యాపించిన శక్తిగల, త్వామ్ = నిన్ను, యేషామ్ తు = ఎవరియొక్క, సకలమ్ = సకలమూ, మానసమ్ = మనస్సులోని, ధ్యానయోగమ్ = ధ్యానయోగము, **కలయతి** = సాక్షాత్కరించు కొనునో, తేషామ్ = వారికి, సురకృతా = దేవతలచే చేయబడిన, సపర్యా = సేవ, బ్రహ్మతా = బ్రహ్మత్వము, యోగితా చ = యోగిత్వమును, **భవతి** = అగును.

**తాత్పర్యము :** పరశమ్భువునకు భూర్భువస్వర్లోకములే శరీరావయవములు, అంతరిక్ష ద్యులోకములు సూర్యాది సప్తగ్రహములు ఆయన శక్తులు. నిగమాగమములు ఆయన ప్రాణాపానశక్తులు అని ఎవరి మానసధ్యానయోగము సాక్షాత్కరించుకొనునో వారికి దేవతలే సపర్య చేయుదురు. వారికి బ్రహ్మత్వము యోగిత్వమును సిద్ధించును.

**వివరణము :** పరశమ్భువునకు సువర్లోకము శిరస్సు, భువర్లోకము నాభి, భూలోకము పాదములు, అంతరిక్షద్యులోకములు అందలి గ్రహనక్షత్రములు ఆయన శక్తులు. నిగమాగమము లాయన ఊపిరి అనగా ప్రాణాపానరూపప్రాణశక్తి. ఇట్లు పరశమ్భువును ధ్యానించు వారికి మానస ప్రత్యక్ష మొనరించుకొను వారికి యోగిత్వమేమి బ్రహ్మత్వమే సిద్ధించును. బ్రహ్మను దేవతలందఱు సేవించెదరు గదా! అట్లే పరశమ్భు ధ్యానసిద్ధుని కూడ దేవతలు సేవించెదరు. ఇంద్రియములు ఆత్మను సేవించునట్లు దేవత లా యోగిని సేవించెదరు. అట్టి యోగికి సగుణబ్రహ్మప్రాప్తిరూపసాలోక్యాదిముక్తి గాని, నిర్గుణ బ్రహ్మకైవల్యము గాని సిద్ధించు ననుటలో ఆశ్చర్యమేమియు లేదు. అట్టి యోగిని సేవించిన వారికి సకల దేవతలను సేవించి నట్లగును.

**భాను శశాంక సౌమ్య గురు భౌమక వీనసుతాంతరిక్ష స**
**ద్యో నిగమాత్తశక్తి కలితు న్నిను శమ్భుని భూర్భువస్సువ**
**ర్యోనిమహిః శరీరు ౘబవనోద్ధతి మాన్పియు ధ్యానయోగ సం**
**ధానత గాంచువారికగు దైవత సేవయు బ్రహ్మయోగితల్.**

**అవతారిక :** పై శ్లోకమున వైయక్తిక మానస ధ్యానయోగ ప్రకారము తత్ఫలమును చెప్పబడినవి. ఈ శ్లోకమున సామూహిక ధ్యాన యోగ ప్రకారము **గాయత్రీ మంత్రము** వ్యాఖ్యానరూపమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ సర్వోత్కృష్టం పరం తత్సవితురనుపమం తే వరేణ్యం శరణ్యం**
**భర్గో దేవస్య ధీమహ్యభిదధతి ధియో యో న ఇత్యౌర్వతేజః ।**
**తుర్యం సర్వాణి భూతాన్యధిగతమమలం సర్వతో దృక్క్రమాద్యం**
**ధ్యాయామి ధ్యేయమంతఃకరణసునియతైర్యోగిభిః శ్రీమహేశ! ॥ 88**

**ప్రతిపదార్థము :** సర్వోత్కృష్టమ్ = అన్నిటికన్న గొప్పనైన, అనుపమమ్ = సాటిలేని, శరణ్యమ్ = శరణువేడదగిన, తత్ = ఆ, దేవస్య = ప్రకాశరూపుడైన, సవితుః = సూర్యుని యొక్క, వరేణ్యమ్ = శ్రేష్ఠమైన, భర్గః = తేజమును, యః = ఎవడు, నః = మా యొక్క, ధియః = బుద్ధులను, సర్వాణి భూతాని = అన్నిభూతములను అధిగతమ్ = వ్యాపించిన, అమలమ్ = నిర్మలమైన, తుర్యమ్ = నాల్గవదైన, సర్వతోదృక్ = సర్వ దర్శకమైన, యమ్ = ఏ, ఔర్వతేజః = బడబాగ్ని తేజమును, ఇతి = ఇత్యాదిగా, ధీమహి = ధ్యానించెదము, **అభిదధతి** = చెప్పెదరో, తమ్ = ఆ, అంతఃకరణసునియతైః = అంతఃకరణమునందు మిక్కిలి నిశ్చలత గలిగిన, యోగిభిః = యోగులతో కూడి, శ్రీమహేశ! = ఓ మహేశ్వరా! ధ్యేయమ్ = ధ్యానింపదగిన నిన్ను, ధ్యాయామి = ధ్యానించెదను,

**తాత్పర్యము :** ఎవడు మా బుద్ధులను ప్రేరేపించునో దేవుడైన ఆ సవిత యొక్క సర్వోత్కృష్టమైన సాటిలేని నాల్గవదైన బడబాగ్ని తేజో రూపమైన గొప్ప తేజమును ధ్యానించెదము అని చెప్పుచు అంతఃకరణమును నియమించు కొని యున్న యోగులతో కూడి ధ్యానింపదగిన నిన్ను ఓ మహేశ్వరా! ధ్యానించెదను.

**వివరణము :** గాయత్రీ మంత్రమున **ధీమహి** అను పదము కలదు. **అది బహు వచనాంతము.** సంధ్యోపాసనా సమయమున సూర్యతేజమును గృహములలోని ఉపనీత, గృహస్థ, వాన ప్రస్థులందఱు కలసి సాయమ్ ప్రాతః కాలములందు, మధ్యాహ్నమునను

ధ్యానింప వలెనను అంశమును ఆ బహువచనాంత పదము వ్యంజింప జేయుచున్నది. **వరేణ్య** శబ్దమును శరణ్యమ్, సర్వోత్కృష్టమ్, 'పరమ్' అను పదములు వివరించుచున్నవి. **భర్గ**శబ్దమును, తుర్యమ్ సర్వాణి భూతాని, అభిగతమ్, అమలమ్, ఔర్వతేజః అను పదములు వివరించు చున్నవి. **ధీమహి** అను శబ్దమును అంతఃకరణసునియతైః యోగిభిః, ధ్యేయమ్, ధ్యాయామి అను పదములు వివరించు చున్నవి. స్థూలశరీరాభిమాని వైశ్వానరాగ్ని, సూక్ష్మ శరీరాభిమాని హిరణ్యగర్భసూర్యాగ్ని, కారణశరీరాభిమాని అవ్యాకృతచంద్రాగ్ని, శరీర త్రయాభిమాన రహితతుర్యాగ్ని **ఔర్వతేజ** మని పిలువబడుచున్న బడబాగ్ని సంప్రదాయభేదమున సూర్యాగ్నియే అవ్యాకృతుడుగా, చంద్రాగ్నియే హిరణ్యగర్భుడుగా చెప్పబడును. ఈ అగ్ని త్రయమునకు బదులుగా గార్హపత్యము ఆహవనీయము దక్షిణము అను అగ్ని త్రయము గ్రహింపబడును. తుర్యాగ్ని మాత్రము ఔర్వతేజమే. గాయత్రీ మంత్రములలోని మూడు పాదములు భూర్భువస్సువర్లోక రూపములు. అనగా స్థూల సూక్ష్మ కారణ శరీరరూపములు గాయత్రీ పాదత్రయము యొక్క సమష్ట్యర్థము. తుర్యమైన పరబ్రహ్మము భృగువంశీయులు ఔర్వ చ్యవన జమదగ్న్యాదులు అగ్ని స్వరూపులని పురాణకథల పరిశీలనము వలన తెలియును. భర్గ శబ్దము భృగుశబ్దము వలె భృజ్ ధాతు నిష్పన్నము. వైశ్వానర, హిరణ్యగర్భావ్యాకృతులు వారి వారి శరీరాభిమానముల ననుసరించి వేఱు వేఱైనను వాఱందఱు వాస్తవమున తుర్యాగ్ని రూపులే అనగా ఉపాధులైన శరీరములను తొలగించి నప్పుడు వారు కేవలాత్మ స్వరూపులే. అహవనీయ గార్హపత్య దక్షిణములను అగ్నులు ఉపాధిభేదముచేతనే భిన్నములు. వానిలోని అగ్ని ఏక రూపమే.

**తత్సవితుర్వరేణ్యమని తావకదైవిక భర్గమున్ విని**
**ర్మత్సరతన్ దలంచెదము మామతుల న్నడిపింపుమంచు న**
**త్యుత్సుక సర్వభూతమయ యోగులచే నిరతమ్ము ధ్యేయ మా**
**చిత్సుఖతుర్య నిర్మలము శ్రీశివతేజము నే దలంచెదన్.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు **గాయత్రీ మంత్ర శబ్దముల అర్థము యొక్క వివరణము ద్వారమున** ధ్యానింపబడినాడు. ఈ శ్లోకమున ఆతడు **కాలస్వరూపుడని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కాలోఽనంతోఽయమాత్మా శివ! దివసనిశాపక్షమాసాస్తథాబ్దాః**
**తద్భేదాః షదృతుస్థాస్తదనుగతజగత్సర్వవృత్తాంతభేదాః ।**

**నానాయజ్ఞక్రియాశ్చ త్రిదశదితిసుతా మానుషాస్సర్వనాగా**
**యోగీంద్రా జీవసంఘాస్తవ చరణబిలే యాంతి జన్మాంతమధ్యాన్ ॥ 89**

**ప్రతిపదార్థము :** అనంతః = అంతములేని, అయమ్ = ఈ, ఆత్మా = ఆత్మ, కాలః = కాలము, శివ! = ఓ శివా!, దివసనిశాపక్షమాసాః = పగళ్ళు రాత్రులు పక్షములు మాసములు, తథా = అట్లే, అబ్దాః = సంవత్సరములు, షడృతుస్థాః = ఆఋఋతువుల యందలి, తద్భేదాః = వాని భేదములు, తదనుగత జగత్సర్వవృత్తాంతభేదాః = వాని ననుసరించిన అన్ని వృత్తాంతములు భేదములు, నానాయజ్ఞక్రియాః చ = అనేక యజ్ఞక్రియలును, త్రిదశదితిసుతాః = దేవరాక్షసులు, మానుషాః = మనుష్యులు, సర్వనాగాః = అందఱు నాగులు, యోగీంద్రాః = యోగీశ్వరులు, జీవసంఘాః = జీవ సమూహములు, తవ = నీయొక్క, చరణబిలే = చరణబిలమున, జన్మాంత మధ్యాన్ = ఆద్యంతమధ్యావస్థలను, **యాంతి** = పొందుచున్నవి.

**తాత్పర్యము :** ఈ ఆత్మస్వరూపపరశమ్భువు కాలస్వరూపుడు కూడ. కాలభేదములైన దినరాత్రులు, పక్షములు, మాసములు, షడృతువులు, సంవత్సరములు, వాని వలన కలుగు ఋతువులలోని భేదములు, వాని ననుసరించిన జగద్వృత్తాంత భేదములు, అనేక యజ్ఞక్రియలు దేవ రాక్షస నాగులు, యోగీంద్రులు మొదలైన జీవసంఘము నీ చరణబిలమున జన్మ స్థితి లయముల నొందుచున్నవి.

**వివరణము :** నిమేషములు, గడియలు, దినరాత్రులు, వారములు, పక్షములు, నెలలు, ఋతువులు, అయనములు, సంవత్సరములు, యుగములు, కల్పములు ఇత్యాది విభాగము లెన్నో అనంతకాలమున చేయబడినవి. కాలమందెట్లు విభాగములు కల్పింపబడివో ఆత్మయందు బహువిధభేదములు కల్పింపబడినవి. విభాగములతో సహా కాలము కూడ ఆత్మ యందు కల్పింపబడినదే. కల్పితము కల్పకాభేదమును కలిగియుండును. ఆత్మ యందు దేవరాక్షస నాగ మానుషాది జీవభేదములు కల్పితములై యున్నవి. **షడృతుస్థాః** అను సమాసము లోని 'ష' అను అక్షరము లఘువే యైనను దానియందు ఆర్షప్రయోగానుగుణమైన గురుత్వమును అంగీకరింపవలసి యున్నది. లేనిచో ఛందో భంగ మగును. **'అపి మాషమ్మషంకార్యా చ్ఛందో భంగం నివారయేత్'** అనునది ఆర్యోక్తి.

**పగలును ఱేలు మాసములు పక్షములున్ ఋతువుల్ శరత్తులున్**
**యుగములు నానసంతగతులొందిన కాలము తద్భిదాఖిలా**

**నుగత సులోకవృత్తము మనుష్యసురాసుర నాగ యోగి జీ**
**వగణము యజ్ఞకర్మములు త్వచ్చరణాగ్రబిల ప్రవృత్తులే.**

**అవతారిక :** పై శ్లోకములో దిన రాత్ర్యాది కాలభేదములు ప్రస్తావింపబడినవి. ఈ శ్లోకమున భూతభవిష్యద్వర్తమాన కాల భేదములు ప్రస్తావింపబడు చున్నవి.

**శ్లో॥ భూతమ్భవ్యమ్భవిష్యత్త్రిభువనభవనం షణ్మహాశక్తిభిస్త్వం**
**తత్సర్వం వ్యశ్నువానో విచరసి కలితః సృష్టిగత్యంతకామైః ।**
**దేవై ర్దైత్యై ర్మనుష్యైరురగపతికులైస్సర్వజీవప్రసారై-**
**రాత్మీయైశ్చిత్రితాంగః శివ! భవతమసః సూర్యభాస్త్వమ్పరస్తాత్ ॥ 90**

**ప్రతిపదార్థము :** శివ = ఓ శివ!, తత్ = ఆ, భూతమ్ = గడచిన, భవ్యమ్ = వర్తమానమైన, భవిష్యత్ = రాబోవు (కాలము), సర్వమ్ = మొత్తము, త్రిభువనభవనమ్ = త్రిభువన మను భవనమును, షణ్మహాశక్తిభిః = ఆఋమహాశక్తులచేత, వ్యశ్నువానః = వ్యాపించుచున్నవాడవైన, సృష్టిగత్యంతకామైః = సృష్టి స్థితిలయేచ్ఛలతో, కలితః = కూడిన వాడవై, విచరసి = తిరిగెదవు, త్వమ్ = నీవు, ఆత్మీయైః = తనకు సంబంధించిన, దేవైః = దేవతలచేత, దైత్యైః = రాక్షసులచేత, మనుష్యైః = మనుష్యులచేత, ఉరగపతికులైః = సర్పరాజ కులముల చేత, సర్వజీవ ప్రసారైః = సర్వజీవ ప్రసారముల చేత, చిత్రితాంగః = చిత్రింప బడిన దేహముకల వాడవై, భవతమసః = సంసారాంధకారము యొక్క, పరస్తాత్ = ఆవలనున్న, త్వమ్ = నీవు, సూర్యభాః = సూర్యుని వంటి కాంతిగల వాడవు,

**తాత్పర్యము :** పరశమ్భువు తన ఆఋ మహాశక్తులతో భూతభవిష్యవర్తమాన త్రిభువన భవనము లన్నింటిని వ్యాపించి యున్నాడు. ఆతనియందు సృష్టిస్థితిలయేచ్ఛలతో దేవదైత్యమనుష్యనాగాది సర్వజీవుల ప్రసారములతో చిత్రింపబడిన శరీరము లున్నవి. ఆతడు సంసారాంధకారము యొక్క ఆవల నున్న సూర్యకాంతివంటి కాంతి గలవాడు.

**వివరణము :** సర్వజ్ఞత, నిత్యాత్మాలోపము, అనాది బోధము, స్వతంత్రత, తృప్తి, ఆనంత్యము అను ఆఋ లేక పరా, ఇచ్ఛ, జ్ఞప్తి, క్రియా, కుండలినీ, మాతృకా అను ఆఋ మహాశక్తులతో భూతభవిష్యద్వర్తమానకాలములలోని త్రిభువనములను పరశమ్భువు సూర్యుడు కాంతితో జగమును వ్యాపించునట్లు వ్యాపించును అను ఉపమాలంకార మీ శ్లోకమున ధ్వనించుచున్నది. 2. దేశమునకు కాలమునకు గాని పరిచ్ఛేదము లేదు. వానివలన ఇతర వస్తువులకు పరిచ్ఛేదమున్నది. దేశకాలపరిచ్ఛేదములేని దాత్మ అని చెప్పబడును.

పరిచ్ఛేదరహిత దేశమున ఎన్ని బ్రహ్మాండములు వర్తమాన కాలమున నున్నవో చెప్పజాలము. అట్లే భూతకాలమున ఎన్ని బ్రహ్మాండములు పుట్టిగిట్టినవో చెప్పజాలము. అట్లే రాబోవు కాలమున ఎన్ని బ్రహ్మాండములు పుట్టిగిట్టునో యెఱుగము. ఈ శ్లోకమున భూత వర్తమాన భావి బ్రహ్మాండము (త్రిభువనము)లు చెప్పబడినవి. ఏకవచనమున నున్నను జాత్యేకవచనమది. కావున పై యర్థము లభించును. 3. ఊహకందని బ్రహ్మాండ బాహుల్యము అను భావమును విడచి ఒక బ్రహ్మాండమును గ్రహించినప్పుడు దాని నెందఱో రాక్షసమనుష్యదేవనాగాది సర్వజీవ ప్రసారమం దుండునని గ్రహింప వలెను. అది యెచట నున్నది? పరశమ్భువు దేహమందే అనగా త్రిభువనభవనమందే చిత్రింపబడి యున్నది. ఆ జీవులందఱు పరశమ్భువున కాత్మీయులు. త్రిభువన భవనపు గోడలు జడములు. ఆ జడముల పై జీవ వర్ణములు ప్రసృతములై యున్న ఉత్ప్రేక్షణ మీ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది.

**భూతభవద్భవిష్యమగు ముజ్జగమున్ భవనమ్మునందు ది**
**వ్యాతత శక్తి షట్కము లనంత భజించుచు వే చరించెదు**
**ద్భూతిగతిప్రణాశ మితుల న్బుధదైత్యనృనాగనైజభా**
**వ్రాత విచిత్రితాంగుడగు భానుడ వీవు భవాంధ్యరాశికిన్.**

**అవతారిక :** పై శ్లోకమున దృశ్యమైన త్రిభువనభవనము చెప్పబడినది. ఈ శ్లోకమున తద్ద్రష్ట యొక్క భేదములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ శ్రోతా స్పర్శీ చ ద్రష్టా నిజరసరసికః సర్వగంధాంతరజ్ఞం**
**వక్తా కర్తా చ గంతా త్రిభువన! భవతో విశ్వసర్గః ప్రమోదీ ।**
**కామీ మీమాంసకశ్చ ప్రథితశుచిశిఖాసప్తకవ్యాప్తవిశ్వో**
**బోద్ధా స్వార్థానంతానధిగతచరణః సర్వతస్త్వం శివోఽసి ॥ 91**

**ప్రతిపదార్థము :** త్రిభువన! = ఓ త్రిభువన రూపుడా!, త్వమ్ = నీవు, శ్రోతా = వినువాడవు, స్పర్శీ = స్పృశించువాడవు, ద్రష్టా = చూచువాడవు, నిజరసరసికః = స్వరసమునందు రసికుడవు, సర్వగంధాంతరజ్ఞమ్ = సమస్త గంధములలోని భేదమును ఎఱుగువాడవు, వక్తా = మాట్లాడువాడవు, కర్తా = చేయువాడవు, గంతా = పోవు వాడవు, భవతః = నీ నుండి, విశ్వసర్గః = ప్రపంచముయొక్క సృష్టి, (భవతి = జరుగును), ప్రమోదీ = సంతోషించువాడు, కామీ = కాముకుడవు, మీమాంసకః చ = మీమాంసకుడవును,

ప్రథిత శుచిశిఖాసప్తక వ్యాప్త విశ్వః = ప్రసిద్ధమైన ఏడు అగ్ని జ్వాలలచే వ్యాపించిన విశ్వము కలవాడవు, అర్థాన్ = విషయములను, బోద్ధా = తెలిసికొనువాడవు, అనంతానధిగతచరణః = అనంతునిచే అందుకొనబడని పాదములు గలవాడవు, సర్వతః = అన్నిదిక్కుల నుండి, శివః + అసి = మంగళ కారుడవై ఉన్నావు.

**తాత్పర్యము :** ఓ త్రిభువనస్వరూపా! నీవే ద్రష్టవు. శ్రోతవు, స్పర్శివి, రసాస్వాదివి, సర్వగంధాఘ్రాతవు, కామివి, ప్రమోదివి, మీమాంసకుడవు. ఏడు అగ్ని జ్వాలలచే సమస్త విశ్వమును నింపిన వాడవు. సర్వార్థ జ్ఞాతవు. వక్తవు, గంతవు, కర్తవు, అనంతుడు సైతము నీ చరణముల నందు కొనజాలడు. అన్ని దిక్కులనుండి మంగళముల కలిగించు వాడవు.

**వివరణము :** ఇంద్రియములు జ్ఞానకరణములు. జ్ఞానసాధనములు. వానిద్వారా జీవునకు ఆయా విషయముల జ్ఞానము కలుగును. ఆ జీవుడు శివాభిన్నుడు. కావున శివుడే అన్ని విషయముల జ్ఞాత. శివుడు శివాభిన్నుడు కావున శివుడే అన్ని విషయముల జ్ఞాత. శివునకు భిన్నముగా జీవుడను వాడు లేడు కావున జీవుడు జ్ఞాత అని చెప్పక శివుడే జ్ఞాత అని ఈ శ్లోకమున చెప్పబడినది. స్థూలముగ శబ్దమొక విషయముగనే కన్పడినను ఆ శబ్దమున అనేక భేదము లున్నవి. ఆ భేదములను కూడ జ్ఞాత ఎఱుగును. అట్లే గంధవిశేషములను రసవిశేషములను, స్పర్శవిశేషములను జ్ఞాత ఎఱుగును. **'భవతః విశ్వసర్గః'** అను వాక్యమునకు అర్థముగా పర్యవసించును. అనంతాదులు సర్వజ్ఞులుగా లోకమున కీర్తిగన్నవారు. వారుకూడ నీ పాదముల నెఱుగరు. అనగా నీవు జ్ఞాతవే కాని జ్ఞేయుడవు కావు అనునది పర్యవసన్నార్థము. వాస్తవమునకు మనః ప్రతిబింబితమైన ఆత్మకే శ్రోతృత్వాదులు సిద్ధించును. బిందుభూతుడైన ఆత్మయందు అనగా శివునందు అవి ఆరోపితములే. వక్తా, గన్తా అనుపదములు కర్మేంద్రియములు. కర్మేంద్రియములద్వారా కర్మల నొనర్చు వాడు అను అర్థము నొసగును. మీమాంస యనగా పూజ్యవిచారము దాని నొనర్చునది మనస్సు. దాని ద్వారా విచారణ మొనర్చు వాడు కూడ శివుడే. పరశమ్భువు అగ్నిరూపుడని ఈ వఱకు చెప్పబడినది. అగ్నికి సప్తజిహ్వుడు (ఏడు నాలుకలు గలవాడు) అను పేరు కలదు. అది ప్రసిద్ధము. ఆ ఏడు నాలుకలచే ప్రలయకాలమున జగమును మ్రింగివేయును. స్థితికాలమున తన భేదములైన సూర్యతారాదుల ద్వారమున లోకమునకు వెలుగు నొసంగు వాడాతడే.

**శ్రోతవిలోకి స్పర్శి రససూచియు గంతయు వక్త కర్తయున్**
**ఘ్రాత విసర్గి మోదియును గామియు మంతయు నగ్ని సప్తజి**

హ్వాతత విశ్వమూర్తియు ననంత నిజార్థ మహాప్రపంచ వి
జ్ఞాతయు సర్వతోధిగత సచ్చరణాత్మ శివ స్వరూపమౌ.

**అవతారిక :** పై శ్లోకమున శివునందు శ్రోతృత్వాదులు కొన్ని ధర్మములు చెప్ప బడినవి. ఈ శ్లోకమున మఱికొన్ని ధర్మములు ఆతని యందు చెప్పబడు చున్నవి.

**శ్లో॥ సర్వార్థీ సర్వనామా సకలకులపతిః సర్వలోకాంగనేశః**
**శృంగారీ సర్వభోగీ నవరసరసికః ప్రాజ్యసామ్రాజ్య భోక్తా ।**
**త్రైలోక్యే వాక్ప్రపంచే ప్రవచనముదితః సోమయాజీ చ యజ్ఞః**
**సంచారీ కామచారీత్యనువదతి జనో య స్స ధన్య స్త్వమేవ ॥ 92**

**ప్రతిపదార్థము :** శివ = ఓ శివా!, సర్వార్థీ = అన్నింటిని కోరువాడవు, సర్వనామా = అన్ని పేర్లుకలవాడవు, సకలకులపతిః = అన్నివిద్యాసంస్థల అధిపతివి, సర్వలోకాంగనేశః = అన్నిలోకములలోని స్త్రీలకు భర్తవు, శృంగారీ = శృంగారివి, సర్వభోగీ = అన్ని భోగములు కలవాడవు, నవరసరసికః = తొమ్మిది రసముల నాస్వాదించు వాడవు, ప్రాజ్య సామ్రాజ్య భోక్తా = విశాల సామ్రాజ్యము నేలు వాడవు, త్రైలోక్యే = లోక త్రయము నందు, వాక్ప్రపంచే చ = శబ్దప్రపంచము నందును. ప్రవచనం + ఉదితః = ప్రవచనములలో చదువబడిన వాడవు, సోమయాజీ = సోమయాజివి, యజ్ఞః చ = యజ్ఞస్వరూపుడవును, సంచారీ = సంచారివి, కామచారీ = కామచారివి, ఇతి = అని, యః = ఏ, జనః = జనుడు, **అనువదతి** = మాట్లాడునో, సః = ఆ, ధన్యః = ధన్యుడవు, త్వమ్ ఏవ = నీవు.

**తాత్పర్యము :** అన్నింటిని (అర్థములను) కోరువాడు లేక అన్ని అర్థములు కలవాడు, అన్నిపేర్లుకలవాడు, అన్ని గురుకులములకు అధిపతి, అన్నిలోకములలోని స్త్రీలకు భర్త, శృంగారి, అన్ని భోగములు కలవాడు, తొమ్మిది రసముల నాస్వాదించువాడు, విశాల సామ్రాజ్యము నేలువాడు, మూడులోకము లందును, వాక్ప్రపంచము నందును ప్రవచనముచే చదువబడినవాడు, సోమయాజి, యజ్ఞమును అయిన వాడు, చక్కగా తిరుగువాడు, స్వేచ్ఛగా తిరుగు వాడును, అని ఏ జనుడనువదించునో వాడును నీ స్వరూపమే.

**వివరణము :** అన్ని అర్థములు కోరినంతనే ఎవనికి లభించునో ఆ సర్వార్థి పరశమ్భువే. ఆతడు అన్ని పేర్లు కలవాడు. అన్ని గురుకులములకు విద్యాసంస్థలకు ఆతడే అధిపతి. సమస్తలోకములలోని స్త్రీ లందఱికిని ఆతడే అధిపతి. శృంగారి ఈ అంశము యొక్క నిరూపణము కొంత శ్రీ కృష్ణావతారమున జరిగినది. సర్వభోగములును ఆతని కున్నవి.

అన్ని భోగములను ఆతడనుభవించును. రసములు తొమ్మిది. వాని నన్నింటి నాత డాస్వాదించును. విశాలమైన అనగా సర్వలోక రూపమైన సామ్రాజ్యము నాతడేలును. అందఱిపై ఆతని అధికారము చెల్లును. తన ఏలుబడిలోని దేనినైనను తన కిష్టము వచ్చిన తీరున నడచునట్లుచేయగలడు. మూడు లోకముల చదువులన్నియు ఆతనినే చెప్పును. తత్ప్రపంచప్రతిపాద్యు డాతడే, సోమ యాగము చేయువాడును, ఆతనిచే చేయబడు యజ్ఞమును ఆతడే, చక్కగా తిరుగువాడని స్వేచ్ఛగా తిరుగువాడు అని ఎవనిని గురించి జనుడు మాట్లాడునో ఆ జనుడును పరశమ్భువే.

**సర్వమహార్ధి సర్వకులశాసకమూర్తియు సర్వకాముఁడున్**
**సర్వజగత్సతీపతియు సర్వరసాదియు సర్వభోగియున్**
**సర్వజనేశ్వరేశ్వరుడు, సర్వవచఃపతి యజ్వ యజ్ఞమున్**
**చర్విత కామి సంసరణ శాలియు నా నిను బల్క ధన్యుడౌ.**

**అవతారిక :** పై శ్లోకమున కొన్ని ధర్మములు చెప్పబడినవి. ఈ శ్లోకమున మరికొన్ని ధర్మములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ క్షేత్రం క్షేత్రప్రమాతా శివగురువదనాఘోరవిద్యాధిదేవో**
**మంత్రో మంత్రాధిదేవో మఖవిధిరనఘో యాగయోగ్యః పదార్థః ।**
**త్వం దర్శః పూర్ణమాసః పరిధిరపి మఖాచార్యవర్యశ్చ హోతో-**
**ద్గాతాధ్వర్యుశ్చ హవ్యం త్రివిధహుతవహస్త్వాం వినా నాస్తి శమ్భో! ॥ 93**

**ప్రతిపదార్థము :** శమ్భో = ఓ శమ్భూ! క్షేత్రమ్ = క్షేత్రమవు, క్షేత్రప్రమాతా = క్షేత్రజ్ఞుడవు, శివగురు వదనాఘోరవిద్యాధిదేవః = శివగురుముఖము నుండి వెలువడిన అఘోరవిద్య యొక్క అధిదేవతవు, మంత్రః = మంత్రమవు, మంత్రాధిదేవః = మంత్రాధి దేవతవు, అనఘః = శుద్ధమైన, మఖవిధిః = యజ్ఞవిధివి, యాగయోగ్యః = యాగమునకు దగిన, పదార్థః = పదార్థమవు, త్వమ్ = నీవు, దర్శః = దర్శేష్టివి, పూర్ణమాసః = పూర్ణమాసేష్టివి, పరిధిః + అపి = పరిధివి, మఖాచార్యవర్యః చ = యజ్ఞాచార్యవర్యుడవును, హోతా = హోతవు, ఉద్గాతా = ఉద్గాతవు, అధ్వర్యుః = అధ్వర్యుడవు, హవ్యమ్ = హవ్యమవు, త్రివిధహుతవహః = త్రివిధాగ్నివి, త్వామ్ = నీవు, వినా = లేక, నఅస్తి = లేదు.

**తాత్పర్యము :** నీవే శివగురుముఖమునుండి వెలువడు అఘోరవిద్యాధిదేవతవు. నీవే మంత్రమవు. మంత్రాధి దేవతవు. యాగవిధివి నీవే. యాగయోగ్య పదార్థమును నీ

స్వరూపమే. నీవే దర్శేష్టివి. పూర్ణమాసేష్టివి. పరిధివి నీవే. మఖాచార్యుడవు నీవే. హెూతవు, ఉద్గాతవు, అధ్వర్యుడవు కూడ నీవే. త్రివిధాగ్నివి నీవే. నీవు కానిది లోకమున ఏమియును లేదు.

**వివరణము :** క్షేత్రక్షేత్రజ్ఞులు,హవిర్హోతలు, మంత్రమంత్రాధిదేవతలు భిన్నులనుటలోక ప్రసిద్ధము కాని ఉపనిషత్సిద్ధాంతము ననుసరించి అన్నియు నీవే. నీ కన్న భిన్నమైన దేదియులేదు. ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము అను పేర్లు గల అగ్నులు మూడును నీవే అయి ఉన్నావు. **హెూత ఋగ్వేదము చదువుచు హెూమము చేయును. అధ్వర్యుడు యజుర్వేదము చదువుచు యాగకర్మ నిర్వహించును. ఉద్గాత ఉచ్చైస్వరమున సామమును చదువును.** మఖాచార్యుడైన బ్రహ్మ పై మూడు వేదములనేకాక అథర్వ వేదము నెఱిగినవాడై ఉండవలెను. ఈ చతుర్విధ ఋత్విక్కులును పరశమ్భువే.

**క్షేత్రము క్షేత్రవేది గురు సిద్ధముఖోద్గత విద్య దేవుడున్**
**సత్రము మంత్రమున్ పరిథి సత్రవిధానము మంత్రదేవుడున్**
**పాత్రము హెూతయున్ ద్రివిధవహ్నియు దర్శయు పూర్ణమాసయున్**
**సత్రగురుండు హవ్యమును శమ్భుడ నీకితరమ్ము నెద్దియా.**

**అవతారిక :** పై శ్లోకమున **క్షేత్ర క్షేత్రజ్ఞులు** పరశమ్భువే అని చెప్పబడినది. ఈ శ్లోకమున **క్షేత్ర క్షేత్రజ్ఞ భేదములు** అన్ని పరశమ్భువే అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ క్షేత్రజ్ఞాః సర్వదేవాః సురవరభుజగాస్సర్వజీవాశ్చ తచ్చ**
**క్షేత్రమ్బ్రహ్మాండరూపం త్రిభువనభవనం వ్యాపకం చిత్రరూపమ్ ।**
**ఏతావద్వ్యాప్య తత్ర స్థితమఖిలజగద్భక్తం భోక్తారమగ్నిం**
**జ్ఞాత్వా షట్ఛక్తిభిస్త్వాం పరమశివ! మహామృత్యుమత్యేతి విద్వాన్ ॥ 94**

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరశమ్భూ!, క్షేత్రజ్ఞాః = క్షేత్రజ్ఞులైన, సర్వదేవాః = సమస్తదేవతలు, సురనర భుజగాః = దేవయోని విశేషములైన భుజగులు మనుష్యులు, సర్వజీవాః = జీవులందఱు, తత్ = ఆ, క్షేత్రమ్ = క్షేత్రమైన, బ్రహ్మాండరూపమ్ = బ్రహ్మాండరూపమైన, త్రిభువన భవనమ్ = త్రిభువనమను భవనమును, వ్యాపకమ్ = వ్యాపించిన, చిత్రరూపమ్ = చిత్రరూపమైన, ఏతావత్ = ఇంతవరకును, వ్యాప్య = వ్యాపించి, స్థితమ్ = నిలచిన, అఖిల జగద్భక్తమ్ = సర్వజగద్రూపమైన అన్నమును, భోక్తారమ్ = భుజించు, అగ్నిమ్ = అగ్నియునైన, త్వామ్ = నిన్ను, షట్ఛక్తిభిః =

ఆఱుశక్తులతో, సహితమ్ = కూడినవానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, విద్వాన్ = విద్వాంసుడు, మహామృత్యుమ్ = అజ్ఞానరూప మహామృత్యువును, **అత్యేతి** = దాటును.

**తాత్పర్యము :** క్షేత్రజ్ఞ రూపులైన సర్వదేవతలు దేవయోని విశేషులైన భుజగాదులు, మనుష్యులు మొదలైన జీవులందఱు క్షేత్రరూపమైన బ్రహ్మాండ రూపమైన త్రిభువన భవన వ్యాపకమైన సర్వజగద్రూపమైన భోజ్యము భోక్తృ రూపాగ్నియు నీవే అయి యున్నావు. ఆఱు శక్తులతో కూడిన నిన్నెఱిగిన విద్వాంసుడు అజ్ఞాన రూపమైన మహామృత్యువును దాటి అమృతత్వమును (మోక్షమును) పొందును.

**వివరణము :** జీవులు క్షేత్రజ్ఞులు. బ్రహ్మాండమంతయు క్షేత్రము. క్షేత్రమును వ్యాపించి క్షేత్రజ్ఞు డుండును. భవనమున వ్యాపించిన వెలుగువలె క్షేత్రజ్ఞుడు క్షేత్రమును వెలిగించు చుండును. వెలుగుటయే ఇట భోక్తృత్వము. అగ్ని సర్వభక్షకుడు. అట్లే పరశమ్భువు సర్వజగద్భోక్తా. భోక్తృత్వమనగా జ్ఞాతృత్వము. క్షేత్రము. క్షేత్రజ్ఞాభిన్నము. పరశమ్భువు. క్షేత్రజ్ఞాభిన్నుడు. తన షట్ఛక్తులతో ఈ జగ ద్వ్యాపారమును నిర్వహించు పరశమ్భువు నాత్మగా నెఱిగిన వాడు అజ్ఞాత రూప మహామృత్యువును దాటును. చావు మృత్యువు. చచ్చుట మరల పుట్టుట కొఱకు, మఱల పుట్టి మరల చచ్చుట సంసారము. దీనికి మూలము అజ్ఞానము. అది మహామృత్యువు. దానిని దాటుటయే మృత్యుంజయత్వము. అమృతత్వము. అదియే మోక్షము. జ్ఞానము వలన దానిని పొందుటయే పురుషార్థము. దానిని సాధించిన వాడే విద్వాంసుడు. విద్వాంసుడే దానిని సాధించగలడు. వాడే బ్రహ్మము. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' బ్రహ్మము నెఱిగినవాడు బ్రహ్మమే అని ఉపనిషత్తు చెప్పుచున్నది.

**క్షేత్రవిధుల్ సమస్తసుర ఖేచర రాక్షస ముఖ్యజీవులౌ**
**క్షేత్రమజాండ మంతయును చిత్ర జగత్త్రయహర్మ్యరూపమే**
**క్షేత్రమ యాన్నరాశిని విశిష్టమహాద్భుత శక్తి షట్కదే**
**యాత్రముతో భుజించెడి మహాగ్నిని నిన్నెఱుగన్ విముక్తుడౌ.**

**అవతారిక :** పై శ్లోకమున **మోక్షహేతువు విద్య** అని సూచించబడినది. ఈ శ్లోకమున **తద్విద్యాస్వరూపము** వివరింపబడుచున్నది.

**శ్లో॥ ఉక్తక్షేత్రాధిదేవే పరతరపురుషే త్వయ్యనంతస్వరూపే**
**దివ్యామ్నాయా గురూక్తా నిజనిజనియతిస్ఫూర్తయః సర్వవేదాః ।**

**సాంగోపాంగాశ్చ శాస్త్రాణ్యధిగతమహిమాన్యోన్యసిద్ధాంతవిద్యా**
**భాషాస్స్వార్థైర్విభాంతి త్రిణయన! భవతో విశ్వమూర్తేః పరః కః ॥ 95**

**ప్రతిపదార్థము :** త్రినయన! = ఓ త్రిలోచనా, ఉక్తక్షేత్రాధిదేవే = చెప్పబడిన క్షేత్రమునకు అధి దేవతవు, పరతరపురుషే = పరాత్పర పురుషుడవైన, అనంతస్వరూపే = అనంతస్వరూపుడవైన, త్వయి = నీ యందు, గురుక్తాః = గురువుచే చెప్పబడిన, దివ్యామ్నాయాః = దివ్యమంత్రములు, నిజనిజనియతి స్ఫూర్తయః = తమతమభవితవ్య నియమమును తెలుపు, సాంగోపాంగాః = అంగములతో ఉపాంగములతోడను కూడిన, సర్వవేదాః = అన్నివేదములు, శాస్త్రాణి = శాస్త్రములు, అధిగత మహిమాన్యోన్య సిద్ధాంత విద్యాః = తెలిసిన మహిమగల అన్యోన్య సిద్ధాంతములకు సంబంధించిన విద్యలు, భాషాః = భాషలు, స్వార్థైః = తమ అర్థములతో కూడి, **విభాంతి** = ప్రకాశించుచున్నవి, విశ్వమూర్తేః = విశ్వమూర్తివైన, భవతః = నీకన్న, పరః = భిన్నుడు, కః = ఎవడు?

**వివరణము :** సర్వ విధములైన సురనర భుజగమృగాదుల శరీరములు క్షేత్రములు. వాని కధిదేవతయు పరశంభువే. ఆతడు అనంతస్వరూపుడు. పరాత్పరపురుషుడు. ఆతని యందే సర్వవిధ గురూపదిష్ట మంత్రములు, ఆచార్యాది శ్రుతములైన వేదములు, శాస్త్రములు భిన్న భిన్న సిద్ధాంతములతో ఆ పరశంభువు యొక్క మహిమను ప్రతిపాదించు విద్యలన్నియు వానివాని అర్థములతో కూడి ఆ పరశమ్భువునందే ప్రకాశించుచుండును. ఆతనికి భిన్నముగా క్షేత్రముకాని క్షేత్రజ్ఞుడు కాని ఉండడు. ఆతనిని మించిన శ్రేష్ఠులు కూడ ఎవరు లేరు. ఎచ్చటనులేరు. ఏకాలముననను లేరు. ఉండరు.

**ఈవరమైన క్షేత్రమును నేలెడి దేవుడవైన నీ యెడన్**
**పావనసాంగవేదములు భవ్యగురూదిత సర్వవిద్యలున్**
**ధీవరమాన్యశాస్త్రములు దివ్యమహాద్భుత భాషలన్నియున్**
**స్వావిహితార్థతన్ తెలియవచ్చెను నీకిది విశ్వమూర్తికిన్.**

**అవతారిక :** పై శ్లోకమున సర్వవిధ జగజ్జీవాభేదము లా పరశమ్భువు నందే ప్రకాశించు చున్నవని ఆభాసరూపమున తదభేదము చెప్పబడినది. ఈ శ్లోకమున విశ్వమునకు పరశంభువునకు కార్యకారణసంబంధరూపమున రూపాభేదము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మూలం వ్యోమైవ వాయుజ్వలనజలధరామధ్యమం యస్య శాఖా**
**దేవాః పర్ణాని దైత్యాః కిసలయనిచయా మానుషాశ్చ ప్రతానాః ।**

**నాగాః పుష్పాణి జీవా బహువిధతనవః పక్వసస్యప్రబోధో**
**విశ్వన్యగ్రోధకద్రోః పరమశివ! భవాన్ బీజభూతో విభాతి ॥ 96**

**ప్రతిపదార్థము :** పరమశివ = ఓ పరశంభూ!, యస్య = ఏ, విశ్వన్యగ్రోధకద్రోః = విశ్వమను మఱ్ఱిచెట్టునకు, మూలమ్ = వేఱు, వ్యోమ ఏవ = ఆకాశమే (యగును), మధ్యమమ్ = నడుము, వాయుజ్వలన జలధరాః = వాయువుఅగ్నిమేఘములు, శాఖాః = కొమ్మలు, దేవాః = దేవతలు, పర్ణాని = ఆకులు, దైత్యాః = దైత్యులు, కిసలయ నిచయాః = చిగుళ్ళ గుంపులు, మానుషాః = మనుష్యులు, ప్రతానాః = తీగలు, నాగాః = నాగులు, పుష్పాణి = పూవులు, బహువిధతనవః = అనేక విధ శరీరములు గల, జీవాః = జీవులు, పక్వసస్యమ్ = పంట, ప్రబోధః = జ్ఞానము, విశ్వన్యగ్రోధకద్రోః = విశ్వన్యగ్రోధవృక్షమునకు, బీజభూతః = విత్తనమై, భవాన్ = నీవు, **విభాతి** = ప్రకాశించు చున్నావు.

**తాత్పర్యము :** ఓ పరశమ్భూ! విశ్వమను మఱ్ఱిచెట్టునకు నీవు విత్తనము, ఆకాశము వేఱు, వాయువు అగ్ని మేఘములు నడిమి భాగము, శాఖలు దేవతలు, ఆకులు దైత్యులు, చిగుళ్ళ గుంపులు మనుష్యులు, తీగలు నాగులు, వివిధ శరీరములు గల జీవులు పుష్పములు, పండు జ్ఞానము.

**వివరణము :** ఈ శ్లోకమున సావయవ రూపకాలంకార మున్నది.

**వ్యోమము మూలమై సుహుతభుగ్జలదానిలరాశి మధ్యమ**
**మ్మై మరుదాలి కొమ్మల సురావలి యాకులు నాగుకాడలా**
**హా మనుజుల్ సుపల్లవములై బహురూపశరీర జీవులున్**
**వేమఱుతోచు విశ్వవట వృక్షపు బీజమ వీవ యోశివా!**

**అవతారిక :** పై శ్లోకమున పరశంభువు కాలానుసారముగా జననమరణాదుల నొందు **విశ్వన్యగ్రోధకద్రు బీజముగా** చెప్పబడినాడు. ఈ శ్లోకమున ఆతడు **కాలుడు కాలాంతకుడుగా** చెప్పబడుచున్నాడు.

**శ్లో॥ మాయారూపేణ కాలో జననమరణకృత్సర్వజీవాంశవృత్తే-**
**ర్విద్యారూపేణ కాలాంతక ఇతి వినుతః స త్వమేవాపరో న ।**
**దేహాహంకార ఏవాంతక ఇతి గురుణా యః ప్రవిజ్ఞాయ మాయాం**
**జాగర్త్యాత్మప్రబోధే శివ! తవ కృపయా సోఽత్ర మృత్యుంజయస్స్యాత్ ॥ 97**

**ప్రతిపదార్థము :** శివ = ఓ శివా!, మాయారూపేణ = మాయారూపమున, సర్వజీవాంశవృత్తేః

= సర్వజీవుల యందు అంశముగానున్న వృత్తి యొక్క, జనన మరణకృత్ = జననమును, మరణమును కలిగించు, కాలః = కాలుడు, విద్యారూపేణ = విద్యారూపమున, కాలాంతకః = కాలాంతకుడు, ఇతి = అని, వినుతః = పొగడబడిన వాడవు, సః = వాడు, త్వమేవ = నీవే, అపరః = మరొకడు, న = కాడు, గురుణా = గురువుచేత, దేహోహంకార ఏవ = దేహము నేనను బుద్ధియే (వృత్తియే), అంతక ఇతి = అంతకుడు అని, తవ కృపయా = నీకృపతో, యః = ఎవడు, మాయామ్ = మాయను, ప్రవిజ్ఞాయ = ఎఱిగి, ఆత్మ ప్రబోధే = ఆత్మయొక్క జ్ఞానమున, జాగర్తి = మేలుకొనునో, సః = వాడు, అత్ర = ఈలోకమున, మృత్యుంజయః = మృత్యుంజయుడు, **స్యాత్** = అగును,

**తాత్పర్యము :** పరశంభువు మాయారూపమున కాలుడై సర్వజీవుల జనన మరణముల నొనర్చును. సర్వజీవులలోని అహంకారరూపమైన జీవుల కంశత్వమును గలిగించు వృత్తిలో మిగిలిన అన్ని వృత్తులు జనన మరణముల నొందుటచే అహంకారమే అంతకుడు (కాలుడు). ఆ పరశంభువే విద్యాస్వరూపుడై అహంకారము నంత మొనర్చుటచే ఆయనయే కాలాంతకుడు. గురుకృపచే నీ యంశము నెఱిగిన విద్వాంసుడు మృత్యుంజయుడగును.

**వివరణము :** పరశంభుడీశ్వరుడు. కావున ఆతడు మాయావి. మాయకలవాడు. మాయా రూపముననే సర్వ ప్రపంచ సృష్టిస్థితిలయముల నాతడొనర్చును. సృష్టిస్థితిలయములు జీవుల కేర్పడుట పరశంభువు మాయ వలననే కాని వాస్తవముగా జీవులు పరశంభు రూపులే. పరశంభువు మాయారూపమున జగజ్జీవుల సృష్టిస్థితిలయముల నొనర్చుటచే అవి యన్నియు కాలికము లగుటచే పరశంభువే మాయారూపమున కాలుడని చెప్పబడును. సర్వజీవాంశవృత్తి అహంకారవృత్తి ఇది అంతఃకరణవృత్తి. దీని యందే ఇతరాంతః కరణవృత్తులన్నియు సృష్టిస్థితిలయముల నొందును. వృత్తి జ్ఞానము చేతనే సిద్ధములైన వృత్తి జ్ఞాన విషయము లన్నియు ఆత్మకు జ్ఞాతృత్వమును ఆత్మాధీనమైన అంతఃకరణము ద్వారానే ఆత్మ ప్రతిఫలన రూపాహంకారము నందు, అహంకారప్రతిఫలితాత్మప్రతిబింబము (చిదాభాస) నందు జ్ఞాతృత్వమును కలిగించును. ఈ అహంకారము సంకుచితముగా జీవునందు పిండదేహము నేనను రూపమును విస్తృతముగా నీశ్వరునందు బ్రహ్మాండ దేహము నేనను రూపమును పొందును. ఈ ఈశ్వరాహంకారము **పూర్ణాహంత** అని, జీవాహంకారము అహంత అని పిలువబడును. బ్రహాండ పిండాండ విలయము జరిగినప్పుడు పరశంభు వొక్కడే నిర్గుణ నిరహంకార నిరంజన రూపము నొందును ఈ స్థితి నొందుట అంత కాంతకత్వము లేక **మృత్యుంజయత్వము** లేక కాలాంతకత్వము.

విద్యవలన జీవుడీ స్థితి నందును. కావున కాలుడన్నను ఈశ్వరుడన్నను ఆతడు కాలకాలుడు. కాలాంతకుడు. అంతకాంతకుడు. మృత్యుంజయు దన్నను, విద్యచేత కలుగు అమృతత్వము యొక్క స్థితియే. కావున పరశంభువు మాయారూపమున కాలుడని చెప్పబడును. దేహాహంకారము బంధహేతువు కావున మృత్యు రూపము. దానిని విద్యారూపమున తొలగించు పరశంభువు మృత్యుంజయుడు, అంతకాంతకుడు. పరశంభు స్థితిని విద్యచేత నొందిన జీవుడును పరశంభు రూపుడే కావున ఆతడును మృత్యుంజయుడగును.

**చింతిలమాయగా సకల జీవతనూద్భవనాశకర్తవై**
**వింతగ కాలనామమును విద్యగ నొక్కడవైన నీవె కా**
**లాంతక సంజ్ఞ ంౖదాల్చెదు త్వదన్యములేదు గురూక్తి చేత(నా**
**యంతకుడీ యహంకృతియె యంచును మాయ నెఱింగి యుండి)ని**
**ద్రాంతము నందు మేల్కొను మహాత్మవిబోధుడు గెల్చు మృత్యువున్.**

**అవతారిక :** పై శ్లోకమున విద్య యొక్క ఒక అర్థమైన జ్ఞానము వలన **మృత్యుంజయత్వము** కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున విద్య యొక్క మరొక అర్థమైన ఉపాసనమెట్లు కవిచే చేయబడినదో చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్వం నాథస్త్వం గురుస్త్వమ్పరపదజనితామ్నాయవిద్యార్థకోశ-**
**స్త్వం శమ్భుస్త్వమ్పరేశః పరతరమహిమా త్వమ్పరా త్వమ్పరాగ్నిః ।**
**త్వమ్భానుస్త్వం సుధాంశుస్త్వమపి చ జననీ త్వమ్పితా త్వం సుమిత్రం**
**త్వమ్భ్రాతా బాంధవస్త్వమ్భవసి ధననిధిస్త్వాం వినా నాస్తి మేఽన్యః ॥ 98**

**ప్రతిపదార్థము :** త్వమ్ = నీవు, మే = నా యొక్క, నాథః = ప్రభుడవు, గురుః = గురుడవు, పరపద జనితామ్నాయ విద్యార్థకోశః = ఓంకారమునుండి పుట్టిన విద్య యొక్క అర్థమునకు పెట్టెవు, శమ్భుః = సుఖమును పుట్టించు వాడవు, పరేశః = పరమేశ్వరుడవు, పరతరమహిమా = శ్రేష్ఠమైన మహిమకలవాడవు, త్వమ్ = నీవు, పరా = పరవు, త్వమ్ = నీవు, పరాగ్నిః = శ్రేష్ఠాగ్నివి, భానుః = సూర్యుడవు, సుధాంశుః = చంద్రుడవు, జననీ = తల్లివి, అపి చ = మరియు, పితా = తండ్రివి, త్వమ్ = నీవు, సుమిత్రమ్ = మంచిమిత్రుడవు, త్వమ్ = నీవు, బాంధవః = బంధుడవు, త్వమ్ = నీవు, ధననిధిః = ధనములమూటవు, భవసి = అగుదువు, త్వామ్ వినా = నీవు తప్ప, అన్యః = ఇతరుడు, న అస్తి = లేడు,

**తాత్పర్యము :** నీవే నా ప్రభుడవు. గురుడవు. ఓంకారజన్యమైన విద్య యొక్క అర్థము యొక్క పెట్టెవు. నీవే శంభుడవు. పరమేశ్వరుడవు. నీవే అతిశయత మహిమ గలవాడవు. నీవే పరాశక్తివి. పరాగ్ని స్వరూపుడవు. నీవే చంద్రుడవు. సూర్యుడవు. నీవే తల్లివి, తండ్రివి, మంచి మిత్రుడవు. నీవే సోదరుడవు, బాంధవుడవు, నీవే వరహాలమూటవు, నీవు తప్ప నా కితరుడు లేడు. (ఇతరుడు నాకేమియు కాడు. నా దృష్టిలో ఇతరుడనువాడే లేడు.)

**వివరణము :** లోకమున తల్లి, తండ్రి, గురువు, ప్రభువు, బాంధవుడు అను వారందరు, అపకరించు భ్రాత్రాదులను చూచుచున్నాము గదా! కావున వాస్తవమునకు నీవేనాకు తల్లివి, దండ్రివి, గురుడవు, ప్రభుడవు. నీకన్న మించిన మహిమ కలవారు లేరు. నీతో సమానులే లేరు. ఇక అధికు లెట్లుందురు. సూర్యచంద్రాదులు వెలుగు చున్నారనగ నీ శక్తి తోడనే వెలుగుచున్నారు. కావున నీవే సూర్యుడవు, చంద్రుడవు. అందరిలో అన్నింటిలో నుండు పరాశక్తివి నీవే అయినప్పుడు అందఱు నీ శక్తి తోడనే పనిచేయుచున్నప్పుడు నాకు అన్నియు అందఱును నీవు. నీవు తప్ప మరొకటి, మరొకడు లేడు.

**గురుడవ నాథనాథుడవు గూఢమహా పరభైరవుండవా**
**పరవు పరేశ శంభు పరవహ్నివి చంద్రుడవమ్మవయ్యవా**
**తరణివి బాంధవుండవు నిదానమ వాత్మ సహోదరుండవా**
**పరమసుహృద్వరుండవు కృపాపర లేదు త్వదన్యమెచ్చటన్.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువుయొక్క **సర్వవిధోపాస్యత** వర్ణించబడినది. ఈ శ్లోకమున ఆ పరశమ్భువుయొక్క **తత్త్వము శబ్దార్థాధారభూతమని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శబ్దార్థాధారభూతం త్రిభువనజనకం సర్వతో దిక్సతత్త్వం**
**త్రైలోక్యస్థాయి లింగత్రయవిదితపదం సర్వతత్త్వైకవేద్యమ్ ।**
**సర్వానిర్వాచ్యసత్తాగతపరవిభవం జ్యోతిరుజ్జృమ్భమాణం**
**వ్యక్తీకృత్యాత్మవర్ణైః ప్రకటయసి పరం తత్త్వమాత్మీయమగ్రే ॥ 99**

**ప్రతిపదార్థము :** శబ్దార్థాధారభూతమ్ = శబ్దార్థముల కాధారభూతమైన, త్రిభువన జనకమ్ = త్రిభువనమును పుట్టించు, సర్వతో దిక్సతత్త్వమ్ = అన్ని దిక్కుల నుండి చేరదగిన సమ్యక్తత్త్వమైన, త్రైలోక్యస్థాయి = త్రిలోకములం దున్నట్టి, లింగత్రయ విదితపదమ్ = మూడులింగముల చేతను తెలియబడు పదముగల, సర్వతత్త్వైక వేద్యమ్ = అన్ని తత్త్వముల చేత తెలియదగిన, సర్వానిర్వాచ్య సత్తాగత పరవిభవమ్ = అంతటి చేతను నిర్వాచ్యమైన

సత్తలో నున్న శ్రేష్ఠమైన వైభవమైన, ఉజ్జృంభమాణమ్ = విజృంభించుచున్న, జ్యోతిః = వెలుగును, ఆత్మవర్ణైః = నీ వర్ణములతో, వ్యక్తీకృత్య = వెల్లడించి, ఆత్మీయమ్ = నీదైన, తత్త్వమ్ = తత్త్వమును, అగ్రే = మొదట, **ప్రకటయసి** = ప్రకటించుచున్నావు.

**తాత్పర్యము :** శబ్దార్థముల కాధారమైన త్రిలోకముల సృజించు అన్ని దిక్కులనుండి చేరదగిన తత్త్వమైన త్రిలోకములందు నిలచి ఉండు మూడు లింగముల చేత తెలియదగిన పదమైన, అన్ని తత్త్వముల చేతను తెలియదగిన, ఎవరికిని నిర్వచించరాని సత్తలో నున్న పరవైభవము గల, విజృంభించు జ్యోతిని వెలువరించి నీ తత్త్వమును నీ వర్ణముల తోడనే మొదట ప్రకటించుచున్నావు.

**వివరణము :** పరమాత్మ లింగ త్రయాతీతము. దానిని వ్యక్తీకరించుటకు లింగ త్రయాతీతమైన ఓంకారమే కావలెను. ఆ ఓంకారము అవ్యయము. అది ప్రాథమికమైన శబ్దాత్మక జ్యోతి. దాని ద్వారమున దానిలోని వర్ణములు పరమాత్మ యొక్క తనవైన వర్ణములు ఆ ఓంకారము అను జ్యోతిని వెలువరించి తన తత్త్వమును పరమాత్మ వెల్లడించును. పరమాత్మ ఓంకారములోని అకార ఉకార మకారములే త్రిభువనముల బుట్టించును. త్రైలోక్యమునందా ఓంకార మొక్కటియే స్థిరమైన తత్త్వము. పరమేశ్వరుడా వర్ణముల తోడనే అనిర్వాచ్యమైన సచ్చిదానందతత్త్వమును ప్రకటించును.

**పలుకు తదర్థమున్ నిలచుపట్టు, జగత్త్రయయోని సర్వ ది**
**క్కులగల కొల్వు ముజ్జగము కూడు త్రిలింగపదమ్ము లౌను చి**
**ద్విలసిత సర్వతత్త్వపరివేద్యము సర్వవచోతిసత్తయా**
**వెలుగును జిమ్మి యర్థముల వెల్లడి జేయుదు వాత్మతత్త్వమున్.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు యొక్క **ఓంకారోపాస్యత** చెప్పబడినది. ఈ శ్లోకమున కార్యమైన విశ్వము, కారణమైన ఓంకార వాచ్య విశ్వేశ్వరుడును **అభిన్నులని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్వం విశ్వం విశ్వహేతుర్విరహితకరణో విశ్వకార్యైకకర్తా**
**విశ్వాతీతశ్చ విశ్వేశ్వర ఇతి బహుధా నిశ్చితశ్చాక్షరజ్ఞైః ।**
**అద్వైతాత్మప్రబోధానలబహులశిఖాచర్వితాత్మీయహవ్యః**
**శ్రీశమ్భో విశ్వసత్తాపరతరవియతి ప్రైషి నిర్వాణపూజామ్ ॥ 100**

**ప్రతిపదార్థము :** శ్రీశమ్భో = ఓ శ్రీ శమ్భో!, త్వమ్ = నీవు, విశ్వమ్ = విశ్వమవు,

విశ్వహేతుః = విశ్వకారణమవు, విరహితకరణః = సాధనములులేని, విశ్వకార్యైకకర్తాః = విశ్వకార్యమున కొక్కడవైన కర్తవు, విశ్వాతీతఃచ = విశ్వమున కతీతుడవును, విశ్వేశ్వరః = విశ్వేశ్వరుడు, ఇతి = అని, బహుధా = అనేకవిధములుగా, అక్షరజ్ఞైః = విద్వాంసుల చేత, నిశ్చితః చ = నిశ్చయింపబడిన వాడవును, అద్వైతాత్మ ప్రబోధానల బహులశిఖా చర్వితాత్మీయ హవ్యః = అద్వైతాత్మ జ్ఞానాగ్ని జ్వాలల చేత నమల బడుచున్న తన హవిర్ద్రవ్యముగల వాడవై, విశ్వసత్తా పరతర వియతి = విశ్వము యొక్క ఉనికి కావలి దైన పరమాకాశము నందు, నిర్వాణ పూజామ్ = శాంతిరూప పూజను, ప్రైషి = పొందుచున్నావు.

**తాత్పర్యము :** ఓ పరశమ్భూ! నీవు విద్వాంసుల చేత విశ్వరూపుడవు అని, విశ్వకారణ రూపుడవని, విశ్వాతీతుడవని, కారణరహితుడవైన విశ్వకర్తవని, బహు విధములుగా చెప్పబడుచున్నావు. నీవేమో అద్వైతాత్మ జ్ఞాన జ్వాలల చేత ప్రపంచము నంతను (హవిర్ద్రవ్యమును) ప్రవిలాపించుచు అనగా జ్వాలా జిహ్వాలతో మ్రింగుచు విశ్వమున కావలనున్న పరమాకాశమందు శాంత్యానంద రూప పూజను పొందుచున్నావు.

**వివరణము :** ఈశ్వరునిచే విశ్వము నిర్మింపబడినది. కుమ్మరివాడు కుండనునిర్మించినట్లా? కాదు కుమ్మరి వాడు నిమిత్తకారణము మాత్రమే. మట్టి ఉపాదాన కారణము. కుమ్మరివాడు కుండను నిర్మించి చచ్చి పోవచ్చును. కుండ ఉండును. కాని విశ్వేశ్వరుడులేక విశ్వముండదు. ఈశ్వరుడు విశ్వమునకు నిమిత్తకారణము. ఉపాదాన కారణము కూడ. కుండను నిర్మించుటకై కుమ్మరికి సారె మొదలగు సాధనములు కావలెను. పరమేశ్వరు డే సాధనములతో జగమును నిర్మించెను? సాధనములులేకయే ఈశ్వరుడు విశ్వమును నిర్మించెను. కుమ్మరి ఇతర నిర్మితమైన సారె మొదలగు సాధనములతో కుండను నిర్మించినట్లు విశ్వనిర్మాణమును సాధనములతో నిర్మించెనన్నచో సాధనము నెవడాతనికి నిర్మించి యిచ్చిరి. అను ప్రశ్నయు బయల్దేరును. సాధన సృష్టికర్త మరొకని నంగీకరించినచో ఆ సాధన సృష్టికర్తయైన ఈశ్వరుడే జగమును కూడ నిర్మింప జాలడా? జగన్నిర్మాణకర్త సాధనముల నిర్మించలేడా? అను ప్రశ్నములు కలుగును. విశ్వమునకు విశ్వనాథులకును భిన్న కర్తల నంగీకరించినచో ఒకరు చేయగల పనిని మరొకరు చేయలేని అసమర్థులని చెప్పవలసి వచ్చును. ఈశ్వర శబ్దమునకు సమర్థుడనియే అర్థము. సామర్థ్యమున లోప మేర్పడినచో ఈశ్వరత్వమునకే హాని ఏర్పడును. అసమర్థుడు జగన్నిర్మాణకర్త లేక జగత్సాధననిర్మాణకర్త. ఇరువురీశ్వరుల నంగీకరించుట గౌరవ దోష భూయిష్ఠము. అట్లే కొందఱు కుమ్మరులు

కలసి ఒకే కుండను నిర్మించినట్లు పెక్కీశ్వరులు ఏక ప్రపంచ నిర్మాతలని చెప్పుట కూడ గౌరవ దోష భూయిష్ఠము. కావున సాధనాపేక్ష లేకయే ఈశ్వరుడు జగములను నిర్మించెను అని చెప్పుటలో పై గౌరవ దోషముల ప్రసక్తి ఉండదు. ఈశ్వరుడు విశ్వకర్త యనగా నిమిత్తకారణము మాత్రమే కాదు. ఉపాదానము లైన పరమాణ్వాదులును ఆతడే. ఆతడే పరమాణ్వాది (లేక ప్రకృత్యాది) విశ్వహేతురూపుడు. విశ్వరూపుడును. కారణరూపుడు, కార్యరూపుడును అతడే. విశ్వాతీతుడు, పరశమ్భువు అని కొందఱు చెప్పుదురు. వారు పరశమ్భువు మాయయే లేక పరశమ్భువుయొక్క శక్తియే జగత్సృష్టి స్థితిలయముల నొనర్చునందురు. శక్తి కార్యము నాతని కాపాదింపబడుటచే ఆతడు విశ్వకర్తయని చెప్పబడుచున్నాడు. నిజమునకు ఆతడు విశ్వాతీతుడనియే చెప్పవలెను. లేనిచో విశ్వములోని పరిణామాది దోషములాతని యందు నుండునని చెప్పవలసి వచ్చును. కావున ఆతడు విశ్వాతీతుడే. ఇట్లు పెక్కురు విద్వాంసులు పెక్కు విధములుగా పరశంభువును గూర్చి చెప్పుదురు గాక. ఆయన మాత్రము అద్వైతాత్మరూపుడు. ఆతడు స్వప్రబోధరూప జ్ఞానాగ్ని జ్వాలలతో అజ్ఞాన జన్యమైన జగమును సహేతుకముగా మ్రింగివైచును. అప్పుడా పరశమ్భువు నిర్వాణ (శాన్త్యానంద) పూజనము నొందు చుండును.

**విశ్వమువీత సాధనత విశ్వనిదానము విశ్వకార్యకృద్**
**విశ్వమహేశ్వరుండనుచు ౘెక్కువిధమ్ముల నక్షరజ్ఞ వా**
**గీశ్వర నిశ్చితుండ వవిహీనవిబోధ మహాగ్ని జిహ్వలన్**
**విశ్వమహాహుతిన్ మెసవి విశ్వపు సత్తను మ్రింగి నిల్వవే.**

**అవతారిక :** పై శ్లోకమున చివరిదైన **నిర్వాణము** వర్ణింపబడినది కావున ఈ శ్లోకమున ప్రకరణ ముపసంహరింపబడు చున్నది.

**శ్లో॥ ఏవం యః స్తౌతి మూర్తిం త్రిభువనకమయాం విష్వగాశ్చర్యచర్యా-**
**మంతర్బాహ్యగమోక్తిప్రవినుతవిభవామాదిమధ్యాంతహీనామ్ ।**
**సౌమ్యోగ్రాకారదేవాసురనరభుజగానేకజీవప్రభేదో-**
**త్పత్తిస్థిత్యంతభూమిస్స భవతి జగదాశ్చర్యవానేవ శమ్భో! ॥ 101**

**ప్రతిపదార్థము :** శమ్భో! = ఓ శమ్భుడా! ఏవమ్ = ఈవిధముగా, యః = ఎవడు, త్రిభువనకమయామ్ = త్రిభువన రూపమైన, విష్వగాశ్చర్యచర్యామ్ = అన్నియు ఆశ్చర్య చర్యలే కలిగియున్న, అంతర్బాహ్యగమోక్తి ప్రవినుత విభవామ్ = అంతర్బాహ్యములైన

ఆగమములలోని వాక్కులతో పొగడబడిన వైభవముకల, ఆది మధ్యాంత హీనామ్ = ఆది మధ్యాంతములు లేని, మూర్తిమ్ = ఆకృతిని, స్తౌతి = స్తుతించునో, సః = వాడు, సౌమ్యోగ్రాకార దేవాసురనర భుజగానేక జీవ ప్రభేదోత్పత్తి స్థిత్యంత భూమిః = సౌమ్యములు ఉగ్రములునైన దేవ రాక్షస నరనాగాద్యనేక జీవ ప్రభేదముల ఉత్పత్తి స్థితి లయముల యంత భూమి, జగదాశ్చర్యవాన్ + ఏవ = జగము నాశ్చర్య చకిత మొనర్పగలవాడు గానే, భవతి = అగును.

**తాత్పర్యము :** ఓ శమ్భో! ఈ విధముగా నెవడు త్రిభువనరూపమైన ఆశ్చర్యచర్యలుగల, ఆది మధ్యాంత హీనమైన అంతర్బాహ్యాగమోక్తులతో స్తుతింపబడిన నీ మూర్తిని స్తుతించునో వాడు, ఘోరాఘోరాకృతులు గల దేవ రాక్షస నర నాగాద్యనేక జీవ విశేషముల ఉత్పత్తి స్థితుల భూమియై జగదాశ్చర్యాకారు డగును.

**వివరణము :** పరమేశ్వరుని మూర్తి త్రిభువనమయము. ఆ మూర్తి సర్వాశ్చర్యమయము. త్రైవర్ణికులచే పఠింపబడు వేదములు అంతరాగమములు, శూద్రులకును పఠనీయములైన తంత్రములు బాహ్యాగమములు వానిలోని ఉక్తులచే స్తుతింపబడిన వైభవ మా మూర్తి యందున్నది. ఆ మూర్తిని స్తుతించు వాడు పరమేశ్వరుడు అగును. సర్వజీవుల ఉత్పత్తి స్థితిలయముల కంతమందున్నవాడు పరమేశ్వరుడు. ఆ జీవులలో కొన్ని సౌమ్యములు, కొన్ని ఘోరములు నైన మూర్తులను ఆకృతులను కలిగియుండును. వాని యన్నింటిని బుట్టించి కాపాడి సంహరించువాడు పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుడుగా జీవత్వము నుండి రూపొందించిన ఆ స్తోత జగమున కాశ్చర్యమును కలిగించుటలో నాశ్చర్యమే మున్నది.

**వింతల కాటపట్టయిన విశ్వమహో ఘనరూపమైన బా**
**హ్యాంతరనైగమోక్తి వినుతాద్భుత వైభవమైన యాదిమ**
**ధ్యాంతి విహీనమైన భవదాకృతి నీవిధివేడువాడు వి**
**శ్వాంతర సర్వజీవ జననాంతనివాసధరాద్భుతుండగున్.**

***

## -- అంతర్యాగోపచార పరామర్శ ప్రకరణమ్ --

**అవతారిక :** పై ప్రకరణమున పరశంభూపాసనా ప్రకారములు చెప్పబడినవి. ఈ ప్రకరణమున ఉపాసనా విశేషములలో నొకటైన **అంతర్యాగము** పరామర్శింపబడుచున్నది.

మొదట పరమేశ్వరునకు బహిర్యాగరూపములలో నొకటైన ఉపచారపూజ ఆక్షేపింపబడుచున్నది.

**శ్లో॥ కా పూజా పూజకః కః శివగురురితి కః కో విధః కశ్చ మంత్రః**
**కిం పీఠం కిమ్ప్రసూనం కిమమలసలిలం కేఽత్ర సర్వోపచారాః ।**
**నిర్ద్వంద్వస్యాత్మనస్తే ద్వయమితి రచితం సర్వమేతత్కథం స్యాత్**
**సంతోషార్థే మహేశ! త్రికరణవిమలజ్ఞానపూజాప్రసన్నః ॥ 102**

**ప్రతిపదార్థము :** మహేశ! = ఓ మహేశా!, పూజా = పూజ, కా = ఏది, పూజకః = పూజించువాడు, కః = ఎవడు ?, విధః = విధానము, కః = ఏది, మంత్రః చ = మంత్రము, కః = ఏది, పీఠమ్ = పీఠము, కిమ్ = ఏది, ప్రసూనమ్ = పుష్పము, కిమ్ = ఏది, అమలసలిలమ్ = శుద్ధోదకము, కిమ్ = ఏది, అత్ర = ఇచట, సర్వోపచారాః = సర్వోపచారములు, కే = ఏవి?, నిర్ద్వంద్వస్య = ద్వైతము లేని, ఆత్మనః = ఆత్మవైన, తే = నీకు, ద్వయమితి రచితమ్ = ద్వైతజ్ఞానముతో చేయబడిన, ఏతత్ = ఇది, సర్వమ్ = అంతయు, సంతోషార్థే = సంతోషము కొరకు, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగును, త్రికరణ విమల జ్ఞానపూజా ప్రసన్నః = త్రికరణ శుద్ధమైన జ్ఞానపూజచేత ప్రసన్నుడవు.

**తాత్పర్యము :** ఏది పూజ, పూజకుడెవడు, విధానమేది, మంత్రమేది, పీఠమేది, పుష్పమేది, శుద్ధోదకమేది, ఈ పూజలో అన్ని ఉపచారములున్నవా, అసలు పరశమ్భువు అద్వైతమూర్తి, ద్వైతజ్ఞానముతో చేయబడు పూజ యెట్లు ఆ పరశమ్భువునకు సంతోష హేతువగును? త్రికరణ శుద్ధ జ్ఞానపూజ తోడనే ఆయన ప్రసన్నుడగుట సంభవించును.

**వివరణము :** పూజ్యపూజకభేదజ్ఞానము పూజా హేతువగును, పరిచ్ఛిన్న విగ్రహాదుల పూజా విధానము గ్రంథములలో చెప్పబడినది. పూజోపకరణములైన గంధ పుష్పాదులు శుద్ధోదకాదులు చెప్పబడినవి. అపరిచ్ఛిన్న పరమాత్మ పూజా విధానము, దాని పూజా ద్రవ్యములుకాని చెప్పబడలేదు. విగ్రహము నొక పీఠమందు నిలపవచ్చును. సర్వ వ్యాపకుడైన పరమాత్మకు పీఠము నెక్కడ నుండి తేగలము. పరమాత్మునకు సంతోషము కలుగవలెనని కదా, ఆతనికి పూజ చేయుట. లోకము నందెవరికైనను సంతోషము కలుగవలెననియే పూజ చేయబడును. పరమాత్ముడు సంతోష సాగరుడు. ఆతని సంతోషము పూజ వలన కలుగుట యేమి? లోకమున పరిమితులైన వ్యక్తులకు పరిమితములైన ఉపచారముల ఆధిక్యాల్పతల వలన పూజ్యుల సంతోషమున భేదము కలుగును. అపరిమితుడైన

పరమాత్మకు పరిమితులమైన మనము అపరిమితోపచారములు నెట్లు సమకూర్ప గలము? ఆ పరమాత్మ మన పూజను స్వీకరించుటకై అపరిమితత్వమునుండి పరిమిత విగ్రహాదుల యందవతరించి నాడను కొనినను ఆయనకు తగిన పీఠము నెట్లు నిలుపవచ్చును. ఉపచారములనగా సేవలు. సేవాసాధనములు శుద్ధోదక గంధపుష్పాదు లుపచారములు, వాని సమర్పణములు నుపచారములు. ఈ సమర్పణము సేవారూపము. సమర్ప్యములైన గంధ పుష్పాదులు సేవా సాధనములు. గ్రంథములలో పంచోపచార దశోపచార షోడశోపచార చతుష్షష్ట్యుపచార భేదమున ఉపచారములసంఖ్య భిన్న భిన్నముగా చెప్పబడుచున్నది. **పూజకు ఆద్యంతములలో ధ్యానముండవలెను. ధ్యానమనగా ఉపాసనము. ఆ ధ్యానముల(ఉపాసనముల) మధ్య ఉపచారపూజ సాగినప్పుడు దానికి ఉపాసనాంగత సిద్ధించును.** బహిర్యాగము బహిరంగాంగము. అంతర్యాగము అంతరంగాంగము. బహిర్యాగమునకన్న అంతర్యాగ ముపాసనకు దగ్గరిది. పూజ్య పూజక భేదము, నారోపించుకొని పూజచేయవచ్చును. పరమాత్మ సర్వజ్ఞుడు. త్రికరణములలో మాలిన్యముగల మనము చేయుపూజ శుద్ధముగా నెట్లుండ గలదు. మన త్రికరణములలో అశుద్ధి ఆయనకు తెలియును కదా! అప్పుడాపూజ ఆతని కెట్లు సంతోషము కలిగించును. త్రికరణములనగా మనోవాక్కాయములు. మనోవాక్కులు సూక్ష్మ దేహమునకు చెందినవి. కాయమనగా స్థూలదేహమని తెలియవలెను. మనస్సులోని కామక్రోధాదులు మనశ్శుద్ధతా భంజకములు. వాక్కులో అసత్యత్వాదులు అక్షర పదభ్రంశాదుల వాక్శుద్ధి భంజకములు. ఇక స్థూలదేహము సర్వాశుచినిధానము. ఇవి యా పవిత్ర పరమాత్మ పూజోపకరణములు. ఈ విధముగా పరమేశ్వరుని బహిర్యాగరూపమైన బాహ్యపూజ ఆక్షేపింప బడినది. **త్రికరణ విమల జ్ఞానపూజా ప్రసన్నః** అను సమాసముచే పరమేశ్వరుడు త్రికరణశుద్ధమైన జ్ఞానపూజచే అనగా **అంతర్యాగముచే ప్రసన్నుడగునని** చెప్పబడినది.

**ఏ యది పూజ పూజకుడు నెవ్వడు శంభుగురుండు నెవ్వడో**
**ఏ యది మంత్రమేది విధి ఏయది పీఠము పుష్పమేది ఏ**
**వో యుపచారముల్ ద్వయ వియుక్తునకే ద్వయపూజతోష సం**
**జ్ఞాయకమెట్టు లా శివుడు జ్ఞానమయార్చన సుప్రసన్నుడౌ.**

**అవతారిక :** పై శ్లోకమున పరమాత్మకు **పీఠపుష్పాదుల ఉపచారత** ఆక్షేపింప బడినది. ఈ శ్లోకమున **ఆవాహనాసనములు** ఆక్షేపింపబడుచున్నవి.

శ్లో॥ త్రైకాల్యం సర్వతస్తే సకలజగదిదం వ్యశ్నువానాత్మసత్తా-
విస్ఫూర్తేరష్టమూర్తేరఖిలజనమనఃప్రోచ్ఛసింహాసనస్య ।
కస్మాదావాహనం స్యాద్బహిరిహ చరితం క్వాసనం చంద్రమౌలే-
ర్మాయాసంసారభావో రచయతి నితరామాత్మభోగాయ భేదమ్ ॥ 103

**ప్రతిపదార్థము :** సర్వతః = అన్నివైపుల, త్రైకాల్యమ్ = త్రికాలము లందున్న, ఇదమ్ = ఈ, సకలజగత్ = సర్వజగమును, వ్యశ్నువానాత్మ సత్తా విస్ఫూర్తేః = వ్యాపించి యున్న అత్మసత్తాస్ఫూర్తిరూపుడైన, అఖిలజనమనఃప్రోచ్ఛసింహాసనస్య = సర్వజగముల కన్న ఉన్నతమైన సింహాసనము గల, అష్టమూర్తేః = అష్టమూర్తియైన, చంద్రమౌళేః = చంద్రశేఖరునకు, కస్మాత్ = ఏచోటినుండి, ఆవాహనమ్ = వచ్చి చేరుట, స్యాత్ = సంభవించును, బహిః = బయట, ఇహ = ఇచ్చట, చరితమ్ = చరించుట, స్యాత్ = సంభవించును, క్వ = ఎచట, ఆసనమ్ = ఆసనము, స్యాత్ = సంభవించును, మాయా సంసార భావః = మాయా సంసారము యొక్క ఉనికి, ఆత్మభోగాయ = తనభోగము కొరకు, నితరామ్ = మిక్కిలి, భేదమ్ = భేదమును, రచయతి = రచించుచున్నది.

**తాత్పర్యము :** సార్వదేశికము సార్వకాలికమునైన ఈ జగము నాత్మ సత్తయే వ్యాపించి స్ఫురించుచున్నది. అట్టి ఆత్మసత్తా స్ఫూర్తి రూపుడు, జనతహృదయోన్నతసింహాసనస్థుడు, అష్టమూర్తియునైన చంద్రశేఖరుని యొక్క మాయయే సంసారమై ఆత్మభోగము కొరకు భేదము రచించు చున్నది. అట్టి ఆ చంద్రశేఖరునకును ఆవాహనాసనములు బయట నున్న ఈ లోకమున చరించుట ఎట్లు సంభవించును?

**వివరణము :** సార్వదేశికము దేశాతీతము సార్వకాలికము కాలాతీతము నైన ఆత్మ దేశకాలపరిచ్ఛిన్నము జగమును వ్యాపించి యున్నది. జగముయొక్క స్ఫూర్తి ఆత్మసత్తాయొక్క స్ఫూర్తియే. జగమునకు పృథక్సత్త లేదు. ఆత్మసత్తనుప జీవించియే జగత్తు వ్యావహారిక సత్త కలదై స్ఫురించుచున్నది. స్ఫూర్తియు ఆత్మదే. అది జగద్రూపమున స్ఫురించుచున్నది. వ్యావహారికసత్తకు పైనున్న సింహాసనము పై అనగా పార మార్థిక సత్త యందు బ్రహ్మ స్ఫురించుచుండును. జగత్తు అష్టమూర్తిమయము. అష్టమూర్తులనగా పంచభూతములు. సూర్యచంద్రద్వయము, అహంకారము ఒకటి. ఇవి శివుని మూర్తులే కనుక శివున కష్టమూర్తి అనిపేరు. ఈ పంచదశ తిథిరూప కలాత్మక కాలవ్యాప్తము. షోడశ (పదాఱవ) కలారూప చంద్రుని శివుడు ధరించి యుండుటచే శివుడు చంద్రమౌళి యనబడును. దేశకాల పరిచ్ఛిన్నమైన ఈ జగమాయనయందు ఏకదేశమే. **పాదోఽస్య విశ్వా భూతాని** అను

శ్రుతి దీనికి ప్రమాణము. లోని ఆత్మ యొక్క బహిశ్చరణమే ఈ జగము. లోపల, బయట యను వ్యవహారములు శరీరము నాశ్రయించి జరుగును. ఈ జగమంతయు పరమేశ్వరుని శరీరమే కావున ఆతనికి బహిశ్చరితమనునది ఎట్లుండును?. ఆయనను ఆవహింప జేయవలెననిన ఎక్కడ నుండి ఆవహింపజేయవలెను? ఎక్కడ ఆవహింప జేయవలెను? ఆవహింపజేయ దలచిన చోట ఆయన లేనప్పుడు గదా ఆవహింపజేయుట సంభవించును. పరమేశ్వరుడు సర్వ వ్యాపకుడు. కావున లేని చోటులేదు. గావున ఆవాహన మతనికి సంభవించదు. జగమునే ఉన్నతసింహాసనముగా చేసికొన్న ఆతనికి తద్బహిర్భూతమైన సింహాసనము నెట్లు సమకూర్చగలము? ఆయన యీ మాయిక సంసరణము ఆత్మ భోగమునకై భేదమును రచించుచున్నది. మాయయే సంసరించు ఆత్మకు భోగమును కలిగించుచున్నది. అనాత్మ రూపమైన మాయకు స్వార్థము లేదు. కావున పరుడైన ఆత్మ యొక్క భోగము కొఱకే అనగా భేదమును వహించుచున్నది.

**ఈ జగమంత సామయికమేయనుభూతమొనర్చు నాత్మ స**
**త్తాజనితాష్టమూర్తి జనతహృదయోన్నతసింహపీఠ వి**
**భ్రాజిత చంద్రమౌళి నిటు రమ్మనుటాసనమిచ్చుటెట్లు మా**
**యా జనితమ్ము సంసృతియె యంతరమున్ రచియించు నాత్మకై.**

**అవతారిక :** పై శ్లోకమున బహిర్యాగము యొక్క ఒక ప్రకారమైన అర్చనములోని **ఆవాహనాసనాదులు** ఆక్షేపించబడినవి. ఈ శ్లోకమున దానిలోని పాత్రాసాదనాదులు **పాద్యాదులు** ఆక్షేపింపబడు చున్నవి.

**శ్లో॥ ఆధారోఽగ్నిః సుపాత్రం రవిరమృతకలానాయకః పూర్ణమద్యం**
**శక్తీశస్త్వమ్ప్రపూజ్యః షడవయవయుతస్తత్ర పాత్రప్రవర్గే ।**
**పాద్యం తే తర్పణం ప్రభవతి సుముదే బాహ్యయాగార్ఘ్యపాత్రైః**
**సంతుష్టః స్యాః కథం త్వం పరశివ! విమలజ్ఞానదుగ్ధాబ్ధిశాయిన్! ॥ 104**

**ప్రతిపదార్థము :** ఆధారః = ఆధారము, అగ్నిః = అగ్ని, సుపాత్రమ్ = మంచి పాత్రము, రవిః = సూర్యుడు, పూర్ణమద్యమ్ = పూర్ణమద్యము, అమృత కలానాయకః = చంద్రుడు, శక్తీశః = శక్తులకీశ్వరుడైన, షడవయవయుతః = ఆరు అవయవములతో కూడిన, త్వమ్ = నీవు, పూజ్యః = పూజనీయుడవు, తత్ర = అచట, పాత్ర ప్రవర్గే = పాత్రప్రవర్గ్యములు, పాద్యమ్ = పాద్యమును, తర్పణం చ = తర్పణమును, తే = నీ యొక్క, సుముదే =

సంతోషము కొఱకు, **ప్రభవతి** = సమర్థమగునా?, విమలజ్ఞాన దుగ్ధాబ్ధి శాయిన్ = స్వచ్ఛమైన జ్ఞానమను పాలసముద్రమునందు శయనించువాడా!, పరశివ! = ఓ పరశమ్భూ! త్వమ్ = నీవు, బాహ్యయాగార్ఘ్యపాత్రైః = బహిర్యాగార్ఘ్యపాత్రలచేత, సంతుష్టః = సంతోషించు వాడవు, కథమ్ = ఎట్లు, స్యాః = అగుదువు?

**తాత్పర్యము :** ఆధారము అగ్నికాగా, సుపాత్రము సూర్యుడు కాగా, పూర్ణమద్యము చంద్రుడుకాగా, షడంగములతో కూడిన శక్తీశుడవైన నీవు ప్రపూజ్యుడవు. అచట పాత్రప్రవర్గ్యములు పాద్యతర్పణములు నీకు సంతోషము కలిగించ గలుగునా? బాహ్య యాగార్ఘ్యపాత్రలచే నీవు సంతుష్టుడ వెట్లగుదువు? ఓ పరశివా! నీవు విమల జ్ఞానదుగ్ధాబ్ధియందు శయనించువాడవు గదా?

**వివరణము :** అగ్ని యందు సూర్యుడొక పాత్రము. అనగా బహుదేశ కాలవ్యాప్తమైన అగ్నిలో సూర్య డేక దేశీయుడు. చంద్రుడనగా ఆ సూర్య పాత్రలో పోయబడిన మద్యమే చంద్రుడు. దేవతాన్నమైన అమృతమును దేవతల కందించువాడు. దేవతలందఱు నీశక్తులే. వాని కీశ్వరుడవు. నీవు పైన చెప్పబడిన అమృతముతో తృప్తుడవౌదువేమో కాని పాత్రములలోని పాద్యతర్పణములు తృప్తిని కలిగించునా? బహిర్యాగమున పాద్యపాత్ర, అర్ఘ్యపాత్ర, తర్పణపాత్ర, ఆచమనీయపాత్ర, మద్యపాత్ర, స్నానీయపాత్ర వేఱువేఱుగా నుండును. **పాద్యమనగా** పాదోదకము. **అర్ఘ్యమనగా** హస్తోదకము. **ఆచమనీయమనగా** త్రాగదగిన నీరు. స్నానీయము పెద్ద పాత్రలో నుండవలెను. ఇవి యన్నియు వేఱు వేఱు పాత్రములలో ఉండవలెను. ఉపయోగము ననుసరించి జలములలో తారతమ్య ముండవలెను. అనగా త్రాగదగిన జలము అత్యంత శుద్ధముగా నుండవలెను. అర్ఘ్యోదకము సుగంధిలమై ఉండవలెను. పాదోదకము త్రాగదగిన జలమంత శుద్ధముగా అనగా వడకట్టినదిగా ఉండనక్కఱలేదు. సుగంధిలము కానక్కఱలేదు. అన్ని జలములు ఆచమనీయ జలమంత ఉత్కృష్టముగా నున్న మరీ మంచిది. మానవులు మద్యము త్రాగినట్లు దేవతలమృతము త్రావెదరు. లేదా యజ్ఞములలో అర్పింపబడిన రసము త్రావెదరు. అర్ఘ్యమనగా పూజ. దానికై ఉపయోగింపబడు జలమంతయు అర్ఘ్యమే అయినను వేఱు పాత్రములలో నుంచి ఉపయోగించుట సంప్రదాయము. ఈ శ్లోకమున పరశమ్భువు విమలజ్ఞానదుగ్ధాబ్ధిశాయిగా సంబోధింప బడినాడు. దీనివలన విమలజ్ఞానదుగ్ధాబ్ధిలో శయనించు వానికి భౌతిక జలము తృప్తి కలిగించజాలదని, స్పష్టపరచును. ఇంతేగాక విష్ణువు పాలసముద్రమందు శయనించునను పురాణగాథయొక్క అంతరార్థమును

తెలుపుచున్నది. మరియు పరశమ్భువే విమలజ్ఞానదుగ్ధాబ్ధిశాయి అని ఆతనియందు విష్ణ్వభేదమును తెలుపు చున్నది.

**భానుదుపాత్రమౌ నమృతభానుడు పూరితమద్యమౌ నధి**
**ష్ఠానము వహ్ని పూజ్యుడవు షట్కరణుండవు త్వత్సుమోద సం**
**ధానము పాద్యతర్పణ విధానములున్ బహిరర్ఘ్యపాత్ర సం**
**జ్ఞానము త్వత్సుమోదకమె జ్ఞానపయోనిధిశాయి యో శివా!**

**అవతారిక :** పై శ్లోకము పాద్యతర్పణముల పాత్రాసాదనాదులు ఆక్షేపించబడినవి. ఈ శ్లోకమున స్నానాదు లాక్షేపింప బడుచున్నవి.

**శ్లో॥ భాస్వచ్చంద్రాగ్నిబింబోదితవిమలశివజ్ఞాననిత్యప్రమోద**
**జ్ఞానానందప్రవాహాస్త్రిగుణితసరితో ముఖ్యనాడీత్రయస్థాః ।**
**కాలిందీజహ్నుకన్యాంతరసరిదభిధాస్తే తనుస్నానకృత్యే**
**సృష్టా హృల్లింగమూర్తేః కథమితరజలైః స్యాత్తవ స్నానమత్ర ॥ 105**

**ప్రతిపదార్థము :** భాస్వచ్చంద్రాగ్ని బింబోదిత విమల శివజ్ఞాన నిత్య ప్రమోద జ్ఞానానంద ప్రవాహాః = సూర్యచంద్రాగ్ని బింబములనుండి పుట్టిన స్వచ్ఛమైన శివ జ్ఞానముచే కలిగిన నిత్యములైన తృప్తి, జ్ఞానము, ఆనందము అను ప్రవాహములు, త్రిగుణితసరితః = మూడు అను అంకెతో గుణింప బడిన నదులు, ముఖ్యనాడీత్రయస్థాః = ముఖ్యములైన మూడు నాడుల యందున్నట్టి, కాలిందీ జహ్ను కన్యాంతర సరిదభిధాః = కాలింది, జహ్నుకన్య, అంతర సరిత్తు అను పేరుగలవి, హృల్లింగమూర్తేః = హృదయలింగమూర్తియైన, తే = నీ యొక్క, తనుస్నానకృత్యే = దేహస్నానకర్మయందు, సృష్టాః = సృష్టింపబడినవి, ఇతరజలైః = ఇతరజలములచేత, తవ = నీకు, అత్ర = ఇచ్చట, స్నానమ్ = స్నానము, కథమ్ = ఎట్లు, స్యాత్ = సంభవించును.

**తాత్పర్యము :** సూర్యచంద్రాగ్నిబింబములనుండి శివజ్ఞానానందామృతప్రవాహములు నిండి ప్రవహించు మూడు నాడులు గంగా యమునా సరస్వతీనామములు గలవి. హృదయ లింగమూర్తివైన నీ దేహము నభిషేకించు నిమిత్తము సృష్టింపబడినవి. వానితో నీకు స్నానము జరుగునుగదా! ఈ బాహ్యములైన ఇతర జలములతో నీకు స్నానమెట్లు సంభవించును.

**వివరణము :** ఈ శరీరమున మూలాధార స్వాధిష్ఠాన చక్రద్వయము అగ్నిబింబమని అగ్ని

మండలమని; మణిపూరానాహత చక్రద్వయము సూర్యబింబమని, సూర్యమండలమని; విశుద్ధ్యాజ్ఞా చక్రద్వయము చంద్రబింబమని, చంద్రమండలమని చెప్పబడిన వీనికి పైన సహస్రారము మరొక (పర) చంద్ర మండలము ఉన్నది. త్రివిధ మండల రూపిణి యైన కుండలిని పరచంద్రమండలమును వేధించినప్పుడు ఆ పరచంద్రమండలమునుండి అమృతము ప్రవహించును. ఆ పరచంద్రమండలము శివరూపము. ఆ అమృతము జ్ఞానరూపము. ఆ శివజ్ఞానామృతము శరీరములోని డెబ్బది రెండు వేల నాడులలో నిండి శివయోగికి అమృతస్నానము ఘటిల్లును. డెబ్బది రెండు వేల నాడులలో మూడు ముఖ్య నాడులున్నవి. అవియే గంగా, యమునా,సరస్వతులు. ఇవి ఆధ్యాత్మికములైనవి. శరీరములోని ఇడా, పింగళా, సుషుమ్నానాడులు. ఇడ చంద్రనాడి, పింగళ సూర్యనాడి, సుషుమ్న బ్రహ్మనాడి లేక అగ్నినాడి, అని చెప్పబడును. అగ్ని రూప కుండలిని పరచంద్రమండలమైన సహస్రారము వైపు పైకి ప్రయాణించు నాడి యగుటచే **సుషుమ్నా** అగ్ని నాడి యనియు చెప్పబడినది. సహస్రారము క్రింద చంద్రుడు, సూర్యుడు, అగ్ని–ఈ మూడును అగ్ని రూపములే. అగ్ని ప్రభేదములే. ముఖ్యములైన ఇడా, పింగళా, సుషుమ్నా నాడులలో ఆనంద ప్రవాహము సత్య శివజ్ఞాన రూపము. అది నిత్యానంద రూపము. యోగీశ్వరుడైన పరశమ్భువున కీ శివజ్ఞాన రూపామృత ప్రవాహముతో స్నానము యోగ్యమగును. కాని బాహ్య జలములతో నాతని కెట్లు స్నానము ఘటిల్లును. 2. ఇడయే ఆధ్యాత్మికదృష్టితో గంగానది యని, పింగళయే యమున యని, సుషుమ్నయే సరస్వతియని వ్యవహరింపబడును.ప్రయాగక్షేత్రము నందు గంగా యమునలు శుక్ల కృష్ణ వర్ణములు కలవై మన కంటికి కనబడును. ఆ రెండు కలియుచోట లోపలినుండి సరస్వతీ నదీ ప్రవాహము కలియునని, దాని ధ్వని సైతము వినబడునని యాత్రికులు తమ స్వానుభవమును చెప్పుకొనుచుందురు. లోపలి నుండి కలియునది సరస్వతీనది. కావున అది ఈశ్లోకమున **అంతరసరిత్తు** అని చెప్పబడినది. కలింద పర్వతమునుండి పుట్టిన దగుటచే యమునకు కాళిందియను పేరు. గంగ భగీరథుని వెంబడించుచు జహ్ను మహాముని యజ్ఞవాటికను ముంచగా జహ్ను వా ప్రవాహమును నిరోధించెనని ఆ తరువాత దానిని విడచెనని అందుచేత గంగకు జాహ్నవి జహ్ను కన్య అను పేర్లేర్పడుట పురాణ ప్రసిద్ధము.

**అనల రవీందు బింబ జనితామల శాంభవబోధ నిత్య చి**
**ద్ఘనఝరముల్ త్రినాడికల దైక సరిద్యమునా సరస్వతుల్**

**మనమను లింగమూర్తికి నిమజ్జనముంబొనరింప సృష్టముల్**
**కన నితరాంబువుల్ స్నపనకర్మకు నర్హములెట్టు లౌనొకో.**

**అవతారిక :** పై శ్లోకమున **స్నాన మాక్షేపింపబడినది.** ఈ శ్లోకమున **వస్త్రయజ్ఞోపవీతాదు లాక్షేపింపబడుచున్నవి.**

**శ్లో॥ లజ్జారాగాదిమాయాతిమిరదినకరీభూతచేతఃప్రబోధ-**
**జ్యోతిఃపుంజప్రవృత్తేర్గతభవతమసో దిక్పటాలంకృతస్య ।**
**ప్రజ్ఞాయజ్ఞోపవీతైరుపచితవపుషః ప్రేతభస్మాంగరాగ-**
**స్యాంతే మిథ్యోపచారాస్తవ వసనమహాసూత్రదీపానులేపాః ॥ 106**

**ప్రతిపదార్థము :** లజ్జారాగాది మాయా తిమిర దినకరీ భూత చేతఃప్రబోధ జ్యోతిః పుంజ ప్రవృత్తేః = సిగ్గు, రాగము, మొదలయిన మాయయను చీకటికి సూర్యుడైన మానసిక జ్ఞానమను వెలుగుల సమూహము యొక్క ప్రవృత్తి గల, గతభవతమసః = సంసారాంధకారము తొలగిన, దిక్పటాలంకృతస్య = దిక్కులనెడు వస్త్రములతో అలంకరింపబడిన, ప్రజ్ఞాయజ్ఞోపవీతైః = ప్రజ్ఞయను యజ్ఞోపవీతములచేత, ఉపచిత వపుషః = పెంపొందిన శరీరము గల, ప్రేత భస్మాంగ రాగస్య = శవదహన జనిత భస్మమే మై పూతగా గల, తవ = నీకు, అంతే = సిద్ధాంతమున, వసన మహాసూత్ర దీపానులేపాః = వస్త్ర యజ్ఞోపవీత దీపానులేపములు, మిథ్యోపచారాః = అసత్యోపచారములు.

**తాత్పర్యము :** లజ్జారాగాది గుణమయమైన మాయ యను చీకటికి సూర్యుడైన మానసిక జ్ఞానమను వెలుగుల సమూహమును ప్రసరింప జేసి సంసారాంధకారమును పారద్రోలిన వాడు, దిగ్వస్త్రధారియు, ప్రజ్ఞా యజ్ఞోపవీతము ధరించిన వాడు, శవముల కాల్చగా నేర్పడిన బూదిని పూసికొను వాడును నైన పరశమ్భువునకు వస్త్రదీపయజ్ఞోపవీత గంధానులేపములు మిథ్యోపచారములే.

**వివరణము :** మాయ సత్త్వరజస్తమోగుణమయము. లజ్జారాగాదులు రజస్సంభవములు. మోహాదులు తమస్సంభవములు. వైరాగ్యాదులు సత్త్వ సంభవములు. మానసిక జ్ఞానము గూడ సంభవమే. అది మాయా సంసారాంధకార సూర్యజ్యోతిః స్వరూపము. సంసారము మాయా కార్యము. మాయ సంసారకారణము. మనస్సున జనించు చివరి వృత్తి **అహమ్ బ్రహ్మాస్మి** యనునది. అదియే సూర్యజ్యోతిగా ఇట రూపింపబడినందున సంసారము నందు అంధకారారోపము అర్థసిద్ధమైనది. జ్ఞానసూర్యజ్యోతితో సంసారము బోగొట్ట గల శివునకు

మహస్సు అనగా దీపము ఆవశ్యకమా? దిగంబరునకు వస్త్రమావశ్యకమా? దిక్కులదాక వ్యాపించు శివుని శరీరమును చుట్ట బెట్టుటకు తగిన వస్త్రము సంభవించునా? ఆ శివునకు దిగ్వస్త్రము లిచ్చినంత అలంకారమును అనగా అందమును సాధారణవస్త్రము కలిగించునా! ప్రజ్ఞనే యజ్ఞోపవీతముగా ధరించిన శివునకు యజ్ఞోపవీతమేల? జ్ఞాని యజ్ఞోపవీతమును త్యజించుననుట సంన్యసించుననుట ప్రసిద్ధము గదా! జ్ఞానాగ్నిచే దేహాభిమానమును గాల్చి తద్భస్మమును అంగాంగముగా దాల్చిన చిన్మయశరీరము గల శివునకు గంధానులేప మందాసక్తి యుండునా? సిద్ధాంతరీత్యా వస్త్ర దీప యజ్ఞోపవీత గంధానులేపనా ద్యుపచారములు శివునకు మిథ్యోపచారములే అనగా అవి ఉపచారములు కాజాలవు.

**మాయతమమ్ముబాపు నహిమద్యుతియైన మనంపుబోధ తే**
**జోయుతుడున్ దిశాపట విశోభిత మూర్తియు బ్రజ్ఞ జందెమున్**
**బాయక దాల్చువాడు చితిభస్మము పూతగ నొప్పువాడున**
**స్థాయిపటోపవీత శుభచందన లేపములన్ ధరించునే.**

**అవతారిక :** పై అయిదు శ్లోకములలో **బాహ్యోపచారము** లాక్షేపింపబడినవి. ఈ శ్లోకమున **అహింసాద్యష్టోపచారము లంతర్యాగోపయోగములుగా** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ సర్వాహింసేంద్రియాశ్వద్రుతగతిశమనం సర్వభూతానుకంపా**
**శాంతిః సత్యప్రబోధో గురుకథితతపోనిశ్చలధ్యానదృష్టిః ।**
**శ్రద్ధా భక్తిశ్చ నిత్యం నిజవిషయపరిత్యాగితా నిస్పృహత్వం**
**సంవిత్పూజ్యేతి పుష్పాణ్యమలశివ! భవత్పూజనాయ క్రియంతే ॥ 107**

**ప్రతిపదార్థము :** సంవిత్పూజ్య! = ఓ జ్ఞానపూజ్యా, అమలశివ = ఓ స్వచ్ఛాశివా!, సర్వాహింసా = దేనిని హింసింపకుండుట, ఇంద్రియాశ్వ ద్రుతగతి శమనమ్ = ఇంద్రియములను గుఱ్ఱముల పరుగును శమింప జేయుట, సర్వభూతానుకమ్పా = అన్ని భూతములందలి దయ, శాంతిః = శాంతి, సత్యమ్ = సత్యము, ప్రబోధః = జ్ఞానము, గురుకథితతపః = గురువుచే చెప్పబడిన తపస్సు, నిశ్చల ధ్యాన దృష్టిః = చలించని ధ్యానమందలి చూపు, శ్రద్ధా = శ్రద్ధ, భక్తిః = భక్తి, నిజ విషయపరిత్యాగితా = తన విషయముల విడచుట, నిస్పృహత్వమ్ = కోరికలు లేకుండుట, ఇతి = అను, పుష్పాణి = పుష్పములు, భవత్పూజనాయ = నీ పూజ కొఱకు, **క్రియంతే** = సమకూర్పబడును.

**తాత్పర్యము :** ఏ భూతమును హింసింపకుండుట(సర్వాహింస) ఇంద్రియాశ్వముల పఱుగును

అదుపులో పెట్టుట, అన్ని భూతములందు దయ, గురువు చెప్పినట్లు తప మొనరించుట, దేవతాధ్యానమందు దృష్టి చెదర కుండుట, శ్రద్ధ, భక్తి, విషయపరిత్యాగము, నిస్పృహత అనునవి, సంవిత్పూజ్యుడు, స్వచ్ఛుడునైన శివునకు సమర్పింపదగిన పుష్పములు, కావున ఇవియే సమకూర్పబడును.

**వివరణము :** సర్వభూత దయతో సర్వ భూతముల కభయ మొసగుట తన వ్రతమని శ్రీరాముడు చెప్పెను. సంన్యాసాశ్రమ స్వీకారసమయమున ఇట్టి వ్రతము స్వీకరింపబడును. ఇంద్రియములు గుఱ్ఱముల వంటివి. వాని పరుగు నరికట్టుట **దమము** అని చెప్పబడును. మనస్సు యొక్క వేగము నరికట్టుట **శాంతి** యన బడును. గురువు చెప్పినట్లు తపోధ్యానాదులు చేయుట (గురుసేవచేయుట) **గుర్వనువృత్తి,** విషయ పరిత్యాగత **అపరిగ్రహమని** చెప్పబడును. నిస్పృహత **వైరాగ్యము**, ఇట్టి గుణములే సంవిత్పూజనములో పుష్పములుగా నుపయోగపడ దగినవి.

**భూతదయాస్పృహామల విబోధతపోవిషయ ప్రహాణస**
**త్యాతత శాంతి దాంత్య చరితాత్మమనః స్థితి భక్తిభావ సం**
**ఘాతము పుష్పజాతముగ కల్ప్యమగున్ శివ సంవిదర్చనన్**
**భూతపతీ మహావిమలబోధమయాపరిమేయ వైభవా!**

**అవతారిక :** పై శ్లోకమున **సత్యాహింసాది గుణ పుష్పపూజ** ప్రస్తావింప బడినది. ఈశ్లోకమున యోగినీ మాతృ శక్తులు **భైరవులు చేయు పుష్పపూజ** ప్రస్తావింప బడుచున్నది.

**శ్లో॥ బ్రాహ్మ్యాద్యా మాతరోఽష్టౌ స్వవిషయకుసుమైరాత్మభావప్రసూనై-**
**ర్యోగిన్యః శక్తయస్తే నిజనిజమహిమస్ఫూర్తిమన్మంజరీభిః ।**
**త్వద్భావం భావయద్భిస్తవ కిరణమహాభైరవైరాత్తసంగా-**
**స్త్వాం శ్రీచిద్భైరవేశం పరమశివగురుం పూజయంతి స్మరంత్యః ॥ 108**

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరశమ్భో!, బ్రాహ్మ్యాద్యాః = బ్రాహ్మిమొదలైన, అష్టౌ = ఎనమండుగురు, మాతరః = మాతలు, స్వవిషయకుసుమైః = తమకు విషయములైన పూలతో, యోగిన్యః = యోగినులు, ఆత్మభావప్రసూనైః = ఆత్మభావపుష్పములతో, శక్తయః = శక్తులు, నిజనిజ మహిమస్ఫూర్తి మన్మంజరీభిః = తమ తమ మహిమల ప్రకాశముల గల పూగుత్తులతో, త్వద్భావమ్ = త్వదాత్మకత్వమును, భావయద్భిః = భావించు, తవ = నీయొక్క, కిరణ మహా భైరవైః = కిరణములను మహాభైరవులతో, ఆత్తసంగాః = పొందిన

సంగముకల వారై, శ్రీచిద్భైరవేశమ్ = మంగళమయ చిద్భైరవేశ్వరుడవైన, త్వామ్ = నిన్ను, గురుమ్ = గురువును, స్మరంత్యః = స్మరించుచున్న వారై, **పూజయంతి** = పూజించెదరు.

**తాత్పర్యము :** బ్రాహ్మ్యాద్యష్టమాతృకలు రశ్మిభైరవులతో కూడిన వారై తమకు విషయములైన పూవులతో కాకిన్యాది యోగినులు ఆత్మభావ పుష్పంబులతో పరాది శక్తులు తమ మహిమల స్ఫూర్తులు గల పూగుత్తులతో శ్రీచిద్భైరవేశ్వరుడవైన పరమశివగురుస్వరూపుడవైన నిన్ను పూజించెదరు.

**వివరణము : బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణీ, చాముండీ, మహాలక్ష్మీ నామములుగల వారష్టమాతృకలు**. వీరు భూజలాగ్నివాయ్వాకాశేంద్రియములైన నాసారసనా చక్షుస్త్వక్ర్శోత్రేంద్రియములకు అంతరింద్రియములైన మనోబుద్ధిచిత్తములకు అధిదేవతలు. వీరికి గంధ రస రూప స్పర్శ శబ్ద మనన జ్ఞప్తి చింతనములు విషయములు. ఇవియే పుష్పములుగా వీరిచేత ఆత్మరూపియైన పరశమ్భువునకు పూజ చేయబడును. కాకిన్యాది యోగినులు చతుష్షష్టి సంఖ్యలు. ఒక్కొక్కరి కొక్కొక్క కోటి యోగినులు పరిచారికలుగా కలవారై నందున మహాయోగినులు అని పిలువబడుదురు. వీరు తమ భక్త్యాది భావపుష్పములతో శివు నర్చించెదరు. పరాదిశక్తులు మహిమోపేతలు. తమ మహిమల స్ఫూర్తులను పూలగుత్తులతో శివు నర్చించెదరు. 2. భైరవులందఱు చిద్భైరవ(వహ్ని)సూర్య రశ్మి రూపులు. చిద్భైరవుడు మంగళస్వరూపుడగుటచే శ్రీ చిద్భైరవేశ్వరుడుగా నీ శ్లోకమున చెప్పబడినాడు.

**పావనలష్టమాతృక లపారమహావిషయాత్మక ప్రసూ**
**నావలిశక్తులు న్నిజమహామహిమస్ఫురణాచ్ఛ పుష్ప గు**
**చ్ఛావలి యాత్మభావకుసుమావలి యోగినులున్ మహత్వసం**
**భావనులైన త్వత్కిరణ భైరవులన్ విహిత ప్రసక్తులై**
**శ్రీవరభైరవేశ్వరు స్మరించుచు బూజలు సేయుచుండరే.**

**అవతారిక :** పై శ్లోకమున అంతర్యాగమందలి **పుష్పోపచారముయొక్క సమర్పణము** చెప్పబడినది. ఈ శ్లోకమున **ధూప దీప నైవేద్యోపచార సమర్పణము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ సద్విద్యాంగారమధ్యార్పితసతతమహావాసనాభ్యాసధూపైః**
**శ్రీమద్వక్త్రారవిందోదితసకలకులామ్నాయబోధప్రదీపైః ।**

సర్వార్థాక్షాన్నభేదైరుపరచితమహాదివ్యనైవేద్యపానై-
రారాధ్యో యోగిభిస్త్వం కథమితరకృతైస్తోష్యసే శ్రీపరేశ! ॥ 109

**ప్రతిపదార్థము :** శ్రీపరేశ! = ఓ శ్రీపరేశా, సద్విద్యాంగారమధ్యార్పిత సతత మహా వాసనాభ్యాస ధూపైః = మంచి విద్యలనెడి నిప్పుల నడుమ వేయబడిన నిరంతర మహావాసనాభ్యాసము వలన నేర్పడిన ధూపములతో, శ్రీమద్వక్త్రారవిందోదిత సకల కులామ్నాయ బోధ ప్రదీపైః = జ్ఞానముకల (గురు) ముఖ కమలము నుండి పుట్టిన సకల కులామ్నాయ జ్ఞానములనెడి దీపములతో, సర్వార్థాక్షాన్నభేదైః = సర్వ విషయములనెడి ఇంద్రియములనెడి అన్న విశేషములుగల, దివ్యనైవేద్యపానైః = దివ్యనైవేద్య పానములచే, యోగిభిః = యోగులచేత, ఆరాధ్యః = పూజింపదగిన, త్వమ్ = నీవు, ఇతరకృతైః = ఇతరకృతములతో, కథమ్ = ఎట్లు, **తోష్యసే** = సంతోషింపజేయబడగలవు?

**తాత్పర్యము :** ఓ శ్రీపరేశా! సద్విద్యలనెడి నిప్పుల నడుమ వేయబడిన వాసనాభ్యాసములు అనెడి ధూపములతో, గురుముఖ కమలమునుండి పుట్టిన సకల కులామ్నాయ జ్ఞానములనెడి దీపములతో ఇంద్రియములతో ననుభవింప దగిన సర్వవిషయాన్నముల నైవేద్యములతో పానీయములతో యోగులచేత పూజింపదగిన నీవు ఇతరకృతములైన ధూపదీపనైవేద్య పానములతో నెట్లు సంతోషింప జేయబడగలవు?

**వివరణము :** సద్విద్యలు అనగా మంచి ఉపాసనలు. అవి చేయగా చేయగా వాసనలు కాలిపోవును. కాలునప్పుడు పొగవచ్చును. ఆ పొగ ధూపముగా యోగులు సమర్పింతురు. సద్విద్యలు నిప్పులుగా మహావాసనాభ్యాసము ధూపముగా రూపింపబడుటచే రూపకాలంకార మిందున్నది. 2. కులామ్నాయములు గురుముఖైకవేద్యములు. పుస్తకములు చదివిన ఏదో అర్థము స్ఫురించును. కాని సరియైన అర్థము స్ఫురించదు. కులామ్నాయములు వేదములవంటివి. వేదములు గురుముఖోదితములై శిష్యులచే శ్రుతములై శ్రుతులనబడినవి. గురూదితములు అనగా గురుశిష్య పరంపరాగతములు. కావున ఆమ్నాయము లనబడినవి. వేదములనగా జ్ఞానభాండారములు. అట్లే కులామ్నాయములవలన దివ్యప్రబోధములు కలుగును. ఆ ప్రబోధములు వేలు కలుగును. ఆ ప్రబోధములే ఇట దీపములుగా రూపింపబడినవి. ఇంద్రియములు శబ్ద స్పర్శ రూప రస గంధ సుఖాదికాన్నములను ఆత్మకు నివేదించు సాధనములు. సాధకులు విషయముల ననుభవించునప్పుడు అవి ఆత్మకు నివేదితము లగుచున్నవను పవిత్రభావనమును కలిగియున్నప్పుడు ఆ విషయసేవనము కూడ ఈశ్వరానుగ్రహసాధన మగును. అందువలన విషయములే ఇట

నివేదనీయాన్న పానములుగా చెప్పబడినవి. పైన చెప్పిన ధూపాద్యుపచారములను యోగులు మాత్రమే సమర్పింపగలరు. సాధారణులు బాహ్యధూపాద్యుపచారముల మాత్రము సమర్పించెదరు. ఆ సమర్పణము పుణ్యకర్మయే యైనను భేదబుద్ధిని శీఘ్రముగా నశింపజేయుజాలదు. కావున బహిర్యాగమందు ఉపచారసమర్పణము కన్న వాసనాదహనాభ్యాసము కులామ్నాయ జ్ఞానము, విషయాన్నపాననివేదనము లావశ్యకములు. అంతర్యాగమందు ధూపదీప నైవేద్యములుగా చెప్పబడిన వాని సమర్పణము భేదబుద్ధిని తొలగించుటలో నెక్కువగా ఉపయోగించును. చిత్తమును నిరోధించుటలో కర్మ బహిరంగము. ఉపాసనము అంతరంగము కావున బహిరుపచారములు లేని ఈ అంతర్యాగము (ఉపాసనము) చిత్తనిరోధద్వారమున జ్ఞానమును కలిగించుట కెక్కువ సహకరించును.

**విద్యల నిప్పులందు ఁబడవేసిన వాసనలన్ సుధూపముల్**
**ఉద్యృతదేశికోక్తి ఁగులబోధను దీపము లింద్రియార్థ నై**
**వేద్యములిచ్చు యోగులకుఁ బ్రీతుడవయ్యెదు నీవునట్లు స**
**మ్మోద్యుడవయ్యెదన్యకృత పూజల శమ్భుడ! శ్రీపరేశ్వరా!**

* * *

## -- విశేషోపచారపరామర్శ శాంతి ప్రకరణమ్ --

**అవతారిక :** పై ప్రకరణమున ముఖ్యముగా చివరి శ్లోకములలో **అంతర్యాగోపచారములు** పరామర్శింపబడినవి. ఈ ప్రకరణమున పంచభూతకృతములైన విశేషోపచారములు పరామర్శింపబడుచున్నవి. ముఖ్యముగా మొదటి శ్లోకమున **భూకృతములైన చందన వస్త్రధూప పాన తాంబూలాదులు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ విద్యానానావిభూషా మృగమదఘనసారాదిసౌరభ్యవస్తు-**
**ప్రోతశ్రీచందనాని ప్రవికచకుసుమాన్యద్భుతాన్యంబరాణి।**
**నానామోదాశ్చ ధూపాః క్రముకశకలవద్వీటికాః పానభేదాః**
**నానాపాత్రాణి భూమ్యా పరశివ! భవతః పూజనాయ క్రియంతే॥ 110**

**ప్రతిపదార్థము :** పరశివ! = ఓ పరశమ్భూ!, భూమ్యా = భూమిచేత, విద్యానానా విభూషాః = విద్యలనెడి అనేకములైన సొమ్ములు, మృగమదఘన సారాది సౌరభ్యవస్తు ప్రోతశ్రీచందనాని = కస్తూరి కర్పూరము మొదలైన సుగంధద్రవ్యములతో సిద్ధములైన శ్రీచందనములు,

ప్రవికచ కుసుమాని = వికసించిన పుష్పములు, అద్భుతాని = వింతైన, అంబరాణి = వస్త్రములు, నానామోదాః = అనేక వాసనలు గల, ధూపాః చ = ధూపములను, క్రముకశకలవద్వీటికాః = పోక ముక్కలు గల తాంబూలములు, పానభేదాః = పానీయ విశేషములు, నానాపాత్రాణి = అనేక పాత్రలు, భవతః = నీ యొక్క, పూజనాయ = పూజకొఱకు, **క్రియంతే** = చేయబడుచున్నది.

**తాత్పర్యము :** ఓ పరశమ్భూ! విద్యలను నానాభూషణములు, కస్తూరీకర్పూరాది సుగంధ ద్రవ్యములతో కూర్చబడిన శ్రీ చందనములు, అద్భుతములైన అంబరములు, వికసించిన పుష్పములు, అనేక వాసనలుగల ధూపములు, అనేక విధములైన పాత్రలు భూమి నుండి నీ పూజ కొరకు సిద్ధము చేయబడుచున్నవి.

**వివరణము :** విష్ణుసహస్రనామభాష్యమున శ్రీ శంకరులు సాంఖ్యయోగములు (శాస్త్రభేదములు) విష్ణువునకు కుండలములు అని చెప్పినట్లు ఈ శ్లోకమున వివిధ విద్యలు వివిధ భూషణములుగా రూపింపబడినవి. 2. కస్తూరీ కర్పూరాది సుగంధ ద్రవ్యములు చందనమునందు వేసి గంధము సిద్ధము చేయవలెను. అట్టి చందనము పరశమ్భు పూజ కుపయుక్తము. వికసించిన సుగంధిల పుష్పములు, సుగంధములైన నానావిధ ధూపములు, వింతైన వస్త్రములు భూమినుండి లేక భూమిజ వృక్షాదులనుండి సిద్ధము చేయబడును. భూమిగతములైన బావులు మొదలగు వానినుండి శుద్ధజలము తెచ్చికొని శర్కరాది భూమిజ ద్రవ్యములవేసి సిద్ధము చేయబడిన పానీయములు కూడ భూమినుండి వచ్చినవే అని గమనింపవలెను. భూషణోపచారము పూర్వ ప్రకరణశేషముగా నీ శ్లోకమున చెప్పబడినది. కావుననే పూర్వ ప్రకరణాంత్య శ్లోకములందు వలె రూప కాలంకారము నిబంధింపబడినది. గంధాది సామాన్యోపచారములే సిద్ధముచేయు ప్రక్రియ ననుసరించి చేయబడి విశేషోపచారములుగా పేర్కొనబడినవి. పూజాసమయమున ధూపపాత్రములు, గంధ పాత్రములు పానపాత్రములు మొదలగునవి పూజాస్థానమున ఆసాదింపబడవలె ననుట ఈ శ్లోకమున సూచించబడినది.

**బహువిధముల్ విభూషలు జవాదియు ఁగప్పురమాదిగా ముదా**
**వహ శుభ గంధవస్తువుల వాసితముల్ సిరిచందనమ్ములున్**
**బహువిధపుష్పధూపములు వస్త్రములున్ విడెముల్ సుపానముల్**
**బహువిధపాత్రముల్ మహి శివా భవదర్చనకై యుపాత్తముల్.**

**అవతారిక :** పై శ్లోకమున భూమియను భూతముచే చేయబడిన **శ్రీ చందనాద్యుపచారములు** చెప్పబడినవి. ఈ శ్లోకమున **నైవేద్యాదులు** (జల భూతములచే చేయబడినవి) చెప్పబడుచున్నవి.

**శ్లో॥ సప్తైతే మండలస్థాశ్చరుజలనిధయో దివ్యనైవేద్యరాశీ-**
**న్నానాపక్వాన్నభేదాన్ వివిధాపిశితవచ్ఛాకనానోపదంశాన్ ।**
**భక్ష్యం భోజ్యం చ చోష్యం వివిధశశిసుధాస్వాదవద్వస్తు లేహ్యం**
**హాలాదధ్యాజ్యదుగ్ధాన్యపి విదధతి తే సూపహారాయ శమ్భో!॥ 111**

**ప్రతిపదార్థము :** శమ్భో! = ఓ శమ్భూ, ఏతే = ఈ, సప్త = ఏడు, చరుజలనిధయః = చరుసముద్రములు, మండలస్థాః = మండలమునందు నిలువ బడినవై, దివ్యనైవేద్యరాశీన్ = దివ్యనైవేద్యరాశులైన, నానాపక్వాన్నభేదాన్ = అనేకపక్వాన్నవిశేషములును, వివిధాపిశితవచ్ఛాకనానోపదంశాన్ = వివిధములైన మాంసములుగల శాకములు, అనేక విధములైన పచ్చళ్ళు వడియములు మొదలైన వానిని, భక్ష్యమ్ = భక్ష్యమును, భోజ్యమ్ = భోజ్యమును, చోష్యమ్ = చోష్యమును, లేహ్యమ్ = లేహ్యమైన, వివిధశశి సుధాస్వాదవద్వస్తు = అనేక విధమైన చంద్రామృతము వంటి రుచిగల వస్తువును, హాలాదధ్యాజ్యదుగ్ధాని+అపి = కల్లును, పెరుగును, నేతిని, పాలను, తే = నీ యొక్క, సూపహారాయ = మంచి ఆహారముకొఱకు, **విదధతి** = చేయుచున్నవి.

**తాత్పర్యము :** ఓ పరశమ్భూ! ఈ మండలస్థ సప్త చరుజలనిధులే నానాపక్వాన్నములను, మాంసయుక్త శాకాదులను, భక్ష్య, భోజ్య చోష్యములను, చంద్రామృతము వంటి లేహ్యమును, కల్లును, పెఱుగును, నేతిని, పాలను నీ ఆహారము కొఱకు చేయుచున్నవి.

**వివరణము :** ఆహారము చతుర్విధము. భక్ష్యము (నమలదగినది), భోజ్యము (చప్పరించదగినది), చోష్యము (జుర్రుకొనదగినది), లేహ్యము (నాకదగినది), రొట్టెలు మొదలగునవి భక్ష్యములు, అన్నాదులు భోజ్యములు, పులుసు మొదలగునవి చోష్యములు, పచ్చళ్ళును, తేనె మొదలగునవి లేహ్యములు. ఈ అన్నియును రసప్రధానములే అనగా రుచి ప్రధానముగా గలవి. జలము రసమునకు జన్మస్థానములే అనగా రుచి ప్రధానముగా గలవి. జలము రసమునకు జన్మ స్థానము, జలము యొక్క సంబంధములేక ఏవస్తువును ఆహారింపదగినది కాదు. కావున జలనిధులే ఈ ఆహార పదార్థముల జేయుచున్నవని ఈ శ్లోకమున చెప్పబడినది. కల్లు, మాంసము మొదలగునవి ఇందు చెప్పబడుటచే వానిని

భుజించువారు వానిని పరశమ్భువునకు నివేదించియే భుజింపవలెనని సూచింపబడుచున్నవి. **'యదన్నా వై మనుష్యాస్తదన్నా వై దేవతాః'** (మనుష్యులకేది యన్నమో దేవతలకును అదియే అన్నము) అని గదా సూక్తి.

**మండలవాసి సప్తచరు మాన్యసముద్రము లన్నరాసులన్**
**వండిన మాంసశాకములు భక్ష్యము భోజ్యము చోష్యలేహ్యముల్**
**కుండల రస్యమద్యములు గోఘృతదుగ్ధ దధుల్ సుపానముల్**
**నిండుగ నీ నివేదనలు నీకయి సిద్ధము చేసె శంభుడా!**

**అవతారిక :** పై శ్లోకమున **జలభూతకృతమైన నైవేద్యోపచారము** చెప్పబడినది. ఈ శ్లోకమున (ఔర్వః) **అగ్ని రూప భూతకృతనీరాజనోపచారము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ మాత్రాకారైః ప్రదీపైర్దహనరవికలానాథనక్షత్రమాలా-**
**విద్యున్మాణిక్యముక్తారజతకనకధాత్వాదినానాప్రకాశైః ।**
**యుష్మన్నీరాజనాయై విరచితరచనం స్వప్రకాశాదిమూర్తిం**
**సర్వానందాత్మరూపం పరమశివ! గురుం భాసయత్యౌర్వతేజః ॥ 112**

**ప్రతిపదార్థము :** పరమశివ! = పరశమ్భో!, మాత్రాకారైః = జ్ఞాత్రాకారములైన, దహన రవి కలానాథ నక్షత్ర మాలా విద్యున్మాణిక్య ముక్తా రజత కనక ధాత్వాది నానా ప్రకాశైః = అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రమాలా, మెఱుపులు, మణులు ముత్తెములు, వెండి, బంగారు ధాతువులు మొదలైన అనేక ప్రకాశములుగల, యుష్మన్నీరాజనాయై = మీ నీరాజనము కొఱకు, విరచితరచనమ్ = చేయబడిన రచన గల, ఔర్వతేజః = బడబాగ్ని, స్వప్రకాశాదిమూర్తిమ్ = స్వప్రకాశమైన మొదటి ఆకారముగల, సర్వానందాత్మరూపమ్ = సర్వానందస్వరూపముగల, గురుమ్ = గురుడవైన, (త్వామ్ = నిన్ను), **భాసయతి** = ప్రకాశింపజేయును.

**తాత్పర్యము :** ఓ పరశమ్భో! జ్ఞాత్రాకారములైన అగ్ని సూర్యుడు చంద్రుడు నక్షత్రములు మెఱుపులు మణులు ముత్తెములు వెండి బంగారములు గల దీపములతో (బడబాగ్ని) నీకు నీరాజనము సిద్ధ మొనర్చిన బడబాగ్ని; ఆదిమూర్తివి, సర్వానందరూపుడవు, గురుస్వరూపుడవునైన నిన్ను ప్రకాశింపజేయుచున్నది.

**వివరణము :** సూర్యుడు, అగ్ని, మెఱుపులు, ముత్తెములు, మణులు, వెండి, బంగారు మొదలైన ధాతువులు స్థూలముగాక స్వయంప్రకాశములని చెప్పబడును. చీకటిలో తమకు

తామే వెలుగునని స్వయంప్రకాశములు, చంద్రుడు సూర్యుని వెలుగు తనపై పడిన పిమ్మట ప్రకాశించువాడగుటచే స్వయంప్రకాశుడు కాడని చెప్పవలెను. కాని సూర్య ప్రకాశము చంద్రునిపై పడుట అనునది మనకు అప్రత్యక్షము కావున ఈ శ్లోకమున చంద్రుడు స్వయంప్రకాశుడు గానే చెప్పబడినాడు. లేదా స్వయంప్రకాశచంద్రుడే బ్రహ్మాండమున మరొకడున్నాడని అంగీకరించి ఆ చంద్రుడీ శ్లోకమున చెప్పబడినాడు అనవలెను. పైన చెప్పబడిన సూర్యాదులు ఆత్మ (ప్రాణి) చే ప్రకాశింప జేయబడుచున్నవారే కావున స్వయం ప్రకాశులని చెప్పుటకు వీలులేదు. కావున ఈ ప్రపంచమున ఆత్మ యొక్కటియే స్వయం ప్రకాశము అది పరశమ్భు రూపము. గూఢముగా అనగా దేహాంతర్భాగమున కనబడక యుండి ప్రకాశించునది ఆత్మ. అట్లే జలమున కనబడక యుండి జలము నాహారించునది బడబాగ్ని. అది ఈ శ్లోకమున పరశమ్భువునకు (ఆత్మకు) నీరాజన మిచ్చుచున్నది, అని చెప్పబడినది. ఆ ఔర్వతేజో భేదములే సూర్యాదులు. సాధారణదీపములతో సాధారణులు నీరాజన మొసగుదురు. అంతర్యాగము చేయువారు మానసికముగ నిట్టి భావన చేసెదరు. ఆ భావనయే ఇట నీరాజనము. మాతృ అను పదమునకు జ్ఞాత అని అర్థము. మాత్రాకారములనగా జ్ఞాత్రాకారములు. సూర్యాదులకు స్వయంప్రకాశమైన ఆత్మ (మాత్రజ్ఞాతృ) తో సామ్యమును పురస్కరించుకొని సూర్యాదులు మాత్రాకారములని చెప్పబడినది.

**భ్రాజితవహ్నిభాను హిమ భాను భరాశితటిన్మహామణీ**
**రాజిత హైమ ధాతుతతిరమ్య బహు ప్రభమంత్రదీప నీ**
**రాజన స్వప్రకాశరుచిర ప్రథితాఖిలమోదరూప చి**
**త్తేజమవైన నీకు శివ తీర్చెదు వెల్గుల నౌర్వతేజమున్.**

**అవతారిక :** పై శ్లోకమున నీరాజనోపచార (ఔర్వ) **తేజో భూతకృతము చెప్పబడినది.** ఈ శ్లోకమున **వాయుభూతకృత గతిప్రధానములైన చతుఃషష్టి పూజాన్తర్గతములైన నాట్యచామరా-తపత్రవ్యజనాద్యుపచారములు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ ముద్రా నానార్థపోషా నతిపథచలితానష్టయోగాంశ్చ నాట్యం**
**తీర్థాక్రాంతిప్రణామం నిజకరణగతిం సర్వసిద్ధాంతవాచః।**
**కర్మజ్ఞానప్రవాహాన్ వ్యజనమపి మహా చామరాణ్యాతపత్రం**
**హస్త్యశ్వాదీన్ రథాం స్తే పరశివ! చరణేఽధ్యాస్య దాస్యం విధత్తే॥ 113**

**ప్రతిపదార్థము :** పరశివ! = ఓ పరశమ్భూ! నానార్థపోషాః = అనేకార్థముల వ్యంజించు,

ముద్రాః = ముద్రలను, నతిపథచలితాన్ = నమస్కారమార్గమున చలితములైన, అష్టయోగాన్ = అష్టయోగములను, నాట్యమ్ = నాట్యమును, తీర్థాక్రాంతిమ్ = తీర్థాటనమును, ప్రణామామ్ = ప్రణామమును, నిజ కరణగతిమ్ = తన యింద్రియముల జ్ఞానమును, కర్మజ్ఞానప్రవాహాన్ = కర్మజ్ఞానముల ప్రవహింపజేయు, సర్వసిద్ధాంతవాచః = సర్వసిద్ధాంతవాక్యములను, అపి చ = మరియు, వ్యజనమ్ = తాళ వృంతము, చామరాణి = చామరములను, ఆతపత్రమ్ = గొడుగులను, హస్త్యశ్వాదీన్ = ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వానిని, రథాన్ = రథములను, తే = నీయొక్క, చరణే = పాదమునందు, అధ్యాస్య = ఉంచి, దాస్యమ్ = సేవను, **విధత్తే** = చేయుచున్నాడు.

**తాత్పర్యము :** అర్చకుడు అనేకార్థముల వ్యంజించు ముద్రలు ధరించును. నమస్కార (శరణాగతి) మార్గమునందలి అష్టయోగముల నవలంబించును. నాట్య మొనర్చును, తీర్థాటన మొనర్చును, ప్రణామమొనర్చును. తన యందింద్రియ మార్గముల (పరమాత్మవైపు) గతిని నిర్దేశించును. కర్మ జ్ఞానముల ప్రవహింపజేయు సర్వసిద్ధాంతవాక్యముల నుపన్యసించును. వ్యజనచామరాతపత్ర హస్త్యశ్వ రథములను నీ చరణము నందుంచి దాస్యమొనర్చును.

**వివరణము :** పూజోపచారములలో పెక్కు ఉపచారముల సమర్పించునప్పుడు వివిధ ముద్రల నర్చకులు పట్టెదరు. నమస్కార ముద్ర (చేతులు జోడించుట) అందఱకు పరిచితమే. అట్లే యోనిముద్ర, సాష్టాంగ నమస్కారముద్ర, ధేనుముద్ర మొదలగునవి అర్చనాసమయమున ప్రదర్శింపబడుచుండును. ఆయా ముద్రలు ఆయా ఉపచారముల సూచించుటచే అవి నానార్థపోషకము లగును. ఒక్కొక్కప్పుడు రెండు మూడు ఉపచారములకు ఒకే ముద్ర ప్రదర్శింపబడును. ఇవి కాక మత్స్య, కూర్మ, శంఖ, చక్రాది ముద్రలు హస్తములతో ప్రదర్శింపబడుట జపమునకు ముందు వెనుకలలో చేయబడును. నాట్యమున బహువిధ ముద్రలు ప్రదర్శింపబడును. మంత్రయోగ, లయయోగ, నాదయోగ, కుండలినీయోగ, క్రియాయోగ, హఠయోగ, రాజయోగ, అజపాయోగములు భగవద్గీతలో చెప్పబడిన నిష్కామకర్మయోగ, ధ్యానయోగ, భక్తి యోగ, సాంఖ్యయోగములు కలవు. ధ్యానభక్తి యోగము లౌకయోగముగా భావింపబడును. సాధకులు వీని కొన్నింటి నంగములు కొన్నింటి నంగులుగా చేసికొని ఆయా యోగులుగా పేర్కొన బడియున్నారు. పాతంజలమైన అష్టాంగ యోగము రాజయోగముగా కొందఱిచే భావింపబడుచున్నది. వస్తి నౌలి ధౌతి మొదలగు కర్మలు ప్రధానాంగములుగాగల యోగము **హఠయోగమని** కొందఱచే భావింపబడుచున్నది.

యోగమున యమనియమములకు ప్రాధాన్యము కాదనరానిది. అవిలేక యే యోగమైనను పునాది లేనిదే యగును. కొందఱు యోగమున ఆసన ప్రాణాయామములకే అధికప్రాధాన్య మొసగుదురు. పూజా జపాదులకును ఆసన ప్రాణాయామముల ఆవశ్యకత యున్నది. శీర్షాసనము, మయూరాసనాదులైన ఆసనములు ఆరోగ్యోపయోగములేకాని ధ్యానోపయోగములుకావు. ధ్యానమునకు స్వస్తిక పద్మాసన వీరాసనాదులు కొన్ని మాత్రమే ఉపయోగపడును. అణిమాదిసిద్ధ్యర్థములైన యోగము నవలంబించువారు పరమేశ్వర ప్రాప్తికి దూరులుగానే ఉందురు. అర్చనాయోగము, ధ్యాన యోగాంతర్గతముగా కొందఱచే అంగీకరింపబడి నందున, ఆరంభాంతముల యందు ధ్యానము చేర్చబడి యుండును. అర్చనము నవవిధ భక్తులలో నొకటి. అది భక్తి యొక్క నవ విధములలో విస్తృత ప్రచారము గల విధము. అర్చనములలో మిక్కిలి చిన్నది పంచోపచారము. మిక్కిలి పెద్దది చతుఃషష్ట్యుపచారము. మధ్యమము షోడశోపచారము. ఛత్రచామరాదులు విశేషోపచారములు అయినను షోడశోపచారపూజాంగముగ కూడ కొన్ని విశేషోపచారముల సమర్పణము (మానసికముగా, వాచికముగా) కలదు. అర్చనము త్రివిధము. మానసికము, వాచికము, కాయికము. గంధం సమర్పయామీత్యాది వాక్యపఠనము వాచిక పూజ, గంధము మొదలగు నుపచారముల సమర్పించుట కాయికపూజ, మానసమున ఉపచారముల సమర్పణమును భావించుట మానసికము. మానసికమైన ఈ పూజ అంతర్యాగమున అంతర్భవించును. రాజోపచారములలో హస్త్యశ్వరథ పదాతి ఛత్రచామరాది సమర్పణ ముండును. సాంఖ్య యోగాది సర్వశాస్త్రసిద్ధాంతవాక్యముల పఠనము కాని ఆయా శాస్త్రసిద్ధాంతముల దిఙ్మాత్ర పరామర్శము గాని చేయబడును. అర్చనాంతమున అక్కడ ఉన్న వారందఱకు తీర్థ ప్రసాద వితరణము చేయబడును. ఇదిక్కడ ఒక విధముగా తీర్థక్రాంతియే. ప్రణామము అష్టవిధము. కరములతో, చరణములతో, ఉదరముతో, లలాటముతో, శిరముతో, వాక్కుతో, మనసుతో, చెవులతో (అను ఎనిమిది అంగములతో) చేయబడుటచే అష్ట విధము. ఒకే సారి ఈ ఎనిమిది అంగములతో నమస్కరించి నప్పుడు ఆ నమస్కారము(ప్రణామము) **అష్టాంగప్రణామము** అనబడును. **నిజకరణగతి** అనగా **ధ్యానము.** అందు తన బయటి యింద్రియముల నిరోధముండును. ఇవి యన్నియు పరమేశ్వర సేవలో భాగము, అనియు శ్లోకమున చెప్పబడినది.

**అతిపథ చాలనమ్ములును అర్థసుపుష్టము లష్టయోగముల్**
**తతనటనమ్ము ముద్రలును తైర్థగతుల్ కరణ ప్రచారముల్**

**నతియు సమస్తసిద్ధవచనమ్ములు కర్మసుబోధ వాహ సం**
**తతి వ్యజనమ్ము చామర రథమ్ము లిభాశ్వము లాతపత్రముల్**
**చతురత నీ కొసంగి పరశంభుడ వాయువు చేయు దాస్యమున్.**

**అవతారిక :** పై శ్లోకమున **వాయుభూతకృతములైన** కొన్ని **విశేషోపచారములు** చెప్పబడినవి. ఈ శ్లోకమున **ఆకాశ భూతకృతములైన గీత వాద్యాది ధ్వని మయోపచారము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆకాశః శబ్దభేదైః ప్రలయ జలధరామందదంభోలిజృమ్భై-**
**ర్భేరీనిస్సాణవాద్యైర్దరనికరరవైర్భూరిఘంటానినాదైః।**
**తాలైర్నాదైర్మృదంగైర్మురజడమరుకైర్గీతసద్వల్లకీభిః**
**సర్వైర్వాద్యప్రభేదైర్ ధ్వనిభిరిహ విభో! నాదపూజాం కరోతి॥** **114**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ ప్రభో! ఆకాశః = ఆకాశము, శబ్దభేదైః = శబ్దభేదములైన, ప్రలయజలధరామందదమ్భోలిజృమ్భైః = ప్రలయకాల మేఘముల గొప్ప వజ్రము యొక్క విజృంభణముల చేత, భేరీనిస్సాణవాద్యైః = భేరీపటహ వాద్యముల చేత, దరనికరరవైః = శంఖసమూహధ్వనులచేత, భూరిఘంటానినాదైః = గొప్పగంటల ధ్వనులచేత, తాలైః = తాలములచేత, నాదైః = నాదములచేత, మృదంగైః = మృదంగములచేత, మురజడమరుకైః = మురజ, డమరుకముల చేత, గీతసద్వల్లకీభిః = గీతముల చేత, మంచి వీణల చేత, సర్వైః = అన్ని, వాద్యప్రభేదైః = వాద్యప్రభేదములచేత, ధ్వనిభిః = ధ్వనులచేత, ఇహ = ఇక్కడ, నాదపూజామ్ = నాదపూజను, **కరోతి** = చేయుచున్నది.

**తాత్పర్యము :** ఆకాశము ప్రలయకాలమేఘముల యొక్క, భేరీనిస్సాణముల యొక్క, గొప్ప శంఖముల యొక్క, గొప్ప గంటల యొక్క, తాలముల యొక్క, మృదంగముల యొక్క, మురజడమరుకముల యొక్క, పాటల యొక్క, మంచి వీణల యొక్క ధ్వనుల చేత ఈ లోకమున నాద పూజనొనర్చుచున్నది.

**వివరణము :** పూజాసమయమున ముఖ్యముగా నీరాజనసమయమున వివిధ వాద్యములు వాయింపబడును. పాటలు పాడబడును. మొత్తము ఆ ధ్వని యంతయు ప్రలయకాల మేఘ గర్జనమనిపించును. ఆ మహాధ్వనిలో సర్వశబ్దములు లీనమగును. ఇంద్రియముల కార్య క్రమము ఆగిపోవును ఆ స్థితి ఒక విధమైన ధ్యానావస్థకు దారితీయును.

**నభమును శబ్దభేదములనాశకరాంబుద వజ్రఘోషలన్**
**శుభమురజమ్ము ఘంటికలు శుభ్రదరమ్మును భేరితాళముల్**
**నిభృతమృదంగమున్ డమరునిస్తులవీణలు నాది వాద్యముల్**
**ప్రభవమొనర్ప ఁబూజలను స్వామికి గూర్చు ననంత మూర్తియై.**

**అవతారిక :** పై శ్లోకమున **ఆకాశభూతకృత నాదపూజ** వర్ణింప బడినది. ఈ శ్లోకమున **భైరవీ భైరవకృత స్తుతి** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ శాంభవ్యో రశ్మిదేవ్యః సమరసముదితా మాతృకావర్ణరూపా**
**భాస్వంతో భైరవా నిర్మలసరసకలాపానమత్తాః క్రమస్థాః।**
**వేదాంతైరాగమాంతైరభిదధతి పరం వైభవం శామ్భవం తే**
**సర్వానిర్వాచ్య సత్తావియదుదితపదం శ్రీవిభో! విశ్వమూర్తే!॥ 115**

**ప్రతిపదార్థము :** విశ్వమూర్తే! = ఓ విశ్వమూర్తీ!, శ్రీవిభో! = శ్రీవిభూ, శాంభవ్యః = శంభువునకు సంబంధించిన, సమరసముదితాః = సమరసముతో ఆనందించిన, మాతృకావర్ణరూపాః = మాతృకావర్ణరూపులైన, రశ్మిదేవ్యః = కిరణదేవతలు, భాస్వంతః = ప్రకాశించుచున్న, నిర్మలసరసకలాపానమత్తాః = నిర్మలములైన సరసకలల ద్రావుటచే మత్తులైన, క్రమస్థాః = క్రమమునందున్న, భైరవాః = భైరవులు, వేదాంతైః = వేదముల సిద్ధాంతములైన, ఆగమాంతైః = ఉపనిషత్తుల చేత, సర్వానిర్వాచ్య సత్తావియదుదితపదమ్ = ఎవరికిని చెప్పరాని సత్తాకాశము పుట్టిన, స్థానముగాగల, పరమ్ = గొప్పనైన, తే = నీయొక్క, వైభవమ్ = వైభవమును, **అభిదధతి** = చెప్పెదరు.

**తాత్పర్యము :** శివ భక్తులైన మాతృకావర్ణరూపలైన రశ్మిదేవతలు ప్రకాశించుచున్న **అష్టభైరవులు.** సమరసముదితులై నిర్మలమైన సరసమైన కలల పానముచే మత్తులై క్రమమునందున్న వారై వేదసిద్ధాంతములైన ఉపనిషద్వాక్యములతో, ఎవరికి చెప్పరాని సత్తాకాశము బుట్టిన చోటుగా గల నీ మహత్తర వైభవమును చెప్పెదరు.

**వివరణము :** భైరవీ భైరవులు శక్తి శివతేజోరూపులు. వారు శివశక్తులవలె సమరస ముదితులు. ఎవరెక్కువయో, ఎవరు తక్కువయో చెప్పరాదు. అట్టివారు ఎవరికి చెప్పరాని సత్త అనగా అనిర్వాచ్య సత్తకల పరశమ్భు వైభవమును ఉపనిషద్వాక్యముల ననుసరించి వివరించు చుందురు.

**సమరసమోదివర్ణమయసత్తను శాంభవరశ్మి దేవులున్**
**క్రమగతులున్ ప్రభాకరులు రమ్యకలాహరు లష్టభైరవుల్**
**విమల మహాగమాంతముల విశ్వమయా నిఖిలోక్తి దూర స**
**త్త్వమయ వియత్పదమ్మగు భవత్పరవైభవమే వచించెదున్.**

**అవతారిక :** పై శ్లోకమున **భైరవీ భైరవకృత స్తుతి** వర్ణింప బడినది. ఈ శ్లోకమున **యోగినీ క్షేత్రపాలకృత పుష్పపూజ** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ యోగిన్యః క్షేత్రపాలాః సరసమధుమదా వేదశాస్త్రార్థతత్త్వ-**
**వ్యాఖ్యానధ్యానవక్త్రాః పితృవనదశదిగ్వృక్షగా భైరవాశ్చ।**
**సౌధాస్వాదప్రమత్తాః ప్రకటితవికటాట్టోపసింహాట్టహాసాః**
**స్వస్వవ్యాపారపుష్పైః పరమశివ! గురుం త్వాం విభో! పూజయంతి॥ 116**

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరశమ్భూ!, యోగిన్యః = యోగినులు, క్షేత్రపాలాః = క్షేత్రపాలురైన, సరసమధుమదాః = సరసమైన మధువుయొక్క మదము కలవారై, వేద శాస్త్రార్థ తత్త్వవ్యాఖ్యాన ధ్యాన వక్త్రాః = వేద శాస్త్రముల వ్యాఖ్యానించు ధ్యానించు ముఖము కలవారై, పితృవన దశ దిగ్వృక్షగాః = శ్మశానమందలి పది దిక్కులలోని వృక్షములందున్న, భైరవాః చ = భైరవులును, సౌధాస్వాదప్రమత్తాః = అమృతమునకు సంబంధించిన ఆస్వాదముచే మత్తులై, ప్రకటితవికటాట్టోపసింహాట్టహాసాః = ప్రకటింపబడిన వికటమైన ఆటోపముతో కూడిన సింహము యొక్క నవ్వు వంటి నవ్వుగలవారై, స్వస్వవ్యాపారపుష్పైః = తమతమ వ్యాపారములనెడి పుష్పములతో, గురుడవైన, త్వామ్ = నిన్ను, **పూజయంతి** = పూజించెదరు.

**తాత్పర్యము :** ఓ పరశమ్భునాథ! యోగినులు క్షేత్రపాలురైన సరసమధువు యొక్క మదముకల, వేద శాస్త్రముల అర్థముల వ్యాఖ్యానించు ధ్యానించు ముఖములుగల, శ్మశానము యొక్క పది దిక్కులందలి వృక్షముల యందున్న భైరవులును అమృతము ద్రావి మత్తులై గర్వమును ప్రకటించు సింహగర్జనము వంటి నవ్వులు గలవారై, తమ తమ వ్యాపారములనెడి పుష్పములతో గురుడవైన నిన్ను పూజించుచుందురు.

**వివరణము :** కాకినీ శాకినీ డాకిన్యాది యోగినులు, భైరవులు, క్షేత్రపాలకులు వారు మధువును సుధను ద్రావి మత్తులైనను వివేకమును గోల్పోలేదు. ఆ మత్తు సంతోషరూపమే కాని ఆత్మ జ్ఞానాపహారకము కాదు. వారెప్పుడు వేదశాస్త్రార్థ తత్త్వములను

వ్యాఖ్యానించుటయేకాక ఆ వ్యాఖ్యాతార్థమును ధ్యానించుచుందురు. శ్మశానము శమ్భు నివాసము, దానిచుట్టును వివిధములైన వృక్షములున్నవి. ఆ వృక్షములపై వారున్నారు. ఆనందమును బట్టజాలనప్పుడు వికటాట్టహాసము చేయుచున్నారు. అట్టి హాసము సింహగర్జనమును పోలి యున్నది. తమ విధిని నిర్వహించుటయే స్వామికి పుష్పసమర్పణ పూజగా భావించుచుందురు. తమ విధుల నేమఱక చేయుచుందురు.

**ఘనతరవేదశాస్త్రచయగాఢరహస్యమువిప్పిచెప్పు యో**
**గినులును క్షేత్రపాలకులు కేవల పైతృకభూమి వృక్షచా**
**రణులు మహాట్టహాసులు సురామదమత్తులు భైరవుల్ మహే**
**శుని దమవ్యాపృతి ప్రసవశోభన పూజలు సేయుచుండరే.**

**అవతారిక :** పై శ్లోకమున **యోగినీ భైరవకృతపూజ** వర్ణింపబడినది. ఈ శ్లోకమున **యోగినీ సహిత భూతప్రేత పిశాచాది కృత ధ్యానగానములు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ భూతాః ప్రేతాః పిశాచాః స్వవికృతివిభవైః ప్రాప్తబీభత్సవేషా**
**యోగిన్యస్తే శ్మశానావరణగతమహాదేవతా భాసయంతి।**
**దేవాస్తే పూర్వదేవా మధురసముదితా విస్మయావిష్టచిత్తాః**
**శాంతా ధ్యాయన్తి గాయన్త్యపి పరమశివ! త్వామ్ముదోపాసతే చ ॥ 117**

**ప్రతిపదార్థము :** పరమశివ! = ఓ పరశమ్భూ, భూతాః = భూతములు, ప్రేతాః = ప్రేతములు, పిశాచాః = పిశాచములు, స్వవికృత విభవైః = తమవికారవైభవములతో, ప్రాప్తబీభత్సవేషాః =పొందబడిన బీభత్సవేషములు గలవారై, యోగిన్యః = యోగినులు, తే = నీ యొక్క, శ్మశానావరణగతమహాదేవతాః = శ్మశానావరణ మందున్న మహాదేవతలను, భాసయంతి = ప్రకాశింపజేయుదురు, తే = ఆ, దేవాః = దేవులును, పూర్వదేవాః = రాక్షసులును, మధురసముదితాః = మధురసముచే సంతోషించిన వారై, విస్మయావిష్టచిత్తాః = ఆశ్చర్యముచే ఆవేశింపబడిన మనస్సుగలవారై, శాంతాః = శాంతులై, ముదా = సంతోషముతో, త్వామ్ = నిన్ను, **ధ్యాయంతి** = ధ్యానించెదరు, **గాయంతి** = స్తుతించెదరు, **ఉపాసతే** చ = ఉపాసించెదరుకూడ.

**తాత్పర్యము :** ఓ పరమశివా! తమ వికారవేషముల వైభవములతో బీభత్సవేషము నొందిన భూతప్రేత పిశాచములు, యోగినులు నీ శ్మశానావరణమందలి దేవతల ప్రకాశింపజేసెదరు. ఆ దేవతలు రాక్షసులు మధువు సేవించి సంతోష మత్తులో ఆశ్చర్యము నొందిన చిత్తములు

గలవారై నిన్ను స్తుతించుచు ధ్యానించుచు ఉపాసించుచుందురు.

**వివరణము :** అంత్యేష్టి సంస్కారములకు నోచుకొనని ప్రాణులు భూతప్రేతపిశాచములుగా జన్మించి ఆకలిదప్పులు కలవారైనను తినుటకును త్రాగుటకును చేతకాని వారై యుందురు. యోగినులు శివుని శ్మశానావరణమందలి మహా దేవతల ప్రకాశింపజేసెదరు. ఆ దేవులు మధురసముదితులైన ఆ పూర్వ దేవులు అనగా రాక్షసులు సంతోషముగా శివుని స్తుతించుచు ధ్యానించుచు ఉపాసించెదరు. స్తుతి వాచికము, ధ్యానము మానసికము, ఇవి రెండును ఉపాసనాంగములు. స్తుతి బహిరంగము, ధ్యానము అంతరంగము.

**ప్రేతపిశాచభూతములు పెక్కులు యోగినులున్ భవచ్ఛ్మశా**
**నాతతదేవతా ప్రకటనాదరులాగత విస్మయుల్మధు**
**ప్రీతులు దేవదానవులు ప్రీతిని బాడెదరెప్డు శాంతులై**
**చేతమునందుపాసనల ఁజేయుదురో శివ! నిన్ను గూర్చియే.**

**అవతారిక :** ఈ శ్లోకమున బ్రహ్మాది కృతములైన వేదగాన పుష్ప వాద్యనృత్తాదులు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ బ్రహ్మా వేదోక్తగానైర్హరిరపి కమలైస్తాండవైశ్చండరుద్రా-**
**స్తౌర్యత్రయ్యా మహేంద్రో నిజనిజవిషయైరన్యదిక్పాలదేవాః ।**
**సిద్ధాః సర్వే మునీంద్రాః స్తుతినతివచనైః సర్వదుర్గాగణేశా**
**నృత్తైర్వాద్యప్రభేదైర్విదధతి సుముదం తే మహాదేవ! శమ్భో!॥ 118**

**ప్రతిపదార్థము :** మహాదేవ! = ఓ మహాదేవ, శమ్భో = ఓ శమ్భూ, బ్రహ్మా = బ్రహ్మ, వేదోక్తగానైః = వేదోక్తగానములతో, హరిః+అపి = విష్ణువును, కమలైః = కమలములతో, చండరుద్రాః = చండరుద్రులు, తాండవైః = తాండవములతో, మహేంద్రః = దేవేంద్రుడు, తౌర్యత్రయ్యా = నృత్యగీతములతో, దిక్పాలదేవాః = దిక్కులను పాలించు దేవతలు, నిజనిజవిషయైః = తమతమ విషయములతో, సిద్ధాః = సిద్ధులు, సర్వే = అందఱు, మునీంద్రాః = మునీంద్రులు, స్తుతినతివచనైః = స్తుతులచే, నమస్కారములచేత, సర్వదుర్గాగణేశాః = అందఱుదుర్గల చేత, గణేశులతో, నృత్తైః = నృత్తములతో, వాద్యప్రభేదైః = వాద్యవిశేషములతో, తే = నీకు, సుముదమ్ = మిక్కిలి సంతోషమును, **విదధతి** = చేయుచుందురు.

**తాత్పర్యము :** ఓ మహాదేవా! పరశమ్భూ! బ్రహ్మ వేదోక్తగానములతో, విష్ణువు కమలములతో,

చండ రుద్రులు తాండవములతో, దేవేంద్రుడు నృత్యగీతములతో, దిక్పాలక దేవతలు తమతమ విషయములతో, సిద్ధులు, మునీంద్రులందఱు స్తుతులతో నమస్కార వచనములతో, సర్వదుర్గా, గణేశులు నృత్తములతో వాద్యవిశేషములతో నీకు మిక్కిలి సంతోషమును కలిగించుచున్నారు.

**వివరణము :** యజుర్వేదోక్తములతో, సామవేదగానములతో బ్రహ్మ పరశమ్భువును సంతోష పెట్టును. ఋగ్వేదమునందు సూక్తములు అనగా మంత్ర సమూహములు, యజుర్వేదమునందు ఉక్తములు అనగా గద్యములు ఉండును. వాని పఠనము వలన శివుడు సంతోషించునని బ్రహ్మ యా పని చేయును. లౌకికగానమే సర్వసంతోషజనకమై యుండ సామవేదగానము సర్వ సంతోష హేతువెట్లుగాకుండును. విష్ణువు శివుని సహస్రకమలములతో పూజించు చుండగా శివుని మాయచే నొక పుష్పము తక్కువయ్యెను. ఆ విష్ణువు కమలాక్షుడు. కావున తనకన్నైన కమలమును వానితో కలిపి అనన్యనముగా సహస్రకమలార్చనము పూర్తి చేసెను. శివుడు ఆతని భక్తికి సంతోషించి విష్ణువునకు చక్రము నొసగెను. గాన పురాణ కథ **'హరిరపి కమలైః'** అను పదములు తెలుపును. రుద్రుల సంఖ్య పదునొకండని, వంద అని సహస్రమని వివిధముగా పేర్కొన బడినది. వారందఱు చండులే అనగా కోపము గలవారే. కోపార్థకమైన చసి ధాతువునుండి చండ శబ్దము నిష్పన్నమైనది. నృత్యగీతములు **తౌర్యత్రిక**మనబడును. అది ఈ శ్లోకమున తౌర్యత్రయి అని పేర్కొనబడినది. ఇంద్రుడు దానితో శివుని సంతోష పెట్టునని ఈ శ్లోకమున చెప్పబడినది. దేవతలలో కొందఱు దిక్పాలురు. వారిలో ఇంద్రుడు పూర్వ దిక్కునకు అధిపతి. అగ్ని, యమ, నిరృతి, వరుణ వాయు, కుబేరేశానులు, క్రమముగా ఆగ్నేయ్యాది దిక్కులకు అధిపతులు. వీరందఱు శివుడు తమకొసగిన విషయములతో అనగా అధికారముల (విధుల) నిర్వహించుచు శివుని సంతోషింప జేయుదురని ఈ శ్లోకమున చెప్పబడినది. నిత్యముక్తులైన కొందఱు జీవులు శివుని జగద్వ్యాపారమున సహకరించెదరు. వారు సిద్ధు లనబడుదురు. సంకల్పముల నిరోధించు యోగులు ముని లనబడుదురు. అట్టి మునులలో శ్రేష్ఠులు మునీంద్రులు. వారు స్తుతి వాక్యములతో, నతి వాక్యములతో పరమశివుని సంతోషింపజేసెదరు. దుర్గలు నవసంఖ్యాకలు, గణేశు లసంఖ్యాకులు. వారు నృత్తములతో వాద్య విశేషములతో శివునకు సంతోషమును కలిగించెదరు. ప్రతికదలికకు అర్థము గలది నృత్యము. నృత్తము ప్రతి కదలికకు విడిగా భావస్ఫోరకత్వ ముండదు. మొత్తమునకు భావ రస స్ఫోరకత్వ ముండును. స్త్రీల నృత్తము లాస్య మనబడును. కావున

దుర్గలు తమ లాస్యములతో శివుని సంతోషింప జేయుదురు. గణేశులు వాద్య విశేషములు ప్రయోగించుచు శివతుష్టిని కలిగించెదరు.

**నలిన భవుండు వేదవచనమ్ముల రుద్రులు తాండవమ్ములన్**
**నలినదలేక్షణుండు నలినమ్ముల నింద్రుడు భవ్యనృత్యగీ**
**తుల దివిజుల్ దిగీశ్వరుల తుల్యములౌ విషయమ్ములన్ గణే**
**శులును సమస్తదుర్గలు సుశోభననృత్యవిశేషవాద్య క**
**మ్ముల మునిసిద్ధులున్ స్తుతుల మోదము హెచ్చుగ నీకు ఁగూర్పరే.**

**అవతారిక :** పంచభూతకృత విశేషోపచారముల యొక్క యోగినీ భైరవ భూత ప్రేతపిశాచాదుల స్తుతిధ్యానాదుల యొక్క సమర్పణమునకు పిమ్మట పై శ్లోకమున బ్రహ్మాదుల **శివుని హేతుపూజ, వాద్యగాన నాట్యములు** చెప్పబడినవి. ఈ శ్లోకమున పరశమ్భువుయొక్క **సకల బ్రహ్మాండ శరీర వ్యాప్తి** చెప్పబడు చున్నది.

**శ్లో॥ సంతప్తః ప్రేతసింహాసనవిహితమహాభైరవః శామ్భవాగ్నిః**
**పంచాశద్విస్ఫులింగాక్షరవిదితపరాఘోరవిద్యోగ్రతేజాః ।**
**సత్యాంతర్యజ్ఞదేవస్త్రిభువనహవిషా తోషితాత్మీయరశ్మి-**
**ర్వాగర్థవ్యక్తభావాత్సకలమిహ తనుం వ్యశ్నువానో విభాతి ॥ 119**

**ప్రతిపదార్థము :** సంతప్తః = సంతాపముగల, ప్రేతసింహాసనవిహిత మహాభైరవః = ప్రేతసింహాసన మందున్న భీకరమైన, శామ్భవాగ్నిః = శమ్భు సంబంధమైన అగ్ని, పంచాశత్‌విస్ఫులింగాక్షర విదిత పరాఘోరవిద్యోగ్రతేజాః = ఏబది మిణుగురులనెడి అక్షరములతో చేయబడిన శ్రేష్ఠమైన అఘోరవిద్యయను ఉగ్రతేజముగల, సత్యాంతర్యజ్ఞదేవః = సత్యములోని యజ్ఞ దేవరూపుడైన, త్రిభువనహవిషా = త్రిభువనమను హవిస్సుతో, తోషితాత్మీయరశ్మిః = సంతోషింప జేయబడిన తన కిరణములు గలదై, వాగర్థవ్యక్తభావాత్ = వాగర్థముల వలన వ్యక్తమైన భావము వలన, సకలమ్ = సమస్తమైన, తనుమ్ = దేహమును, ఇహ = ఇచ్చట, వ్యశ్నువానః = వ్యాపించునదై, **విభాతి** = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము :** సంతప్తమైన ప్రేత సింహాసనమందున్న అతిభీకరమైన శాంభవాగ్ని సత్యములోని యజ్ఞదేవరూపమై త్రిభువనహవిస్సుతో తన రశ్మిల సంతోషింపజేయునదై వాగర్థ వ్యక్తమైన భావము వలన సర్వశరీరమును వ్యాపించుచు ప్రకాశించుచున్నది.

**వివరణము :** ప్రేతముల దహనముతో సంతసించిన శామ్భవాగ్ని మిణుగురులు వెదజల్లును.

ఆ మిణుగురులే ఏబది వర్ణములు. వానిలో అఘోరవిద్య యను ఉగ్రతేజ మున్నది. సింహాసన మందున్న కాళ్ళు నాలుగు, ఫలకమును ప్రేతములు. కావున ఆ సింహాసనము ప్రేతసింహాసన మనబడును. వాస్తవమునకు సర్వవ్యాపకమైన ఆత్మ దేనికి సంబంధించదు. కావున ప్రాణమున్న శరీరము కూడ ప్రేతమే. ఇట్టి శరీరము సింహాసనముగా గల పరశమ్భువు ప్రేతసింహాసన గతుడు. అతడు సూక్ష్మశరీరము నాశ్రయించి స్థూలశరీరములోనికి రాకపోకల చేయుచుండును. ప్రేత శబ్దమునకు వాస్తవికమైన అర్థము జడమనియే. స్థూలశరీరమున సూక్ష్మశరీరసంబంధము లేనప్పుడు చైతన్యస్పర్శ ముండదు. అట్లే మోక్షము కలిగిన పిమ్మట సూక్ష్మశరీరము నశించును. అనగా అది జడజగ మందు కలిసి పోవును. **'న తస్య ప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమవలీయంతే'** అను శ్రుతి ననుసరించి సూక్ష్మ అనగా అపంచీకృత ప్రాణవాయువు స్థూలవాయువున కలిసిపోవును. అట్లే ముక్తుని అవసాన కాలమున ఆతని అపంచీకృతభూతరూపేంద్రియములును స్థూలభూతములందు కలిసిపోవును. చైతన్యమొక అగ్ని. దానియందు హవిస్సువంటిది త్రిభువనము. చైతన్యాంశములైన చిద్విస్ఫులింగములు వ్యాపించిన త్రిభువనము జడమైనను చేతనము వలె భాసించును. చైతన్యమనగా జ్ఞానము. అది వాగర్థ ద్విదళ బీజముగా సమస్తజగముగా రూపొందును. ఈ జగము శివశక్త్యాత్మకము. శబ్దము శక్తి. అర్థము శివుడు. పంచాశదక్షరములు శబ్ద శక్తి మయములు. వాని యందు అఘోరవిద్యయను ఉగ్రతేజము వ్యాపించియున్నది. శబ్దము అర్థమును విడచి యుండదు. ఆ శబ్దమునకు చెందిన అక్షరముల అఘోర విద్యోగ్రతేజమున వ్యాపించి యుండువాడు పరశమ్భువే. ఆయన శాంతుడు గావున అఘోరుడని చెప్పబడినాడు. తత్ప్రతిపాదకవిద్య అఘోరవిద్యయైనది. ఆ ఉగ్రతేజ స్వరూపుడైన శమ్భువునందు త్రిభువన హవిస్సు వ్రేల్చబడుచున్నందున అతడు యజ్ఞదేవుడైనాడు. ఆయన సత్యస్వరూపుడు. ఆయనలో నిరంతర సుయజ్ఞము జరుగుచుండును. దాని వలన రశ్మిదేవతలకు శామ్భవాగ్న్యంశములకు అనగా విస్ఫులింగములకు సంతోషమును కలుగును. ఈ విధముగా పరశమ్భువను అగ్ని వాగర్థమయమైన, త్రిజగద్రూప తనువున వ్యాపించుచు వెలుగుచున్నది.

**ప్రైతవరాసనా విహిత భైరవమైన యఘోరమంత్ర తే**
**జోతివిదక్షరార్ధశతసూచి సదంతర యజ్ఞదేవతా**
**నాతురమైన లోకహవిరాహృతి తోషిత నైజరశ్మి సం**
**ఘాతమునైన సర్వతనుగామి సుశాంభవ వహ్ని వెల్గెడున్.**

**అవతారిక :** పై శ్లోకమున **శామ్భవాగ్ని యొక్క శరీరవ్యాప్తి** చెప్పబడినది. ఈ శ్లోకమున దానిలో **చంద్ర నక్షత్రాది కాంతుల విలీనము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ సర్వజ్ఞానైకభూమిస్త్రిభువనకరవీరాఖ్యశూన్యశ్మశాన-**
**జ్ఞానాకూపారపూరః శ్రుతిమఖబహువిచ్ఛాస్త్రబోధోదవాహాన్ ।**
**ప్రజ్ఞాగాంభీర్యగర్వాన్గ్రసతి రవిరివ స్వప్రకాశాత్ ప్రకాశా-**
**నన్యానిందూదుముఖ్యాన్నిబిడతరరుచిర్ధ్వాంతపూరాంస్తవాగ్నిః ॥ 120**

**ప్రతిపదార్థము :** సర్వజ్ఞానైక భూమిః = అన్ని జ్ఞానములకు ఏకాధారమైన, త్రిభువన కరవీరాఖ్య శూన్యశ్మశాన జ్ఞానాకూపార పూరః = త్రిభువన కరవీరమను పేరుగల శూన్య శ్మశాన జ్ఞానసముద్రప్రవాహముగల, తవ = నీయొక్క, అగ్నిః = అగ్ని, శ్రుతిమఖ బహువిత్ = వేదాద్యనేకముల నెఱిగిన, శాస్త్రబోధోదవాహాన్ = శాస్త్రజ్ఞానమేఘములను, ప్రజ్ఞాగాంభీర్య గర్వాన్ = ప్రజ్ఞాగామ్భీర్యగర్వములుగల, స్వప్రకాశాత్ = తన ప్రకాశము వలన, నిబిడతరరుచిః = అధికతర కాంతిగల, రవిరివ = సూర్యునివలె, ఇందూదుముఖ్యాన్ = చంద్రనక్షత్రాదు లైన, అన్యాన్ = ఇతరములైన, ప్రకాశాన్ = ప్రకాశములను, ధ్వాంతపూరాన్ = చీకట్ల ప్రవాహములను, **గ్రసతి** = మ్రింగును.

**తాత్పర్యము :** సర్వజ్ఞానముల కాధార భూమియైన, త్రిభువన కరవీరమను పేరుగల శూన్య శ్మశానము యొక్క జ్ఞానసముద్రప్రవాహముగల నీ యొక్క అగ్ని అధికతర కాంతిగల సూర్యుని వలె ప్రజ్ఞాగాంభీర్య గర్వమును, స్వప్రకాశము వలన చంద్ర నక్షత్రాదీతర ప్రకాశములను, వేదాది శాస్త్రజ్ఞ శాస్త్రజ్ఞాన మేఘములను, చీకట్ల సమూహములను మ్రింగివేయుచుండును.

**వివరణము :** సూర్యుడు నిరంతర స్వప్రకాశస్వరూపుడు. పరప్రకాశ్య చంద్రాది గ్రహముల కాంతిని సూర్యుడు మ్రింగివేయునట్లు స్వప్రకాశమైన శామ్భవాగ్ని దృష్టితో సూర్యుడును శామ్భవాగ్ని ప్రకాశ్యుడు గాన పరప్రకాశ్యుడే. గావున సూర్యాది గ్రహనక్షత్రకాంతి సమూహములు తన జ్ఞానగాంభీర్యము వలన మ్రింగివేయును. సూర్యుని నుండి జనించిన మేఘములు కొంతకాలము సూర్యుని ఆచ్ఛాదించినను పిమ్మట వానిని కూడ మ్రింగివేయునట్లు ఆత్మను భవరూపశాంభవాగ్నిని శాస్త్రజ్ఞానమేఘములు కొంతకాలము వరించినను దాని ముందు నిలువజాలక చెదిరిపోవును. సూర్యుడు అంధకార ప్రవాహములను మ్రింగి వేయునట్లు శామ్భవాగ్ని శూన్యమును మ్రింగి వేయును.

త్రిభువనములు ప్రలయమం దుండవు. అవి అప్పుడు శూన్యములై పోవును. త్రిభువనము శ్మశానమువలె శూన్యమై పోవును. సత్పదార్థము వలె అసత్పదార్థముకూడ జ్ఞానముతోడనే గ్రహింపదగినదై యుండుటచే జ్ఞానమే సర్వజ్ఞానాధారము. సత్పదార్థములకు అసత్పదార్థములకును ఆధారము. పదార్థమున్నది అనునది జ్ఞానమే. పదార్థము లేదు అనునదియు జ్ఞానమే. జ్ఞానమునకన్న భిన్నముగా సత్తుగాని అసత్తుగాని లేనేలేవు. కావున ప్రలయకాలపు శ్మశానజ్ఞానప్రవాహము కాని, సృష్టికాలపు త్రిభువనముల వ్యావహారిక (సత్త) జ్ఞానము కాని, పరమార్థమైన శాంభవాగ్ని జ్ఞానము కన్న భిన్నములు కాజాలవు. శాంభవాగ్ని ప్రకాశించిన తోడనే అన్ని అజ్ఞానాంధకారములు నశించిపోవును. త్రిభువనములు ప్రకాశించు కాలమున (స్థితి కాలమున) ప్రకాశింపని (ప్రలయ) కాలమునకు శాంభవాగ్ని ఒకటే విరాజమానమై ఉండును. ఈ జ్ఞానమే అజ్ఞానమును తజ్జనిత దుఃఖములను అంధకారములను కూడ మ్రింగివేయును. మహారాష్ట్రములోని కోల్హాపురమునకు కరవీరపురమని పేరున్నది. అక్కడి శ్మశానము ప్రలయకాలశ్మశానమునకు ప్రతినిధిగా గ్రహింపబడినది. శ్రుత్యాది బహు ప్రామాణిక జ్ఞానమునకు ఇతరములైన అప్రామాణిక జ్ఞానములకును శాంభవాగ్నియే ఆధారమై నందున అది **సర్వజ్ఞానైకభూమి** అని చెప్పబడినది.

**విమల శివా త్రిలోక కరవీరక నామ మహాశ్మశాన చి**
**త్కమలధిశాస్త్రబోధ ఘనకంధరరాశిని బ్రజ్ఞ మ్రింగెడున్**
**కమలహితుండువోలె నిజ కాంతి నిజేతరకాంతి జాతమున్**
**తిమిరమహా ప్రవాహమును తెల్లము నీదగు శాంభవాగ్నియే.**

**అవతారిక :** పై శ్లోకమున శమ్భువాగ్నిరూపజ్ఞానము, అజ్ఞానాంధకారనాశనముగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఈ స్తోత్రముయొక్క సంహారము చేయబడుచున్నది.

**శ్లో॥ శ్రీ శమ్భో! విశ్వమూర్తే! పరమశివ! గురో! నాథ! విశ్వేశ్వరాత్మ**
**న్నేషాశేషార్థవద్వాక్ప్రసవవిరచితా స్రగ్ధరావృత్తపూజా।**
**త్వయ్యేవ జ్ఞానవహ్నౌ హుతవహరసనే సంహితా ముక్తయే మే**
**భూయాదాగః క్షమస్వ ప్రవచనపతితః శ్రీవిభో! మే ప్రసీద ॥ 121**

**ప్రతిపదార్థము :** శ్రీ శమ్భో! = ఓ శ్రీ శమ్భో, విశ్వమూర్తే! = విశ్వమే ఆకారముగాగలవాడా!, పరమశివ! = ఓసర్వశ్రేష్ఠశివా!, నాథ! = ఓ ప్రభూ, విశ్వేశ్వర! = విశ్వమునకు

ప్రభువైనవాడా!, ఆత్మన్! = ఆత్మయైన వాడా!, శ్రీవిభో! = ఓ శ్రీపతీ, గురో! = ఓ గురూ! అశేషార్థవ ద్వాక్ప్రసవ విరచితా = సంపూర్ణమైన అర్థముగల వాక్కులనెడి పుష్పములతో రచింపబడిన, ఏషా = ఈ, స్రగ్ధరావృత్తపూజా = స్రగ్ధరావృత్తములతో రచింపబడిన పూజ, హుతవహరసనే = హుతమును మోయు నాలుకలుగల, జ్ఞానవహ్నౌ = జ్ఞానాగ్ని స్వరూపుడవైన, త్వయి ఏవ = నీ యందే, సంహితా = ఉంచబడినదై, మే = నా యొక్క, ముక్తయే = ముక్తి కొఱకు, **భూయాత్** = అగుగాక, ఆగః = అపరాధమును, **క్షమస్వ** = క్షమించుము, ప్రవచనపఠితః = ప్రవచన పఠితుడవై, మే = నాకు, **ప్రసీద** = అనుగ్రహింపుము.

**తాత్పర్యము :** ఓ శివా! పరశమ్భూ, సంపూర్ణార్థముగల వాక్పుష్ప విరచితమై యీ స్రగ్ధరావృత్త పూజ హుతము వహించు నాలుకలు గల జ్ఞానాగ్ని స్వరూపుడవై నాకు ముక్తిని ప్రసాదించుగాక, ఇందులోని అపరాధములు క్షమించుము. ఇది ప్రపంచములలో పఠింపబడుచు చిరకాలముండునట్లు అనుగ్రహింపుము.

**వివరణము : స్రగ్ధరావృత్తమునకు** మ,ర,భ,న,య,య,య అను గణము లుండును. ఏడేసి అక్షరములకు పిదప యతి (విరామము) ఉండును. ఈ స్తోత్రము నందలి వాక్కులన్నియు అర్థవంతములు. పుష్పములందు వాసన ఉన్నట్లు ఈ వాక్కు లందు అర్థమున్నది. స్రగ్ధారుడవు నీవు కావలెనని నీకై వాక్పుష్పములతో నీ స్రక్కులను రచించి నీకు సమర్పించితిని. ఇక నీవు స్రగ్ధరుడవే. స్రక్కులను రచించి నేనును స్రగ్ధరుడనే యైతిని. పాఠకులును స్రగ్ధారులు కాగలరు. ఈ స్రగ్ధరావృత్తము నందలి ప్రత్యక్షరమును ఒక పుష్పమే. ఆ పుష్పములతో నీ వృత్తము స్రగ్ధరావృత్తమైనది. దీనిని పఠించు వారు స్రగ్ధరావృత్తులు అనగా స్రక్కులధరించు పూర్ణ శీలము గల వారగుదురు. శీలసంపన్నులై నీ కరుణకు పాత్రులగుదురు. ఇదిగో నీకు సమర్పింపబడిన నీ కంఠమున వృత్తమై గుండ్రనిదై ప్రకాశించుచున్నది. మ,ర,భ,న,య,య,య అను గణములు గల స్రగ్ధరా వృత్తముల నాయీ వాఙ్మయిపూజతో ఉపచారము ఇంతకన్న అధికమైన ఉపచారము (సేవ) నేను చేయలేను. ఈ వృత్త రచనములో నేవేని దోషములున్న క్షమించుము. నాయందను గ్రహము చేసి మోక్షము ప్రసాదింపుము. మోక్షమును ప్రసాదించు ప్రసాదము నా యందు కలవాడ వగుము.

**శివగురుసార్థ వాక్ప్రసర చిన్మయ వృత్తకపూజనమ్మిదే**
**అవిరతభావనా రచితమయ్యె హుతాశరసావిబోధ వ**

**హ్నివయిన నీయెడన్ దొసగు నీవె క్షమింపుము విశ్వమూర్తి వి**
**శ్వవిభుడ! నాపయిన్ గరుణ జల్లుము చెల్లగ నాదుజన్మమున్.**

*** * ***

## -- ఉపసంహార ప్రకరణమ్ --

**అవతారిక :** పై శ్లోకమున విశేషోపచార పరామర్శ శాంతి ప్రకరణమును ముగించుచు **స్రగ్ధరావృత్తపూజ** ముగిసినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున ఉపసంహారప్రకరణ మారంభించుచు పరశమ్ము కృప వర్ణింపబడుచున్నది. హరిణీ వృత్తము.

**శ్లో॥ ఇతి తవ కృపాదోగ్ధ్రీ పూజా సుభక్తిస్సృతాఽమృతా**
**జననమరణప్రాదుర్భావప్రభేదపటీయసీ ।**
**జనయతి ముదమ్బ్రహ్మానందప్రవాహతరంగిణీ**
**దహతి విపదః పుణ్యమ్పాపం దురంతభవాటవీమ్ ॥ 122**

**ప్రతిపదార్థము :** ఇతి = ఈ విధముగా, తవ = నీయొక్క, కృపాదోగ్ధ్రీ = కృపను బితుకు, సుభక్తిస్సృతా = మంచి భక్తిచే స్రవింపబడిన, అమృతా = అమృతరూపిణియైన, పూజా = పూజ, జననమరణ ప్రాదుర్భావ ప్రభేద పటీయసీ = జనన మరణముల ప్రాదుర్భావమును నశింపజేయుట యందు మిక్కిలి సమర్థమైనది, బ్రహ్మానందప్రవాహతరంగిణీ = బ్రహ్మానంద ప్రవాహముగల నది, ముదమ్ = సంతోషమును, **జనయతి** = కలిగించును, విపదః = ఆపదలను, పుణ్యమ్ = పుణ్యమును, పాపమ్ = పాపమును, దురంత భవాటవీమ్ = దుఃఖాన్తమైన సంసారారణ్యమును, **దహతి** = కాల్చును.

**తాత్పర్యము :** పరశమ్ము పూజ ఆతని కృపను పితుకును. అది సుభక్తిచే స్రవించబడిన యమృతమే. అది జననమరణచక్రప్రాదుర్భావమును నశింపజేయుటకు చాలినది. బ్రహ్మానందరూపసంతోషహేతువు. అది ఆపదలను పుణ్యపాపములను దుఃఖాన్తమైన సంసారమను అరణ్యమును దహించును.

**వివరణము :** విపత్తులను పాపమును సంసారమును దహింపజేయునది పరశమ్ముపూజ. అది ఆయన కృపామృతమును కలిగించును. బ్రహ్మానందము అను గొప్ప సంతోషమును కలిగించును. సంతోషములలో బ్రహ్మానందమును మించినది లేదు. ఈ శ్లోకమున పాపముతో పాటు పుణ్యము దహించునని చెప్పబడినది. పాపము వలె పుణ్యము కూడ సంసారమును పెంచునదే. పాపమువలన నరకము, పుణ్యమువలన స్వర్గము కలుగును.

రెండును సంసారములోని దుఃఖసుఖ రూపములు. మోక్షమునకు ప్రతిబంధకములు. సాలోక్యవిముక్తిని పొందుటకు ముందు విరజానదీ స్నానముండును. ఆ స్నానము పుణ్యమును పాపమును తొలగించును. ముక్తిని పొంద బోవు వాని పుణ్యమాతని మిత్రులకు, పాపమాతని శత్రువులకు సంక్రమించునని వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. కైవల్యముక్తి హేతువైన జ్ఞానము వలన **'జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురు తేఽర్జున'** అను స్మృతి (గీత) ననుసరించి పుణ్య కర్మయు నశించును. పుణ్యమును నశించునని గమనింపవలెను. శ్లోకారంభ మందలి ఇతి శబ్దము గ్రంథసమాప్తి ద్యోతకమని గ్రహింపవలెను.

**ఈ విధి నీదుపూజ ప్రవహించును నాపయి నీ మహాకృపన్**
**తావక దివ్యభక్తి సుధ దానమొనర్పగ ఁజేయు మోద గం**
**గా విమల ప్రవాహమున ఁగాల్చు విపజ్జనిమృత్యు పుణ్యపా**
**పావధిహీన దుఃఖ నిలయ ప్రకటోగ్య మహాభవాటవిన్.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భుపూజ, ఆతనికృప ద్వారా **మోక్షహేతువు** అని చెప్పబడినది. ఈ శ్లోకమున ఈ సోత్రరచనచే తన జన్మధన్యమైనదని కవిచే చెప్పబడుచున్నది. అర్ధసమవృత్తము.

**శ్లో॥ పరశివ! మమ జన్మ ధన్యమేత-**
**త్తవ మహిమస్తుతిమోచితో యతోఽహమ్ ।**
**కులమిదమఖిలం ద్విధా విభిన్నం**
**పరమపదం గతమేవ తే ప్రసాదాత్ ॥** **123**

**ప్రతిపదార్థము :** పరశివ! = ఓ పరశమ్భూ!, యతః = ఎందువలన, అహమ్ = నేను, తవ = నీయొక్క, మహిమ స్తుతి మోచితః = మహిమను స్తుతించు బరువు నుండి విడిపింపబడితినో, ద్విధా = రెండు విధములుగా, విభిన్నమ్ = వేఱైన, మమ = నా యొక్క, ఇదమ్ కులమ్ = ఈ కులము, అఖిలమ్ = మొత్తము, తే = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహము వలన, పరమ పదమ్ = మోక్షమును, గతమ్ ఏవ = చేరినదే, ఏతత్ = ఈ, మమ = నాయొక్క, జన్మ = పుట్టువు, ధన్యమ్ = ధన్యమైనది.

**తాత్పర్యము :** ఓ పరశమ్భూ నీ స్తుతి రచించుటచే నాయీ జన్మ ధన్యమైనది. రెండుగా భిన్నమైన నా కులమంతయు మోక్షమును పొందినదే అగుచున్నది.

**వివరణము :** కులము రెండు విధము లనగా మాతృవంశము, పితృవంశము లేక

విద్యావంశము, జన్మవంశము. విద్యా వంశమనగా గురుశిష్య పరంపర, జన్మవంశ మనగా పితృ పుత్ర పరంపర.

**పరశివ యీ మదీయ జని భవ్యము ధన్యమునయ్యె నీమహ**
**ద్గురు మహిమస్తుతి గ్రథనధుర్యముతీరుట చేత నేటికిన్**
**పరమపదమ్మునందెను భవత్కరుణాళు కటాక్షదృష్టి ని**
**స్సరణము చేత నీ ద్విధము సర్వకులమ్ము నిరస్తమోహమై.**

**అవతారిక :** పూర్వశ్లోకమున **వంశ ద్వయ పరమపదప్రాప్తి** చెప్పబడినది. ఈ శ్లోకమున కవిచే తన **జీవన్ముక్తస్థితి** చెప్పబడుచున్నది. శిఖరిణీ వృత్తము.

**శ్లో॥ హతో మాయామృత్యుర్గురువచనఖడ్గేన మనసః**
**ప్రభిన్నమ్మాలిన్యం వ్యవహతమహంకారతిమిరమ్।**
**హతా మే కామాద్యాః ప్రబలరిపవః స్వాత్మవిషయా**
**మహేశ! త్వత్సేవావిదితసువివేకాగ్నిమహసా ॥ 124**

**ప్రతిపదార్థము :** గురువచనఖడ్గేన = గురువాక్యమను కత్తితో, మనసః = మనస్సు యొక్క, మాయామృత్యుః = మాయయను మృత్యువు, హతః = కొట్టబడినది, మహేశ! = ఓ మహేశ్వరా! త్వత్సేవా విదిత సువివేకాగ్ని మహసా = నీసేవచే తెలియబడిన వివేకమనెడి అగ్ని యొక్క కాంతిచేత, మాలిన్యమ్ = మాలిన్యము, ప్రభిన్నమ్ = భేదింపబడినది, అహంకార తిమిరమ్ = అహంకారమను చీకటి, వ్యవహతమ్ = కొట్టబడినది, మే = నా యొక్క, కామాద్యాః = కామము మొదలైన, స్వాత్మ విషయాః = స్వాత్మ విషయములుగాగల, ప్రబల రిపవః = గొప్పశత్రువులు, హతాః = కొట్టబడినారు.

**తాత్పర్యము :** నీ సేవచే లభించిన వివేకమనెడి అగ్ని యొక్క కాంతిచేత మాలిన్యము, అహంకారాంధకారము నశింప జేయబడినది. స్వాత్మ విషయకామాది శత్రువులు కొట్టబడినారు. గురువచనఖడ్గముచేత మనసుయొక్క మాయామృత్యువు నశింప జేయబడినది.

**వివరణము :** కామాది శత్రువులకు ఆత్మయే విషయము. అనగా ఆత్మజ్ఞానము కలుగనీయకుండ జేయుటయే కామాదుల కృత్యము. కావున అవి ప్రబలరిపువులని చెప్పబడినవి. పై శ్లోకమున మాయా మృత్యు పదము మాయాజనిత మృతి శబ్దము అజ్ఞాన జనితమృతి యను నర్థమున ప్రయోగింపబడినది అనియు భావింప వచ్చును.

**గురువచనాసి మాయమృతి కొట్టఁబడెన్ స్వమనోమలమ్ము సం**
**క్షరితము నాయహంకృతి తమమ్ము నశించె త్వదీయసేవ వా**
**గరిత పుట్టినట్టి సువివేక మహానల కాంతిచేత నాం**
**తరవిషయారి వర్గము విదారితమయ్యె మహేశ! శ్రీశివా!**

**అవతారిక :** పై శ్లోకమున కవికి అహంకారనాశము చెప్పబడినది. ఈ శ్లోకమున అహంకారనాశముతో పాటు లజ్జాదినాశము చెప్పబడుచున్నది. మందా క్రాంతా.

**శ్లో॥ జాతిర్లజ్జా నిజకులమదః సర్వసంశీతిరాధి-**
**ర్దేహాహంతా సుకృతదురితద్వంద్వపాశోఽభిమానః ।**
**సర్వే హ్యేతే మమ వినిహతాస్త్వన్మహావాక్యసూర్య-**
**జ్యోతిః పుంజైః కిమపరమహం దేవ! భద్రం సమీహే ॥ 125**

**ప్రతిపదార్థము :** దేవ! = ఓ దేవా, జాతిః = జాతి, మమ = నాకు, లజ్జా = సిగ్గు, నిజకులమదః = తనకులగర్వము, సర్వసంశీతిః = సర్వసందేహము, ఆధిః = మనోవ్యాధి, దేహాహంతా = దేహమునందు నేనను బుద్ధి, సుకృత దురిత ద్వంద్వ పాశః = పుణ్యాపాపద్వంద్వమనెడి పాశము, అభిమానః = నాది అను బుద్ధి, ఏతే = ఈ, సర్వే = అన్ని, వినిహతాః + హి = కొట్టబడినవి గదా!, త్వన్మహావాక్య సూర్య జ్యోతిః పుంజైః = నీ మహా వాక్య సూర్యజ్యోతి స్సమూహముల చేత, అపరమ్ = మరొకటి, భద్రమ్ = మంగళమును, **సమీహే** కిమ్ = కోరెదను?

**తాత్పర్యము :** దేవా! నాసర్వ సంశయరూప మనోవ్యాధి తొలగినది. సిగ్గు చిమిడి పోయినది. జాతి, వంశము గొప్పవి అను ఆభిజాత్యము నశించినది. పాపపుణ్యపాశములు తొలగినవి. దేహమునందు నేను నాది యను బుద్ధి నశించినది. నా యందుండిన ఇవి యన్నియు నీ మహావాక్యసూర్యజ్యోతిఃపుంజములచే నశించినవి.

**వివరణము :** మహావాక్యములు సూర్యజ్యోతిః పుంజములతో రూపింపబడి నందున జాతిలజ్జాదులు తిమిర రూపములు అనువిషయము వ్యంజిత మగుచున్నది. కావున ఇందు రూపకాలంకార మున్నది.

**జాతికులాభిమానములు సంశయ లజ్జలు దేహమందహం**
**తాతి మహాభిమానమును ఆధులువ్యాధులు పుణ్యపాప యు**
**గ్మాతతపాశముల్ మొదలు నన్నియు తావక వాక్యభాస్కర**
**జ్యోతులఁబ్రుంగె అన్యసుఖ సుందర భద్రము నేమి కోరుదున్.**

**అవతారిక :** పై శ్లోకమున ఆభిజాత్యాది నాశము చెప్పబడినది. ఈ శ్లోకమున తన్నాశహేతువైన విద్యయొక్క అభ్యసనము సార్థకమైనదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ మద్విద్యాభ్యసనమభూదిహైవ సార్థకం**
**సాన్నిధ్యాత్తవ చ తదుక్తిగోచరస్య ।**
**అద్య త్వం త్రిభువనవాఙ్మనస్యలభ్యో**
**నిర్బాధస్సకలపథైకగమ్యమూర్తే! ॥ 126**

**ప్రతిపదార్థము :** తదుక్తిగోచరస్య = ఆతని(గురువు) వాక్కుచే గోచరుడవైన, తవ = నీయొక్క, సాన్నిధ్యాత్ = సాన్నిధ్యమున, సకలపథైకగమ్యమూర్తే! = అన్ని మార్గములకు ఏకగమ్యమైన స్వరూపము గలవాడా! అద్య = నేడు, త్వమ్ = నీవు, త్రిభువనవాఙ్మనసి = త్రిభువనములలోని వాఙ్మనమునకు, అలభ్యః = పొందరానివాడవు, నిర్బాధః = నాశము లేనివాడవు, మద్విద్యాభ్యసనమ్ = నా విద్యాభ్యాసము, ఇహ ఏవ = ఇచటనే, సార్థకమ్ = సఫలము, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము :** గురువాక్కుచే గోచరుడవైన నీ యొక్క సాన్నిధ్యము వలన నా విద్యాభ్యాసము సఫలమైనది. అన్ని మార్గముల గమ్యమైన స్వరూపము గలవాడా! నేడు నీవు భువన వాఙ్మనమునకు లభ్యుడవుకావు. నాశరహితుడవు. నాకు లభించితివి గదా!

**వివరణము : తత్త్వమసి** అను గురూక్తిచేగాని ఉపనిషదుక్తిచేగాని, గోచరుడవైన నీ సాన్నిధ్యము అనగా నీ ఈశ్వరత్వము యొక్క గానీ, పరబ్రహ్మత్వము యొక్క గాని ప్రాప్తి కలుగుటచే విద్యకు సార్థకత కలిగినది. విద్యాఫలము ఆత్మజ్ఞానము. అది ప్రతిబంధాదులచే కలుగనపుడు విద్యాభ్యసనమునకు అనగా మంత్రజపమునకు ధ్యానమునకు గాని ఫలమేమున్నది. సత్యస్వరూపుడవు ఐన నీవు త్రిభువనవాఙ్మనస్సులకు లభ్యముకాని వాడవై యుండియు నాకు లభ్యుడవైతివి. అని కవి తృప్తిని ప్రకటించుచున్నాడు. వాఙ్మనసి అను ప్రయోగముగాని, వాఙ్మనస్య అను ప్రయోగము గాని **ఆర్షమని** గ్రహింపవలసి యున్నది.

**చదువుల వెల్గు నీదయిన సన్నిధి భాగ్యము నాకు గల్గ నా**
**చదువులు సార్థకమ్ములిట సర్వజగద్వచనాంతరంగముల్**
**పొదువగలేవు క్లేశములు పొందవు నిన్నెపుడేని వేదు స**
**ర్వదరవిహీనమార్గముల బ్రాప్యుడ వొక్కడవంచెటింగితిన్.**

**అవతారిక :** పై శ్లోకమున సకల పథైక గమ్యమూర్తి యైన పరశమ్భువు తన **జపధ్యానానుష్ఠాన పథమున లభించుట** చెప్పబడినది. ఈ శ్లోకమున **అలభ్యమూర్తిని కవి భజించుట** చెప్పబడుచున్నది. పృథ్వీ వృత్తము.

**శ్లో॥ శ్రుతిస్మృతిమిథఃపథే ప్రచలితోఽహమేకాంతతః**
**ప్రభోః శివగురోస్తవ త్రిజగదున్నతాజ్ఞాం గతః ।**
**భజామి పరపావకం త్రిజగదాత్మహవ్యాశినం**
**భవన్తమధిదైవతం భవవనే జ్వలంతం స్వతః ॥ 127**

**ప్రతిపదార్థము :** శ్రుతి స్మృతి మిథః పథే = వేద శాస్త్రముల రహస్య మార్గమున, ఏకాంతతః = ఒంటరిగా, ప్రచలితః = బయలుదేరిన, అహమ్ = నేను, శివగురోః = శివగురుడవైన, ప్రభోః = ప్రభుడవైన, తవ = నీయొక్క, త్రిజగదున్నతాజ్ఞామ్ = మూడులోకముల కంటెను ఎత్తైన ఆజ్ఞను, గతః = పొందిన వాడనై, త్రిజగదాత్మ హవ్యాశినమ్ = మూడు లోకములనెడు తన హవ్యమును భుజించు, పరపావకమ్ = పరాగ్ని స్వరూపుడవైన, అధిదైవతం = అధి దైవతమవైన, భవవనే = సంసారాటవియందు, స్వతః = స్వయముగా, జ్వలంతమ్ = ప్రకాశించుచున్న, భవన్తమ్ = నిన్ను, **భజామి** = భజించుచున్నాను.

**తాత్పర్యము :** వేదశాస్త్రముల రహస్యమార్గమున శివగురుడవైన నీ యాజ్ఞను పొంది ఒంటరిగా బయలుదేరిన నేను మూడులోకముల తన హవ్యములంజేసికొని భుజించు పరాగ్ని స్వరూపుడవైన సంసారాటవిలో స్వయముగా ప్రకాశించు నిన్ను భజించుచున్నాను.

**వివరణము :** పరమాత్మ కొఱకు ప్రయాణించుట (సాధనమొనర్చుట) ఆయనను చేరుట అనునవి హృదయగుహాలో జరుగునని కావున ఆ మార్గము రహస్యమని చెప్పబడినది. హృదయము పరప్రత్యక్షము కాదుగదా! ఎవరిని గూర్చి ప్రయాణము చేయుదుమో ఆతడే ప్రయాణోపాయమునై ఉన్నాడు. ఆ మార్గము నుపదేశించిన గురువు ఉపాయమని **'గురురుపాయః'** అను తంత్రవచనము చెప్పుచున్నది. ఆ శివుడు ఆ శివగురువును అభిన్నులు కావున, ఇరువురును ఉపాయములని చెప్పవలెను. అందుచేతనే ఆ గురువు శివగురువనియే చెప్పబడుచున్నాడు. ఇంతకు ఆయనను చేరుట అప్రాప్తప్రాప్తికాదు. ప్రాప్తప్రాప్తియే. ప్రాప్తుడు కాదు అని అనుకొనబడిన వానిని ప్రాప్తుడను జ్ఞానమును పొందుటయే. గుర్వాజ్ఞను మించిన ఆజ్ఞ మరొకటి లేనందున అది త్రిజగదున్నతాజ్ఞ అని చెప్పబడినది. ఆ పరశమ్భువు

జ్ఞానాగ్నిచే త్రిలోకముల గాల్చువాడు. గావున త్రిజగత్తులే హవ్యములుగా వానిని భుజించు వాడు గావున త్రిజగదాత్మ హవ్యాశియైన పరాగ్నిగా, త్రిజగదాత్మరూపభావము అగ్నిభోజ్యమైన **హవ్యముగా** రూపించబడుచున్నది.

**శ్రుతులు స్మృతుల్ వచించిన విశుద్ధరహస్యపథమ్ము నందు నే**
**కతమ చరించి నేను త్రిజగత్ప్రభుదేశిక! శంభు నీదు నా**
**నతిఁ ద్రిజగద్ధతిన్ భవవనమ్మును మ్రింగుచుఁ దా జ్వలించు దై**
**వత పరపావకున్ సతము భక్తి భజించెద నే స్వయమ్ముగా.**

**అవతారిక :** పూర్వ శ్లోకమున **పరాగ్ని స్వరూప పరశమ్భువు యొక్క భజనము** చెప్పబడినది. ఈ శ్లోకమున **కవికి గల వైరాగ్యము** చెప్పబడుచున్నది. శా.వి.

**శ్లో॥ బ్రహ్మత్వం సురనాయకత్వమఖిలక్షోణీపతిత్వం లస-**
**ద్బ్రాహ్మణ్యం సురయక్ష నాగపితృతా గంధర్వతా సిద్ధతా ।**
**ఏతత్సర్వమనిత్యమేవ గణితం నాహం సమీహే సుఖం**
**కిం తు త్వత్పదపద్మనిశ్చలతరధ్యానం సమీహే విభో! ॥ 128**

**ప్రతిపదార్థము :** బ్రహ్మత్వమ్ = బ్రహ్మత్వము, సురనాయకత్వమ్ = ఇంద్రత్వము, అఖిలక్షోణీపతిత్వమ్ = సమస్తభూమి కధిపతి యగుట, లసద్బ్రాహ్మణ్యమ్ = ప్రకాశించు బ్రాహ్మణత్వము, సురయక్షనాగపితృతాః = సురత్వ, యక్షత్వ, నాగత్వ, పితృత్వములు, గంధర్వతా = గంధర్వత్వము, సిద్ధతా = సిద్ధత్వము, ఏతత్ = దీనిని, సర్వమ్ = అంతను, అనిత్యమ్ ఏవ = అనిత్యముగనే, గణితమ్ = లెక్కపెట్టబడిన, సుఖమ్ = సుఖమును, అహమ్ = నేను, న సమీహే = కోరను, కింతు = కాని, విభో! = ఓ ప్రభూ, త్వత్పదపద్మ నిశ్చలతర ధ్యానమ్ = నీ పాద పద్మముల నిశ్చల తరమైన ధ్యానమును, సమీహే = కోరెదను.

**తాత్పర్యము :** బ్రహ్మ పదవినిగాని, ఇంద్రపదవినిగాని, చక్రవర్తిత్వమునుగాని, దేవత్వ, యక్షత్వ, నాగత్వ, పితృత్వములను గాని; ప్రకాశించు బ్రాహ్మణత్వమును గాని, గంధర్వత్వమును గాని, సిద్ధత్వమునుగాని, అనిత్యములుగా పరిగణింపబడినందున నేను కోరను, కాని ఓ ప్రభో! నీ పాదకమలనిశ్చలధ్యానమును మాత్రము కోరెదను.

**వివరణము : 'ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున'** అను భగవద్గీతా వాక్యము వలన బ్రహ్మలోకము క్రిందనున్న గంధర్వ యక్షాదిలోకములన్నియు అనిత్యములు.

బ్రహ్మపదము కూడ అనిత్యమే కాని బ్రహ్మ పదమును చేరుకున్న వాడు మాత్రము వెనుకకు రాక ఆ బ్రహ్మ యొక్క **'తత్త్వమసి'** అను తత్త్వము యొక్క ఉపదేశముతో కైవల్యమును అపునరావృత్తియైన శాశ్వతమైన మోక్షమును పొందును.

**ధాతృత దేవనాయకత దానవవైరిత యక్షనాగతల్**
**పైతృకసిద్ధవిప్రతలు భాసిలు నశ్వరమైన సౌఖ్య సం**
**వ్రాతము లేను గోరను భవత్పదపద్మనిరంతరాయ చిం**
**తాతత నిత్యసౌఖ్యము నిరంతర మో ప్రభు నేను గోరెదన్.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భువు పాద పద్మముల నిశ్చలధ్యానము కోరబడినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున తన జీవన్ముక్తత పునరావృత్త మొనర్ప బడుచున్నది. శార్దూల విక్రీడితము.

**శ్లో॥ సమ్ప్రాప్తా కృతకృత్యతా సఫలతా వాచాం తవ స్తోత్రతా**
**మృత్యోరప్రమితస్య మృత్యురభవద్వశ్యం గతం త్వత్పదమ్ ।**
**సంసారనవధిప్రచండజలధి స్తీర్ణః ప్రమోహో హతః**
**పుణ్యం పాపమగాద్వినాశమిహ మే ప్రాప్తః ప్రబోధో విభో ॥ 129**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ ప్రభూ, కృతకృత్యతా = ధన్యత, సమ్ప్రాప్తా = పొందబడినది, తవ = నీయొక్క, స్తోత్రతా = స్తోత్రమగుటయే, వాచామ్ = వాక్కులకు, సఫలతా = సాఫల్యము, అప్రమితస్య = పరిమితిలేని, మృత్యోః = మృత్యువు యొక్క, మృత్యుః = మృత్యువు, అభవత్ = అయ్యెను, త్వత్పదమ్ = నీ పదము, వశ్యమ్ = వశభావమును, గతమ్ = పొందినది, సంసారానవధి ప్రచండ జలధిః = సంసారమను అంతులేని క్రూర సముద్రము, తీర్ణః = దాటబడినది, ప్రమోహః = తీవ్రమోహము, హతః = కొట్టబడినది, పుణ్యమ్ = పుణ్యము, పాపమ్ = పాపము, వినాశమ్ = వినాశమును, అగాత్ = పొందెను, ఇహ = ఇచట, మే = నాకు, ప్రబోధః = జ్ఞానము, ప్రాప్తః = పొందబడినది.

**తాత్పర్యము :** నీయొక్క స్తోత్రరూపమును దాల్చుటయే నా వాక్కుల సాఫల్యము కావున నాకును ధన్యత కలిగినది. పరిమితి లేదనుకొన్న మృత్యువునకును చావేర్పడినది. నీ పాదము నాకు స్వాధీనమైనది. అంతులేని సంసార క్రూర సముద్రము దాటబడినది. నా ప్రమోహము కొట్టబడినది. నా పుణ్యపాపములు నశించినవి. ఈ లోకముననే నాకు నీ దివ్యజ్ఞాన ప్రబోధము కలిగినది.

**వివరణము :** నశింపజేయునది మృత్యువు. ఇది ప్రధానముగా జీవుల స్థూలశరీరమునుండి సూక్ష్మశరీరమును బయటకు కొని పోవుట ద్వారా స్థూల శరీరమునకు నాశము కలిగించును. జడ పదార్థములలో పరమాణు బంధమును విఘటింప జేయుట ద్వారా కార్యజగత్ పదార్థముల నాశము కలుగును. ఇది మృత్యువని వ్యవహరింపబడకపోయినను మృత్యువనియే చెప్పబడవలెను. ఈ రెండు స్థలములందును జడ పదార్థనాశమే ఉన్నది. సూక్ష్మశరీరము, కారణశరీరమును జడములే. అవి అజ్ఞానమను జడము నశించిన పిమ్మట చైతన్యమయజ్ఞానదగ్ధము లగును. అది (జ్ఞానము) యే మృత్యు మృత్యువని చెప్పబడినది. స్థూలశరీరనాశము మృత్యువు కాగా సూక్ష్మ, కారణ శరీరనాశము మృత్యువునకే మృత్యువు. అది జ్ఞానస్వరూపము, పరశమ్భువు జ్ఞానస్వరూపుడు. కావున జ్ఞానము కలుగుటయే పరశమ్భుప్రాప్తి. జ్ఞానము మృత్యువునకు పిమ్మట లభించునది కాదు. అది సశరీరునకు ఈ లోకముననే లభింప దగినది. అది లభించిన వాడు జీవన్ముక్తుడు అని చెప్పబడును. ఇచట కవియొక్క జీవన్ముక్తావస్థలోని ఆనందోద్గారములే చెప్పబడినవి.

**పలుకులకబ్బె నేడు ఫలవత్త్వము ధన్యత త్వత్త్స్వవత్వమున్**
**కలిగెను మిత్తికేమృతియు ఁగల్గె భవత్పదసిద్ధి సంసృతీ**
**జలధి సుతీర్ణమయ్యె వెసఁజచ్చెఁ బ్రమోహము పుణ్యపాపముల్**
**విలయమునొందె బోధము లభించెను నాకిట శ్రీవిభూ! శివా!**

**అవతారిక :** పై శ్లోకమున జ్ఞారుచ పరశమ్భువుయొక్క **మృత్యుమృత్యుమృత్యుత్వము** చెప్పబడినది. ఈ శ్లోకమున ఈ స్తోత్రము ఆ పరశమ్భువుయొక్క సంతోషము కొఱకు కావలె నను తన అపరాధములు క్షమింపబడవలెనను కోరికలు పునరావృత్త మొనర్పబడు చున్నవి. మాలినీ వృత్తము.

**శ్లో॥ ఇతి పరశివ శమ్భోఽనంతకాంతే మహిమ్న-**
**స్తవ విరచితమేతత్ స్తోత్రమాత్మోక్తిశక్త్యా ।**
**ప్రభవతు సుముదే తే త్వమ్మమ స్వాంతవర్తీ**
**భవ! భవగతదుఃఖం ఛింధి చాగః క్షమస్వ ॥ 130**

**ప్రతిపదార్థము :** ఇతి = ఈ విధముగా, పరశివ! = పరశివా!, శమ్భో = శమ్భూ!, అనంతకాంతే = అనంతమైన కాంతిగలవాడా, తవ = నీయొక్క, మహిమ్నః = మహిమయొక్క, స్తోత్రమ్ = స్తోత్రము, ఆత్మోక్తి శక్త్యా = నా ఉక్తి శక్తితో, విరచితమ్ =

రచింపబడిన, ఏతత్ = ఇది, తే = నీయొక్క, సుముదే = మిక్కిలి సంతోషము కొఱకు, **ప్రభవతు** = చాలుగాక, భవ = ఓ భవా!, త్వమ్ = నీవు, మమ = నా యొక్క, స్వాంతవర్తీ = మనమున నుండు వాడవై, భవగత దుఃఖమ్ = సంసారము నందున్న దుఃఖమును, **ఛింధి** = ఛేదించుము, ఆగః చ = అపరాధమును కూడ, **క్షమస్వ** = క్షమింపుము.

**తాత్పర్యము :** ఈ విధముగా ఓ పరశమ్భూ! అనంతకాంతిగలవాడా, నీ మహిమ యొక్క స్తోత్రము నాచే యథావాక్ శక్తి రచింపబడినది. ఇది నీకు గొప్ప సంతోషమును కలిగించుగాక! నా సంసారదుఃఖమును ఛేదించుగాక! నా అపరాధమును గూడ నా మనసులో నన్ను నీవు క్షమింపుము.

**వివరణము :** ఇతి శబ్దము సమాప్తి సూచకము. భవ భవగత అనుచోట ఛేకాను ప్రాసాలంకార మున్నది. అపరాధ క్షమాపన మొనరించు ఈ స్తోత్రముతో స్వామి సంతోషింప వలెనను కోరికను కవి ప్రకటించుచున్నాడు.

**పరశివ! నాశహీనరుచిభాసి భవన్మహిమ స్తవంబిదే**
**విరచితమయ్యె నా పలుకు పేర్మి మదీయహృదిన్ వెలుంగు నీ**
**కురుముదముం బొనర్చెడు భవోద్భవదుఃఖముఁ దీర్చుమో భవా!**
**పరమకృపన్ దొసంగులను బాపుము శంభుడ! నిర్మలాంతరా.**

**అవతారిక :** పై శ్లోకమున కవి యొక్క **అపరాధక్షమాపన** మర్థించబడినది. ఈ శ్లోకమున శరణాగతుడైన కవి యొక్క రక్షణ మర్థింపబడుచున్నది.

**శ్లో॥ యావాంస్తే జీవలోకః పరశివ! చతురాశీతి లక్షైక సంఖ్య-**
**స్తత్తత్కర్మ ప్రభేదోపగతజనిమృతీ ఘోరసంసారచక్రే ।**
**సృష్టిస్థిత్యంతవృత్తిమ్భజతి నిరవధి త్వత్పదధ్యానహీనో**
**దృష్ట్వైవమ్భీతభీతం శరణముపగతం త్రాహి మాం దేవ! మృత్యోః ॥ 131**

**ప్రతిపదార్థము :** చతుర = చతురుడా, పరశివ! = ఓ పరశమ్భూ, దేవ! = ఓ దేవా, తే = నీయొక్క, అశీతిలక్షైక సంఖ్యః = ఎనుబది లక్షల సంఖ్యగల, జీవలోకః = జీవలోకము, యావాన్ = ఎంతయో, (తావాన్ = అంతయు), ఘోరసంసారచక్రే = ఘోరమైన సంసార చక్రమున, తత్తత్కర్మప్రభేదోపగతజనిమృతిః = ఆయా కర్మల భేదములవలన పొందబడిన జన్మ మరణములు గలదై, త్వత్పదధ్యానహీనః = నీ పాదకమల ధ్యానము లేనిదై, నిరవధి = అనంతముగా, సృష్టిస్థిత్యంతవృత్తిమ్ = సృష్టిస్థితిలయముల పౌనఃపున్యమును, భజతి

= పొందుచున్నది, ఇదమ్ = దీనిని, దృష్ట్వా = చూచి, భీతభీతమ్ = మిక్కిలి భయము నొందిన, శరణమ్ = శరణమును, ఉపగతమ్ = పొందిన, మామ్ = నన్ను, మృత్యోః = మృత్యువు నుండి, **త్రాహి** = కాపాడుము.

**తాత్పర్యము :** చతురుడవైన ఓ పరశమ్భు దేవా! నీదైన ఎనుబది లక్షల సంఖ్యగల జీవలోక మంతయు ఈ ఘోరసంసారచక్రమున కర్మభేదజనితజననమరణములు గలదై నీ పద ధ్యానము లేనిదై నిరంతరము మరల మరల సృష్టిస్థితిలయముల నొందుచున్నది. దీనిని చూచి నేను మిక్కిలి భీతుడనై నీ శరణు జొచ్చినాడను. నన్నీ మృత్యువునుండి కాపాడుము.

**వివరణము :** జీవలోకము చతురశీతి లక్ష సంఖ్యాకము. దానిలో ఎనుబది లక్షలు పేర్కొన్నచో చివరి నాలుగులక్షల సంఖ్య పేర్కొన బడకపోవుట అకించిత్కరము లేదా 'చతురశీతి' అను పదమును చతురాశీతి అని పేర్కొన వచ్చును. సంసార హేతువైన అజ్ఞానమే మృత్యువు. దాని నుండి కాపాడు మనగా జ్ఞానమును కలిగింపుమనియే అర్థము. జ్ఞానికి సంసార జన్మ మరణ పరంపరాభీతి లేదు. ఉండదు.

**శివ! కృతకర్మచే చతురశీతిక లక్షలజీవరాసులం**
**దవధివిహీనమై విపులమై యతిఘోరమునౌ భవమ్మునన్**
**భవము స్థితిన్ లయమ్ముగను త్వత్పదచింతనహీను జీవుఁ జూ**
**చి వడకుచున్ మహాభయముచే శరణొందిన నన్నుఁ బ్రోవవే.**

**అవతారిక :** పై శ్లోకమున మృత్యుభీతమృకండుసూనునివలె కవి పరశంభువు శరణు జొచ్చి రక్షింపుమనుట కోరబడినది. ఈ శ్లోకమున **మృత్యుంజయరూపబ్రహ్మసత్తకు** నమస్కరించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ దుర్వాసాస్సత్యవాసాః కనకగిరిరహం కందరే మే హృదాఖ్యే**
**శ్లోకాశ్చైతే మృగేంద్రాః పదనఖదశనాః శాంభవాౖస్త్రైకవీర్యాః ।**
**మాయాధ్వాంతేభయూథప్రదలనపటవో బ్రహ్మవిద్యాటవీస్థాః**
**వక్తౄన్ శ్రోతౄన్ ప్రమాతౄ న్నిజహృదయగుహాబ్రహ్మసత్తాన్ నమన్తి ॥ 132**

**ప్రతిపదార్థము :** దుర్వాసాః = దుర్వాసుడను పేరుగల, అహమ్ = నేను, సత్యవాసాః = సత్యమే వస్త్రముగా గల వాడను, కనకగిరిః = బంగరుకొండను, మే = నా యొక్క, హృదాఖ్యే = హృదయమను పేరుగల, కందరే = గుహయందు, ఏతే = ఈ, శ్లోకాః = శ్లోకములు, పదనఖదశనాః = పదములనెడి గోళ్లుదంతములు గల, శాంభవాస్త్రైక వీర్యాః

= శాంభవాస్త్రమే వీర్యముగా, మాయాధ్వాంతేభయూథ ప్రదలన పటవః = మాయాంధకారమను ఏనుగుల గుంపును చీల్చుటకు సమర్థములైన, బ్రహ్మవిద్యాటవీస్థాః = బ్రహ్మవిద్యయను అడవియందున్న, మృగేంద్రాః = సింహములు, వక్తౄన్ = వక్తలను, శ్రోతౄన్ = శ్రోతలను, ప్రమాతౄన్ = జ్ఞాతలను, నిజ హృదయగుహా బ్రహ్మసత్తాన్ = తమహృదయ గుహలలోని బ్రహ్మసత్తగల వారిని గూర్చి, **నమన్తి** = నమస్కరించు చున్నవి.

**తాత్పర్యము :** నా పేరు దుర్వాసుడు. కాని నేను సత్యము వస్త్రముగా కలవాడను. నేను మేరుగిరిని, నా హృదయమను పేరుగల గుహలో సింహములే ఈ శ్లోకములు. వీనికి పదములే గోళ్ళు దంతములు, శాంభవాస్త్రమే వీని వీర్యము. ఇవి మాయాంధకారమను గజసమూహమును చీల్చ సమర్థములు. బ్రహ్మవిద్యయను అడవిలో నివసించునవి. ఇవి తమ హృదయములలో బ్రహ్మసత్తగల వక్తలకు శ్రోతలకు ప్రమాతలకు నమస్కరించుచున్నవి.

**వివరణము :** సింహములు గుహలలో నున్నట్లు శ్లోకములు హృదయములలో నున్నవి. గోళ్ళవలె దంతములవలె పదములున్నవి. అడవి వంటిది బ్రహ్మవిద్య ఇత్యాది ఔపమ్యము వ్యంజింపబడినందున ఉపమాలంకారస్ఫూర్తి ఉన్నది. రూపకాలంకారము వాచ్యముగా నున్నది. అవయవులైన శ్లోకములు సింహములతో రూపింపబడినవి. పదనఖ దశనాద్యవయవ రూపణము నున్నందున ఇట సావయవ రూపకాలంకార మున్నది. శాంభవాస్త్రము ఒక మంత్రము. మాయాంధకారము గజసమూహములుగ రూపింబడుటకు నలుపుదనము అను ధర్మము సహకారిగా నున్నది. శ్లోకములు బ్రహ్మజ్ఞులైన వక్తృశ్రోతృప్రమాతలను నమస్కరించుచున్నవని చెప్పుటచే వారి యెడ కవికి గల భక్తి వ్యంగ్యమగు చున్నది.

**శ్వాసితతత్త్వుడన్ కనకశైలుడ మౌనిని సత్యరాస దు**
**ర్వాసుడ నాహృదాఖ్య కుహరమ్మున బ్రహ్మవిచారకాననా**
**ధ్యాసనముల్ విమోహగజదారణ శక్తులు శామ్భవాస్త్రవి**
**న్యాసిత వీర్యముల్ పదరదాళినఖాళులు శ్లోకసింహముల్**
**భాసిలు బ్రహ్మసత్తను ప్రవక్తల శ్రోతల గూర్చి మ్రొక్కెదన్.**

**అవతారిక :** పై శ్లోకమున బ్రహ్మసత్తానుభూతి గల ఈ స్తోత్రశ్లోకములు మాయాంధకార నాశములని చెప్పబడినవి. ఈ శ్లోకమున ఈ స్తోత్ర వక్తృ శ్రోతృ ప్రమాతలకు దేహాంతమున బ్రహ్మతో కైవల్యము కలుగునని ఇతర ఫలములు కూడ కలుగునని చెప్పబడుచున్నది. స్రగ్ధర వృత్తము.

శ్లో॥ భూష్యం వైదుష్యముద్యద్దినకరకిరణాకారమాకారతేజః
ప్రజ్ఞానం భూరిమానం నిజకరకలితం దుర్గమం యోగమార్గమ్ ।
ఆయుష్యం బ్రహ్మపోష్యం హరగిరివిశదాం కీర్తిమభ్యేత్య భూమౌ
దేహాంతే బ్రహ్మపారం పరశివచరణాకారమభ్యేతి విద్వాన్ ॥ 133

**ప్రతిపదార్థము :** భూష్యమ్ = అలంకరింప దగిన, వైదుష్యమ్ = పాండిత్యమును, ఉద్యద్దినకర కిరణాకారమ్ = ఉదయించిన సూర్యుని కిరణముల ఆకారము గల, ఆకారతేజః = దేహకాంతిని, భూరిమానమ్ = గొప్ప గౌరవముగల, ప్రజ్ఞానమ్ = గొప్ప జ్ఞానమును, నిజకరకలితమ్ = తన చేతికి చిక్కిన, దుర్గమమ్ = పొందరాని, యోగమార్గమ్ = యోగమార్గమును, బ్రహ్మపోష్యమ్ = కైలాసమువలె స్వచ్ఛమైన, ఆయుష్యమ్ = ఆయుష్యమును, హరగిరి విశదామ్ = కైలాసమువలె స్వచ్ఛమైన, కీర్తిమ్ = కీర్తిని, భూమౌ = భూమియందు, అభ్యేత్య = పొంది, దేహాంతే = దేహాంతమున, పరశివ చరణాకారమ్ = పరశమ్భువు యొక్క పాదముల ఆకారముగల, బ్రహ్మపారమ్ = బ్రహ్మమును (సంసారము యొక్క ఆవలి) ఒడ్డును, విద్వాన్ = ఎఱిగినవాడు (ఈ స్తోత్రమును), **అభ్యేతి** = పొందును.

**తాత్పర్యము :** ఈ స్తోత్రము నెఱిగిన వాడు అలంకరింప దగిన పాండిత్యము కల సూర్యకిరణ సమాన దేహకాంతిని, గొప్ప గౌరవముగల బ్రహ్మజ్ఞానమును, తన చేతిలో చేరిన దుర్గమయోగ మార్గమును, బ్రహ్మను పోషించునంతటి ఆయుష్యమును, కైలాసమువలె స్వచ్ఛమైన కీర్తిని, బ్రతికి యుండగానే పొంది, మరణానంతరము పరశివచరణరూపమైన బ్రహ్మత్వమును పొందును.

**వివరణము :** విద్వాంసుని సన్మానించుట, అలంకరించుట, సువర్ణభూషణమును గండపెండేరమును దొడుగుట ఇత్యాది విధమున అలంకరించినచో ఆతని పాండిత్యమే భూషింపబడి నట్లగును. గొప్ప పాండిత్యమే భూష్యమైనది. అట్టి పాండిత్యము నీ స్తోత్రార్థజ్ఞాతకు కలుగును. ఆతని శరీరకాంతి సూర్యకిరణకాంతివలె ఉజ్జ్వలమగును. ఆతని అత్యుత్కృష్టమైన తన ప్రజ్ఞానస్వరూప మవగతమగును. దుర్గమమైన యోగమార్గము కరతలామలక మగును. జీవులలో దీర్ఘాయుష్మంతుడు, హిరణ్యగర్భుడు ఆతడే బ్రహ్మ (చతుర్ముఖుడు). ఆతనిని పోషించు నంతటి ఆయుష్యమనగా బ్రహ్మను సృష్టించగల పరమేశ్వరత్వము లాభించును. అనగా పరమేశ్వరు డొక బ్రహ్మ తరువాత మరొక బ్రహ్మను సృష్టించి పోషించును. అట్టి స్థితి నీ స్తోత్రార్థజ్ఞాత పొందును. కీర్తి తెల్లని దనుట కవి సమయము. కైలాసమువలె స్వచ్ఛమైన తెల్లనికీర్తి స్తోత్రార్థజ్ఞాతకు జీవించి యుండగనే

కలుగును. దేహాంతమున **పరశివచరణరూపపరబ్రహ్మత్వము** నొందును. భూష్యం వైదుష్యం, ఆయుష్యం బ్రహ్మపోష్యం, ప్రజ్ఞానం భూరిమానం అను పదముల జంటలను ప్రథమ తృతీయ ద్వితీయ పాదముల ఆదిని ప్రయోగించుట చేత ఆకారభూరిపార శబ్దముల ప్రయోగము చేతను వృత్త్యనుప్రాసమను శబ్దాలంకార మేర్పడినది.

**పోష్యపయోజ సూర్యకరమూర్తిని మూర్తిని శిష్యభూష్య వై**
**దుష్యము భూరిమానమును దుర్గమయోగము బ్రహ్మపోష్యమా**
**యుష్యము శంకరాద్రి విశదోజ్జ్వలకీర్తిని బొంది భూమి నా**
**యుష్యముదీరఁ బండితుడు నొందును బ్రహ్మ శివాంఘ్రిరూపమున్.**

**అవతారిక :** పై శ్లోకమున స్తోత్రార్థ జ్ఞాతకు కలుగు ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున స్తోత్ర పాఠకులైన బ్రాహ్మణులకు కలుగు ఫలము చెప్పబడుచున్నది.

**శ్లో॥ యే శ్రీశాంభవశాసనే కృతధియః శ్రీశాసనే కర్మఠాః**
**శ్రౌతస్మార్తవిధిష్వమందమతయః సత్యవ్రతా బ్రాహ్మణాః ।**
**విద్వాంసస్సకలాగమేషు చ శాంభవకలా విద్యాసు తే**
**బ్రహ్మప్రాప్తి మవాప్నువంతి పఠనాచ్ఛమ్భోర్మహిమ్నః స్తుతే ॥ 134**

**ప్రతిపదార్థము :** యే = ఎవరు, శ్రీ శాంభవ శాసనే = శ్రీశాంభవ శాస్త్ర మందు, కృతధియః = అర్థముల బుద్ధితో తెలిసికొనినారో, శ్రీశాసనే = (శామ్భవమైన) ఆజ్ఞయందు, కర్మఠాః = కర్మనిష్ఠులు, శ్రౌతస్మార్త విధిషు = శ్రౌతస్మార్తవిధులందు, అమందమతయః = సూక్ష్మబుద్ధిని ప్రకాశింపజేసినారో, సత్యవ్రతాః = సత్యనియమము గలవారో, సకలాగమేషు = అన్ని ఆగమములందు, శామ్భవ కలా విద్యాసు చ = శాంభవవిద్యా కలలందును, విద్వాంసః = విద్వాంసులైన, తే = ఆ, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, బ్రహ్మప్రాప్తిమ్ = శ్రీశామ్భవ బ్రహ్మ ప్రాప్తిని, శమ్భోః = శమ్భువు యొక్క, మహిమ్నః = మహిమ యొక్క, స్తుతేః = స్తుతియొక్క, పఠనాత్ = పాఠమువలన, **అవాప్నువంతి** = పొందెదరు.

**తాత్పర్యము :** శామ్భవ శాస్త్రముల నభ్యసించి తదుక్త ప్రకారము కర్మల నాచరించి శ్రౌతస్మార్త కర్మానుష్ఠానజ్ఞానములతో నిష్ణాతులైన సకలాగమములయొక్క కలలయొక్క సంపూర్ణ జ్ఞానము కల బ్రాహ్మణులు ఈ శమ్భుమహిమ్న స్తుతిపాఠమువలన శ్రీశమ్భు బ్రహ్మము నొందెదరు.

**వివరణము : 'శ్రుతి స్మృతీ మమైవాజ్ఞే'** అను సూక్తి ననుసరించి వేదములు స్మృతులు పరమేశ్వరుని ఆజ్ఞలు. ఆ శ్రుతి స్మృతులే శాస్త్రములనియు చెప్పబడినవి. శాసించునవి

అనగా ఇట్లు చేయవలెను, ఇట్లు చేయకూడదు అని చెప్పునవి కావున అవి శాస్త్రములు. శమ్భు పారమ్యమును బోధించు తంత్రములును శాస్త్రములే. వాని అర్థము గ్రహించి తదుక్తప్రకారము కర్మల నొనరించు వారు శిష్టులనియు చెప్పబడుదురు. శ్రుత్యుక్త కర్మములు శ్రౌతకర్మలు. స్మృత్యుక్త కర్మలు స్మార్తములు. శ్రుతులనగా వేదములు. వానిలో కొన్ని పఠన పాఠముల నుండి తొలగిపోగా తపస్యులైన మునులు సమాధిలో ఆ లుప్తములైన వేదముల అర్థమును స్మరించి వ్రాసిన గ్రంథములు స్మృతులు. ఆగమము లనగా శివునిచే పార్వతికి చెప్పబడిన గ్రంథములు. **'ఆగతం శివవక్త్రాత్తు గతం తు గిరిజాముఖే'** (శివవక్త్రమునుండి వచ్చి గిరిజ ముఖమున (చెవిని) జొచ్చినవి) అని ఆగమ శబ్ద నిర్వచనము కానవచ్చును. ఈ నిర్వచనము శైవాగమములకు వర్తించును. వైష్ణవాగమములు విష్ణువుచే లక్ష్మికి, గరుడాదులకు చెప్పబడిన ట్లూహించుకొనవచ్చును. కలలనగా అఱువది నాలుగు విద్యలు. వీని నభ్యసించి నిష్ణాతులగు బ్రాహ్మణులుగా పూర్వ బహుజన్మ పుణ్యమున జన్మించినవారు. అట్టివారదృష్ట విశేషమున నీ **పరశమ్భువు మహిమ్నః స్తుతిపాఠము** చేసినచో ఆ బ్రాహ్మణజన్మయే చరమ జన్మమగును. అనగా వారికి మరల జన్మ ముండదు. అట్టి బ్రాహ్మణులు దేహాంతమున శమ్భు చరణ పరబ్రహ్మమునే పొందెదరు.

**శ్రీశివశాసనస్థమతి చేష్టలు శ్రౌతము స్మార్తమౌ విధిన్**
**వేశితమౌ సుబుద్ధిగల విజ్ఞులు సత్యవచుల్ ద్విజాగ్రణుల్**
**స్వాశయ సర్వవిద్యలు మహాశయ! నీమహిమమ్ముఁ బాడగా**
**పాశములూడి శాంభవము బ్రహ్మముఁ బొందెద రద్భుతమ్ముగా.**

**అవతారిక :** పై శ్లోకమున స్తోత్రపాఠి బ్రాహ్మణులకు **బ్రహ్మపదప్రాప్తి** ఫలము చెప్పబడినది. ఈ శ్లోకమున బ్రహ్మపదము నభిలషింపని వానికి ఆతని **అభిలషితపదము** లభించునని చెప్పబడుచున్నది. స్రగ్ధర.

**శ్లో॥ స్తోత్రం చైతత్పఠేద్యః శివగురువచనాఘోరవిద్యాత్తదీక్షః**
**సత్యజ్ఞానప్రకాశాత్ప్రబలభవరిపుం పుణ్యపాపాద్యవిద్యామ్ ।**
**భిత్త్వా ముక్తోఽ వికల్పస్త్రిజగతి మహితం సౌఖ్యమాత్మప్రబోధం**
**తేజః కీర్తిం చ లక్ష్మీమఖిలషితపదం వ్యశ్నుతే స్తోత్రవీరః ॥ 135**

**ప్రతిపదార్థము :** ఏతత్ = ఈ, స్తోత్రమ్ = స్తోత్రమును, శివగురు వచనాఘోరవిద్యాత్త దీక్షః = శివగురువచనమైన అఘోరవిద్య (మంత్రమున ఉపాసనమున) దీక్షను పొందిన,

యః = ఎవడు, పఠేత్ = చదువునో, సత్యజ్ఞానప్రకాశాత్ = సత్యమైన జ్ఞానముయొక్క ప్రకాశమువలన, ప్రబలభవరిపుమ్ = మిక్కిలి బలముగల సంసారమను శత్రువును, పుణ్యాపాపాద్యవిద్యామ్ = పుణ్యము, పాపము మొదలైన అవిద్యను (అజ్ఞానమును), భిత్త్వా = ఛేదించి, ముక్తః = ముక్తుడై, అవికల్పః = వికల్పరహితుడై, త్రిజగతి = మూడు లోకముల యందు, మహితమ్ = గొప్పదైన, సౌఖ్యమ్ = సౌఖ్యమును, ఆత్మప్రబోధమ్ = ఆత్మజ్ఞానమును, తేజః = తేజస్సును, కీర్తిమ్ = కీర్తిని, లక్ష్మీమ్ = సంపదను, చ = మరియు, అభిలషితపదమ్ = కోరిన పదమును, స్తోత్రవరః = స్తోత్రవరుడైన, (సః = ఆతడు), **వ్యశ్నుతే** = పొందును.

**తాత్పర్యము :** శివగురువునుండి అఘోరవిద్యాదీక్షను పొంది ఈ స్తోత్రమును పఠించిన వీరుడు సత్యజ్ఞానప్రకాశమువలన సంసారమను శత్రువును దానికి మూలమైన పుణ్యాపాద్య జ్ఞానమును నశింప జేసికొని ముక్తుడై నిర్వికల్పుడై యుండును. మరియు మూడు లోకములందు గొప్పదైన సౌఖ్యమును, ఆత్మజ్ఞానమును, తేజమును, కీర్తిని, సంపదను, కోరిన పదమును పొందును.

**వివరణము :** శివగురువనగా శివస్వరూపుడుగా భావింపదగిన గురువు. శివగురువులకు భేదము పాటింపరాదని సర్వశైవతంత్రసిద్ధాంతము. ఆతనినుండి విద్యను స్వీకరించిన వానికే విద్య (మంత్రజపధ్యానములు) లందధికార మేర్పడును. అట్లు అఘోరవిద్యాదీక్షితుడై ఎవడీ స్తోత్రమును చదువునో వానికి నిర్వికల్పముక్తి కలుగును. అట్లు దీక్ష పొందకున్నను స్తోత్రమును అహర్నిశల పఠించిన స్తోత్ర వీరుడు అని చెప్పదగిన స్థితిని పొందినచో మూడు లోకము లందును అధికమైన సౌఖ్య తేజః కీర్తులను సంపదను పొందును. బ్రహ్మపదము నభిలషించని వాడు, ఇంద్రాదిపదము నభిలషించువాడును ఈ స్తోత్రమును పఠించి దానిని పొందగలడు. తంత్రములందు వీరులనగా ఉపాసకులని చెప్పబడినారు. వి ఇరా = విశిష్టమైన వాక్ఛక్తి లేక జ్ఞానశక్తి గలవాడు వీరుడని వీరశబ్ద నిర్వచనము కలదు.

**గురువదనోదితమ్మగు నఘోరమహత్తరవిద్య దీక్షితుం**
**డురుతరమీస్తుతిన్ జదువుచుండెడిధీరుడు స్తోత్రవీరుడా**
**పరతరసత్యబోధ రుచివహ్ని భవారి నవిద్యఁ బుణ్యపా**
**ప రతిని గూల్చి ముక్తుడగు భవ్య యశోవిభవాదిలాభుడై.**

**అవతారిక :** పూర్వ శ్లోకమున పఠనముయొక్క **లౌకికాలౌకిక ఫలములు** పరశమ్భుమహిమ్నః స్తోత్రపాఠకునకు కలుగునని చెప్పబడినది. ఈ శ్లోకమున జపించు వానికి వానితో పాటు శివశక్తి **తత్త్వపదములు** తెలియునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ మహిమ్నః స్తోత్రస్య త్రిభువన గురోర్యో జపరతః**
**పరాశక్తేస్తత్త్వం పరశివపదం వేత్తి సబుధః ।**
**అగాధం గాంభీర్యం స్తుతిగతమనంతప్రమితిజం**
**సమస్తాస్సిద్ధీరప్యనుభవతి గచ్ఛేత్పరపదమ్ ॥ 136**

**ప్రతిపదార్థము :** త్రిభువనగురోః = మూడు లోకముల గురువు (పరశమ్భువు) యొక్క, మహిమ్నః = మహిమ యొక్క, స్తోత్రస్య = స్తోత్రము యొక్క, జపరతః = జపము నందు తత్పరుడైనవాడు, యః = ఎవడో, సః = ఆ, బుధః = విద్వాంసుడు, పరాశక్తేః = పరాశక్తి యొక్క, తత్త్వమ్ = తత్త్వమును, పరశివపదమ్ = శివస్థానమును, వేత్తి = ఎఱుగును, స్తుతిగతమ్ = స్తోత్రమందున్న, అనంత ప్రమితిజమ్ = అనంత ప్రమాణజన్యమైన, అగాధమ్ = లోతులు తెలియని, గామ్భీర్యమ్ = గంభీరతను, సమస్తాః = అన్ని, సిద్ధీః+అపి = సిద్ధులను గూడ, **అనుభవతి** = అనుభవించును, పరపదమ్ = ఉత్కృష్ట స్థానమును, గచ్ఛేత్ = పొందును.

**తాత్పర్యము :** త్రిలోకగురువైన పరశమ్భువు యొక్క ఈ స్తోత్రమును జపించుట యందు తత్పరుడైన పండితుడు పరాశక్తి తత్త్వమును శివపదమును ఎఱుగును. మరియు స్తోత్రమందున్న అనంత ప్రమాణముల తెలియదగిన అంతులేని గాంభీర్యమును దానితో పాటు సమస్త సిద్ధులను అనుభవించును. శివపదమును గూడ చేరును.

**వివరణము :** అవిద్య బంధహేతువు. విద్య మోక్షహేతువు. బంధ మోక్షములు మిథ్యలు. అవిద్యావిద్యలును మిథ్యలే. ఇవి యన్నియు మాయామయములు. మాయ అనునది పరబ్రహ్మకు భిన్నమా, అభిన్నమా, భిన్నమని, అభిన్నమని చెప్పరానిది. ఎవనికి బద్ధ భావన మున్నదో వానికి ముక్తి కావలెనని వాంఛ ఉండును. ఆ వాంఛ తీరుటకీ స్తోత్రమును జపింపవలెను. శాంభవతంత్రవేత్తలు పరశమ్భువునందు ఆఱు శక్తులున్నవి అని అంగీకరించెదరు. పరాశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, కుండలినీశక్తి, మాతృకాశక్తి అను ఆఱు శక్తు లాతని యందుండు నందుఱు. వానిలో పరాశక్తి మిగిలిన అయిదు శక్తుల కన్నా ఉత్కృష్ట పరోత్కృష్ట. కావున దానికి పరాశక్తి అను పేరు సార్థకము. దాని

పని యే మనగా శివుని జీవునిగా జీవుని శివునిగా జేసి అనగా బంధించి విడిచి ఆడుకొనును. ఇత్యాదిగా ఆ పరాశక్తి తత్త్వము. ఈ స్తోత్రమున వర్ణింపబడినది. ఈ శక్తులన్నియున్నను నిర్వికల్పుడైన శివుని స్థితి అనగా పరశమ్భుస్థితియు వర్ణింపబడినది. ఈ స్తోత్రము నర్థము చేసికొనుట కెన్నియో దర్శనముల నెఱిగి యుండవలెను. ఎన్నియో తంత్రముల నెరిగి యుండవలెను. అనగా **ఈ స్తోత్రము సర్వతంత్ర దర్శన సారము.** ఆ అనంత ప్రమితులు అనగా ప్రమాణములు వాని వలన కలుగు జ్ఞానమీ స్తోత్రమున నున్నది. కావున ఈ స్తోత్ర గాంభీర్య మింతింత యని యనరానిది. అది అగాధము. దాని లోతునకు చొచ్చుకొని పోగలుగుటకు పరశమ్భు కృప ఉండవలెను. శాస్త్రాధ్యయన జన్య సర్వాహంకారములు గలవానికి అది తెలిసినట్లే ఉండి తెలియకయే ఉండి పోవును. నిరంతరము స్తోత్రమును జపించిన వానికి పరాశక్తియొక్క పరశంభువుయొక్క అనుగ్రహము కలిగి ఈ స్తోత్ర పరమార్థము సాక్షాత్కరించును. అట్టి వాడు ఇహలోకజీవనమును అణిమాద్యష్టసిద్ధుల ననుభవించుచు దేహపాతానంతరము **పరశంభుపదము** చేరును.

**భువన మహాగురుండగు ప్రభుండగు శమ్భుని యీ మహాస్తవం**
**బవని జపించు పండితుడు హాయిగ నా పరశక్తి తత్త్వమున్**
**శివపదమున్ సమగ్రముగ శేముషి చేత నెఱుంగు నంత హ**
**స్తవశగమౌ నగాధతను శమ్భుపదమ్మును జేరు సిద్ధతన్.**

**అవతారిక :** పై శ్లోకమున ఈ స్తోత్రమును పఠించిన వానికి పరశక్తితత్త్వము **శివపదప్రాప్తి** సమస్తసిద్ధులు లభించునని చెప్పబడినది. ఈ శ్లోకమున వానికి భువనాధిపత్య గురుత్వ **శివత్వప్రాప్తి** కలుగునని చెప్పబడుచున్నది. ఇంద్రవజ్రా.

**శ్లో॥ శ్రీక్రోధ భట్టారక దివ్యనామ్నా - దుర్వాససా సూక్త మహామహిమ్నః ।**
**స్తోత్ర మ్పఠేద్యో భువనాదిపత్యం నిత్యం గురుత్వం శివతాముపైతి ॥137**

**ప్రతిపదార్థము :** శ్రీ క్రోధ భట్టారక దివ్యనామ్నా = పూజ్యమైన క్రోధ భట్టారక అను దివ్య నామముగల, దుర్వాససా = దుర్వాసునిచేత, సూక్త మహా మహిమ్నః = బాగుగా చెప్పబడిన మహా మహిమ యొక్క, స్తోత్రమ్ = స్తోత్రమును, యః = ఎవడు, పఠేత్ = పఠించునో, (సః = వాడు), భువనాధిపత్యమ్ = లోకాధిపత్యమును, నిత్యమ్ = నిత్యమైన, గురుత్వమ్ = గురుత్వమును, శివతామ్ = శివత్వమును, **ఉపైతి** = పొందును.

**తాత్పర్యము : 'క్రోధ భట్టారక'** అను దివ్యమైన నామాంతరముగల దుర్వాసుని చేత

రచింపబడిన ఈ మహాశమ్భుమహిమ్నస్తోత్రమును పఠించిన వాడు లోకాధిపత్యమును నిత్యమైన గురుత్వమును శివత్వమును పొందును.

**వివరణము :** శివుని క్రోధము దుర్వాసోమునిగా నవతరించినది. జగత్సంహారమునకు క్రోధమావశ్యకము అది గాక తంత్రములలో క్రోధ పదము జ్ఞానవాచిగా చెప్పబడినది. అజ్ఞాన సంహారము చేయునది సంహారకత్వసామ్యముచేత క్రోధ జ్ఞానముల ఏకరూపత ఉచితమే అని గ్రహింపవలెను. క్రోధము చెడ్డ గుణమని చెప్పరాదు. ఒక గుణము సద్గుణమని, దుర్గుణమని చెప్పుట తాత్కాలికము మాత్రమే. గుణమునందు సత్త్వముగాని, దుస్త్వము గాని నియతములు గావు. నిత్యములును గావు. **దుష్ట సంహారక క్రోధము జగన్మంగళ హేతువు.** అపరాధులందు రాజాదు లవలంబించు క్షమ పాపవృద్ధికి హేతువగుటచే అది చెడ్డగుణమే అగును కదా!

**క్రోధభట్టారకాఖ్యుడు బోధమూర్తి**
**సాధుదుర్వాససునిచేత శస్తమైన**
**శమ్భుమహిమ స్తవము పఠించంగ నిత్య**
**భువన భర్తృ గురుత్వమున్ శివత నొందు.**

**అవతారిక :** పై శ్లోకమున నీ **మహిమ్నః స్తోత్రపాఠఫలము** చెప్పబడినది. ఈ శ్లోకమున నీ స్తోత్రము **సర్వస్తోత్రోత్కృష్టమని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ మహేశాన్నాపరో దేవో – మహిమ్నో నాపరా స్తుతిః ।**
**అఘోరాన్నాపరో మంత్రో – నాస్తి తత్త్వం గురోః పరమ్ ॥ 138**

**ప్రతిపదార్థము :** మహేశాత్ = మహేశుని కన్న, అపరః = వేఱైన, దేవః = దేవుడు, న = లేడు, మహిమ్నః = మహిమ్న స్తోత్రమునకన్న, అపరా = వేఱైన, స్తుతిః = స్తోత్రము, న = లేదు, అఘోరాత్ = అఘోర (మంత్ర) మున కన్న వేఱైన, మంత్రః = మంత్రము, న = లేదు, గురోః = గురువున కన్న, పరమ్ = ఉత్కృష్టమైన, తత్త్వమ్ = తత్త్వము, న = లేదు.

**తాత్పర్యము : దేవతలలో మహేశ్వరుని మించిన దేవుడు, స్తోత్రములలో పరశమ్భుమహిమ్నః స్తోత్రమును మించిన స్తోత్రము, మంత్రములలో అఘోరమంత్రమును మించిన మంత్రము, తత్త్వములలో గురుతత్త్వమును మించి తత్త్వము లేవు.**

**వివరణము :** మహేశు డాశుతోషుడు, జ్ఞానప్రదాన, సంసారసంహారకుడు. ఆయనను మించిన దేవుడు లేనందున మహాదేవ నామ మాతనికి ప్రసిద్ధమైనది. మోక్ష సుఖము శమ్పదవాచ్యము. దాని నుద్భవింప జేయు నుత్కృష్టుడు అందుచే ఆతనికి పరశమ్భు నామము సార్థకము. మహిమ్నః స్తోత్రములలో శివవిష్ణుగణేశదేవీమహిమ్నః స్తోత్రములున్నవి. వాని అన్నిటి కన్న ఈ పరశమ్భు మహిమ్న స్తుతి గొప్పది. మిగిలిన మహిమ్న స్తోత్రములు ఆయా దేవతల ఇతర స్తోత్రముల కన్న గొప్పవి. 'మహిమ్నః' అను ఆ పదమారంభ మందుండుట మహిమ్నః స్తోత్ర సామాన్య లక్షణము (ఉపలబ్ధ మహిమ్నః స్తోత్రముల కీ వ్యాఖ్యాత ఆంధ్ర పద్యానువాద మొనర్చి యున్నాడు) ఆమ్నాయమంత్రములలో నొకటి రెండు అఘోరమంత్రములున్నవి. అవి ఈ స్తోత్రమున చెప్పబడిన అఘోరవిద్యారూపములు కావు. **'న గురోరధికమ్'** అని సర్వమతసిద్ధాంతములు చెప్పుచున్నవి. గురువును మించినది లేదు. **శివుడు కోపించినచో గురువతని కడకు పోయి పురుషకార మొనరించి మన మొనర్చిన భగవదపరాధమును భగవంతునిచే క్షమింపజేయును. గురువునెడ అపరాధ మొనర్చి ఆతనికి కోపమును తెప్పించితివేని ఆ భగవంతుడును మనను కాపాడజాలడు.** ఈ స్తోత్రమున పెక్కు పర్యాయములు గురువు, శివగురువు, శివదేశికుడు, ఇత్యాది శివాభేద వాచక శబ్దములే ప్రయోగింప బడినవి.

**పుడమిని మహేశ్వరాన్యదేవుండు లేదు**
**ధర మహిమ నుతి కన్న స్తోత్రంబు లేదు**
**ధర నఘోరాన్య పరమ మంత్రమ్ము లేదు**
**ధరణి గురువునకన్న తత్త్వమ్ము లేదు.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భుమహిమ్నస్తోత్రమును మించిన స్తోత్రము లేదని చెప్పబడినది. ఈ శ్లోకమున స్తోత్రకర్తయైన **దుర్వాసుని మహిమ** చెప్పబడుచున్నది. ఆర్యా గీతి.

**శ్లో॥ సదసదనుగ్రహనిగ్రహగృహీతమునివిగ్రహో భగవాన్ ।**
**సర్వాసాముపనిషదాం దుర్వాసా జయతి దేశికః ప్రథమః ॥ 139**

**ప్రతిపదార్థము :** సదసదనుగ్రహ నిగ్రహ గృహీత ముని విగ్రహః = మంచివారి ననుగ్రహించుట కొఱకు చెడ్డవారిని నిగ్రహించుట కొఱకు ముని విగ్రహము స్వీకరించిన, భగవాన్ = పూజ్యుడైన, సర్వాసామ్ = అన్ని, ఉపనిషదామ్ = ఉపనిషత్తుల యొక్క, ప్రథమః = మొదటి, దేశికః = ఉపదేశక గురువైన, దుర్వాసాః = దుర్వాసుడు, **జయతి** =

సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నాడు.

**తాత్పర్యము :** సత్పురుషుల ననుగ్రహించుట కొఱకు దుష్టజనుల నిగ్రహించుట కొఱకును ముని విగ్రహ (శరీర)మును స్వీకరించిన వాడు, అన్ని ఉపనిషత్తులకు మొదటి ఉపదేశక గురువైన దుర్వాసుడు సర్వోత్కర్షముగా వర్ధిల్లు చున్నాడు.

**వివరణము : పరిత్రాణాయ సాధూనా** మిత్యాది భగవద్గీతా శ్లోకార్థము నీ శోక్ల ప్రథమార్ధము వివరించుటచే దుర్వాసుడు భగవదవతారమని వ్యంజింప జేయబడినది. ఉపనిషత్తుల ప్రథమ దేశికుడని చెప్పుట. **'సహి పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్'** అను పాతంజల సూత్రము యొక్క అర్థమును వివరించుట కూడ దుర్వాసుని భగవదవతారత్వమునే వ్యంజించుచున్నది. ఈ శ్లోకము దేవీ మహిమ్నః స్తోత్రము నందును కలదు. అందుచే దేవీ మహిమ్నః స్తోత్రము, పరశమ్భుమహిమ్నఃస్తోత్రము అను రెండు స్తోత్రములును దుర్వాసోముని రచితము లనియే శిష్టులచే విశ్వసింపబడుచున్నది.

**సదనుగ్రహాసదాగ్రహ**
**విదితమహాకార్యకలితవిగ్రహుడును స**
**త్పదనిరతు డుపనిషత్తుల**
**తుదనెఱిగిన మొదటి గురుడు దుర్వాసు డిలన్.**

**అవతారిక :** పై శ్లోకమున దుర్వాసుడు ప్రశంసింపబడినాడు. ఈ శ్లోకమున పరశమ్భు మహిమ్నః స్తోత్ర జ్ఞానికి ధీరత్వము కలుగునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రీగురుకరుణాలక్ష్యో యః కోఽప్యాత్మవిదనుగృహీతి పరః ।**
**పరశమ్భుస్తుతిబోధో జగదాధారో భవేత్సదా ధీరః ॥ 140**

**ప్రతిపదార్థము :** శ్రీ గురుకరుణా లక్ష్యః = శ్రీగురుకరుణయే లక్ష్యముగాగల, యః కః+అపి = ఎవడైనను, ఆత్మవిదనుగృహీతి పరః = ఆత్మవేత్త యొక్క అనుగ్రహ మందాసక్తుడైన, పరశమ్భు స్తుతి బోధః = పరశమ్భు స్తోత్ర జ్ఞానముగల, యః కః అపి = ఎవడైనను, జగదాధారః = జగత్తున కాధారుడు, సదా = ఎల్లప్పుడు, ధీరః = ధీరుడు, **భవేత్** = అగును.

**తాత్పర్యము :** ఈ స్తోత్రమును గురుకరుణయే లక్ష్యముగా గలవాడు ఆత్మవేత్తయైన దుర్వాసోమహర్షి గురుని అనుగ్రహము కోరువాడు **పరశమ్భు స్తోత్రజ్ఞానము కలవాడెవడైనను**

**జగదాధారుడు. సదా ధీరుడు అగును.**

**వివరణము :** ఈ పరశమ్భుమహిమ్నఃస్తోత్రము గురుకరుణయందు దృష్టి గలవానికి ఆత్మవేత్తయైన గురువు (దుర్వాసుని) అనుగ్రహమునందు ఆసక్తి గలవానికి పరశమ్భు స్తోత్రము యొక్క యథార్థజ్ఞానము కలిగి ఎవడైనను జగదాధారత్వమును అనగా పరశమ్భుత్వమును పొందగలడు. ధీరశబ్దము బుద్ధి యందు వాక్కు నందు అతిశయించిన వానిని తెలుపును.

**శ్రీగురుకరుణాలక్షితు**
**డాగమసుగమాత్మబోధనానుగ్రహ సం**
**యోగుడు పరశంభుస్తుతి**
**జాగృతనిజబోధుడెపుడు జగదాశ్రయుడౌ.**

**అవతారిక :** పై శ్లోకమున పరశమ్భుస్తోత్రజ్ఞానఫలము పరమాత్మప్రాప్తి అని చెప్పబడినది. ఈ శ్లోకమున స్తోత్రమందలి ప్రకరణసంఖ్య తెలుపబడుచున్నది.

**శ్లో॥ పరశమ్భోస్తవ పద్యం రవిప్రకరణం పఠంస్త్రికాలేఽపి ।**
**రవిరివ జగత్ప్రకాశమతిచాతుర్యాజ్జగద్గురుర్భవతి ॥ 141**

**ప్రతిపదార్థము :** పరశమ్భోః = పరశమ్భుడవైన, తవ = నీయొక్క, రవిప్రకరణమ్ = పన్నెండు ప్రకరణములు గల, పద్యమ్ = పద్యగ్రంథమును, త్రికాలే+అపి= త్రికాలమందును, పఠన్ = చదువుచున్నవాడు, రవిః ఇవ = సూర్యునివలె, జగత్ప్రకాశమతిచాతుర్యాత్ = జగత్ప్రకాశరూపసుబుద్ధిచాతుర్యమువలన, జగద్గురుః = జగద్గురువు, **భవతి** = అగును.

**తాత్పర్యము :** పరశమ్భుడవైన నీ యొక్క ద్వాదశ ప్రకరణములుగల ఈ పద్యమయ స్తోత్రమును త్రికాలము లందు పఠించువాడు సూర్యునివలె జగత్ప్రకాశరూపసుబుద్ధి చాతుర్యమున జగద్గురువగును.

**వివరణము :** నెలకొక సూర్యుని చొప్పున సంవత్సరమునకు పన్నెండు గురు సూర్యులు వెలుగుచుందురు. కావున రవిశబ్దము ద్వాదశ సంఖ్యను బోధించును. జీవునికి పిండమున బుద్ధి అంతరవయవము (అంతఃకరణ చతుష్టయములో నొకటి) ఈశ్వరునకు బ్రహ్మాండమున బుద్ధి ప్రబోధకి సూర్యుడవయవము. (తైజసచక్షుః స్థానీయుడు బుద్ధిస్థానీయుడు) గురు శబ్దము కూడ అంధకారనాశమును బోధించును. అజ్ఞానాంధకారమును బోగొట్టు గురువు

సూర్యుని వంటివాడే. జగత్తును సూర్యుడు చీకటి బాపి వెలిగించినట్లు, గురువు అజ్ఞానాంధకారమును బోగొట్టి జ్ఞానజ్యోతిని శిష్యుల హృదయముల వెలిగించును. త్రికాలములలో ప్రాతర్మధ్యాహ్న ప్రదోషములలో ఈ స్తోత్రము పఠించువాడు **శివాభిన్నజగద్గురువుగా** రూపొందును.

**పరశంభుడవగు నీ భా**
**స్కరప్రకరణాత్మ నుతిఁ ద్రికాలము జదువన్**
**గురువగు జగమ్మునకు భా**
**స్కరసముడై స్వప్రకాశ సంపదఁ బడయున్.**

**అవతారిక :** పై శ్లోకమున స్తోత్రపాఠి జగద్గురు వగునని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆత్మ వేత్తృ గురువు మహాదేవుడని ఆతడే పరశమ్భు హృదయరూపమైన ఈ స్తోత్రమును సత్పాత్రుల కిచ్చుట గోరబడుచున్నది.

**శ్లో॥ తస్మాత్ స్మృతిమతిబుద్ధిప్రజ్ఞానాత్మవిన్మహాదేవః ।**
**పరశమ్భోస్తవ హృదయం సత్పాత్రేషు ప్రకాశయేత్సదయమ్ ॥ 142**

**ప్రతిపదార్థము :** తస్మాత్ = అందువలన, స్మృతిమతి బుద్ధి ప్రజ్ఞానాత్మవిత్ = స్మృతి మతి బుద్ధి ప్రజ్ఞానము ఆత్మను ఎరిగిన, మహాదేవః = మహాదేవుడు, పరశమ్భోః = పరశమ్భుడవైన, తవ = నీయొక్క, హృదయమ్ = హృదయమును, సత్పాత్రేషు = యోగ్యుల యందు, సదయమ్ = దయతో, ప్రకాశయేత్ = ప్రకాశింపజేయుగాక!

**తాత్పర్యము :** స్మృతి మతి బుద్ధి ప్రజ్ఞానము ఆత్మను ఎఱిగిన మహాదేవుడు పరశమ్భువైన నీ యొక్క హృదయరూపమైన ఈ స్తోత్రమును దయతో ప్రకాశింపజేయుగాక!

**వివరణము :** స్మృతి అనగా జ్ఞాపకశక్తి. మతి అనగా ఆలోచనాశక్తి. బుద్ధి యనగా నిశ్చయించు శక్తి. ప్రజ్ఞానమనగా ప్రతిబింబచైతన్యము. ఆత్మయనగా అధిష్ఠానచైతన్యము. వీని నెఱిగిన మహాదేవుడు అనగా త్రిమూర్తులలోని శివుడు ఆదిగురు స్వరూపమున వెలుగొందువాడు. స్తోత్రపాఠకునిలో అవతరించి ఆతనిని గురువుగా రూపొందించి ఈ స్తోత్ర పాఠ సంప్రదాయము అవిచ్ఛిన్నముగా సాగుటకై సత్పాత్రము లనదగిన శిష్యుల హృదయమున దయతో వెలుగింప జేయుగాక!

**స్మృతి బుద్ధ్యాత్మ జ్ఞాన**
**స్థితి పరుడు మహా శివగురుదేవుడు సదయో**
**దృతి పరశంభునుతి రహ**
**స్యతత్త్వము సుపాత్ర సుహృదయమ్ములఁ జొనుపున్.**

ఇతి మహర్షిదుర్వాసవిరచిత శ్రీ పరశంభుమహిమ్నఃస్తోత్రమ్
శ్రీ దోర్బల విశ్వనాథశర్మచే వ్రాయబడిన శివప్రియావ్యాఖ్యానము
సంపూర్ణము.

**శ్రీః**

## నమస్సులు

ప్రూఫ్ చూచుటనందు తోడ్పడిన మిత్రులు డా॥ చింతలపూడి వేంకటేశ్వర్లు గారికి, శ్రీ వెల్లంపల్లి దాశరథి గారికి నమస్సులు.

– రామోరా.